# ఆంధ్రప్రదేశ

# గ్రామ పంచాయతుల చట్టము

# (1964)

అనువాదకులు


ఎం. శ్రీనివాసరావు, బి.ఏ.ఎల్.ఎల్.బి.

అడ్వొకేటు, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు.

బి. ఎస్. శాస్త్రి, ఎం.ఏ.



ప్రకాశకులు



ర్జున బుక్ డిపో

గ్రామపంచాయతీ ఫారమ్స్ అండ్ రిజిష్టర్సు

ర్స్. పబ్లిషర్స్ అండ్ స్టేషనర్స్

హైదరాబాదు–ఆం. ప్ర.

# ఆంధ్రప్రదేశ

# గ్రామ పంచాయతుల చట్టము

( 1964 లో 2 వ చట్టము )

అనువాదకులు

ఎం. శ్రీనివాసరావు, బి.ఏ.ఎల్ ఎల్.బి.

ఆడ్వకేటు, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు.

బి. ఎన్. శాస్త్రి, ఎం.ఏ.

ప్రకాశకులు

నాగార్జున బుక్ డిపో

సప్లయిర్స్ ఆఫ్ గ్రామపంచాయతీ ఫారమ్స్ అండ్ రిజిష్టర్సు

బుక్ సెల్లర్స్, పబ్లిషర్స్ అండ్ స్టేషనర్స్

నారాయణగూడ :: హైదరాబాదు

# మా మాట

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము దేశాభివృద్ధికి ప్రభుత్వము కృషి చేయుచున్నది. ప్రజలు ప్రభుత్వ ప్రణాళికల నర్థము చేసుకొనుటకు, ప్రణాళికా లక్ష్యముల నెరవేర్చి అభివృద్ధి మార్గమునకు రాచబాటలు నిర్మించుటలోను నిమగ్నులైయున్న సమయమున ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీల చట్టమును ప్రజానీకమున కందుబాటులో నుండుటకై మేమీ గ్రంథము నాంధ్రమున ననువదింపజేసి ప్రచురించినాము.

ఇంతవరకు ఆంధ్ర జిల్లాలలో మద్రాసు గ్రామ పంచాయతీ చట్టము, తెలంగాణములో 1956వ సంవత్సరపు హైదరాబాదు గ్రామ పంచాయతీల చట్టము అమలులో నున్నది. ఈ రెండు చట్టములను ప్రభుత్వమువారు రద్దుచేసి క్రొత్తగా ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీల చట్టమును రూపొందించినారు. ఆ చట్టమునకు ఆంధ్రానువాదమే ఈ గ్రంధము.

ఇందు పంచాయితీ విధులు, వాటి నిర్వహణ, న్యాయపంచాయితీలు మున్నగు విషయములు ప్రభుత్వము వారు నిర్ణయించిన విధముగా ఈ గ్రంథమున చెప్పబడినవి.

ఆంధ్రప్రజలు మా యీ కార్యమునకు ప్రోత్సాహ మొసంగెదరని ఆశించుచున్నాము

ఈ గ్రంథమును ప్రచురించుటలో సహాయపడిన శ్రీ ఎస్.ఎస్. మూర్తిగారికిని, చక్కగా ముద్రించి ఇచ్చిన దక్షిణ భారత ప్రెస్సు మేనేజరు శ్రీ గిడుగు రామమూర్తి గారికిని హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఇట్లు
ప్రకాశకులు.

# గమనిక

ఈ చట్టము భారత రాష్ట్రపతిచే ఆమోదింపబడి, 7వ అధ్యాయము మినహా మిగతా చట్టము 1964వ సంవత్సరము, జనవరి 18వ తారీకునుండి అమలులోనికి రావలెనని, 18-1-1964 తేదీ ఆంధ్ర ప్రదేశ అసాధారణ గెజిటు 7వ విభాగములో, జి. ఓ. ఎం. ఎస్. 34 పంచాయతీరాజ్ (7వ భాగము) క్రింద ప్రచురణద్వారా ఆంధ్ర ప్రదేశ్ గవర్నరుచే ఆదేశింప బడినది.

# 1964 ఆంధ్రప్రదేశ గ్రామ పంచాయతుల చట్టము

(1964 వ సంవత్సరపు 2 వ చట్టము)

# విషయ సూచిక

(షెడ్యూళ్ళ, అనుబంధములతో సహా)

## 1 వ అధ్యాయము

## ప్రాథమిక విషయములు



## 2 వ అధ్యాయము

## పంచాయతీల ఏర్పాటు, పరిపాలనము, నియంత్రణ,

## 3. వ అధ్యాయము

### పంచాయతీల అధికారములు, కర్తవ్యములు మరియు ఆస్తి

## 4 వ అధ్యాయము

## పన్ను విధింపు. ఆర్థిక విషయములు

## 5 వ అధ్యాయము

## ప్రజాభద్రత, సౌకర్యము, ఆరోగ్యము

## 6వ అధ్యాయము

### సామాన్య విషయములు, నానావిధ విషయములు

## 7 వ అధ్యాయము

## సివిలు మరియు క్రిమినలు న్యాయపాలన

### 1 వ భాగము-పరిష్కారసంఘము

## 2 వ భాగము

## న్యాయ పంచాయతీలు

సివిలు విచారణాధికారము

క్రిమినలు విచారణాధికారము

## 8వ అధ్యాయము

## నియమములు, ఉపనిబంధనలు, దండనలు

## 9 వ అధ్యాయము

## అనుబంధ నిబంధనలు

## షెడ్యూళ్ళు మరియు అనుబంధములు

### షెడ్యూలు—1



### షెడ్యూలు—2

కొన్ని పనులకును, పంచాయతీల ఆదాయములకు వచ్చిన పైకమును దాచుటకును, పంచాయతీ నిధి నుండి పైకమును చెల్లించుటకును సంబంధించిన నియమములు.



### 2వ భాగము



### అనుబంధము-ఎ



### అనుబంధము—బి

అనుబంధము—సి



అనుబంధము—డి



షెడ్యూలు—3



షెడ్యూలు—4



షెడ్యూలు—5



షెడ్యూలు—6

మధ్యకాల నిబంధనలు

# ఆంధ్రప్రదేశ
# గ్రామ పంచాయితీల చట్టము, 1964

## 1 వ అధ్యాయము

### ప్రాథమిక విషయములు

1. సంగ్రహనామము, వ్యాప్తి, ప్రారంభము:—(1) ఈ చట్టము 1964 ఆంధ్రప్రదేశ గ్రామ పంచాయతీల చట్టము అని పిలువబడును.

(2) ఇది ఈ దిగువ పేర్కొనబడిన వాటికితప్ప మిగిలిన ఆంధ్ర ప్రదేశ రాష్ట్రమంతటికిని వర్తించును:-

(ఎ) 1955, హైదరాబాదు మున్సిపల్ కార్పొరేషన్ చట్టము (1956 లో 2 వ చట్టము) వర్తించు మున్సిపల్ కార్పొరేషనులు;

(బి) రాష్ట్రములో ప్రస్తుతము అమలులో ఉన్న మునిసిపాలిటీలకు సంబంధించిన శాసనము వర్తించు మునిసిపాలిటీలు;

(సి) 1956, ఆంధ్రప్రదేశ (తెలంగాణా ప్రాంత) మైనింగ్ సెటిల్మెంటు చట్టము (1956 లో 44 వ చట్టము) వర్తించు మైనింగు సెటిల్మెంటులు;

(డి) 1924, కంటోన్మెంట్ల చట్టము వర్తించు కంటోన్మెంట్లు.

(1) ఇది ప్రభుత్వమువారు ఆంధ్ర ప్రదేశ గెజెటులో ప్రకటన ద్వారా నిర్ణయించునట్టి తేదీన ప్రాంతములోను అమలులోనికి రావ

లయును. ప్రభుత్వము వారు వివిధ ప్రాంతములకొరకు వివిధ నిబంధనల కొరకు వేరువేరు తేదీలు నిర్ణయించవచ్చును.

2. నిర్వచనములు.—ఈ చట్టములో, సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప,—

(1) "ఆంధ్ర ప్రాంతము" అనగా ఆంధ్రప్రదేశ రాష్ట్రములో తెలంగాణా ప్రాంతము కాని ప్రదేశములు అని అర్థము;

(2) "బోర్డు" అనగా 154 విభాగము క్రింద ఏర్పరుచబడిన పరిష్కార సంఘము.

(3) "భవనము" అనుమాటలో, ఇల్లు, వెలియిల్లు, దుకాణము, పశువుల కొట్టము, పాయిఖానా, పాక, (వ్యవసాయ భూమి లోని పశువుల పాక కాక) గుడిసె, గోడ మరియు అట్టి ఏ ఇతర నిర్మాణమైనను—అది రాతిది, ఇటుకది, కఱ్ఱది, మట్టిది, లోహపుది లేక ఇతరమైన ఏ పదార్థముదైనను—చేరును;

(4) "యాదృచ్ఛిక ఖాళీ" అనగా కాలపరిమితి గడిచిపోవుట వలన కాక ఇతర విధముగా ఏర్పడిన ఖాళీ అనియు "యాదృచ్ఛిక ఎన్నిక" అనగా యాదృచ్ఛిక ఖాళీని భర్తీ చేయుటకై ఏర్పాటుచేయబడిన ఎన్నిక అనియు అర్థము;

(5) "కమీషనరు" అనగా ఈ చట్టము క్రింద కమీషనరు అధికారముతో వేటినైన వినియోగించుటకు లేదా విధులలో వేటినైనా నిర్వర్తించుటకు ప్రభుత్వము అధికారమిచ్చిన ఏ అధికారి అయినా ఈ మాటలో చేరును.

(6) "కంపెనీ" అనగా 1956, కంపెనీల చట్టములో నిర్వచింపబడినట్టి కంపెనీ అని అర్థము. ఆ మాటలో సదరు చట్టము 591వ విభాగము యొక్క అర్థము క్రిందికివచ్చు విదేశకంపెనీ కూడాచేరును;

(7) జిల్లా మునసబు అనగా:—

(i) ఆంధ్ర ప్రాంతం విషయంలో 1873 ఆంధ్రప్రదేశ (ఆంధ్ర ప్రాంతపు) సివిల్ కోర్టుల చట్టము క్రింద నియమింపబడిన జిల్లామునసబు అని అర్థము.

(ii) తెలంగాణా ప్రాంతము విషయములో 1954 ఆంధ్ర ప్రదేశ (తెలంగానా ప్రాంతపు) సివిలుకోర్టుల చట్టము (1954 లో చట్టము) 6వ విభాగముక్రింద నియమింపబడిన మునసబు అని అర్థము.

(8) "ఎన్నిక అధికారి" అనగా పంచాయతీ సర్పంచు, ఉప సర్పంచు లేక సభ్యుడు కానట్టి, నిర్ణయింప బడినట్టి అధికారి అని అర్థము;

(9) "కార్య నిర్వాహకాధికారి" అనగా—

(i) కార్యనిర్వాహక ఆఫీసరు ఉన్న ఒక పంచాయతీ లేక కొన్ని పంచాయతీల సముదాయము విషయములో ఆ కార్యనిర్వాహక ఆఫీసరున్ను, కార్యనిర్వాహక ఆఫీసరులేని పక్షమున పంచాయతీ సర్పంచు అని అర్థము;

(ii) ఇతర ఏ పంచాయతీ విషయములోనైనను దానిసర్పంచు అని అర్థము;

(10) "కార్య నిర్వాహక ఆఫీసరు" అనగా ఒక పంచాయితీ లేక కొన్ని పంచాయతీల సముదాయముయొక్క కార్యనిర్వాహక ఆఫీసరు అని అర్థము;

(11) "ఫ్యాక్టరి" అనగా 1948, ఫ్యాక్టరీల చట్టములో నిర్వచింపబడిన ఫ్యాక్టరీ అని అర్థము. మరియు ఆ మాటలో ఆవిరి, నీరు, నూనె, గ్యాసు, విద్యుచ్ఛక్తి సహాయముతోనైనను యాంత్రికముగా

ఉత్పన్నమగు, మరియు మానవ సహాయమున లేక జంతు సహాయమున ఉత్పన్నము చేయబడని ఏ ఇతరమైన శక్తితోనైనను నడుపబడు పారిశ్రామిక, ఉత్పాదక లేక వ్యాపార కార్యములు కొనసాగింపబడు ఆవరణము; దానికి అనుబంధముగా నున్న ప్రదేశములతో సహా చేరును;

(12) "ప్రభుత్వము" అనగా రాష్ట్ర ప్రభుత్వముఅని అర్థము;

(13) "గ్రామ పంచాయతీ" అనగా ఈచట్టము ననుసరించి స్థానిక పరిపాలనకొరకు ఏర్పాటుచేయబడిన సంస్థ అని అర్థము.

(14) "గ్రామసభ" అనగా 6 వ విభాగము క్రింద ఏర్పడు గ్రామసభ అని అర్థము;

(15) "ఇల్లు" అనగా ఉమ్మడి దారినుండి ప్రత్యేకపు ముఖద్వారము కలిగిఉండి కాపురముండునట్టిదిగనో లేక ఇతర ఏవిధముగనో మనుష్యులు ఉండుటకు తగిన భవనములేక గుడిసె అని అర్థము; ఆ మాటలో ఏదైన దుకాణము, వర్కుషాపు లేక గిడ్డంగిలేక బస్సులను ఉంచుటకు లేక నిలుపుటకు లేక బస్సుస్టాండుగా ఉపయోగింపబడు భవనముకూడా చేరును;

(16) "గుడిసె" అనగా ముఖ్యముగా కర్ర, మట్టి, ఆకులు, గడ్డి లేక పూరితో నిర్మింపబడిన ఏ భవనమైనను అని అర్థము; ఆ మాటలో ఈచట్టపు ప్రయోజనముల నిమిత్తము పంచాయతి గుడిసెగా ప్రకటించు, ఏ పరిమాణమునైనను కలిగియున్న ఏ తాత్కాలిక నిర్మాణమైనను లేక ఏ పదార్థముతోనైనను నిర్మింపబడిన ఏ చిన్న భవనమైనను చేరును;

(17) "పాయిఖానా" అను మాటలో మరుగుదొడ్డి, నీటి మరుగుదొడ్డి మూత్రశాలయును చేరును;

(18) "స్థానిక అధికారసంస్థ" అనుమాటలో కంటోన్మెంటు అధికార సంస్థ కూడ చేరును;

(19) "సభ్యుడు" అనగా పంచాయతీ సభ్యుడు అని అర్థము;

(20) "కంటకము" అను మాటలో కంటికిగాని, ముక్కుకు గాని, చెవికిగాని హాని, అపాయము, చిరాకు లేక చెడుపు లేదా విశ్రాంతికి లేక నిద్రకు భంగము కలిగించునట్టి లేదా కలిగించజాలునట్టి లేదా ప్రాణాపాయముగా గాని, ఆరోగ్యమునకు లేక ఆస్తికి నష్టదాయకముగా గాని ఉన్నట్టి లేదా వుండజాలునట్టి ఏదైనా చేత లేక చేయమి లేదా స్థలము లేక వస్తువు చేరును;

(21) "న్యాయపంచాయతీ" అనగా 160 వ విభాగముక్రింద ఏర్పాటు చేయబడిన న్యాయ పంచాయతీ అని అర్థము;

(22) "సాధారణ ఖాళీ" అనగా కాలపరిమితి గడచిపోవుట వలన ఏర్పడిన ఖాళీ అనియు, "సాధారణ ఎన్నిక" అనగా ఒక సాధారణ ఖాళీని భర్తిచేయుటకు జరుపబడు ఎన్నిక అనియు అర్థము;

(22) "యజమాని" అను మాటలో—

(ఏ) ఈమాట దేని విషయమై వాడబడెనో అట్టిఆస్తియొక్క అద్దెను లేక లాభములను తన మూలమునగాని లేక మరొకరి కొరకు లేక మత లేక ధర్మ ప్రయోజనముకొరకు ఏజంటు, ట్రస్టి, గార్డియను, మేనేజరు, రిసీవరరుగాగాని ప్రస్తుతమునకు పొందుతున్న లేక పొందుటకు హక్కుగల వ్యక్తియును,

(బి) ఈ మాట దేని విషయమై వాడబడెనో అట్టి జంతువు, వాహనము ఎవరి స్వాధీనములో వున్నదో అట్టివ్యక్తియును చేరుదురు;

(24) "పంచాయతి సమితి" అనగా ఆంధ్ర ప్రదేశ పంచాయతీ సమితి మరియు జిల్లా పరిషత్ చట్టము 1959 విభాగము 2 ఉపవిభాగము (హెచ్) లో వివరించిన పంచాయతి సమితి.

(25) "నిర్ణయింపబడిన" అనగా ప్రభుత్వము వారిచే ఈ చట్టము ననుసరించి చేయబడిన నియమములద్వారా నిర్ణయింపబడిన అని అర్థము;

(26) "ప్రైవేటురోడ్డు" అనగా పబ్లిక్ రోడ్డు కానట్టి ఏదైన వీధి, రోడ్డు, చౌకు, ముంగిలి, సందు, బాట, బండ్లబాట, కాలిబాట, సవారిబాట అని అర్థము; కాని ఒక ఆవరణయొక్క యజమాని తన ఆవరణలోనికి పోవుటకు లేక దానిని అనుకూలముగా ఉపయోగించుకొనుటకు తన భూమిపైననే వేసుకున్న బాట ఈ మాటలో చేరదు:

(27) "పబ్లిక్ రోడ్డు" అనగా రహదారి ఐనను కాకున్నను, త్రోవ ఉపయోగించుకొనుటకు ప్రజల హక్కుగల ఏదైన వీధి, రోడ్డు, చౌకు, ముంగిలి, సందు, బాట, బండ్లబాట, కాలిబాట లేక సవారి బాట అని అర్థము; మరియు ఆ మాటలో

(ఏ) ఏదైన పబ్లిక్ వంతెనపైగాని ఉండు రోడ్డు బాటయును,

(బి) అట్టి ఏదైన రోడ్డుతో, పబ్లిక్ వంతెనతో, లేక భూముతో చేరియుండు కాలి బాటయును,

(సి) అట్టి ఏ రోడ్డుతో పబ్లిక్ వంతెనతో లేక భూముతో నైనను చేరియుండు కాలువలు, రోడ్డు బాటకు ఏవైపుననైన వుండి పేవుమెంటుచే నైనను, వసారాచే నైనను, లేక ఇతర నిర్మాణముచే నైనను, కప్పబడి యున్నను లేకున్నను, దాని ప్రక్కన ఉండు ఆస్తి స్వంత ఆస్తియైనను స్థానిక అధికార సంస్థకు లేక రాష్ట్ర లేక కేంద్ర ప్రభుత్వమునకు చెందిన ఆస్తియైనను గాని సరిహద్దుల వరకు ఉన్నట్టి భూమియును చేరును.

(28) "నివాసము", "నివసించు" — ఒక వ్యక్తి ఇంటిలోని ఏదేని ఒక భాగమును కొన్నిసార్లు నిద్ర పోవుటకు ఉపయోగించి నచో, ఆయనకు ఆ ఇల్లు నివాసము అయి యున్నట్లుగా భావింప బడును. మరియు ఒక వ్యక్తి అట్టి ఒక ఇంటికి ఏ సమయమందైనను తిరిగి వచ్చుటకు స్వేచ్ఛ కలిగియుండిన లేక తిరిగివచ్చు ఉద్దేశము విర మించు కొనకుండిన పక్షములో కేవలము అందులో లేకున్నంత మాత్రమున లేదా వేరొకచోట, తనకు మరియొక గృహము ఉన్నంత మాత్రమున సదరు ఇంటిలో నివసించుట మానివేసినట్లుగా భావింపబడదు;

(29) "రాష్ట్రము" అనగా, ఆంధ్రప్రదేశ రాష్ట్రము అని అర్థము;

(30) తెలంగాణా ప్రాంతము" అనగా 1956, రాష్ట్ర పున ర్వ్యవస్థీకరణ చట్టము 3వ విభాగము (1)వ ఉప-విభాగములో నిర్దిష్ట పరుపబడిన ప్రదేశముగా అని అర్థము;

(31) "గ్రామము" అనగా ఈ చట్టము ననుసరించి ఒక గ్రామముగా ప్రకటింపబడిన ఏదేని స్థానిక ప్రదేశము అని అర్థము;

(32) "జలమార్గము" అను మాటలో సహజమైనట్టి దైనను కృత్రిమమైనట్టిదైనను, నది, ప్రవాహము, కాలువ చేరును;

(33) "సంవత్సరము" అనగా ఆర్థిక సంవత్సరము అని అర్థము;

(34) "జిల్లాపరిషత్తు" అనగా 1959 ఆంధ్రప్రదేశ పంచాయతీ సమితుల జిల్లాపరిషత్తుల చట్టము (1959 లో 35వ ఆంధ్రప్రదేశ చట్టము) 36వ విభాగము క్రింద ఏర్పాటు చేయబడిన జిల్లాపరిషత్తు అని అర్థము.

# 2వ అధ్యాయము

## పంచాయతీల ఏర్పాటు, పరిపాలనము, నియంత్రణ

3. ఈ చట్టముయొక్క కార్యముల నిమిత్తము గ్రామమును ప్రకటించుట:— (1) కమీషనరు ప్రకటనద్వారా, ఇందు నిమిత్తము నిర్ణయింపబడు నియమములకు లోబడి రెవిన్యూ గ్రామము లేదా అందులోని భాగము లేదా రెవిన్యూ తాలూకాలోని ఏదైన భాగమును ఈ చట్టముయొక్క కార్యముల నిమిత్తము గ్రామముగా ప్రకటించవచ్చును, ఆ గ్రామపు పేరును నిర్దేశించ వచ్చును;

(2) కమీషనరు ఈ విషయమై నిర్ణయింపబడు నియమముల ననుసరించి ప్రకటన ద్వారా—

(ఎ) ఒక గ్రామము నుండి దానిలో చేరియున్న ఏ స్థానిక ప్రదేశమునైనను మినహాయించవచ్చును. లేక

(బి) ఒక గ్రామమునకు ప్రక్కగా ఉండి అదే రెవిన్యూ తాలూకాలో చేరియున్న ఏదైన స్థానిక ప్రదేశమును ఆ గ్రామములో చేర్చవచ్చును; లేదా

(సి) (1) వ ఉప-విభాగము క్రింద జారీ అయిన ప్రకటనను రద్దుచేయవచ్చును; లేదా

(డి) గ్రామ నామమును మార్చవచ్చును:

అయితే ఈ ఉప-విభాగము క్రింద ప్రకటన జారీ చేయుటకు ముందు కమీషనరు అట్టి ప్రకటన ఏ పంచాయతీకి వర్తించునో ఆ

పంచాయతి అట్టి ప్రతిపాదనకు వ్యతిరేకముగా కారణమును చూపుటకు తగిన అవకాశ మీయవలెను. మరియు అట్టి పంచాయతీ ఏవైన అభ్యంతరములు తెలిపినచో వాటిని పరిశీలించవలెను.

వివరణ:— (1), (2) ఉప-విభాగములలో ఉపయోగించిన "రెవిన్యూ తాలూకా" అను పదమునకు, (1)వ ఉప-విభాగములో ఉపయోగించిన "రెవిన్యూ గ్రామము" అను పదమునకు క్రమముగా ప్రభుత్వ రెవిన్యూ లెక్కలలో తాలూకాగా లేక గ్రామముగా గుర్తించబడినదై ఈ క్రిందివాటిలో చేరియున్న ఏవేని ప్రాంతములను మినహాయించగా మిగిలిన స్థానిక ప్రదేశము అని అర్థము:—

(ఎ) 1955 హైదరాబాదు మున్సిపల్ కార్పొరేషనుల చట్టము (1956 లో 2వ చట్టము) వర్తించు మున్సిపల్ కార్పొరేషను;

(బి) మున్సిపాలిటీలకు సంబంధించి రాష్ట్రములో తత్కాలమందు అమలులోనున్న శాసనము వర్తించు మునిసిపాలిటీ;

(సి) 1956 ఆంధ్రప్రదేశ (తెలంగాణా ప్రాంత) మైనింగు సెటిల్మెంట్ల చట్టము (1956లో 44వ చట్టము) వర్తించు మైనింగు సెటిల్ మెంటు,

(డి) 1924, కంటోన్మెంట్ల చట్టము వర్తించు కంటోన్మెంటు

(3) కమీషనరు—తనకు సమయోచితముగా అనుకున్న ఉత్తరువుల నివ్వవచ్చు.

(4) అంతరించిన ఒక పంచాయతీ స్వాధీనములో ఉండిన ఆస్తిని పరిష్కరించుటకు దాని అప్పులను తీర్చుటకు సంబంధించి

(బి) ఒక స్థానిక ప్రదేశముపై అధికార విరమణ చేసిన పంచాయతీ స్వాధీనములో ఉండిన ఆస్తిలోని ఏ భాగమునైనను పరిష్కరించుటకు, అట్టి ఆస్తికి సంబంధించి లేక అట్టి స్థానిక ప్రదేశము నుండి ఏర్పడిన ఆ పంచాయతీ అప్పులను తీర్చుటకు సంబంధించిన,

తాను తగునని భావించునట్టి ఉత్తరువులు జారీ చేయవచ్చును.

ఈ ఉప-విభాగము క్రింద జారీ చేయబడిన ఉత్తరువులో కమీషనరు అవసరమని భావించునట్టి అనుపూరక, ప్రాసంగిక, ఆనుషంగిక నిబంధనలు కూడ చేరి యుండ వచ్చును; మరియు ఆయన ప్రత్యేకముగా

(*i*) పంచాయతీకి రావలసిన ఏదైన పన్ను, రుసుము లేక ఇతర మొత్తము లేక పంచాయతీ ఒక స్థానిక ప్రదేశముపై అధికార విరమణ చేసిన సందర్భములో సదరు స్థానిక ప్రదేశమునకు సంబంధించిన పంచాయతీకి రావలసిన ఏదైన పన్ను, రుసుము లేక ఇతర మొత్తము ఉత్తరువులో నిర్దిష్ట పరుపబడిన అధికారులకు చెల్లించవలసినదిగా ఆదేశింపవచ్చును; మరియు

(*ii*) ఒక పంచాయతీకి అది అంతరించిన తేది నాటికి లేక సందర్భమును బట్టి ఒక స్థానిక ప్రదేశముపై అధికార విరమణ చేసిన తేది నాటికి అట్టి పన్ను రుసుము లేక మొత్తమునకు సంబంధించి పెండింగులో ఉన్న అప్పీళ్ళు, అర్జీలు లేక ఇతర దరఖాస్తులు ఉత్తరువులో నిర్దిష్ట పరుపబడిన అధికారులచే పరిష్కరింపబడవలయునని ఆదేశించ వచ్చును.

(4) గ్రామములకు పంచాయతీల ఏర్పాటు వాటి సంఘీకరణ:- (1) ఒక గ్రామమునకు సంబంధించి 3వ విభాగము క్రింద ప్రకటన

ప్రచురితమైన తేదీన ఆ గ్రామపంచాయతీ ఏర్పాటు చేయబడినట్లుగా భావింపబడవలయును. 220వ విభాగము (1)వ ఉప-విభాగము క్రింద నియమింపబడిన స్పెషల్ ఆఫీసరు ఆ విభాగములో నిబంధింపబడిన రీతిగా పంచాయితీ సభ్యుల, సర్పంచు ఎన్నికలకు ఏర్పాట్లు చేయవలయును.

(2) ఈచట్టపు నిబంధనలకు లోబడి గ్రామ పరిపాలన పంచాయతీ వశమై ఉండవలయును కాని ఆ పంచాయతీ. ఈ చట్టము లేక ఏదేని ఇతర శాసనము ద్వారా లేక వాటి క్రింద వాని సర్పంచుకు లేక కార్యనిర్వాహకాధికారికి, లేక ఏదైన ఇతర స్థానిక అధికార సంస్థకు లేక ఇతర అధికార సంస్థకు స్పష్టముగా ప్రత్యేకింపబడిన విధులను నెరవేర్చుటకు హక్కు కలిగి యుండరాదు.

(3) ప్రతి పంచాయతీయును, 3వ విభాగము క్రింద జారీ చేయబడిన ప్రకటనలో నిర్దేశింపబడిన గ్రామ నామముతో సంఘీభూత సంస్థగా నుండవలయును; నిరంతర వుత్తరాధికారమును, సామాన్య ముద్రను కలిగి యుండవలయును. ఈ చట్టము లేక ఏదైన ఇతర శాసనము ద్వారా లేక వాటి క్రింద విధింపబడు ఎదైన పరిమితికి లేక అర్హతకు లోబడి, దాని సంఘీభూతమైన పేరిట వ్యాజ్యము చేయబడునట్టియు, లేక చేయునట్టియు, ఆస్తులను సంపాదించి, ఉంచుకొని బదిలీ చేయునట్టియు, కంట్రాక్టులను చేసికొను నట్టియు అది ఎందు నిమిత్తమై ఏర్పాటుచేయబడెనో ఆ ప్రయోజనములకు గాను అవసరమగు, అవశ్యకమగు లేక యుక్తమైన అన్ని కార్యములు చేయుటకు అధికారము కలిగి యుండవలయును.

(5) పట్టణ వాడలు:- (1) ప్రభుత్వము ఆంధ్రప్రదేశ్ గజెటులో ప్రకటనద్వారా ఒక గ్రామము లేదా పారిశ్రామిక, కార్మిక, ఏదైన

సంస్థకు చెందిన కాలనీ లేదా ఆరోగ్య కేంద్రముగా వున్న లేదా విశిష్టమైన మత కేంద్రాలు లేక అందులో ఏ నిర్దిష్ట భాగమునైనను పట్టణవాడగా ప్రకటించవచ్చును.

(2) ఒక వేళ ఉపవిభాగము (1) క్రింద ప్రకటించబడిన పట్టణ వాడ ఒక గ్రామము లేదా గ్రామము యొక్క భాగముగా యుండిన, కమిషనర్ (13) విభాగపు, (2) వ ఉపవిభాగము ననుసరించి, ఉపవిభాగము (1) క్రింద ప్రకటించిన ప్రకటనను రద్దు చేయవచ్చు లేదా పరిస్థితినిబట్టి గ్రామమునుండి అటువంటి భాగమును వదల వచ్చు.

(3) పట్టణ వాడగా ప్రకటించబడిన ప్రాంతము గురించి ప్రభుత్వము ఆంధ్రప్రదేశ్ గజెటులో ప్రకటనద్వార పట్టణవాడ కమేటిని తప్పక ఏర్పాటు చేయవలెను, ఎందులోనైతె నిర్ణయించిన పద్ధతిలో ఎన్నికైన సభ్యులు, ప్రభుత్వముచే నామనిర్దేశము చేయబడినవారు తప్పక యుండగలరు.

అయితె ప్రభుత్వముచే నామనిర్దేశము చేయబడిన సభ్యుల సంఖ్య మొత్తము సభ్యుల సంఖ్యలో మూడవవంతుకంటె ఎక్కువ యుండకూడదు.

(4) ప్రభుత్వము ఉపవిభాగము (2) క్రింద జారీ చేసిన ప్రకటనలో ఈ చట్టము ద్వారా లేక దీని క్రింద ఒక పంచాయతీకి అప్పగించబడిన విధులలో ఏవైన పట్టణ వాడ సంఘమునకు బదిలీ చేయబడి దానిచే నిర్వర్తించబడవలెనని ఆదేశింప వచ్చును. మరియు ఈ క్రిందివాటిని నిబంధించవలెను.

(i) పట్టణ వాడ సంఘము సభ్యుల మొత్తము సంఖ్య;

(ii) పట్టణ వాడ సంఘములో సభ్యులుగా ఉండవలసిన వ్యక్తులు లేక వారిని ఎంచుకొనవలసిన విధానము.

(iii) పట్టణవాడ సంఘము చైర్మనుగా ఉండవలసిన వ్యక్తి లేదా అతనిని ఎన్నుకొనవలసిన లేక నియమించ వలసిన విధానము,

(iv) చైర్మను మరియు సభ్యుల పదవీకాలము,

(v) ఏ నిర్బంధములకు షరతులకు లోబడి పట్టణ వాడ సంఘము తన విధులను నిర్వర్తించవచ్చునో ఆ నిర్బంధములు, షరతులు,

(vi) పట్టణ వాడ సంఘపు కార్య విధానము.

(5) ప్రతి పట్టణవాడ కమేటి తన కార్యనిర్వాహకమునకు నిర్ణయించిన పద్ధతిని పాటించవలెను.

(6) ప్రభుత్వము ఆంధ్రప్రదేశ గజెటులో ప్రకటనద్వారా ఈ చట్టము లేదా మునిసిపాలిటీలకు సంబంధించి తత్కాలమందు అమలులో ఉన్న శాసనము లేక దానిక్రింద చేయబడిన ఏదైన నియమావళి లేక (1)వ ఉప-విభాగములో పేర్కొన్న గ్రామము స్థానిక ప్రదేశము లేక దానిలోని నిర్దిష్ట భాగములో కాకుండా రాష్ట్రములోని ఇతర ప్రదేశములో తత్కాలమందు అమలులో నున్న ఏదేని ఇతర శాసనము యొక్క ఏవేని నిబంధనలు ఆ ప్రకటనలో నిర్దేశించినంత మేరకు అట్టి మార్పులకు, చేర్పులకు, నిర్బంధములకు లోబడి ఆ గ్రామమునకు స్థానిక ప్రదేశమునకు లేక భాగమునకు వర్తించవలెనని ఆదేశింప వచ్చును.

6. గ్రామసభ :

(1) 3వ విభాగము క్రింద ప్రకటన ప్రచురితమైన తేదీన ప్రతి గ్రామమునకు ఒక గ్రామసభ ఏర్పాటు కావలెను.

(2) గ్రామసభ 14వ విభాగములో పేర్కొన్న పంచాయతీ ఓటర్ల జాబితాలో పేర్లుగల వ్యక్తులందరితో కూడి యుండవలెను. అట్టి వ్యక్తులు గ్రామ సభ సభ్యులుగా భావించబడవలెను.

(3) పంచాయితీ ఈ క్రింది విషయములను గ్రామ సభకు నివేదించవలెను. గ్రామ సభ ప్రతి సంవత్సరము కనీసము రెండు సారులు వాటిని పరిశీలించు నిమిత్తము నిర్ణయించ బడు తేదీన, స్థలమున, సమయమున సమావేశము కావలెను:—

(i) లెక్కల వార్షిక వివరణ, ఆడిటు రిపోర్టు,

(ii) గత సంవత్సరపు పరిపాలనను గూర్చిన నివేదిక,

(iii) ఈ సంవత్సరపు పనుల కార్యక్రమము, లేక బడ్జెటులో గాని, వార్షిక కార్యక్రమములోగాని చేర్చని ఏదైన క్రొత్త కార్య క్రమము,

(iv) క్రొత్త పన్నులకు లేదా ప్రస్తుతపు పన్నులను హెచ్చించుటకు సంబంధించిన ప్రతిపాదనలు.

(v) నిర్ణయింపబడు ఏ ఇతర విషయములైన గ్రామ సభ ఏవైన సూచనలు చేసినచో పంచాయితీ వాటిని తగిన రీతిగా పరిశీలించవలెను.

(4) గ్రామ సభ తమ సమావేశములలో కార్య విధానమ్ము నకు సంబంధించి నిర్ణయింపబడు నియమములను పాటించ వలెను.

(5) గ్రామసభయొక్క ప్రతి సమావేశమునకు పంచాయతి సర్పంచు అధ్యక్షత వహించవలెను.

7. పంచాయతీలో సభ్యుల సంఖ్య :

పంచాయతీలో ఈ క్రింది పట్టిక ననుసరించి కమీషనరు అప్పు డప్పుడు ప్రకటించు నంతమంది సభ్యులు ఉండవలయును:—

పట్టి

| గత జనాభాలెక్కల ప్రకారము పంచాయతీ జనాభా | సభ్యులసంఖ్య |
|---|---|
| (1) | (2) |
| 500 కు తక్కువ యుండిన | 5 |
| 500 లేదా ఎక్కువవుండి 1,500 కు మించనిచో | 7 |
| 1,500 కు మించియుండి 3,000 కు మించనిచో | 9 |
| 3,000 కు మించియుండి 5,000 కు మించనిచో | 11 |
| 5,000 కు మించియుండి 10,000 కు మించనిచో | 13 |
| 10,000 కు మించియుండి 15,000 కు మించనిచో | 15 |
| 15,000 కు మించియున్నచో | 17 |

8. ఎన్నికైన సభ్యులు :

13వ విభాగములో ఇతర విధముగా నిబంధింపబడినట్లు తప్ప పంచాయతీ సభ్యులు లేదా విభాగము (5) ఉపవిభాగము (3) ననుస

రించి ఏర్పర్చబడిన పట్టణవాడ కమేటి రహస్య బ్యాలెటు ద్వారా ఎన్నుకొనబడవలెను.

9. స్త్రీలకు, షెడ్యూల్డు కులములకు, షెడ్యూలు తెగలకు చెందిన వారికి స్థానముల ప్రత్యేకింపు:

(I) ప్రతి పంచాయతీలోను 7వ విభాగముక్రింద నిర్ణయించిన మొత్తము సభ్యుల సంఖ్యనుండి నిర్ణయింపబడు నియమావళికి లోబడి కమీషనరు ప్రకటనద్వారా ఈక్రింది విధముగా స్థానములను ప్రత్యే కించ వలెను.

(ఎ) పైన చెప్పిన మొత్తము సభ్యుల సంఖ్య 7 లేక తక్కువ అయినచో ఒక స్థానము, అట్టి సంఖ్య 9 లేక అంతకు ఎక్కువైనచో రెండు స్థానములు స్త్రీలకొరకు;

(బి) (i) గ్రామములో షెడ్యూలు కులములకు లేక షెడ్యూలు తెగలకు లేదా ఆ రెండింటికి చెందిన మొత్తం ఓటర్ల సంఖ్య 50 అయినచో ఒక సీటు షెడ్యూలు కులములకు లేదా షెడ్యూలు తెగలకు చెందినవారికి, ఎవరైతె ఎక్కువ సంఖ్యలో యున్నారో!

(ii) ఎక్కడైతె షెడ్యూలు కులాలకు మరియు షెడ్యూలు తెగలకు చెందినవారు గ్రామములో 50 గలరో కాని సంఖ్యలో సగము యుండిన ఒక సీటు అతను నిర్ణయించినట్లు షెడ్యూలు తెగ లకు కాని లేదా షెడ్యూలు కులాలకు కాని.

(iii) ఎక్కడైతె షెడ్యూలు కులాలు, మరియు షెడ్యూలు తెగలకు మొత్తము కలసి 50 కంటె ఎక్కువున్న, కాని జనాభాలో సగముకంటె తక్కువ యుండిన, వారి సంఖ్య మొత్తము ప్రజల నిష్పత్తి దృష్టిలో పెట్టుకొని, అతను నిర్ణయించినప్రకారము,అయితే

ఒక సీటు తప్పక ప్రత్యేకింపబడియుంచి షెడ్యూలు తెగలకు కాని ఎక్కువయున్న వారికి కేటాయించబడును.

అయితే షెడ్యూలు కులాల మరియు షెడ్యూలు తెగలకు చెందినవారు సమానముగా యుండిన, ఈ ఉప విభాగముక్రింద అతను నిర్ణయించినట్లు యుండగలదు.

(iv) ఎక్కడైతే షెడ్యూలు కులాలు మరియు షెడ్యూలు తెగలకు మొత్తముకలసి 50 కంటె ఎక్కువయున్న కాని మొత్తము గ్రామ జనాభాలో సగముకంటె తక్కువయుండిన. వారి సంఖ్యా మొత్తము ప్రజల నిష్పత్తి దృష్టిలో పెట్టుకొని అతను నిర్ణయించిన ప్రకారము షెడ్యూలు కులాలకు లేదా షెడ్యూలు తెగలకు ప్రత్యేకింపబడును.

అయితే షెడ్యూలు కులాలకు మరియు షెడ్యూలు తెగలకు చెందినవారు 50 కంటె ఎక్కువ మరియు గ్రామజనాభాలో సగం కంటె ఎక్కువయుంటె. షెడ్యూలు కులాలవారికి గాని, షెడ్యూలు తెగలకు కాని 50 కంటె ఎక్కువయున్న ఎవరు ఎక్కువ సంఖ్యలో యుంటె వారికి ప్రత్యేకించబడును.

ఇంతేకాకుండ (బి) ఖండము క్రింద చేయబడిన ఏ ప్రత్యేకింపు అయినను ఈ చట్టము ప్రారంభమైనప్పటి నుండి పది సంవత్సరముల కాలము గడిచిన పిమ్మట పంచాయతీకి మొదటి సాధారణ ఎన్నికలు జరుగునంతవరకు మాత్రమే అమలుకలిగి యుండవలయును.

వివరణ—ఈ విభాగములో పేర్కొనబడిన షెడ్యూలు కులములు షెడ్యూలు తెగలు అనుమాటలకు వరుసగా వాటికి భారత రాజ్యాంగములోని 366వ అనుచ్ఛేదము (24) మరియు (25)వ ఖండములో ఈయబడిన అర్థములనే కలిగి యుండవలెను.

(2) ఉపవిభాగము (1)లో ఉన్నదేదియు స్త్రీలు షెడ్యూలు కులములు, షెడ్యూల్డు జాతులకు చెందిన సభ్యులు పంచాయతీలోని ప్రత్యేకింపబడని స్థానముకు ఎన్నిక పోటీచేయుటనుండి ఆటంకపరచునట్లు భావింపబడరాదు.

10. నియోజక వర్గముల విభజన.—పంచాయతీకి సభ్యులను ఎన్నుకొను నిమిత్తము కమీషనరు, నిర్ణయింపబడు నియమములకు లోబడి 7వ విభాగము క్రింద నిర్ణయించిన స్థానములు ఎన్నిఉన్నవో అన్ని నియోజకవర్గములుగా గ్రామములను ఓటర్లసంఖ్యను బట్టి విభజించవలెను. ప్రతి నియోజకవర్గమునకు ఒక్కొక్క స్థానము మించకుండా కేటాయించవలెను.

11. సభ్యుల కాలపరిమితి.—(1) ఈచట్టములో వేరొక విధముగా నిబంధింపబడిననే తప్ప, సాధారణ ఎన్నికలలో ఎన్నికఅయిన సభ్యుల పదవీకాల పరిమితి 12వ విభాగము (3)వ ఉప-విభాగము ననుసరించి పంచాయతీ యొక్క మొదటి సమావేశము ఏర్పాటుచేయబడిన తేదీ నుండి ఆరంభమై అయిదు సంవత్సరముల వరకు ఉండవలయును:—

అయితే ప్రభుత్వము వారు, ఆంధ్రప్రదేశ గెజెటులో ప్రకటన ద్వారా, అందు పేర్కొనబడిన తగు కారణమును బట్టి సదరు సభ్యులందరి యొక్క పదవికాలమును సదరు ప్రకటనలో నిర్దిష్టపరుపబడిన కాలము వరకు పొడిగింపవచ్చును; కాని అట్లు పొడిగింపబడిన మొత్తము కాలపరిమితి ఏ సందర్భములోనైనను ఒక సంవత్సరమునకు మించరాదు.

అయితే ఇంకా పునర్నిర్మించబడిన గ్రామపంచాయతి సభ్యుల పదివికాల పరిమితి నిర్ణయించడములో, వెళ్లిపోవుచున్న సభ్యుల కాల విస్తరణను తీసివేయబడును.

(2) పదవిలో నుండి దిగిపోవుసభ్యుల యొక్క పదవికాలము, తిరిగి ఏర్పాటుచేయబడిన పంచాయతీ, 12వ విభాగము (3)వ ఉప విభాగము ననుసరించి మొదటిసారిగా సమావేశపరుపబడిన తేదీ నాటికి ఒకదినము సద్యః పూర్వ్యమువరకు ఉండి ఆరోజుతో అంతమగు నట్లు భావింపబడవలెను:

అయితే పదవిలో నుండి దిగిపోవు ఆ సభ్యులు వారి పదవీ కాలము అంతమైన తరువాత పదవిలో నుండుట వాంఛనీయము కాదని కమీషనరు అభిప్రాయపడినచో ఆయన,

(ఏ) సదరు పంచాయతీ సర్పంచు, ఉపసర్పంచుతోపాటు సభ్యులు వారి పదవి కాలపరిమితి కాలము గడిచిపోవుట కారణముగా అంతమైన తేదీన మరియు ఆతేదీ నుండి పదవినుండి విరమింపవలయు నని ఆదేశింపవచ్చును.

(బి) 216వ విభాగము (1)వ ఉపవిభాగము ననుసరించి సదరు తేదీ నుండి, పంచాయతీ తిరిగి ఏర్పాటు చేయబడువరకు దాని యొక్కయు, తిరిగి ఏర్పాటుచేయబడు పంచాయతీ సర్పంచును ఎన్నుకొనువరకు ఆయనయొక్కయు అధికారములను వినియోగిం చుటకును, విధులను నిర్వర్తించుటకును ఒక స్పెషల్ ఆఫీసరును నియ మింపవచ్చును.

(3) సభ్యుల పదవులలో ఏర్పడు సాధారణ ఖాళీలు, అట్టి ఖాళీలు ఏర్పాటుకు పూర్వము మూడునెలల కాలములోపుగా,ఎన్ని కల అధికారి తాను సముచితమని భావించు విధముగా నిర్ణయించు తేదీన లేక తేదిలలో జరుపబడు సాధారణ ఎన్నికలద్వారా భర్తీ చేయబడవలయును.

అయితే ప్రభుత్వమువారు తగిన కారణమునుబట్టి ఖాళీ ఏర్పడిన తర్వాతనే సాధారణపు ఎన్నిక జరుపుటకు ఆదేశింపవచ్చును లేదా అనుమతింపవచ్చును.

ఇంతే కాకుండా ప్రభుత్వమువారు వ్రాసియుంచదగు తగిన కారణమునుబట్టి అప్పుడప్పుడు ఒక సాధారణ ఎన్నికను లేదా దాని ఏదేని దశను వాయిదా వేయుటకు లేక ఎన్నిక తేదీని మార్చుటకు ఆదేశింపవచ్చును. మరియు అట్టి ఆదేశమును ఎన్నిక అధికారి అమలు జరుపవలయును.

(4) (ఏ) పంచాయతీ యొక్క ఎన్నుకొనబడిన సభ్యుని పదవిలో యాదృచ్ఛిక ఖాళీ ఏర్పడినచో అట్టి ప్రతి విషయము అట్టిఖాళీ ఏర్పడిన పదిహేను దినములలోపల కార్యనిర్వాహకాధికారి ఎన్నిక అధికారికి తెలియచేయవలయును. ఆతేదీనుండి నాలుగు నెలలలోపల ఆఖాళీ భర్తీచేయబడవలెను.

(బి) యాదృచ్ఛిక ఖాళీలో ఎన్నుకొనబడిన సభ్యుడు పదవిలో వెంటనే చేరవలయును. కాని ఆయన ఎవరి స్థానములో ఎన్నుకొనబడెనో ఆ సభ్యుడు అట్టి ఖాళీ ఏర్పడకుండినచో ఆ పదవిలో ఎంత కాలము పదవిలో ఉండుటకు హక్కు కలిగి యుండునో అంతకాలము మాత్రమే పదవిలో ఉండవలయును.

(సి) పంచాయతీకి ఎట్టి యాదృచ్ఛిక ఎన్నికగాని సభ్యుల పదవీ కాలపరిమితి అంతమగు తేదీకి ముందు ఆరు నెలలకు లోపుగా జరుపబడరాదు.

12. పంచాయతీ సర్పంచు మరియు ఉపసర్పంచును ఎన్నుకొనుట - (1) ప్రతి పంచాయతీకిని, నిర్ణయింపబడు విధముగా సదరు పంచాయతీచే సభ్యులలో ఒకరు సర్పంచు మరియొకరు ఉపసర్పంచుగను ఎన్నుకొనబడవలయును. అట్టి కార్యము నిమిత్తము జరిగిన ఒక

ఎన్నిక సమయములో సర్పంచుగానీ, ఉపసర్పంచుగానీ ఎన్నుకొనబడనిచో తిరిగి క్రొత్త ఎన్నిక జరుపబడవలయును. ఆవిధముగా ఎన్నుకొనబడిన సర్పంచు ఉపసర్పంచుల పేర్లు నిర్ణయింపబడు విధముగా ప్రచురింప బడవలయును.

అయితే పార్లమెంటు సభ్యులుగాని, స్టేటు శాసన సభ్యులుగాని, సర్పంచుగాని, ఉపసర్పంచు పదవికి ఎన్నుకొనబడిన, వారు ఆ పదవులకు ఎన్నికైన 15 రోజులలో పార్లమెంటుగాని స్టేటు శాసనసభ సభ్యత్వము రాజీనామా వల్లగాని. మరేవిధముగా గాని అంతముకానట్లుండిన పై పదవి తప్పక అంతమగును.

(2) ఒక గ్రామ పంచాయతీ సభ్యుడు పంచాయతి సమితిలో ఎక్కడైతె ఆ గ్రామములోని అధికారము క్రింద యున్నదో లేదా పంచాయతి సమితిలోని ఏదైన గ్రామపంచాయతితో గాని ఒప్పందము ఇంకాయుండి స్వప్రయోజనము యుండిన సర్పంచుగా ఎన్నిక అగుటకు అనర్హుడు అగును.

అయితె ఒక వ్యక్తి ఒప్పందము లేదా పనిలో క్రిందివాటిలో భాగము లేదా ప్రయోజనము యున్నంత మాత్రమున స్వప్రయోజనము యున్నట్లుగా భావించరాదు,

(i) ఒక కంపెనీలో డైరుక్టరు కాక సాధారణ భాగస్వామిగాయుండిన

(ii) దాని కొరకే ఒక చిరాస్థి ఒప్పందము లేదా కౌలు, అమ్మకము లేదా కొనటము లేదా

(iii) డబ్బు అప్పుగురించి, లేదా డబ్బు ఇచ్చుటకు జామీను ఒప్పందము యుండిన, లేదా

(iv) ఏవైన వార్తాపత్రికలపై చెప్పబడిన గ్రామపంచాయతీ విషయములను ప్రకటించబడునో.

(3) సర్పంచును, ఉపసర్పంచును ఎన్నుకొనుటకుగాను జరుగు మొదటి సమావేశము పంచాయతికి జరిగిన సాధారణ ఎన్నికల ఫలితములు ప్రకటించిన వెంటనే పంచాయతికి ఎన్నికైన సభ్యుల సంతకాలతో నోటీసును సర్పంచును మరియు ఉపసర్పంచులను ఎన్నుకొనుటకు నోటీసు బోర్డుపైన ప్రకటించవలెను.

అయితే ఏవైన కారణములవల్ల సర్పంచు, ఉపసర్పంచు ఎన్నిక అదే రోజున కాజాలకు పోయిన, రెండోరోజు సర్పంచు, ఉపసర్పంచుల ఎన్నిక కొరకు సమావేశము జరుపబడును. ఆ రోజు గ్రామ పంచాయతికి సెలవు అయినా లేక పోయినా.

(4) ప్రతి సర్పంచు లేక ఉపసర్పంచు తన సభ్యత్వ కాలపరిమితి అంతమయిన మీదట సదరు పదవి నుండి విరమింపవలయును.

13. కొన్ని సందర్భములలో ఎన్నిక ద్వారా లేక నామనిర్దేశము ద్వారా ఖాళీలను భర్తీ చేయుట— (1) ఒక ఖాళీని భర్తీచేయుటకు సాధారణ లేక యాదృచ్ఛిక ఎన్నికలో ఏ వ్యక్తిగాని ఎన్నుకొనబడనిచో ఎన్నికల అధికారి నిర్ణయింపగల తేదీన క్రొత్త ఎన్నిక జరుపబడవలెను.

(2) ఒక ఖాళీని భర్తీ చేయుటకు అట్టి కొత్త ఎన్నికలో ఏ వ్యక్తిగాని ఎన్నుకొనబడనిచో అట్టి ఖాళీని భర్తీచేయుటకు పంచాయతీ సభ్యులు నిర్ణయింపబడు విధానమున అట్టి గడువులోపల ఎన్నుకొనవలెను. నిర్ణయింపబడు గడువులోపల ఏ వ్యక్తి ఎన్నుకొనబడనిచో అట్టి ఖాళీని భర్తీచేయుటకు కమీషనరు అర్హుడైన వ్యక్తిని నామనిర్దేశము చేయవలయును.

(3) ఈ విభాగము క్రింద ఎన్నుకొనబడిన లేక నామనిర్దేశము చేయబడిన పంచాయితీ సభ్యుని పదవీ కాలము అతడు సాధారణ లేక యేదో యాదృచ్ఛిక ఎన్నికలో ఎన్నుకొనబడినచో అతని పదవీ కాలము ఎప్పటితో అంత మయ్యేడిదో అప్పటితో అంతము కావలయును.

14. గ్రామ పంచాయతీకి ఓటర్ల జాబితా తయారుచేయుట ప్రచురించుట మరియు దానిలో చేర్చబడుటకు అర్హతలు:— (1) నిర్ణయింపబడిన అధికారిచే అధికార మీయబడిన ఎవరైన వ్యక్తి ఆ గ్రామమునకు సంబంధించిన, ముసాయిదా వోటర్ల జాబితాను ప్రతి సంవత్సరము ప్రకటించవలెను. ఏదైతె ఒక గ్రామము లేక అందలి భాగము చేర్చబడి యున్న శాసనసభా నియోజక వర్గముల జాబితా, 1950 ప్రజా ప్రాతినిధ్య చట్టము ననుసరించి ప్రచురించబడి, సవరించబడిన లేక మార్పు చేయబడిన, ప్రభుత్వము వారు ఆదేశింపగల విధముగా ఆ గ్రామమునకు సంబంధించిన సదరు జాబితా యొక్క భాగములను లేక అందలి మార్పులను పంచాయతి యొక్క ఓటర్ల జాబితాగ ప్రకటించవలెను.

వివరణ:— శాసనసభా నియోజకవర్గము యొక్క ఓటర్ల జాబితాలో ఆ గ్రామమునకు సంబంధించిన ఎట్టి నిర్దిష్టమైన భాగము లేని పక్షమున ఆ గ్రామము ఏ రిజిస్ట్రేషను ప్రాంతము క్రిందకు వచ్చునో దాని క్రింద పేర్లు వ్రాయబడిన వ్యక్తులందరును మరియు అట్టి జాబితాలో వ్రాయబడిన ఎవరి చిరునామాలు ఆ గ్రామములో కలవో ఆ వ్యక్తులందరును ఈ చట్టపు ప్రయోజనము నిమిత్తము తయారు చేయబడిన పంచాయితీ ఓటర్ల జాబితాలో చేర్చబడుటకు హక్కు కలిగి యుండవలయును.

(2) ఉపవిభాగము (1) ననుసరించి ప్రకటించబడిన ముసాయిదా ఓటర్ల జాబితాను ప్రకటించబడిన 30 రోజుల తర్వాత ప్రభుత్వం నిర్ణయించినట్లు నిర్ణయింపబడిన అధికార మీయబడిన వ్యక్తి గ్రామ పంచాయతి యొక్క అంతిమ ఓటర్ల జాబితాను ప్రకటించవలెను. అందులో శాసనసభ ఎన్నికల ఓటర్ల జాబితా అనుసారముగా అవసరము యుండునట్లు సవరింపబడిన లేక మార్పులు చేయబడినది 30 రోజుల తర్వాత ప్రకటించ బడవలెను.

(3) ఉపవిభాగము (2) క్రింద ప్రకటించబడిన ఓటర్ల జాబితా గ్రామ పంచాయతికి ఓటర్ల జాబితాగా యుండును. అది ముందు యున్న ఉపవిభాగములలో చెప్పబడిన విధముగా ముందు సంవత్సరపు ఓటర్ల జాబితా ప్రకటించబడేవరకు అమలులో యుండును.

(4) పంచాయతీ వోటర్ల జాబితా ఒక్కొక్క నియోజకవర్గమునకుగాను, సాధ్యమైనంత వరకు ప్రతి నియోజక వర్గపు ఓటర్ల సంఖ్య సమముగా వుండునట్లు వేరు నియోజక భాగముగా విభజింప బడవలెను.

అయితె ఒక వేళ అట్టి విభజన తర్వాత ఎక్కువ ఓటర్లు మిగిలి యుంటె చివర నియోజక వర్గములో పేర్లు చేర్చబడి యుండును.

(5) పంచాయతీ ఓటర్ల జాబితాలో పేరు వ్రాయబడిన ప్రతి వ్యక్తియును, అది అమలులో ఉన్నంత కాలము, అందులో చేయబడెడి ఏదేని సవరణకు లోబడి, మరియు ఈ చట్టము యొక్క ఇతర నిబంధనలకు లోబడి ఎన్నికలో ఓటు చేయుటకు హక్కు కలిగి యుండవలయును. అట్టి జాబితాలలో పేరు వ్రాయబడని ఏ వ్యక్తి గాని అట్టి ఎన్నికలో ఓటు చేయరాదు.

(6) ఏ వ్యక్తియు ఈ చట్టము క్రింద ఎన్నికలలో ఒకటి కంటె ఎక్కువ నియోజక వర్గములలోగాని, ఒకే నియోజక వర్గములో ఒకటికంటె ఎక్కువసార్లు గాని ఓటు చేయరాదు. అట్లు చేసినచో అతని ఓట్లన్నియు చెల్లవు.

వివరణ—ఈ విభాగములోను, 15 వ విభాగములోను పేర్కొనబడిన "శాసనసభా నియోజకవర్గము" అను మాటలకు చట్ట రీత్యా ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఎన్నికల కొరకు ఏర్పాటుచేయ బడిన నియోజక వర్గము అని అర్థము.

15. ఓటర్ల జాబితాను కొన్ని పరిస్థితులలో పుర్విభజన మరియు పునర్ ప్రకటన:- 14 వ విభాగము, ఉప విభాగము (2) క్రింద ఓటర్ల జాబితాను ప్రకటించబడిన పిదప గ్రామమును మొదటి సారిగా నియోజకవర్గములుగా విభజింపబడి లేదా అట్టి గ్రామ నియోజక వర్గముల విభజన మార్పిడి చేయబడినచో లేదా గ్రామ సరిహద్దులు మారినచో నిర్ణయింపబడిన అధికారి అట్టి గ్రామ నియోజకవర్గముల విభజన యొక్క మార్పు లేక గ్రామ సరిహద్దుల మార్పుకు అను గుణముగా పంచాయతీ ఓటర్లజాబితా లేక అందలి ఏదైన భాగము తిరిగి తయారుచేయునట్లుగా, తిరిగి ప్రచురించునట్లుగా ప్రభుత్వము వారు ఆదేశింపుగల పద్ధతిలో ఏర్పాటు చేయవలెను.

16. అభ్యర్థుల అర్హత:—పంచాయతి సభ్యుడుగా ఎన్నుకొన బడుటకు ఏ వ్యక్తిగాని ఆయన పేరు సదరు ఎన్నికల జాబితాలో ఉండిననే తప్ప, అర్హుడు కాడు

17. రాష్ట్ర కేంద్ర ప్రభుత్వముల యొక్కయు స్థానికాధికార సంస్థలయొక్కయు అధికారుల ఉద్యోగుల అర్హతలు -(1) ఏ గ్రామ అధి కారి లేక ఉద్యోగి మరియు రాష్ట్ర కేంద్ర ప్రభుత్వముల లేక స్థాని

కాధికార సంస్థలయొక్క అధికారి లేక ఉద్యోగి పంచాయతీ సభ్యుడుగా ఎన్నుకొనబడుటకు లేక ఎన్నుకొనబడిన సభ్యుడుగా ఉండుటకు అర్హుడుగా నుండరాదు.

వివరణ—ఈ విభాగము యొక్క కార్యముల కొరకు-

(ఏ) "గ్రామఅధికారి" అనగా ఆంధ్ర ప్రాంతమునకు సంబంధించి—

(1) గ్రామ హెడ్మను గ్రామ మునసబు మరియు గ్రామ కరణము అనియు;

(2) తెలంగాణాకు సంబంధించి-గ్రామ అధికారి, లేక వతన్‌దారు అనగా పటేలు పట్వారీ, లేక తన నామినీ ద్వారా లేక తానే తన పదవికి లేక వతనుకు సంబంధించిన ఉద్యోగము చేయుచున్న వతను హిస్సేదారు అనియు అర్థము.

అట్టి గ్రామ అధికారి లేక వతనుదారు యొక్క నామినీ కూడా ఈ మాటలో చేరును.

(బి) "గ్రామోద్యోగి" అనగా—

(1) ఆంధ్రప్రాంత విషయములో ప్రభుత్వము ఆంధ్ర ప్రదేశ్ గెజట్‌లో ప్రకటన ద్వారా ప్రకటించునట్టి గ్రామోద్యోగి అని అర్థము.

(2) తెలంగాణా ప్రాంతము విషయములో గ్రామ బలుతాదారు, సేట్ సింధి లేక నీరడి లేక హిస్సేదారు ఎవరైతే ప్రభుత్వనిధినుండి ఉపవేతనము పొందుచున్నారో...

(2) ఒక ఎన్నికకు లేక నామినేషనుకు పూర్వముగాని తర్వాత గాని ఏ వ్యక్తియైనను ఈ విభాగము ననుసరించి అనర్హుడా కాడా అను ఎట్టి సమస్యకాని ఉత్పన్నమైన ఎడల దాని విషయమై ప్రభుత్వము వారికి తెలియజేయవలయును. వారందే తుది నిర్ణయము కాగలదు.

18. ఎన్నిక నేరమునకుగాను నేరస్థాపనచేయబడిన వ్యక్తుల అనర్హత:—భారత శిక్షాస్మృతి 10-ఎ అధ్యాయము ననుసరించి లేదా ఎన్నిక రహస్యమును ఉల్లంఘించుటకు సంబంధించిన ఎట్టి శాసనము లేక నియమము ననుసరించి, శిక్షింపదగిన నేరముచేసెనని నేరస్థాపన చేయబడిన ప్రతి వ్యక్తియును అతనిపై నేరస్థాపన చేయబడిన తేదీ నుండి అయిదు సంవత్సరముల కాలపరిమితి వరకు లేక కోర్టువారు ఉత్తరువు ద్వారా నిర్ణయించు అంతకంటే తక్కువ కాలపరిమితి వరకు, ఈ చట్టము వర్తించు ఎట్టి ఎన్నికకో కాని ఎన్నుకొనబడుటకు లేక ఓటు చేయుటకు లేక పంచాయతీ సభ్యుడుగా పదవిలోనుండుటకు అనర్హుడైయుండవలయును.

19. అభ్యర్థుల అనర్హతలు:—(1) ఒకవ్యక్తి క్రిమినలు కోర్టుచే-

(ఏ) 1955, అస్పృశ్యతా నివారణ (నేరములు) చట్టము క్రింద నేరమునకుగాను జైలు శిక్ష.

(బి) అవినీతికి సంబంధించి యుండని ఇతర నేరమునకుగాను ఆరు నెలలకు మించిన కాలమువరకు జైలు శిక్ష.

విధింపబడి అట్టి శిక్ష ఉపసంహారింపబడక, సదరు నేరము క్షమింపబడక ఉన్నఎడల అట్టి వ్యక్తి ఆ శిక్షను అనుభవించుచున్నప్పుడు, ఆ శిక్ష అంతమగు తేదీ నుండి అయిదు సంవత్సరముల వరకును సభ్యుడుగా ఎన్నుకొనబడుటకు అనర్హుడై యుండవలయును.

అయితే ప్రభుత్వమువారు అట్టి శిక్ష ఒక అనర్హతగా అమలు జరుపబడరాదని ఆదేశింపవచ్చును.

(2) ఒక వ్యక్తి ఎన్నికలేక నామనిర్దేశము చేయబడెడు దినమున ఈ దిగువ తెలిపినట్టి వ్యక్తియై ఉన్నచో అతడు సభ్యుడుగా ఎన్నుకొనబడుటకు అనర్హుడు కావలెను.

(ఏ) స్వస్థమనస్కుడు కానివాడై అర్హాముగల కోర్టుచే అట్లు ప్రకటింపబడిన వ్యక్తి.

(బి) చెవిటియు, మూగ అయిన వ్యక్తి, లేక కుష్టు రోగము కల వ్యక్తి,

(సి) దివాలాదారుగా తీర్పు చేయబడుటకు దరఖాస్తు పెట్టుకొన్న వ్యక్తి లేక విముక్తి పొందని దివాలాదారు.

(డి) పంచాయతీతో చేసుకొని అమలులోవున్న కంట్రాక్టులో లేదా దాని కొరకు చేయబడు ఏదైన పనిలో హక్కు కలిగియున్న వ్యక్తి—

(i) ఒక కంపెనీలో (డైరెక్టరు కానట్టి) వాటాదారుగా

(ii) స్థిరాస్తి యొక్క కౌలులో, అమ్మకములో కొనుగోలులో లేక అందుకు సంబంధించిన ఒప్పందములో,

(iii) అప్పు ఒప్పందములో లేక డబ్బు చెల్లింపుకు మాత్రమే పెట్టిన పూచిలో లేక,

(iv) పంచాయతీకి సంబంధించిన వ్యవహారముల ప్రకటనలు వేయబడెడు ఏదైన వార్తాపత్రికలో,

వాటా లేక స్వలాభము కలిగియున్నంత మాత్రమున ఒక వ్యక్తి ఆ కంట్రాక్టు లేక పనిలో స్వలాభము కలిగి యున్నట్లు భావింపబడరాదు.

(ఇ) పంచాయతీ తరపున లేక పంచాయతీకి వ్యతిరేకముగా పనిచేయుటకై జీతము చెల్లించి నియమించబడు న్యాయవాది.

(ఎఫ్) గ్రామములో ఏభాగము పైనైననువిచారణాధికారము గల 1898, క్రిమినలు ప్రొసీజరు కోడు క్రింద గౌరవ మెజిస్ట్రేటుగా వున్న వ్యక్తి.

(జి) అదివరకే పంచాయతీ సభ్యుడుగా వుండి అతని క్రొత్త ఎన్నిక అమలులోనికి వచ్చుటకు పూర్వము పదవీ కాలము అంతము కాబట్టి లేక పంచాయతీ సభ్యుడుగా అదివరకే ఎన్నుకొనబడిన తన పదవీ కాలము ఇంకను ప్రారంభము కానట్టి వ్యక్తి.

(ఎచ్) అంతకు పూర్వము సంవత్సరమువరకు, దానితో చేరియు పంచాయతికి విశ్వాసాశ్రితుడుగా తప్ప ఇతర విధముగా ఆయన పంచాయతికి చెల్లించవలసిన డబ్బు బాకీపడి యుండి అందుకు ఒక బిల్లు, లేక నోటీసు సక్రమముగా అందజేయబడి చెల్లించుటకు అందులో ఏదైన కాలము నిర్ణయింపబడి, ఆ కాలము గడచిపోయి నచో, అట్టి వ్యక్తి.

20 సభ్యుల అనర్హతలు:- 22 వ విభాగపు నిబంధనలకు లోబడి ఈ దిగువ తెలిపిన సభ్యులు తమ సభ్యత్వమును కోల్పోవుదురు:-

(ఏ) క్రిమినలు కోర్టుచే 19 వ విభాగము (1) వ ఉప-విభాగములో వివరింపబడినట్టి నేరమునకై అట్టి శిక్ష విధింపడిన సభ్యుడు;

అయితే, ప్రభుత్వము వారు అట్టి శిక్ష ఒక అనర్హతగా అమలు జరుపబడరాదని ఆదేశించవచ్చును;

(బి) స్వస్థ మనస్కుడు కానివాడై అధికారముగల కోర్టుచే అట్లు ప్రకటింపబడిన సభ్యుడు;

(సి) చెవిటి, మూగయు అయిన సభ్యుడు లేక కుష్టు రోగము గల సభ్యుడు;

(డి) దివాలాదారుగా తీర్పు చేయబడుటకు దరఖాస్తు పెట్టు కొన్న సభ్యుడు లేక దివాలాదారుగా తీర్పుచేయబడిన సభ్యుడు;

(ఇ) 19 వ విభాగపు (2)వ ఉప విభాగములోని (డి)ఖండము యొక్క మినహాయింపు నిబంధనలకు లోబడి, పంచాయతీతో చేసు కొని అమలులో ఉన్న కంట్రాక్టులో లేక దానికొరకు చేయబడు ఏదైన పనిలో స్వలాభము కలిగియున్న సభ్యుడు:

(ఎఫ్) పంచాయతీ తరపున లేదా పంచాయతికి వ్యతిరేక ముగా పనిచేయుటకై జీతము చెల్లింపబడు న్యాయవాది అయిన సభ్యుడు;

(జి) ఈ చట్టము ననుసరించి ఒక అధికారిగా లేక ఒక ఉద్యో గిగా నియమింపబడిన సభ్యుడు;

(హెచ్) 1898, క్రిమినలు ప్రొసీజరు కోడు క్రింద గౌరవ మేజిస్ట్రేటుగా నియమింపబడి గ్రామములో ఏ భాగముపై అయి నను, విచారణాధికారముగల సభ్యుడు;

(ఐ) గ్రామములో నివసించుచుండని సభ్యుడు;

(జె) పంచాయతీకి విశ్వాసపాత్రితుడుగా కాక ఇతర విధముగా తాను చెల్లింపవలసియున్న ఏ విధమైన బాకినైనను ఈ చట్టము ననుసరించి, బిల్లు, లేక నోటీసు తనకు అందజేసిన తర్వాత మూడు నెలలోపల లేక ఈ చట్టము క్రింద ఏదైన బిల్లు లేక నోటీసు అంద జేయవలసిన అవసరము లేని బాకీల విషయములో, బాకి చెల్లింపును కోరుచు పంచాయతీ కార్య నిర్వాహకాధికారి వీలైనంత త్వరలో

అందజేయవలసిన నోటీసు, అందజేయబడినప్పటినుండి మూడు నెలలలోపల చెల్లింపని సభ్యుడు;

(కె) తన పదవీకాలము ప్రారంభమైన తేదీనుండి లేక తాను హాజరైన కడపటి సమావేశపు తేదీ నుండి లేక 21 వ విభాగము లోని (1) వ ఉప-విభాగము క్రింద సభ్యుడుగా ఆయన తిరిగి పదవి. లోనికి వచ్చిన తేదినుండి, వరుసగా మూడు నెలలకాలము పంచాయతీ సమావేశములకు హాజరుకాని సభ్యుడు, లేక ఆ కాలములో మూడింటికంటె తక్కువ సమావేశములు జరిగిన ఎడల ఆ తేదీ తర్వాత జరిగిన మూడు సమావేశములకు హాజరుకాని సభ్యుడు;

అయితే సభ్యురాలు విషయములో, నెలలు నిండినందువలన, ప్రసవము వలన కలిగిన, శారీరకమైన అశక్తత కారణముగా, ఆ సభ్యురాలు ఏ తేదీనుండి హాజరు కాదో తెలుపుచు కార్యనిర్వాహకాధికారికి లిఖిత పూర్వకముగా తెలియజేసిన మీదట సమావేశములకు హాజరుకాని ఎడల, తడవకు రెండు మాసములకు మించని కాలమును, పై తెల్పిన గైరుహాజరీకాలమును లెక్కించుటలో మినహాయింపవలయును;

ఇంతే కాకుండ ఒక సభ్యుడు హాజరుగాని సమావేశమును:-

(i) ఆ సమావేశమును గురించి సదరు సభ్యునకు నిర్ణయింపబడు విధమున తగు నోటీసు పంపబడని ఎడల; లేక

(ii) ఆ సమావేశము సభ్యుల కోరికపై జరుపబడిన ఎడల

ఈ ఖండము క్రింద ఆ సభ్యుని విషయములో లెక్కలోనికి తీసికొనకూడదు.

వివరణ:—ఈ విభాగము కొరకు

(i) "సాధారణ సమావేశము" అనగా మీటింగుకన్న మూడు రోజుల నోటీసు ఇవ్వబడి జరిగిన మీటింగు.

(ii) ఎక్కడైతె సాధారణ సమావేశము కాక వేరే సమావేశము రెండు సాధారణ సమావేశముల మధ్యలో వస్తే అది వరుసగా జరిగే సమావేశముగా గుర్తించబడవలెను.

21. సభ్యులకు వారి పదవులు తిరిగి ఇచ్చుట:—(1) ఒక వ్యక్తి 18 వ విభాగము ననుసరించి లేదా 20 వ విభాగము (ఏ) ఖండము ననుసరించి సభ్యుడుగా నుండుట మానివేసినచో, నేరస్థాపనలేక శిక్ష అప్పీలులేక రివిజనులో రద్దు చేయబడినచో లేక శిక్షవలన కలుగజేయబడిన అనర్హాత ప్రభుత్వము వారి ఉత్తరువు మూలమున తొలగింపబడిన ఆయనకు తన పదవి తిరిగి ఈయబడవలెను. కాగా తాను ఎంత కాలమునకు ఎన్నుకోబడెనో, దానిలో తిరిగి పదవి ఈయబడు తేదీన ఇంకను గడిచిపోకుండ మిగిలియున్న కాల పరిమితి వరకు ఆయన పదవిలో వుంచబడవలయును. ఈ మధ్య కాలములో ఆయన ఖాళీ భర్తీ చేయుటకు ఎన్నుకోబడిన ఏ వ్యక్తియైనను, అట్లు పదవి తిరిగి ఈయబడిన మీదట పదవి నుండి విరమించు కొనవలయును.

(2) 20వ విభాగములోని (కె) ఖండము ననుసరించి ఒక వ్యక్తి సభ్యుడుగా నుండుట మానివేసిన సందర్భంలో ఆ విషయమును గ్రామపంచాయతీకి వెంటనే సదరు వ్యక్తికి వ్రాతమూలకముగా తెలియజేయుచు, దానిని గురించి, దాని మరుసటి సమావేశములో పంచాయతీకి తెలియ పరచవలయును. అట్టి వ్యక్తి పంచాయతీ యొక్క మరుసటి సమావేశపు తేదీన లేక అంతకు పూర్వము లేక ఆయనకు అట్టి సమాచారము అందిన తేది నుండి 15 రోజుల లోపున పదవిలో తిరిగి వుంచవలసినదిగా తనంతట తానుగా పంచాయతీకి దరఖాస్తు పెట్టుకొన్న పక్షమున అట్టి దరఖాస్తు అందిన తరు

వాత మరుసటి సమావేశమునందు పంచాయతీ ఆయనకు తిరిగి సభ్యుడుగా పదవి ఈయవచ్చును:

అయితే, ఒక సభ్యుడు మళ్ళి సభ్యునిగా తీసుకొనబడిన తర్వాత (కె) ఖండము ననుసరించి మళ్ళి అనర్హత కలిగితే, గ్రామపంచాయతి, 30 రోజులలో అతని దరఖాస్తు పునరుద్ధరణకు కార్యనిర్వాహకాధికారి నుండి నోటీసు వచ్చిన గడువునుండి దాఖలు చేస్తే తిరిగి సభ్యుడుగా పదవి ఈయవచ్చు.

22. సభ్యుల యొక్క అనర్హతలను గూర్చి నిర్ణయించు అధికారి: — (1) పంచాయతీకి సభ్యుడుగా ఎన్నుకోబడిన లేదా నామనిర్దేశము చేయబడిన ఏ వ్యక్తిగాని అర్హుడు కాని వ్యక్తిగా లేక 16, 17, 19 లేక 20 విభాగములను అనుసరించి అనర్హుడైనట్లుగా ఆరోపింపబడి, ఆ వ్యక్తి అట్టి ఆరోపణను అంగీకరింపనప్పుడెల్లను, లేదా ఏ సభ్యునకైనను తాను అర్హుడా కాడా అని తాను అనర్హుడయ్యెనా లేదా అని తనకు అనుమానము కలిగినప్పుడెల్లను, అట్టి సభ్యుడు లేక ఎవరేని ఇతర సభ్యుడు మరియు కార్యనిర్వాహకాధికారి ఆ గ్రామము ఎవరి అధికార క్షేత్రము క్రిందికి వచ్చునో, అట్టి జిల్లా మున్సిఫ్‌కు దరఖాస్తు పెట్టుకోవచ్చును. పంచాయతీ లేక కమీషనరు ఆదేశించినచో అట్లు జిల్లా మున్సిఫ్‌కు దరఖాస్తు నోటీసు కాని అనుమానము కాని కలిగిన తేది నుండి రెండు నెలలలో నిర్ణయము కొరకు పెట్టుకొనవలయును.

(2) అట్టి నిర్ణయము జరుగునంత వరకు సదరు సభ్యుడు తాను అర్హుడైన ఎట్లో లేక అనర్హుడు కాకుండ ఉండిన ఎట్లో అట్లే వ్యవహరించుటకు హక్కు కలిగి యుండవలయును.

(3) ఎవరైతే గ్రామ పంచాయతు సర్పంచు లేదా ఉపసర్పంచు పదవి విభాగము 20 ఖండము (కె) ననుసరించి పంచా

యతి సభ్యత్వము అనర్హతవల్ల పోబడి మళ్ళి విభాగము (21) ఉప విభాగము (2) ననుసరించి పంచాయతి సభ్యత్వము తిరిగి ఇవ్వబడిన ఆ తేదినుండే, సర్పంచు లేదా ఉపసర్పంచు పదవి తిరిగి ఇవ్వబడి నట్లు భావించవలెను—

23. సభ్యుడు, సర్పంచు, ఉప సర్పంచు రాజీనామా చేయుట:—
(1) ఎవరేని సభ్యుడు లేక ఉప సర్పంచు వ్రాత మూలకముగా సర్పంచుకు నోటీసు నిచ్చుట ద్వారా తనపదవికి రాజీనామా చేయవచ్చును.

(2) సర్పంచు పంచాయతీకి వ్రాతమూలకముగా నోటీసు ఇచ్చుటద్వారా తన పదవికి రాజీనామా చేయవచ్చును. అట్టి రాజీనామా అది పంచాయతీ సమావేశము యొక్క సమక్షములో ఉంచబడిన తేదీ నుండి అమలులోనికి రావలయును.

అయితే స్పరంచు ఈ పనికొరకై వెంటనే ఒక సమావేశము జరుపుటకు సాధ్యపడదని భావించినచో, ఆయన జిల్లా పంచాయతీ అధికారికి నోటీసు ఇచ్చుట ద్వారా తన పదవికి రాజీనామా చేయవచ్చును. మరియు అట్టి నోటీసు అందిన మీదట, అది సర్పంచు స్వయముగా జిల్లా పంచాయతీ అధికారికి అందచేసిన సందర్భంలో తప్ప, మిగిలిన సందర్భములో ఆయన సదరు సర్పంచునుండి అట్టి నోటీసు యొక్క యథార్థతను గురించి ధృవీకరణను పొందవలయును. వ్యక్తిగతముగ అందజేయబడిన రాజీనామా లేక పైన పేర్కొనబడిన విధముగా ధృవపరుపబడిన రాజీనామా, జిల్లా పంచాయతీ అధికారికి అట్టి నోటీసు అందిన తేదీన మరియు సదరు తేదీనుండి అమలులోనికి రావలయును.

(3) (ఎ) సర్పంచు పదవినుండి రాజీనామ ఉపవిభాగము (2) అనుసరించి అమలులోకి వచ్చినా, కమీషనర్ ప్రకటనద్వారా

కారణములు చూపించుచూ అట్టి వ్యక్తి చట్టములోని విషయముల లేదా, నియమములు, ఉపనియమముల లేదా చట్టప్రకారముగా ఇవ్వబడిన ఉత్తరువుల బుద్ధిపూర్వక లోపము లేదా పని నిర్వహణ వ్యతిరేకించుట లేదా అవిధేయత లేదా అతనికి యున్న అధికార ముల దుర్వినియోగము సర్పంచు పదవి యున్నప్పుడు చేసినట్లు ప్రకటించవచ్చు.

అయితే కమిషనరు అట్టి ప్రకటన చేయకముందె దానికి సంబంధించిన వ్యక్తికి తప్పక సమాధానము ఇచ్చుకొను అవకాశము ఈయవలెను.

ఇంకా అయితే రాజీనామా ఇచ్చి అమలుకు వచ్చిన తేదీ నుండి సంవత్సరము తర్వాత ఈ ఖండము క్రింద చర్యా తీసుకొన కూడదు.

(బి) ఖండము (ఎ) క్రింద ఇచ్చిన ప్రకటన జారీ అయిన నెల లోపల ఆప్రకటనకు వ్యతిరేకముగా ప్రభుత్వమునకు అప్పీలు పెట్టు కొనవచ్చు. అప్పీలు అనుమతించబడిన ప్రభుత్వము ప్రకటనను రద్దు చేయును.

(సి) ఖండము (ఎ) క్రింద ప్రకటించబడిన వ్యక్తి, ఖండము (బి) ననుసరించి ప్రకటన రద్దుచేయబడకుండిన, ప్రకటన అయిన తేది నుండి మూడు సంవత్సరముల వరకు సర్పంచు ఎన్నికకు అనర్హుడుగా యుండును.

21 సర్పంచు, ఉప సర్పంచుల పదవీ విరమణ:—(1) ఈ క్రింది సందర్భములలో సర్పంచు తన పదవిలో ఉండరాదు.

(ఏ) 1959, ఆంధ్ర ప్రదేశ పంచాయితీ సమితుల, జిల్లా పరి షత్తుల చట్టము (1959 లో 35 వ ఆంధ్ర ప్రదేశ చట్టము) 4 వ ప్రకా

గము (1) వ ఉప విభాగము (i) ఖండపు (ఎ) మినహాయింపు నిబంధన క్రింద ఆయన పంచాయతీ సమితి సభ్యత్వమును విరమించి నప్పుడు ;

అయితే, సదరు చట్టపు 10 వ విభాగము (1) వ ఉప విభాగము (సి) ఖండము క్రిందికివచ్చు సందర్భములో పైన తెలిపిన 10 వ విభాగపు (3) వ ఉప విభాగము క్రింద లేదా (4) వ ఉప విభాగము క్రింద తిరిగి పంచాయతీ సమితి సభ్యత్వమును పునరుద్ధరించుటకై పెట్టుకొన్న దరఖాస్తు అంతిమముగా పరిష్కరింప బడునంతవరకు సర్పంచు తన పదవిలో ఉండవలెను ; లేక

(బి) పంచాయితీ యొక్క సభ్యుడుగా తన పదవీకాలము అంతమైన ఎడల లేక తాను ఇతర విధముగా సభ్యుడుగా నుండుట విరమించినప్పుడు ;

(సి) పంచాయతి సమితికి అధ్యక్షుడుగా ఎన్నికైన ప్పుడు ;

అయితే సర్పంచుగా లేకుండుట గ్రామ పంచాయతిలో సభ్యుడుగా యుండుటకు అడ్డురాదు.

(2) ఈ క్రింది సందర్భములలో ఉప సర్పంచు తన పదవిలో ఉండరాదు :—

(ఏ) పంచాయితీ సభ్యుడుగా తన పదవికాలము అంతమైన ఎడల. లేక తాను ఇతర విధముగా సభ్యుడుగా నుండుట విరమించిన ఎడల; లేక

(బి) ఆ పంచాయతీకి ఆతడు సర్పంచుగా ఎన్నుకొనబడిన ఎడల.

25. సర్పంచు యొక్క అధికారములు, విధులు:- (1) ఈ చట్టముచే లేక ఈ చట్టము క్రింద ఇతర విధముగా నిబంధింపబడినట్లు తప్ప, సర్పంచు—

(ఏ) ఖాళీ పర్పడిన తేదీ నుండి ఒక నెలలోపుగా ఉపసర్పంచు ఎన్నిక నిమిత్తము పర్పాట్లు చేయవలయును.

(బి) పంచాయతీ మరియు గ్రామసభ సమావేశములను పర్పాటు చేయవలయును;

(సి) పంచాయతీ యొక్క రికార్డులను చూచుటకు పూర్తి అధికారము కలిగియుండవలెను;

(డి) పంచాయతీ యొక్క తీర్మానములను లేదా దాని ఏదేని సంఘము యొక్క తీర్మానములను అమలు జరుపు నిమిత్తము కార్యనిర్వాహక ఆఫీసరు ఉన్నచో ఆయనపై పరిపాలక నియంత్రణ వహించవలయును;

(ఇ) ఈ చట్టము ద్వారా లేక ఈ చట్టము క్రింద చేయబడిన నియమముల ద్వారా సర్పంచుకు ప్రత్యేకముగా ఈయబడిన లేక అన్ని అధికారములను వినియోగింపవలయును. మరియు విధింపబడిన అన్ని విధులను నెరవేర్ప వలయును.

(2) సర్పంచు లేక తాత్కాలికంగా అధికారము నడుపుతున్న లేదా సర్పంచ్ పనులను నిర్వహించుచున్న యతను గ్రామ పంచాయతి సమావేశమును నెలకు ఒకసారైన సమావేశపర్చవలెను. ఒకవేళ సర్పంచ్ కాని లేదా అటువంటి వ్యక్తి వరుసగా మూడు నెలలలో సమావేశ పర్చకుండిన, 3 మాసముల తర్వాత నుండి సర్పంచ్‌గా యుండు అర్హత కోల్పోవును. మరియు పర్పంచ్ అధి

కారములు నడుప అధికారముండదు. మరియు ఒకసంవత్సరమునరకు సర్పంచ్‌గా యుండుటకు అర్హత యుండదు మరియు సర్పంచ్ అధికారములు నిర్వర్తించే అవకాశము యుండదు.

26. సర్పంచు అధికారముల, విధుల సంక్రమణ మరియు అప్పగింత, సర్పంచ్ పదవికో ఏర్పడిన ఖాళీని భర్తీ చేయుట: (1) సర్పంచ్ పదవి ఖాళీగా ఉన్న ప్పుడు, ఉప సర్పంచు క్రొత్త సర్పంచు ఎన్నుకొనబడినట్లుగా ప్రకటింపబడి పదవిలోనికి వచ్చునంతవరకు, సర్పంచు అధికారములను వినియోగింప వలయును. మరియు విధులను నిర్వహింప వలయును.

(2) సర్పంచు తన అధికార క్షేత్రమునుండి వరుసగా 15 రోజులకంటె ఎక్కువ కాలము గైరుహాజరైన ఎడల లేక 15 రోజుల కంటె ఎక్కువ కాలము అశక్తుడైన ఎడల అట్లు గైరుహాజరైన లేక అశక్తుడుగా నుండు కాలములో, మరొకరీతిగా నిర్ణయింపబడగల సందర్భములలో తప్ప, మిగిలిన సందర్భములలో సర్పంచు యొక్క అధికారములు, విధులు ఉప సర్పంచునకు సంక్రమింప వలయును.

(3) సర్పంచు యొక్క పదవి ఖాళీగాయుండిన లేక సర్పంచు తన అధికార క్షేత్రము నుండి వరుసగా 15 రోజుల కంటె ఎక్కువ కాలము గైరుహాజరు యుండిన లేదా కోర్టు ఆర్డరువల్ల సర్పంచు అధికారములను వినియోగించి యుండినను, మరియు ఉప సర్పంచు స్థలము ఖాళీ యుండిన లేక ఉపసర్పంచు తన అధికార క్షేత్రము నుండి 15 రోజుల కంటె ఎక్కువ కాలము గైరుహాజరు యుండిన, లేదా కోర్టు ఆర్డరు ద్వారా ఉప సర్పంచు విధులు నిర్వర్తించకుండ ఉత్తరువు యుండిన, సర్పంచు యొక్క విధులు, నిర్ణయించబడిన పద్ధతిలో పిలువబడిన గ్రామ పంచాయతి సమావేశములో విస్తరణ

అధికారి (పంచాయత్) గారి అధ్యక్షతలో పంచాయతి సభ్యులలో ఎన్నుకోబడిన వ్యక్తికి సంక్రమించబడును.

ఆ విధముగా నియమింపబడినట్టి పంచాయతీ సభ్యుడు తాత్కాలిక సర్పంచుగా పిలువబడవలయును, మరియు ఆయన, క్రొత్త సర్పంచు లేక ఉప సర్పంచు ఎన్నుకొనబడినట్లు ప్రకటింపబడి, పదవిలోనికి వచ్చునంతవరకు లేక కోర్టు ఆర్డరు లేకుండ అయినంతవరకు సర్పంచు యొక్క అధికారములను ఉపయోగింపవలయును, మరియు విధులను నిర్వర్తింపవలయును.

(4) ఉప సర్పంచు లేక ఉపవిభాగము (3) క్రింద నియమింపబడిన తాత్కాలిక సర్పంచు, సర్పంచు పదవి ఖాళీ అయిన విషయమును అట్లు ఖాళీ పర్పడిన తేదీనుండి ఒక నెలలోపుగా జిల్లా పంచాయతీ అధికారికి నివేదింపవలయును.

(5) నిర్ణయింపబడగల నియమములకు లోబడి సర్పంచు వ్రాత మూలకమైన ఉత్తరువు ద్వారా సదరు ఉత్తరువులో నిర్దేశింపబడగలట్టి పరిమితులలోను, షరతులలోను తన అధికారములలో, మరియు విధులలో వేటినిగాని ఉప సర్పంచుకు లేక ఉప సర్పంచు పదవి ఖాళీగా ఉన్నఎడల లేదా ఉపసర్పంచు అధికారక్షేత్రము నుండి వరుసగా 15 రోజుల కంటె ఎక్కువ కాలము గైరుహాజరై ఉన్నఎడల లేక 15 రోజులకంటె ఎక్కువ కాలము పాటు అశక్తుడై యున్నఎడల, ఎవరేని సభ్యునకు అప్పగింప వచ్చును.

(6) (1), (2) (3), మరియు (5) ఉప విభాగములలో సర్పంచు యొక్క అధికారములు విధులు అని అన్నప్పుడు వాటిలో ఆయన కార్య నిర్వాహకాధికారిగా కూడా నుండు సందర్భములో,

కార్యనిర్వాహకాధికారిగా ఆయనకుగల అధికారములు విధులు కూడ చేరినట్లు భావింప బడవలయును.

(7) సర్పంచు (2) వ ఉప విభాగము ననుసరించి ఉప సర్పంచుకు సంక్రమించిన లేదా (5) వ ఉప విభాగము ననుసరించి ఉప సర్పంచుకు లేక ఎవరేని సభ్యునకు అప్పగింపబడిన అధికారములను వినియోగించుటపైగాని విధులను నెరవేర్చుటపైగాని నియంత్రణ చేయుటకు, సవరించుటకు అధికారము కలిగి యుండవలయును.

27. తాత్కాలిక సర్పంచు తొలగింపు:— కమీషనరు ఉత్తరువు ద్వారా, అందు నిర్దిష్టపరుపబడిన తాత్కాలిక సర్పంచును తొలగింప వచ్చును. అయితే అట్లు తొలగింపబడరాదనుటకు కారణములను తెలుపు కొను నిమిత్తము మొదలు ఆయనకు అవకాశము ఈయ వలెను,

28. సభ్యుల అధికారములు:— (1) ఏ సభ్యుడైనను పంచాయతీ పనులను నెరవేర్చుటలో ఏదైన అశ్రద్ధనుగాని పంచాయతీ ఆస్తి వ్యర్థమగుచున్న విషయమునుగాని, లేక ఏదైన ప్రదేశము యొక్క అవసరములగాని కార్యనిర్వాహకాధికారి యొక్క దృష్టికి తేవచ్చును, మరియు వాంఛనీయముగా కన్పింపగల ఏవేని అభివృద్ధులను సూచింపవచ్చును.

(2) ప్రతి సభ్యుడును, నిర్ణయింపబడగలట్టి నియమములకు లోబడి పంచాయతీ పరిపాలనకు సంబంధించిన విషయములను గురించి తీర్మానములు ప్రవేశ పెట్టుటను, సర్పంచును ప్రశ్నలడుగుటకును హక్కు కలిగి యుండవలయును.

(3) ప్రతి సభ్యుడు కార్యనిర్వాహకాధికారి సరియైనట్టి నోటీసు ఇచ్చిన పిమ్మట పంచాయతీ రికార్డులను ఆఫీసు వేళలలో చూచుటకు హక్కు కలిగి యుండవలయును, అయితే వ్రాత మూలముగా కారణములను తెలుపుచు కార్యనిర్వాహకాధికారి అందుకు నిషేధము పెట్టవచ్చును.

29. ఏ సర్పంచుగాని, ఉప సర్పంచుగాని, సభ్యుడుగాని ప్రతిఫలము పొందకుండుట:— ఏ సర్పంచుగాని, ఉప సర్పంచుగాని, ఏ సభ్యుడుగాని అట్టి తన హోదాలో నైనను లేక ఏఇతర హోదాలో నైనను తాను చేసిన సేవకుగాను పంచాయతీ స్వాధీనములో నున్న లేక నియంత్రణ క్రింద ఉన్న నిధులలోనుండి ఎట్టి జీతము లేక ఇతర ప్రతి ఫలముగాని ఆయన పుచ్చుకొన గూడదు లేదా ఆయనకు ఈయబడ కూడదు.

30. కొన్ని పంచాయితీలకు కార్యనిర్వాహక ఆఫీసరుల నియామకము:— (1) కమీషనరు ఒక పంచాయతీకి లేక ఇందు నిమిత్తమై ఆయనచే ప్రకటింపబడగట్టి ఇరుగు పొరుగు పంచాయతీల సముదాయమునకు ఒక పూర్తికాలము పనిచేయు కార్యనిర్వాహక ఆఫీసరును నియమింపవలయును :

అయితే, ఈ ఉప విభాగము క్రింద పంచాయతీల సముదాయమును ప్రకటించుటకు ముందుగా కమీషనరు ప్రభుత్వము వారి ఆమోదమును పొందవలయును.

(2) పంచాయతీల సముదాయమును గురించి (1)వ ఉప విభాగము ననుసరించి తనచే జారీచేయబడిన ప్రకటనలో కమీషనరు కార్యనిర్వాహక ఆఫీసరు యొక్క జీతమును మరియు కరువు బత్తెమును చెల్లింపవలసిన పంచాయతీల పేర్లను మరియు ఆ పంచాయ

తీల సముదాయములో ప్రతి పంచాయతీయును కార్యనిర్వాహక ఆఫీసరు జీతము కరువు బత్తెములకు అగు ఖర్చును ఏ నిష్పత్తిలో భరింపవలయునో నిర్దిష్ట పరుపవలయును.

(3) అట్లు ప్రకటింపబడనట్టియు ప్రకటింపబడినట్టియు ప్రతి పంచాయతీ సందర్భములోను, కార్యనిర్వాహక ఆఫీసరు ఎవరుగాని లేకుండినచో పంచాయతీ యొక్క సర్పంచు నిర్ణయింపబడగల నియమములకు లోబడి, కార్యనిర్వాహక ఆఫీసరు యొక్క అధికారములను విని యోగింపవలయును. మరియు ఆయన విధులను నెరవేర్చవలయును.

(4) ఇతర విధముగా నిబంధింప బడినట్లు తప్ప (1) వ ఉప విభాగము క్రింద నియమింపబడిన కార్యనిర్వాహక ఆఫీసరుకాని తన పదవికి సంబంధించనట్టి ఏ పనినిగాని ప్రభుత్వము వారి అనుమతి లేనిదే చేయ పూనుకొనకూడదు.

(5) పంచాయతీ లేక (1)వ ఉప విభాగము క్రింద ప్రకటించబడిన పంచాయతీల సముదాయము, కార్యనిర్వాహక ఆఫీసరుకు, ప్రభుత్వము వారు అప్పుడప్పుడు నిర్ణయింపగలట్టి జీత బత్తెములను చెల్లింపవలయును.

(6) పంచాయతీ లేక పైన పేర్కొనబడిన పంచాయతీల సముదాయము—

(ఏ) కార్యనిర్వాహక ఆఫీసరు ప్రభుత్వ సర్వీసులో ఉన్న యెడల ఆయన యొక్క సెలవు బత్తెములు పించను, లేక ప్రావిడెంటు ఫండు లేక పించను ప్రావిడెంటుఫండుకుగాను ప్రభుత్వ

సర్వీసు షరతుల ప్రకారము ఆయనచే లేదా ఆయన తరపున చెల్లింప బడవలసిన వంతు పైకమును;

(బి) కార్యనిర్వాహక ఆఫీసరు ప్రభుత్వ సర్వీసులో లేని యెడల ఆయన యొక్క సెలవు బత్తెములు, పింఛను, ప్రావిడెంటు పండుకుగాను ఈ విషయమున నిర్ణయింపబడగలట్టి వంతు పైకమును చెల్లింపవలయును.

*(7) కార్యనిర్వాహక ఆఫీసరు పంచాతీకి సబార్డినేటుగా ఉండవలెను.

(8) ఉప విభాగము (1) క్రింద నియమింపబడిన కార్యనిర్వాహక ఆఫీసరుల తరగతివారి విభజనము, సర్వీసులో చేర్చుకొను పద్ధతులను, సర్వీసు షరతులను, జీత బత్తెములను, క్రమశిక్షణను నడవడికను, క్రమపరచుటకు ప్రభుత్వము వారు అధికారమును కలిగియుందురు.

31. కార్యనిర్వాహక ఆఫీసరు యొక్క విధులు:— కార్యనిర్వాహక ఆఫీసరు సాధారణముగా పంచాయత్ సమావేశములకు హాజరు కావలయును. మరియు అందు జరుగు చర్చలలో పాల్గొనుటకు హక్కు కలిగి యుండవలయును. కాని వోటు చేయుటకుగాని తీర్మానము ప్రవేశ పెట్టుటకుగాని హక్కు కలిగి యుండకూడదు.

32. కార్యనిర్వాహకాధికారి యొక్క విధులు:— కార్యనిర్వాహకాధికారి—

(ఏ) పంచాయతీ యొక్కయు దాని సమితుల యొక్కయు తీర్మానములను అమలు జరుపవలెను :

అయితే, ఒక తీర్మానము న్యాయ సమ్మతముగా చేయబడలేదని లేక ఈ చట్టముచే లభ్యమైన అధికారములకు మించియున్నదని లేక అమలు జరుపబడినచో దానివలన బహుళః మానవ ప్రాణమునకు లేక ఆరోగ్యమునకు లేక ప్రజాభద్రతకు ప్రమాదము వాటిల్లగలదని కార్యనిర్వాహకాధికారి భావించినచో ఆయన ఆ విషయమును ఉత్తరువుల కొరకై కమీషనరుకు నివేదించవలెను, ఈ విషయములో కమీషనరు నిర్ణయము అంతిమమై యుండవలెను;

(బి) పంచాయతీ యొక్క ఉద్యోగులు, నౌకర్లు అందరిపైనను ఆజమాయిషీ వహింపవలెను.

(సి) ఈ చట్టముచే లేక దీని ననుసరించి కార్యనిర్వాహకాధికారికి నిర్దిష్టముగా ఈయబడిన అధికారము లన్నింటిని వినియోగించవలెను, లేక విధింపబడిన విధుల నన్నింటిని నెరవేర్పవలెను ఈ చట్టముచే లేక దీని ననుసరించి విధింపబడిన అన్ని నిర్బంధములకు, షరతులకులోబడి ఈచట్టపు నిబంధనలను అమలుపరచు నిమిత్తము ఆయన కార్యనిర్వాహకాధికారమును వినియోగించవలెను. మరియు ఆయన ఈ చట్టపు కార్యములను సక్రమముగా నిర్వర్తించుటకు నేరుగా బాధ్యుడై యుండవలెను.

33. సర్పంచుయొక్క అత్యవసర కాల అధికారములు:— అత్యవసర సందర్భములలో సర్పంచు, పంచాయతీ లేక దాని ఏదేని సమితియొక్క మంజూరు అవసరమైనట్టియు ప్రజాసేవ లేదా భద్రత కొరకు వెంటనే నెరవేర్చుట లేదా చేయుట అత్యవసరమని తాను అభిప్రాయపడునట్టియు పనిని నెరవేర్చుటకు లేక అట్టి కార్యమును చేయుటకు కార్యనిర్వాహక ఆఫీసరు ఉన్నచో ఆయనను సంప్రదించి ఉత్తరువు చేయవచ్చును. అయితే ఈ విభాగము క్రింద తీసికొనిన

చర్యను, దానికి గల కారణములను ఆయన పంచాయతీకి లేక సంబంధించిన సమితికి దాని తరువాత సమావేశములో తెలియచేయవలెను.

అయితే, ఏదేని పనిని నెరవేర్చుటకుగాని ఏదేని కార్యమును చేయుటకుగాని ప్రభుత్వముయొక్క ఏదేని ఉత్తరువునకు వ్యతిరేకముగ ఆయన ఉత్తరువు చేయకూడదు.

34. కార్య నిర్వాహకాధికారి విధులను కొన్ని సందర్భములలో ఆరోగ్యాధికారి నెరవేర్చుట :— కమీషనరు సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువు ద్వారా అట్టి ఉత్తరువులో నిర్దిష్టపరుపబడు ప్రదేశములో అట్టి నిర్బంధమునకును, షరతులకును, నియంత్రణకును, రివిజనుకును లోబడి ఈ చట్టము క్రింద కార్యనిర్వాహకాధికారికిగల విధులను నిర్వహించు అధికారమును జిల్లా ఆరోగ్యాధికారికీయ వచ్చును.

35. కార్య నిర్వాహకాధికారి విధులను అప్పగించుట :— నిర్ణయింపబడు నిర్బంధములకును నియంత్రణకును లోబడి, కార్య నిర్వాహకాధికారి లిఖితపూర్వకమైన ఉత్తరువు ద్వారా తన విధులను వేటినైన—

(*i*) ఆయన సర్పంచు అయినచో ఉపసర్పంచుకు, ఉపసర్పంచు లేనప్పుడు ఏ ఇతర సభ్యునికైనను;

(*ii*) ఆయన సర్పంచు కాని ఎడల సర్పంచుకును, సర్పంచు లేనప్పుడు ఉప-సర్పంచుకును సర్పంచు ఉపసర్పంచు లిరువురు లేనప్పుడు ఏ ఇతర సభ్యునకైనను అప్పగించ వచ్చును;

అట్లు అప్పగింపబడిన విధులను వినియోగించుటలేక నెరవేర్చుట కార్యనిర్వాహకాధికారి నిర్ణయించగల నిర్బంధములకును, షరతుల కును ఆయన నియంత్రణకును, రివిజనుకును లోబడి యుండవలెను.

36. పంచాయతీల ఉద్యోగులు, నౌకర్లు:—(1) ఉపవిభాగము (2) క్రింద చేయబడు నియమములకు లోబడి, కార్యనిర్వాహక ఆఫీ సరు తప్ప ప్రతి పంచాయతి యొక్క తదితర ఉద్యోగుల నౌకర్ల సంఖ్యను, హోదాలను, గ్రేడులను, వారికి చెల్లింపవలసిన వేతనము లను, రుసుములను, బత్తెములను కమీషనరు నిర్ణయించవలెను. మరియు ఆయన వాటిని మార్చవచ్చును;

అయితే ఏదైన అత్యావసర సందర్భములో, నిర్ణయింపబడు నియమములకు లోబడి సర్పంచు తాత్కాలికముగా అదనపు ఉద్యో గులను, నౌకర్లను నియమించవచ్చును.

(2) కార్యనిర్వాహక ఆఫీసరులను కాక, పంచాయతీల యొక్క ఇతర ఉద్యోగులను, నౌకర్లను నియమించు అధికారులను గురించి మరియు అట్టి ఉద్యోగుల, నౌకర్ల యొక్క తరగతివారి విభ జనను, చేర్చుకొను పద్ధతులను, వేతనములను బత్తెములను, క్రమశిక్ష ణను నడవడికను, ఉద్యోగ షరతులను గురించి నియమములనుచేయు టకు ప్రభుత్వమువారి అధికారము వుండవలెను.

అట్టి నియమములు కార్యనిర్వాహక ఆఫీసరు కాక పంచా యతీ యొక్క ఇతర ఏ తరగతి ఉద్యోగులనుగాని నౌకర్లనుగాని రాష్ట్రమంతటికిని లేక అందలి ఏదేని విభాగమునకు ఒక ప్రత్యేక సర్వీసుగా ఏర్పాటు చేయుటను నిబంధింపవచ్చును.

(3) రెండు లేదా అంతకంటె ఎక్కువ పంచాయతీలు,నిర్ణయింపబడగల నియమములకు లోబడి, ఆ రెంటికి లేదా వాటి అన్నింటికి ఒకే స్వభావముగల ఏవైన అధికారములను లేక విధులను వినియోగించుటకు లేక నెరవేర్చుటకు ఒక ఉద్యోగిని లేక నౌకరును నియమించవచ్చును. మరియు నియమములచే ఈ విషయమున అధికారమీయబడిన ఏ అధికారిగాని కోరునెడల అట్లు నియమింపవలెను.

(4) ఈచట్టములో ఏమి యున్నప్పటికి పంచాయతీయొక్క కార్యనిర్వాహకాధికారితో సహా ఏ ఉద్యోగిని గాని ఏ నౌకరును గాని కమీషనరు ఏ ఇతర పంచాయతీకిని బదిలీ చేయవచ్చును.

ఈ ఉప-విభాగము క్రింద బదిలీచేయు అధికారి అట్టి బదిలీని అమలు జరుపు నిమిత్తము అవసరమని భావించునట్టి సాధారణ లేక ప్రత్యేక ఆదేశముల నీయవచ్చును.

(5) కార్యనిర్వాహక ఆఫీసరు కాక పంచాయతీయొక్క ఏ ఇతర ఉద్యోగికైనను లేక నౌకరుకైనను చెల్లింపబడిన వేతన బత్తెములలోను; ఆయన శలవు వేతనముల క్రిందను, ఫించను లేక ప్రావిడెంటుఫండు క్రిందను లేక ఫించను ప్రావిడెంటుఫండు క్రిందను ప్రభుత్వమువారు సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువు ద్వారా నిర్ణయించునట్టి భాగమును ఆ పంచాయతీ నుండి ఈ క్రింది సందర్భములలో కమీషనరు రాబట్టవచ్చును, అవేవనగా:—

(ఏ) అట్టి ఉద్యోగి లేక నౌకరు పంచాయతీ సర్వీసులో ప్రభుత్వమువారిచే నియమింపబడిన ఎడల;

(బి) అట్టి ఉద్యోగి లేక నౌకరు ప్రభుత్వోద్యోగి అయిన ఎడల;

(6) పంచాయతీ యొక్క ఉద్యోగులు నౌకర్లు అందరును పంచాయతీకి తాబేదార్లుగా నుండవలయును. ఈ చట్టములో గాని దీని క్రింద చేయబడిన నియమములలో గాని ఇతర విధముగా నిబంధింపబడినట్లు తప్ప, మరియు అట్టి నియమములలో నిర్ణయింపబడు నిర్బంధములకు నియంత్రణకు, అప్పీలు అధికారమునకు లోబడి, సర్పంచు—

(ఏ) పంచాయతీ యొక్క ఉద్యోగులను, నౌకర్లను అందరిని నియమింపవచ్చును;

(బి) ఎవరైన అట్టి ఉద్యోగికి లేక నౌకరుకు సెలవు మంజూరు చేయవచ్చును;

(సి) ఎవరైన ఉద్యోగిని లేక నౌకరును సముచితమైన తగు కారణమును బట్టి అభిశంసింప వచ్చును, జరిమానా విధింప వచ్చును. ఇంక్రిమెంట్లను లేక ప్రమోషనును ఆపుచేయవచ్చును. సీనియారిటీ జాబితాలో తక్కువ శ్రేణికిగాని, తక్కువ పదవికిగాని తక్కువ టైము స్కేలులోనికిగాని ఒక టైము స్కేలులో తక్కువ దశకుగాని ఆయనను తగ్గించవచ్చును, సస్పెండు చేయవచ్చును. తొలగించ వచ్చును లేక భర్తరఫ్ చేయవచ్చును.

(7) ఈ విభాగము యొక్క నిబంధనలు, 1939, ఆంధ్రప్రదేశ (ఆంధ్రప్రాంత) ప్రజారోగ్య చట్టము (1939 లోని 3వ చట్టము) లోగాని రాష్ట్రములో తత్కాలమందు అమలులో వున్న తద్విధమైన ఏ ఇతర శాసనములో గాని ఏమి యున్నప్పటికిని పంచాయతీల ప్రజారోగ్య సిబ్బందికి కూడా వర్తించ వలెను.

(8) (i) ఈ చట్టములో ఏమి యున్నప్పటికిని నిర్ణయింపబడు నియమములకు లోబడి కమీషనరు—

(ఎ) ఏదైనా పంచాయతీ యొక్క కార్యములకు అవసరమని తాను భావించి ఇంజనీరింగు సిబ్బందిని ఇతర సిబ్బందిని నియమించ వచ్చును. అట్టి సిబ్బందికి చెల్లించిన వేతనములను బత్తెములను, వారి సెలవు బత్తెములు, పింఛను లేదా ప్రావిడెంటుఫండు, పింఛను ప్రావిడెంటు ఫండుల క్రింద ఆయన సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువుద్వారా నిర్ణయించు నంతటి వంతు పైకములను పంచాయతీ నుండి వసూలు చేయవచ్చును;

(బి) రెండు లేక ఇంక ఎక్కువ పంచాయతీలకు ఉమ్మడిగా యింజనీరింగు సిబ్బందిని లేక ఇతర సిబ్బందిని నియమించ వచ్చును. అట్టి సిబ్బందికి చెల్లించిన వేతనమును బత్తెము లను వారి సెలవు బత్తెములు, పింఛను లేక ప్రావిడెంటు ఫండు, పింఛను మరియు ప్రావిడెంటు ఫండుల క్రింద ఆయన సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువు ద్వారా నిర్ణయించునంతటి వంతు పైక మును ఆయన అట్లు నిర్ణయించు నిష్పత్తిలో సంబంధించిన ప్రతి పంచాయతీ నుండి వసూలు చేయవచ్చును.

(ii) ఖండము (i) క్రింద నియమింపబడిన సిబ్బందిలోని ఏ సభ్యుని యొక్కయైనను వేతన బత్తెములు సర్వీసు షరతులు నిర్ణ యింప బడు రీతిగా నుండవలెను,

37. సమావేశములకు అధ్యక్షత:—(1) ఈ చట్టములో లేక దీని ననుసరించి మరొక విధముగా నిబంధింపబడినట్లు తప్ప పంచాయతీ ప్రతి సమావేశమునకును సర్పంచు అధ్యక్షత వహించవలెను. ఆయన హాజరుగా లేనప్పుడు ఉప-సర్పంచును ఇద్దరూ లేనప్పుడు ఆ సభకు

ఆ సమావేశములో ఎన్నుకొనబడిన సభ్యుడు అధ్యక్షత వహించ వలెను;

(2) సర్పంచు సమావేశములలో క్రమమును పాటింప చేయ వలెను. ఆయన సమావేశములలోగాని వాటిని పురస్కరించుకొని గాని ఉత్పన్నించు క్రమ తాంశములన్నిటిని నిర్ణయించవలెను. క్రమ తాంశములకు సంబంధించిన ఏ విషయముపై నైనను చర్చజరుగ రాదు క్రమతాంశములకు సంబంధించిన ఏ విషయముపై నైనను, సర్పంచు నిర్ణయము ఈ చట్టములో పరోక విధముగా స్పష్టముగా నిబంధింపబడినట్లు తప్ప తుది నిర్ణయమగును.

(3) ఉప సర్పంచు లేదా సభకు అధ్యక్షత వహించిన సభ్యుడు ఆ సమావేశము నిమిత్తము దానికి అధ్యక్షత వహించు కాలమం దును, సర్పంచు యొక్క అధికారముల నన్నింటిని కలిగియుండ వలెను.

38. ప్రొసీడింగుల మినిట్లు:— పంచాయతీ యొక్క ప్రతి సమావేశములోని ప్రొసీడింగుల మినిటుల యొక్కయు అట్టి ప్రొసీ డింగుల విషయములో సర్పంచు మినహా హాజరైన ఏ సభ్యుని వద్ద నుండియైనను అది ముగిసిన 48 గంటలలోపుగా అందిన భిన్నాభి ప్రాయపు మినిటుల యొక్కయు నకలు నొక దానిని సమావేశము జరిగిన తేదీనుండి మూడు దినముల లోపుగా సర్పంచు జిల్లా పంచా యతి అధికారికిని, పంచాయతి సమితికిని పంపవలెను.

అయితే, కమీషనరు అట్టి మినిట్లను సాధారణముగా లేదా ఏదేని నిర్దేశింపబడిన తరగతుల విషయములలో ఈ విషయమున ఆయనచే అధికార మియ్యబడిన ఏ ఉద్యోగికిగాని పంపవలెనని ఆజ్ఞా పించవచ్చును.

39. రికార్డులను అడుగుటకు అధికారము:— పంచాయతి లేక దాని అధికారి ఎప్పుడైనను కార్యనిర్వాహక కమిటీ అధీనములో ఉన్న ఏ పత్రమునైనను చూపవలసినదని ఆయనను కోరవచ్చును. కార్యనిర్వాహక ఆఫీసరు అట్టి కోరికను వెంటనే పాటించవలెను. మీటింగు కొరకు ఎజండాలోయున్న అంశములకు సంబంధించిన రికార్డులన్నీ కోరిన వెంటనే అందించవలెను.

40. (1) కార్యాచరణ కమిటీలు:—ప్రతి గ్రామ పంచాయతి వ్యవసాయము, ప్రజారోగ్య, పారిశుధ్య మరియు రహదారి కార్యాచరణ కమిటీలను తప్పక ఏర్పాటు చేయవలెను.

(2) ఉప విభాగము (1) లో వివరించిన కమిటీలే కాక, కమిషనర్ అనుమతితో, చట్ట అవసర నిమిత్తము ఒకటి లేదా ఎక్కువ కమిటీలను గ్రామ పంచాయతి ఏర్పాటు చేయవచ్చును.

(3) కార్యాచరణ కమిటీల నిర్మాణము మరియు అధికారములు ఏర్పాటు చేయబడిన నియమముల ననుసరించి యుండును.

అయితే గ్రామ పంచాయతి, నిశ్చయించినచో, పంచాయతి సభ్యులు గానివారిని ఎవరినైనను కమిటీల పనులలో ఉత్సాహవంతులుగా యున్నచో, కార్యాచరణ కమిటీలలో సభ్యులుగా చేర్చుకో వచ్చును.

41. పంచాయతీల యొక్కయు కమిటీల యొక్కయు ప్రొసీడింగులు:- (1) ప్రతి పంచాయతీ యొక్కయు దాని కమిటీ లన్నిటి యొక్కయు ప్రొసీడింగులకు 1వ అనుసూచిలో తెలుపబడిన నియమములును, నిర్ణయింపబడగల ఇతర నియమములును, కమీషనరు యొక్క అనుమతితో పంచాయతిచే చేయబడి, అట్టి నియమములకు

లేదా ఈ చట్టము యొక్క నిబంధనలకు విరుద్ధముగా లేనట్టి రెగ్యులేషనులును వర్తించవలెను.

(2) కమీషనరు (1)వ ఉప విభాగము క్రింద అనుమతి కొరకు తనకు సమర్పింప బడిన రెగ్యులేషనులు వేటినైనను కొన్నింటిని చేర్చుటకు, వదలివేయుటకు, మార్పు చేయుటకు అధికారము కలిగి యుండవలెను.

(3) ఉప విభాగము (1) క్రింద నిర్ణయింపబడిన నియమములలో ఎవరైన సభ్యుడు లేక సర్పంచు లేదా సమితి యొక్క సభ్యుడు లేదా చైర్మను ఏ విషయమైనను అది జనసామాన్యమునకు సాధారణముగా వర్తించుటయే కాక అందులో తనకు స్వయముగా గాని, మరొక వ్యక్తి ద్వారా ప్రత్యక్షముగా లేదా పరోక్షముగా ఆర్థిక ప్రయోజనము ఉన్నచో ఆ విషయమున ఓటు నివ్వకుండ లేదా దానిని గురించిన చర్చలో పాల్గొనకుండ లేదా అట్టి ఏ విషయము గాని, చర్చించ బడునప్పుడు పంచాయతీ యొక్క లేదా సమితి యొక్క ఎట్టి సమావేశములో గాని హాజరు కాకుండ లేదా అధ్యక్షత వహించకుండ ఆటంక పరచుటకు నిబంధించ వచ్చును.

42. (1) సంయుక్త సమితుల నియామకము — పంచాయతీ మరొక స్థానిక అధికార సంస్థతో ఉమ్మడిగా సంబంధము గల ఏదేని కార్యము నిమిత్తము లేదా ఉమ్మడిగా బాధ్యతగల ఏదేని విషయము నిమిత్తము స్థానిక అధికార సంస్థ ఒకదానితో గాని, అంతకంటె ఎక్కువ వాటితో గాని కలిసి సంయుక్త సమితిని ఏర్పాటు చేసికొనవచ్చును. మరియు ప్రభుత్వము అట్లు కోరినచో ఆ విధముగా ఏర్పాటు చేయవలెను.

**వివరణ:—** ఈ ఉప-విభాగములోని 'కార్యము' అను పదములో ఈ చట్టము క్రింద లేక ఏదేని ఇతర శాసనము క్రింద ఏపన్నును వసూలు చేయుటకు పంచాయతీకిని పరొక స్థానిక అధికార సంస్థకును అధికారము కలదో ఆ పన్నును ఉమ్మడిగా వసూలు చేయుట కూడ చేరియుండవలెను.

(2) సంయుక్త సమితిలో, సంబంధించిన స్థానిక అధికార సంస్థలలో సభ్యులు కానట్టి వారు కూడ చేరవచ్చును. అయితే సదరు అధికార సంస్థల అభిప్రాయములో ఆ సభ్యులు, ఆ సమితి పని చేయుటకు ప్రత్యేక అర్హతలు లేదా ప్రత్యేక అభిరుచి కలిగియున్న వారై యుండవలెను :

అయితే, అట్టి సభ్యుల సంఖ్య సంయుక్త సమితిలోని మొత్తము సభ్యుల సంఖ్యలో మూడవ వంతుకు మించరాదు.

(3) సంయుక్త సమితి నిర్మాణము రెగ్యులేషనుల ద్వారా జరుగవలెను. ఆ రెగ్యులేషన్లు (8) మరియు (9) ఉప-విభాగములలో పేర్కొనబడిన సందర్భములలో మినహా సంబంధించిన స్థానిక అధికార సంస్థలన్ని ఆమోదించిననే తప్ప, అమలు కలిగి యుండ కూడదు.

(4) రెగ్యులేషనులు ఈ క్రింది విషయములను నిర్ణయించవలెను ;

(ఎ) సంయుక్త సమితిలో ఉండవలసిన మొత్తము సభ్యుల సంఖ్య ;

(బి) వారిలో సంబంధించిన స్థానిక అధికార సంస్థల యొక్క సభ్యుల సంఖ్య, సభ్యులు కానివారి సంఖ్య ;

(సి) సంయుక్త సమితి యొక్క సభ్యులుగా నుండు వ్యక్తులు లేక వారు ఎన్నుకొనబడు లేక నియమింపబడు విధము ;

(డి) సంయుక్త సమితి యొక్క చైర్మనుగా నుండు వ్యక్తి లేక ఆయన ఎన్నుకొపబడు లేక నియమింపబడు విధము ;

(ఇ) సభ్యుల యొక్కయు చైర్మను యొక్కయు పదవీ కాలపరిమితి ;

(ఎఫ్) సంబంధించిన స్థానిక అధికార సంస్థలలో ఒకటి లేక అంతకంటె ఎక్కువ వాటిచే వినియోగించదగు ఏయే అధికారములను సంయుక్త సమితి వినియోగించ వచ్చును, మరియు సంబంధించిన స్థానిక అధికార సంస్థలయొక్క కార్యనిర్వాహణాధికారులలో ఒకరు లేక అంతకంటె ఎక్కువ మందిచే వినియోగించదగు ఏయే అధికారములను సంయుక్త సమితియొక్క చర్మను వినియోగించ వచ్చును,

(జి) సంయుక్త సమితి యొక్క అధికారుల మరియు నౌకరుల సంఖ్యయు, హోదాలును గ్రేడులును, వారికి చెల్లింపదగు జీతబత్తెములును,

(హెచ్) సంయుక్త సమితి ఉద్యోగులకు, నౌకర్లకు అగు ఖర్చును ఏ నిధులలో నుండి చెల్లించవలసినది; అట్టి ఖర్చును సంబంధించిన స్థానిక అధికార సంస్థల మధ్య విభాగించుట ;

(ఐ) సంయుక్త సమితి ఉద్యోగుల, నౌకర్ల విషయములో 3రివ విభాగము (6) వ ఉప-విభాగములో నిర్దిష్ట పరుపబడిన అధికారములను వినియోగించుటకు అర్హతగల అధికారులు ;

(జె) సంయుక్త సమితికి సంబంధించిన స్థానిక అధికార సంస్థలలో ప్రతి సంస్థయు, విరాళములేమైన చెల్లించవలసి ఉన్నచో అట్టి విరాళములు ;

(కె) సంబంధించిన స్థానిక అధికార సంస్థలకు సంయుక్త సమితి అందజేయవలసిన రిటర్నులు :

(యల్) సంయుక్త సమితి వ్యవహార క్రమము.

(5) ఉప-విభాగములు (3) మరియు (4) క్రింద చేయబడిన రెగ్యులేషనులు మార్పు చేయబడవచ్చును లేదా రద్దుచేయబడవచ్చును. అయితే సంబంధించిన స్థానిక అధికార సంస్థలన్నియు అట్టి మార్పుకు లేక రద్దుకు ఆమోదించవలెను.

(6) సంయుక్త సమితి ఉద్యోగులు, నౌకర్లు అర్హతల ప్రవర్తనల విషయములో సంబంధించిన స్థానిక అధికార సంస్థల ఉద్యోగులకు, నౌకర్లకు వర్తించు నియమము లన్నింటికిని లోబడి యుండవలెను.

(7) సంయుక్త సమితి విఘటనగాని, సంయుక్త సమితినుండి సంబంధించిన స్థానిక అధికార సంస్థ ఏదైన తొలగిపోవుటగాని జరుగవలసి వచ్చినప్పుడు అది నిర్ణయింపబడు నియనుములకు లోబడి జరుగవలెను.

(8) ఉప-విభాగములు (3),(4) లలో పేర్కొనబడిన విషయములలో వేటినైనను పురస్కరించుకొనియు, సంయుక్త సమితి విఘటన జరిగినపుడు లేదా సంయుక్త సమితినుండి స్థానిక అధికార సంస్థ ఏదైనా తొలగి పోయినప్పుడు సంబంధించిన స్థానిక అధికార సంస్థల

మధ్య సంయుక్త సమితియొక్క ఆస్తి, అప్పుల విభజన విషయము లోను. ప్రభుత్వము అవసరము లేదా వాంఛనీయమని తాను భావించునట్టి ఆదేశములను జారీ చేయవచ్చును.

(9) ఈ విభాగమునందు పైన చెప్పిన నిబంధనల విషయములో స్థానిక అధికార సంస్థలలో ఏదైనా అభిప్రాయ భేదము ఉద్భవించినపుడు, ప్రభుత్వమునకు దానిని తెలియజేయవలెను. దానిపై వారి నిర్ణయమే అంతిమమై యుండవలెను.

(10) ఈ విభాగము క్రింద ప్రభుత్వముయొక్క అధికారములు, సంబంధించిన స్థానిక అధికార సంస్థలలో ఒకటి కంటోన్మెంటు అధికార సంస్థ లేదా పెద్ద ఓడరేవుయొక్క ఓడరేవు అధికార సంస్థ అయినపక్షములో కేంద్ర ప్రభుత్వమువారి ఆమోదముతో మాత్రమే వినియోగించబడవలెను.

(11) ఈ విభాగపు కార్యముల నిమిత్తము "స్థానికాధికారి సంస్థ" అను మాటలో గ్రామ సహకారసంఘము కూడ చేరును.

43. పరిపాలనా నివేదిక :- (1) ప్రతి పంచాయతీయును ప్రతి సంవత్సరమును దాని పరిపాలనము గురించిన నివేదిక నొకదానిని ఆ సంవత్సరము అంతమైన తరువాత సాధ్యమైనంత త్వరితముగాను నిర్ణయింపబడిన తేదీ దాటకుండగను నిర్ణయింపబడు నమూనాలలోను వివరములతోను నిర్ణయింపబడు అధికారి ద్వారాను పంచాయతీ సమితికి పంపుకొనవలెను;

(2) ఆ నివేదికను కార్యనిర్వాహకాధికారి తయారు చేయవలెను. పంచాయతీ దానిని పరిశీలించి దాని విషయమై పంచా

యతీ చేసిన తీర్మానమేమైనా యున్నచో దానితో బాటు పంచా యతీ సమితికి పంపవలెను.

(3) నిర్ణయింపబడు గడువులోపల తన అధికార క్షేత్రములో గల పంచాయతీల పరిపాలనను గూర్చి ఏకీకృత నివేదిక నొక దానిని ప్రతి పంచాయతీ సమితి జిల్లా పరిషత్తునకు, ప్రతి జిల్లా పరిషత్తు కమీషనరుకును అందజేయవలెను.

(4) కమీషనరు ఆ సంవత్సరములో రాష్ట్రమందలి పంచా యతీల పరిపాలనను గురించి ఒక సాధారణ నివేదికను ప్రభుత్వము నకు పంపవలెను. అట్టి నివేదిక అందిన మీదట ప్రభుత్వము దానిప్రతి నొక దానిని దానిపై తమ సమీక్షతోపాటు ఆంధ్రప్రదేశ శాసనసభా సమక్షమందు ఉంచవలెను.

44. క్రమరాహిత్యము, ఖాళీ ఏర్పడి యుండుట మొదలగుకారణ ములను బట్టి పంచాయతీ చర్యలు చెల్లుబడి కాకుండా ఉండకూడదు :—
పంచాయతీయొక్క లేక దాని కమిటీ యొక్క లేదా అట్టి పంచా యతీ లేదా కమిటీయొక్క సర్పంచు, ఉపసర్పంచు, ఛైర్మను సభ్యు డుగా పని చేయుచున్న ఏవ్యక్తియొక్క చర్యగాని అట్టి పంచాయ తీలకు కమిటీయొక్క నిర్మాణములో లోపము కలదను కారణమును బట్టి మాత్రమే లేదా అట్టి పంచాయతీ లేక కమిటీయొక్క సర్పంచు, ఉపసర్పంచు, ఛైర్మెను లేదా ఎవరైన సభ్యుడు ఏదైన అనర్హత మూలముగా లేదా అతని ఎన్నిక లేక నామినేషను సక్రమముగా లేనందునగాని, చట్ట విరుద్ధముగా జరిగినందునగాని ఆపదవికి అర్హుడు కాడని లేదా ఆపదవిలో ఉండకూడదనెడి కారణమును బట్టి లేదా అట్టి పంచాయతీ లేక కమిటీ యొక్క సర్పంచు.ఉపసర్పంచు, ఛైర్మెను

లేదా సభ్యుని పదవి ఖాళీగా ఉన్న కాలములో అట్టి చర్య జరిగిన దనెడి కారణమునుబట్టి చెల్లదగనిదిగా భావింపబడకూడదు.

45. తనిఖీచేయు, పర్యవేక్షించు ఉద్యోగుల యొక్కయు, ప్రభుత్వము వారి యొక్కయు, అధికారములు:—(1) కమీషనరు రాష్ట్రములోని పంచాయతీలన్నిటి యొక్క పరిపాలనను పర్యవేక్షించవలెను. ఈ చట్టము ద్వారా లేక దీనిక్రింద తనకు సంక్రమించియున్న విధులను నిర్వర్తించవలెను. మరియు అధికారములను వినియోగించవలెను.

(2) (ఏ) ఈ చట్టముక్రింద ఏర్పాటుచేసిన అన్ని లేక ఏవేని కొన్ని పంచాయతీ కార్యక్రమములను తనిఖీ చేయు లేక పర్యవేక్షణ చేయు కార్యముకొరకు ప్రభుత్వము వారు తాము అవసరమని భావించునట్టి ఇతర అధికారులను నియమించ వచ్చును ;

(బి) ముఖ్యముగాను, పైన చెప్పిన నిబంధనయొక్క సాధారణతకు భంగము లేకుండను ప్రభుత్వము వారు జిల్లా పంచాయతీ అధికారులను, డివిజనలు పంచాయతీ అధికారులను, విస్తరణాధికారులను (పంచాయతీల) నియమించవచ్చును. మరియు వారి ప్రాంతీయాధికార క్షేత్రములను నిర్వచించవచ్చును.

(సి) ఖండములు (ఏ), (బి) లలో తెలుపబడిన ఉద్యోగుల యొక్కయు వారి సిబ్బందిలో వున్న సభ్యులయొక్కయు వర్గీకరణమును, చేర్చుకొను పద్ధతులను, సర్వీసు షరతులను, జీత బత్తెములను, నడత, క్రమ శిక్షణను క్రమబద్ధము చేయుటకు ప్రభుత్వము అధికారము కలిగియుండ వలెను.

(3) పైన చెప్పబడిన ఉద్యోగులకు, వారి సిబ్బందిలో వున్న సభ్యులకు అగు ఖర్చు రాష్ట్రముయొక్క రాష్ట్ర సంచిత నిధినుండి చెల్లింపబడవలెను.

(4) జిల్లా, డివిజనలు, విస్తరణాధికారులు(పంచాయతీల) ఈ చట్టము క్రింద నిర్ణయించబడగలట్టి లేక వారికి ఈయబడునట్టి అధికారములను వినియోగించవలెను. మరియు విధులను నెరవేర్చవలెను

(5) కమీషనరు లేదా కలెక్టరు లేదా (2)వ ఉప-విభాగము క్రింద నియమింపబడిన ఎవరైన ఉద్యోగి లేదా ఈ విషయమై ప్రభుత్వము వారు లేదా కమీషనరు లేదా కలెక్టరు అధికారమిచ్చు ఎవరైన ఇతర ఉద్యోగి లేదా వ్యక్తి ఈ క్రింది వాటియందు ప్రవేశించి తనిఖీ చేయవచ్చును లేదా అట్లు చేయించవచ్చును.

(ఎ) ఏదైన పంచాయతీ యొక్క గాని, కార్యనిర్వాహక ఆఫీసరుయొక్క గాని నియంత్రణలో జరుగుచున్న ఏదైన పని లేదా ఏదైన స్థిరాస్తి;

(బి) ఏదైన పంచాయతీచే నిర్వహింపబడుచున్న లేదా దాని నియంత్రణ క్రిందనున్న ఏదేని పాఠశాల, ఆసుపత్రి, వైద్యశాల, టీకాల కేంద్రము, సత్రము లేక ఇతర సంస్థ మరియు అట్టి సంస్థలో వ్రాసి యుంచబడు రిజిష్టరులు, రికార్డులు లేదా ఇతర పత్రములు;

(సి) పంచాయతీ కార్యాలయము అందు వ్రాసి యుంచబడు ఏవైన రికార్డులు రిజిష్టరులు ఇతర పత్రములు;

పంచాయతులును, వాటి సర్పంచులును, కార్యనిర్వాహకాధికారులును, ఉద్యోగులును, నౌకర్లును, పంచాయతీ ఆస్తిని,

లేదా దాని ఆవరణరలను లేదా యావత్తు పత్రిములను, పైన చెప్పబడిన ఉద్యోగులు, వ్యక్తులు చూచుటకు న్యాయమైన అన్ని వేళలయందును నిర్ణయింపబడు నియమముకులకు లోబడి ఈ విభాగము క్రింద అట్టి ఉద్యోగులు లేక వ్యక్తులు తమ విధులను నెరవేర్చుటకు అవసరమని భావించు అవకాశములను కలుగ జేయవలెను.

(6) కమీషనరు లేక ప్రభుత్వమువారు లేక కమీషనరుఇందు నిమిత్తము అధికార మిచ్చు ఎవరైన ఉద్యోగి లేక వ్యక్తి—

(ఎ) 54 వ విభాగములో పేర్కొనబడిన వివరముగల ఏదైన పబ్లికువర్కుగాని లేక సదుపాయమునకు గాని సర్వీసుకుగాని కేటాయింపు చేయవలెనని వాటిని నిర్వహించవలెనని లేక ఏర్పరచ వలెనని పంచాయతీకి ఆదేశమీయవచ్చును;

(బి) ఏదైనా పంచాయతీ లేదా కార్యనిర్వాహకాధికారి యొక్క స్వాధీనములో గాని నియంత్రణలో గాని ఉన్న ఏదైనా రికార్డు, రిజిష్టరు, ఇతర పత్రమును చూపవలసినదని కోరవచ్చును;

(సి) ఏదైన రిటర్ను, ప్లాను, అంచనా, స్టేటుమెంటు, లెక్క లేక సంఖ్యా వివరములను అందజేయవలసినదిగా పంచాయతీ నైనను లేక కార్యనిర్వాహకాధికారి నైనను ఆదేశించవచ్చును;

(డి) ఏదైనా పంచాయతీకి సంబంధించిన ఏదేని విషయముపై ఎట్టి సమాచారము నైనను, నివేదిక నైనను అందజేయవలసినదిగా ఆ పంచాయతీని లేక కార్యనిర్వాహకాధికారిని ఆదేశించవచ్చును.

(ఇ) పంచాయతీయొక్క గాని, కార్యనిర్వాహకాధికారి యొక్కగాని ప్రొసీడింగ్ లేదా విధుల విషయములో తన అభి

ప్రాయములను ఆ పంచాయతీ లేదా కార్యనిర్వాహకాధికారి చే పరిశీలన నిమిత్తము లిఖిత పూర్వకముగా రికార్డు చేయవచ్చును.

46. ఈ చట్టము క్రింద తీర్మానములు మున్నగువాటిని సస్పెండు చేయుటకు లేక రద్దు చేయుటకు అధికారము:— (1) కమీషనరు లిఖిత పూర్వకమైన ఉత్తరువు ద్వారా, ఈ చట్టమును ననుసంచి లేక దీని పేరుతో:—

(i) ఆమోదింపబడిన ఏ తీర్మానముగాని, జారీ చేయబడిన ఏ ఉత్తరువు గాని మంజూరు చేయబడిన ఏ లైసెన్సు లేక అనుమతి గాని, లేదా

(ii) చేయబడనున్న లేక చేయబడుచున్న ఏ చేతగాని, తన అభిప్రాయములో

(ఎ) అట్టి తీర్మానము, ఉత్తరువు, లైసెన్సు, అనుమతి లేక చేత న్యాయసమ్మతముగా ఆమోదింపబడకున్నచో, జారీ చేయబడకున్నచో, మంజూరు చేయబడకున్నచో లేక అధికృతము కాకున్నచో, లేదా:-

(బి) అట్టి తీర్మానము, ఉత్తరువు, లైసెన్సు, అనుమతి లేక చేత ఈ చట్టము ద్వారా లేక మరేదైన శాసనము ద్వారా ఈయబడిన అధికారములకు మించి యున్నచో లేక అట్టి అధికారములను దుర్వినియోగము చేసినట్లున్నచో లేక మరొక విధముగా అవాంఛనీయముగా నున్నదని కమీషనరు భావించినచో, లేక

(సి) అట్టి తీర్మానమును లేదా ఉత్తరువును అమలు పరచుట వలన లేక అట్టి లైసెన్సును లేదా అనుమతిని అమలులో వుంచుట వలన లేక అట్టి చేత చేయబడుటవలన మానవ ప్రాణమునకు,

ఆరోగ్యమునకు లేక భద్రతకు ప్రమాదము వాటిల్లుట సంభవమై ఉన్న ఎడల లేక దొమ్మి, కలహములు జరుగుట సంభవమై ఉన్న ఎడల;

అట్టి తీర్మానమును, ఉత్తరువును, లైసెన్సును లేక అనుమతిని రద్దుచేయవచ్చును. లేదా అట్టి చేతను చేయకుండా నిషేధింపవచ్చును.

అయితే ఈ ఉపవిభాగములో వున్నదేదియు, జరుపబడిన ఏదైన ఎన్నికను త్రోసి పుచ్చుటకు కమీషనరుకు వీలు కలిగించకూడదు.

(2) కమీషనరు (1)వ ఉప-విభాగముయొక్క (ఏ) మరియు (బి) ఖండములలో పేర్కొనబడిన కారణములలో దేనిని బట్టియైన చర్య తీసికొనుటకు పూర్వము సంజాయిషి నిచ్చుటకు సంబంధించిన అధికారికి లేదా వ్యక్తికి అవకాశము నీయవలెను.

(3) ఉప-విభాగము (1) ఖండము (సి) క్రింద కమీషనరుకు ఈయబడిన అధికారము ఆ ఖండము యొక్క నిబంధనల కనుగుణ్యముగా కలెక్టరుచే వినియోగింపబడవచ్చును.

47. కమీషనరు మరియు కలెక్టరు యొక్క అత్యవసరకాల అధికారములు:-నిర్ణయింప బడగలట్టి నియంత్రణకుల లోబడి కమీషనరు లేదా కలెక్టరు, అత్యవసర సందర్భములో నెరవేర్చుటకుగాని, జరిపించుటకు గాని ఒక పంచాయతీ లేక కార్యనిర్వాహకాధికారి అధికారమును కలిగి యున్నట్టియు ప్రజా సామాన్యమునకు ఏది తక్షణము నెరవేర్చుట లేక జరిపించుట ఆవశ్యకమని ఆయన అభిప్రాయ

పడునో అట్టి ఏదైన పనిని నెరవేర్చుటకును, ఏదైన కార్యమును జరిపించుటకును ఆదేశమీయ వచ్చును లేదా ఏర్పాటు చేయవచ్చును. ఆ పనిని నెరవేర్చుటకు గాని ఆ కార్యమును జరిపించుటకు గాని అగు ఖర్చు, పంచాయతీ ద్రవ్యము తన స్వాధీనములో గల వ్యక్తిచే, అధికారమీయబడిన ఋణములను చెల్లించుటకు అయ్యోడి ఖర్చులుతప్ప అట్టి ద్రవ్యమునుండి చెల్లింపబడెడి ఏదేని ఇతర ఖర్చు కంటె ముందుగా చెల్లింపబడునట్లు ఆదేశమీయవచ్చును.

48. పంచాయతీకి గల విద్యుత్ సంస్థలపై నియంత్రణ:— విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయుటకు ఒక చోటినుండి మరొక చోటికి తీసికొని పోవుటకు, సరఫరా చేయుటకు లేదా ఉపయోగించుటకు ఏర్పడిన సంస్థపై పంచాయతీయొక్క పరిపాలన తత్కాలమందమలులో వున్నట్టి 1910 భారత దేశపు విద్యుచ్ఛక్తి చట్టము (1910 లో 9 వ కేంద్ర చట్టము) లేదా 1948 విద్యుచ్ఛక్తి సరఫరా చట్టము (1948 లో 54 వ కేంద్ర చట్టము) నకును ఆ చట్టముల క్రింద చేయబడిన నియమములకును పంచాయతీకి వాటి క్రింద మంజూరు చేయబడిన లైసెన్సుల యొక్క షరతులకును విరుద్ధముగా లేకుండ నిర్ణయింపబడు నియంత్రణకు లోబడి యుండవలెను.

49. పంచాయతీ, సర్పంచు లేక కార్యనిర్వాహక అధికారి తప్పినప్పుడు చర్యతీసుకొను అధికారము:— (1) ఈ చట్టము లేక మరేదైన చట్టము క్రింద లేక దాని ద్వారాగాని విధింప బడిన విధిని పంచాయతీ, సర్పంచు లేక కార్యనిర్వాహక అధికారి నిర్వర్తించుటకు తప్పెనని ఎప్పుడైనను కమీషనరుకు తోచినచో ఆయన వ్రాత పూర్వక ఉత్తరువుద్వారా అట్టి విధులను నిర్వర్తించుటకు గడువును నిర్ణయించవచ్చును.

(2) అట్లు నిర్ణయింపబడిన గడువులోపల అట్టి విధి నిర్వ_ర్తింప బడనిచో దానిని నిర్వ_ర్తించుటకు కమీషనరు ఎవరైన వ్య_క్తిని నియ మించ వచ్చును మరియు అట్టి విధి నిర్వహణకగు ఖర్చులను, అధికృత ఋణముల చెల్లింపులు తప్ప ఇతర అన్ని చెల్లింపులకన్న అగ్రిమత్వ మొసగుచు చెల్లింపవలసినదిగా పంచాయతీ నిధులను తన అధీన ములో కలిగియున్న వ్య_క్తిని ఆదేశించవచ్చును.

**50. సర్పంచు, ఉపసర్పంచు లేక సభ్యుని తొలగింపు:-** (1) ఎవ రేని సర్పంచు లేక ఉపసర్పంచు ఈ చట్టపు నిబంధనలను గాని, ఏవేని నియమములను, ఉప నిబంధనలను రెగ్యులేషనులనుగాని, వాని ననుసరించి జారీ చేయబడిన చట్ట సమ్మత ఉ_త్తరువులను గాని అమలు పరచుటకు బుద్ధి పూర్వకముగా తప్పెనని లేదా నిరాకరించెనని లేదా ధిక్కరించెనని లేదా అతనికి లభ్యమైన అధికారములను దుర్విని యోగ పరచెనని కమీషనరు అభిప్రాయ పడినచో ఒక ప్రకటన ద్వారా ఆ ప్రక టనలో నిర్దిష్ట పరుపబడు తేదీ నుండి వారిని తొలగింపవచ్చును.

(2) ఎవరేని సభ్యుడు ఈ చట్టము ద్వారా లేదా దీనిక్రింద అతని కప్పగించిన లేదా అప్పగించినట్లున్న అధికారములను వినియో గించడములో గాని, విధులను నెరవేర్చుటలో గాని అవినీతికరముగ ప్రవ_ర్తించెనని కమీషనరు అభిప్రాయపడినచో ఆయన ఒక ప్రకటన ద్వారా ఆ ప్రకటనలో నిర్దిష్ట పరుపబడు తేదీ నుండి అతనిని తొల గింపవచ్చును.

(3) ఉప-విభాగము (1) లేదా ఉపవిభాగము (2) ననుస రించి తాను చర్య కొనికొన దలచినపుడు కమీషనరు సంబంధించిన సర్పంచికి ఉపసర్పంచికి లేక సభ్యునికి సంజాయిషీ చెప్పుకొనుటకు

అవకాశమును ఒసంగవలెను. మరియు జారీ చేయబడిన ప్రకటనలో చర్య తీసికొనుటకు గల కారణములను వివరించవలెను.

(4) ఉప-విభాగము (1) లేదా ఉప-విభాగము (2) క్రింద జారీ చేయబడిన ప్రకటనలోని ఉత్తరువు మూలమున బాధితుడైన ఏ వ్యక్తియైనను అట్టి ప్రకటన ప్రచురింపబడిన తేదీ నుండి 30 దినముల లోపల ప్రభుత్వమునకు అప్పీలు పెట్టుకొనవచ్చును. మరియు ప్రభుత్వమువారు అట్టి అప్పీలుపై నిర్ణయము తీసికొనులోగా అట్టి ప్రకటనలో నిర్దిష్ట పరుపబడిన తేదీని వాయిదా వేయవచ్చును. మరియు అప్పీలు అనుమతింపబడిన సందర్భములో ఉత్తరువు ద్వారా అట్టి ప్రకటనను రద్దు చేయవచ్చును.

(5) ఉప-విభాగము (1) లేక ఉప-విభాగము (2) క్రింద జారీ చేయబడిన ఏదైనా ప్రకటన (4) వ ఉప-విభాగము ననుసరించి రద్దు చేయబడినచో అట్టి ప్రకటన తేదీ మరియు రద్దు తేదీ మధ్య సర్పంచిగా, ఉప సర్పంచిగా లేక సభ్యుడుగా ఎన్నికైన వ్యక్తి ఎవరేని వున్నచో అతడు అట్లు ఎన్నికైన పదవిలో ఉండుట విరమించును. మరియు మొదట ఏ వ్యక్తికి సంబంధించి అట్టి ప్రకటన జారీ చేయబడినదో ఆ వ్యక్తి అట్టి ప్రకటన రద్దు చేయబడిన తేదీ నుండి అధికారము లోనికి తిరిగి రావలెను.

(6) ఉప-విభాగము (1) లేదా ఉప-విభాగము (2) క్రింద సర్పంచి, ఉపసర్పంచి లేక సభ్యుని పదవి నుండి తొలగించుచు ఏ వ్యక్తికి సంబంధించి ప్రకటన జారీ చేయబడినదో ఆ వ్యక్తి, అట్టి ప్రకటన (4)వ ఉప-విభాగము క్రింద రద్దుచేయబడిననే తప్ప సర్పంచి ఉప సర్పంచిగా లేక సభ్యుడుగా ఎన్నికగుటకు లేక అట్టి పదవులలో

దేనియందైనను ఉండుటకు అతని పదవి తొలగింపు అమలులోకి వచ్చిన తేదీ నుండి మూడు సంవత్సరముల వరకు అనర్హుడై యుండ గలడు.

51. సర్పంచు లేక ఉపసర్పంచులపై విశ్వాసరాహిత్య ప్రతిపాదన :— (1) సర్పంచు లేదా ఉపసర్పంచుపై విశ్వాస రాహిత్యమును ప్రకటించు ప్రతిపాదన ఈ క్రింది ఉప-విభాగములలో పేర్కొనబడిన విధానము ననుసరించి చేయవచ్చును.

(2) ప్రతిపాదనను చేయు ఉద్దేశమును తెలుపుచు వ్రాత మూలకమైన నోటీసు నిర్ణయించబడిన నమూనాలో పంచాయతీకి అనుమతింపబడిన సభ్యుల సంఖ్యలో సగమునకు తక్కువకాని సభ్యులచే సంతకము చేయబడి ఉద్దేశించిన ప్రతిపాదన యొక్క ఒక ప్రతితోబాటు అట్టి నోటీసుపై సంతకము చేసిన ఎవరేని ఇద్దరు సభ్యులచే రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుకు అట్టి అధికారిలేని సందర్భములో వారి నిమిత్తమై కలెక్టరు నియమించునట్టి ఇతర అధికారికి వ్యక్తిగతముగా అందజేయబడ వలెను.

(3) ఆ తర్వాత ఈ విభాగములో ఇటుపై సదరు అధికారి అని వ్యవహరింపబడు (2)వ ఉప-విభాగములో నిర్దిష్టపరచిన సంబంధించిన అధికారి (2)వ ఉప-విభాగము ననుసరించి తనకు ఆ నోటీసు అందజేయబడిన తేదీనుండి 30 దినముల లోపల తనచే నిర్ణయింపబడు దినమున పంచాయతీ కార్యాలయమునందు అట్టి ప్రతిపాదనను చర్చించుటకు గాను సమావేశము ఏర్పాటు చేయవలెను. ఆయన సమావేశము గురించి కనీసము 15 పూర్తి రోజుల నోటీసును నిర్ణయింపబడిన విధానమున సభ్యులకు ఈయవలెను.

అయితే అట్టి సమావేశమును ఏర్పాటు చేయ కూడదని కోర్టు ఉత్తరవు జారీ చేసినచో ఆసమావేశము వాయిదా వేయబడ వలెను. తిరిగి ఆకోర్టు ఉత్తరువు రద్దు కాబడిన విషయము సదరు అధికారికి తెలిసిన తేదీనుంచి 30 దినములకు మించకుండా అట్లు వాయిదా పడిన సమావేశమును గురించి సభ్యులకు 15 దినములకు తక్కువగాని నోటీసును ఇచ్చిన మీదట వాయిదా పడిన సమావేశ మును ఏర్పాటు చేయవలెను.

(4) అట్టి సమావేశమునకు సదరు అధికారి అధ్యక్షత వహించ వలెను. పంచాయతీ సభ్యులు మొత్తము సంఖ్యలో అట్టి సమావేశము నకు మూడింట రెండు వంతులు హాజరు కావలెను.

వివరణ:— ఈ విభాగముక్రింద సభ్యుల మొత్తము సంఖ్యలో మూడింట రెండు వంతులను నిర్ణయించుటలో ఏర్పడగల ఏదేని భిన్నాంకమును ఒకటిగా పరిగణించవలెను.

(5) ఇతర విధముగా నిబంధింపబడినట్లు తప్ప ఈ విభాగము క్రింద ప్రతి పాదనను పరిశీలించు నిమిత్తము ఏర్పాటు చేసిన సమా వేశము ఏ కారణము చేతనైనా వాయిదా వేయబడరాదు.

(6) నిర్ణయించిన టైము తర్వాత ఒక గంటలో సమావేశము నకు కోరము లేని యెడల సమావేశము ముగించబడును. ఉప-విభా గము (2) క్రింద ఇచ్చిన నోటీసు రద్దు అగును.

(7) ఈ విభాగము క్రింద ఏర్పరుపబడిన సమావేశము ప్రారం భము కాగానే సదరు అధికారి ఏ ప్రతిపాదనను పరిశీలించుటకై సమావేశము ఏర్పరుపబడినదో ఆ ప్రతిపాదనను పంచాయతీకి చదివి వినిపించవలెను. మరియు దానిని చర్చించకుండానే ఓటుకు పెట్ట వలెను

(8) సదరు అధికారి ప్రతిపాదన యొక్క బాగోగులపై ప్రసంగించరాదు మరియు దానిపై ఓటు చేయు అధికారమును కలిగి యుండరాదు.

(9) సదరు అధికారి సమావేశపు మినిట్ల ప్రతిని, ప్రతిపాదన ప్రతిని దానిపై జరిగిన ఓటింగు ఫలితములతో బాటు సమావేశము ముగిసిన వెంటనే కమీషనరుకు పంపవలెను. సదరు అధికారి అదే సమయములో ప్రతిపాదన ప్రతిని దానిపై ఓటింగు ఫలితమును సమావేశమునకు హాజరైయున్న ప్రతి సభ్యునకు కూడా అంద జేయవలెను.

(10) ప్రతిపాదన పంచాయతీకి అనుమతింపబడిన సభ్యుల సంఖ్యలో మూడింట రెండు వంతుల సంఖ్యచే ఆమోదింపబడినచో సర్పంచును లేక ఉప-సర్పంచు తన పదవీ విరమణచేయవలెను. కమీషనరు ప్రకటన ద్వారా సందర్భమును బట్టి సర్పంచును లేక ఉప-సర్పంచుని తొలగించవలెను మరియు పంచాయతి యొక్క రికార్డులు, డబ్బు లేదా ఇతర ఆస్థులు, తొలగించిన వారి దగ్గరినుండి తీసుకొను ఏర్పాట్లు నిర్ణయించిన పద్ధతిలో చేయవలయును.

అయితే సర్పంచులేక ఉప-సర్పంచును తీసినట్లు ప్రకటించే వరకు సర్పంచు లేక ఉప- సర్పంచుల ఎన్నికలు జరుపరాదు.

(11) పైన సూచింపబడిన మెజారిటీచే ప్రతిపాదన ఆమోదింపబడక పోయినగాని, కోరం లేనందువలన సమావేశము జరుగనప్పుడుగాని అదే సర్పంచు లేక ఉప-సర్పంచుపై తరువాత సమావేశము తేదీనుండి సంవత్సరము దాటనిదే మరొకవిశ్వాస రాహిత్య తీర్మానపు నోటీసు స్వీకరింపబడరాదు.

(12) ఏ కారణము చేతనైనా (4) నుంచి (10) వరకు గల ఉప-విభాగములలోని విధులను సదరు అధికారి నిర్వర్తింప జాలక పోయినచో ఆ విధులను నిర్వర్తించుటకు గాను ప్రభుత్వము ఆంధ్ర ప్రదేశ గెజెట్‌లో ప్రకటనద్వారా మరొక అధికారిని నియమించ వలెను. సదరు అధికారి (2)వ ఉప-విభాగములో పేర్కొన్న ప్రతి పాదన యొక్క నోటీసు ప్రతిని (3)వ ఉప-విభాగము క్రింద జారీచే సిన సమావేశపు నోటీసు ప్రతిని అట్టి మరొక అధికారికి పంపవలెను. అట్టి మరొక అధికారి ప్రతి పాదన పరిశీలించుటకు ఏర్పాటైన సమా వేశమునకు హాజరు కావలెను. ఏ కారణము చేతనైన సదరు అధి కారి ఆ సమావేశమునకు అధ్యక్షత వహించ జాలక పోయినచో అట్టి మరొక అధికారి ఆ సమావేశమున కధ్యక్షత వహించ వలెను. అట్టి సందర్భములో సదరు అధికారికి వర్తించు ఈ విభాగపు నిబంధన లన్నియు అట్టి మరొక అధికారికి వర్తించవలెను.

(13) సర్పంచు లేదా ఉప-సర్పంచు పదవిని స్వీకరించిన తేదీ నుండి ఒక సంవత్సరము లోపల వారిపై విశ్వాసరాహిత్య తీర్మాన మేదియు ఈ విభాగము క్రింద ప్రతిపాదింపబడరాదు.

52. పంచాయతీల విఘటన మరియు రద్దు:— (1) శాసనము ద్వారా పంచాయతీపై విధింపబడిన విధులను అది నిర్వహించుటకు అసమర్థమైనదని లేక నిర్వహింప కుండుటకు పరిపాటియైనదని లేదా తన అధికారములను దుర్వినియోగ పరిచెనని లేక అతిక్ర మించెనని కమీషనరు భావించినచో ఆయన ఒక ప్రకటన ద్వారా—

(ఎ) ఒక నిర్దిష్ట తేదీనుండి ఆ పంచాయతీని విఘటన పరచుచు ఆదేశమీయ వచ్చును. మరియు వెంటనేగాని, మరొక నిర్ణీత తేదీ నుండిగాని దానిని పునర్నిర్మింప వచ్చును; లేదా

(బి) నిర్ణీత తేదీనుండి ఒక సంవత్సరమునకు మించని కాలము వరకు ఈ పంచాయతీని రద్దు చేయవచ్చును.

అయితే, కమీషనరు అసాధారణ పరిస్థితులలో రద్దు కాలమును అదే విధమైన ప్రకటన ద్వారా మరికొంత కాలముపాటు పొడిగించవచ్చును కాని మొత్తము రద్దు కాలము సంవత్సరమున్నరకు మించరాదు.

వివరణ:— (ఏ) ఖండము క్రింద విఘటిత మొనరింపబడిన పంచాయతీ పునర్నిర్మాణము యొక్క అవసరములకై సభ్యులందరి పదవుల ఖాళీలు, యాదృచ్ఛిక ఖాళీలుగానే భావింపబడ వలెను.

(2) ఉప విభాగము (1) క్రింద ప్రకటనను ప్రచురించుటకు ముందు కమీషనరు తానెందుకు అట్లు చేయుటకు ఉద్దేశించుచుండెనో ఆ కారణములను పంచాయతీకి తెలియ చేయవలెను. మరియు అట్లు చేయకూడదనుటకు కారణములను ఆ పంచాయతీ చూపుటకు సహేతుకమైన గడువును నిర్ణయించవలెను. మరియు దాని సంజాయిషీలు, ఆక్షేపణలు ఏవేని యున్నచో వాటిని పరిశీలించవలెను.

(3) ఉప విభాగము (1) క్రింద పంచాయతీని విఘటన లేదా రద్దు చేయుటకు నిర్ణయింపబడిన తేదీన దాని సర్పంచు ఉపసర్పంచులతో సహా సభ్యులందరు వెంటనే తమ పదవులను ఖాళీ చేసినట్లుగా భావింపబడవలెను.

(4) (ఎ) ఒక పంచాయతీని విఘటన పరిచి పునర్నిర్మాణము చేయబడునంత వరకుగల మధ్యకాలములో లేదా సందర్భమును బట్టి అదే రద్దుపరచబడి యుండు కాలములో ఆ పంచాయతీయొక్కయు దాని సర్పంచు యొక్కయు అధికారములను, విధులను అన్నింటిని

గాని లేక కొన్నింటినిగాని, సర్పంచు కార్య నిర్వాహకాధికారి కూడ నైనచో అట్టి అతని అధికారములను కర్తవ్యములను, సాధ్యమైనంతవరకు కమీషనరు నిర్ణయించునంత మేరకు ఈ విషయములో కమీషనరు నియమించు వ్యక్తులచే నిర్వహింపబడ వచ్చును. మరియు కార్యనిర్వాహక ఆఫీసరు గాక ఇతర ఏ వ్యక్తియైనను అట్లు నియమింపబడినచో, కమీషనరు ఆదేశించినచో ఆయన పంచాయతీనుండి తన సేవలను ప్రతి ఫలము పొందవచ్చును.

(బి) (i) పైన పేర్కొనబడినట్లుగా నియమింపబడిన ఏ వ్యక్తియైనను కమీషనరుచే నిర్ణయింపబడగల ఏవేని పరిమితులకు మరియు షరతులకులోబడి వ్రాత మూలకమైన ఉత్తరువు ద్వారా(ఎ)ఖండము ననుసరించి తనకు సంక్రమింప చేయబడిన ఏవేని కర్తవ్యములను పంచాయతీ యొక్క ఎవరేని అధికారికి లేదా ఉద్యోగికి అప్పగింపవచ్చును. మరియు అట్టి పంచాయతీ అధికారి లేదా ఉద్యోగి లేని పక్షములో ప్రభుత్వము వారి యొక్క లేదా ఇతర పంచాయతీ లేక జిల్లా పరిషత్తుయొక్క ఎవరేని అధికారి లేదా ఉద్యోగికి సంక్రమింప చేయవచ్చును ;

(ii) అట్లు సంక్రమింప చేయబడిన కర్తవ్యముల నిర్వహణ, (i.వ ఉప ఖండములో సూచింపబడిన వ్యక్తిచే నిర్ణయింపబడునట్టి పరిమితులకు మరియు షరతులకు లోబడి యుండవలెను. అతని నియంత్రణకు కూడ లోబడి యుండవలెను. అట్టి ఏవేని విధుల నిర్వహణలో జారీచేయబడిన ఏ ఉత్తరువైనను పైవ్యక్తిచే మార్పు చేయబడవచ్చును లేదా రద్దు పరచబడవచ్చును.

(5) పునర్నిర్మాణము చేయబడిన పంచాయతీ యొక్క సభ్యులు దాని పునర్నిర్మాణమునకై నిర్ణయింపబడిన తేదీన తమ పదవులలోనికి ప్రవేశింపవలెను.

(6) ఈ విభాగము క్రింద పంచాయతీ విఘటిత మొనర్చ బడిన లేదా రద్దు చేయబడిన సందర్భములో అది పునర్నిర్మాణ మొనరింపబడు వరకు ప్రభుత్వమువారు ఆ తరువాత పునర్నిర్మింప బడిన పంచాయతీయును, క్రిమానుసారముగా విఘటన లేక రద్దు చేయబడిన తేదీనను పునర్నిర్మాణము జరిగిన తేదీనను ఆ పంచాయతీకిగల సమస్త ఆస్తులకు హక్కు కలిగి యుండవలెను, అది సమస్త అప్పులకు లోబడి యుండవలెను

53. పంచాయతీ తరపున లేక పంచాయతీ వ్యవహరించనప్పుడు వ్యవహరించెడి అధికారుల అధికారములు మరియు పంచాయతీ నిధి ఖర్చు :— పంచాయతీ పక్షమున లేదా పంచాయతీ వ్యవహరించనప్పుడు ఈ చట్టము ననుసరించి న్యాయసమ్మతముగా చర్య తీసికొనెడి ప్రభుత్వమునకు, కమీషనరుకు లేక ఎవరైన ఇతర వ్యక్తికి అందుకు, అవసరమైన అధికారము లన్నియు ఉండును, అంతేకాక ఏ పంచాయతీయొక్క లేక దాని ఏ ఉద్యోగుల లేక నౌకరుల యొక్క అధికారములు వినియోగింప బడుచున్నవో ఆ పంచాయతీకి లేదా ఆ ఉద్యోగులకు లేక నౌకర్లకు ఈ చట్టము ననుసరించి ఎట్టి రక్షణ కలదో అదే రక్షణకు కూడ హక్కు కలిగియుందురు. ఇంతే కాక అట్టి అధికారములను వినియోగించినందువలన ఏ వ్యక్తికైనను కలిగిన నష్టమునకుగాను, ఆ చర్య ఆ పంచాయతీచే లేదా దాని ఉద్యోగులచే లేక నౌకర్లచే తీసికొనబడి యుండినచో ఎంతపరిహారము చెల్లింపబడదగి యుండెడిదో అంత పరిహారము పంచాయతీ నిధిలో నుండి చెల్లింపబడ వలెను..

# 3 వ అధ్యాయము

## పంచాయతీల అధికారములు, కర్తవ్యములు మరియు ఆస్తి

54. కొన్ని విషయములను ఏర్పాటు చేయుట పంచాయతి విధి :- (1) ఈ చట్టము యొక్కయు దీని ననుసరించి చేయబడిన నియమావళి యొక్కయు నిబంధనలకు లోబడి, ఈ క్రింది విషయములకు సంబంధించి గ్రామ అవసరములను తీర్చుటకుగాను తన యొక్క నిధులను బట్టి అవకాశమున్నంతవరకు తగు మాత్రముగా కేటాయింపు చేయుట పంచాయతీ యొక్క విధియై యుండును. అవేమనగా :-

(*i*) పంచాయతీకి చెందిన అన్ని భవనముల యొక్క నిర్మాణము, మరమ్మతు నిర్వహణ మరియు గ్రామములోని అన్ని సార్వజనిక రోడ్ల యొక్కయు (ప్రభుత్వమువారిచే జాతీయ రాష్ట్ర రహదార్లుగా వర్గీకరింపబడినవి మరియు జిల్లాపరిషత్తులు, పంచాయతి సమితీల అధీనములోనున్నవి మినహా) అట్టి రోడ్లపై గల అన్ని వంతెనలను, తూములను మరియు రోడ్డు డాములను నిర్మించుట, మరమ్మతు చేయుట మరియు నిర్వహించుట ;

(*ii*) సార్వజనిక రోడ్ల మరియు సార్వజనిక ప్రదేశములలో దీపముల నుంచుట;

(*iii*) మురుగు కాలువలను త్రవ్వించి నిర్వహించుట మరియు మురికి నీటిని; చెత్తను పరిష్కరించుట ;

(*iv*) వీధులను శుభ్రపరచుట, చెత్తకుప్పలను అడవిగా పెరిగిన చెట్లను, నాగదాళి చెట్లను తొలగించుట, వాడుకలో లేని బావులను, అనారోగ్యకరమైన గుంటలను, మడుగులను, గుంతలను, బొందలను లేక పల్లములను పూడ్చుట మరియు గ్రామము యొక్క పరిశుభ్రతకు సంబంధించిన ఇతర అభివృద్ధులు చేయుట;

(*v*) సార్వజనిక పాయిఖానాలను ఏర్పాటుచేయుట మరియు సార్వజనిక మైనట్టియు, స్వంతమైనట్టియు పాయిఖానాలను పరిశుభ్ర మొనర్చుటకు తగిన ఏర్పాట్లు చేయుట;

(*vi*) స్మశాన వాటికలను ఏర్పాటు చేయుట, నిర్వహించుట, అనాథ పశువుల మనుష్యుల ప్రేత సంస్కారము,

(*vii*) మలేరియా లేక అంటువ్యాధులకు సంబంధించిన నిరోధక చర్యలను, చికిత్స చర్యలను తీసికొనుట;

(*viii*) స్నానమునకును, గుడ్డలు ఉతుకుటకును నీటిని, త్రాగుటకు శుభ్రమైన నీటిని సరఫరా చేయు నిమిత్తమై బావుల త్రవ్వకము, మరమ్మతు, చెరువుల లేక కుంటల త్రవ్వకము మరమ్మతు మరియు నిర్వహణ మరియు నీటి సరఫరా పనుల నిర్మాణము, నిర్వహణ;

(*ix*) ఎరువు సాధనములను భద్రపరచుట గోతి ఎరువు తయారీ మరియు ఎరువుల అమ్మకము;

(*x*) జనన మరణముల రెజిస్ట్రేషను;

(*xi*) పశువుల దొడ్లను ఏర్పాటు చేయుట, నిర్వహించుట;

(*xii*) ఈ చట్టము క్రిందగాని, మరి ఇతర శాసనము క్రింద గాని, అవశ్య కర్తవ్యములని స్పష్టముగా పేర్కొనబడిన ఇతర అన్ని విషయములు.

(2) ఉప విభాగము (1) లో నిర్దిష్టపరుపబడిన ఏవేని విషయములకై ఏర్పాటు చేయబడలేదన్న కారణముపై పంచాయతి లేక కార్య నిర్వాహకాధికారి, పంచాయతి యొక్క అధికారి లేక ఉద్యోగిపై పరిహారమునకైగాని, నిగ్రహాచరణకై గాని ఎట్టి దావాయు వేయబడరాదు.

55. కొన్ని ఇతర విషయములను గురించి ఏర్పాటు చేయుటకు పంచాయతికి అధికారము:—ఈ చట్టము యొక్కయు దీని ననుసరించి చేయబడిన నియమావళి యొక్కయు, నిబంధనలకు లోబడి పంచాయతి ఈ క్రింది విషయములకు సంబంధించి గ్రామావసరములను తీర్చు నిమిత్తము అది యుక్తమని భావించునట్టి ఏర్పాటును కూడ చేయవచ్చును. అవేమనగా :—

(*i*) ప్రయాణీకులకై ధర్మశాలలు, సత్రములు లేక విశ్రాంతి గృహముల నిర్మాణము, మరియు నిర్వహణ;

(*ii*) రోడ్ల ప్రక్కల మరియు ఇతర సార్వజనిక స్థలములలో చెట్లను, పూపొదలను నాటుట మరియు సంరక్షించుట;

(*iii*) ప్రాథమిక విద్య, కుటీర పరిశ్రమలు మరియు వ్యాపారముల యొక్క అభివృద్ధి;

(*iv*) వైద్యశాలలను స్థాపించి నిర్వహించుట మరియు గ్రామీణ వైద్యులకు సబ్సిడీలను చెల్లించుట;

(*v*) శారీరక వ్యాయామమునకై మరియు మనోరంజమునకై రేడియోలు, ఆటస్థలములు, అఖాడాలు, క్లబ్బులు మరియు ఇతర కేంద్రములను స్థాపించుట, నిర్వహించుట;

(*vi*) ఉద్యానవనములు వేయుట, నిర్వహించుట;

(*vii*) గ్రంథాలయములను, పఠన మందిరములను స్థాపించి నిర్వహించుట;

(*viii*) వికలాంగులకు, అనాథలకు, రోగులకు సహాయము ఏర్పాటు చేయుట;

(*ix*) నర్సరీలను, అభివృద్ధికరమైన విత్తనములు మరియు వ్యావసాయిక పరికరముల స్టోరులను స్థాపించుట, నిర్వహించుట మరియు అభివృద్ధికరమైన విత్తనములను, తెగుళ్లకు మందులను క్రిమిసంహారక మందులను ఉత్పత్తి చేయుట, సరఫరా చేయుట మరియు పశు ప్రదర్శనలను, వ్యావసాయిక ప్రదర్శనలను ఏర్పాటు చేయుట;

(*x*) ఉత్పత్తిని వృద్ధిచేయు లక్ష్యముతో మేలురకపు వ్యవసాయ పద్ధతులను గ్రామములో ప్రచారము చేయుట, ప్రదర్శన ప్లాట్లను ఏర్పాటు చేయుట;

(*xi*) భూముల సహకార నిర్వహణము ప్రోత్సహించుట మరియు ఉమ్మడి సహకార వ్యవసాయమును వ్యవస్థీకరించుట;

(*xii*) గిడ్డంగులు, ధాన్యాగారముల స్థాపన మరియు నిర్వహణ;

(*xiii*) పశువుల దొడ్లను, కొట్టములను నిర్మించి నిర్వహించుట;

(*xiv*) గ్రామ వైశాల్యమును విస్తరించుట;

(*xv*) ఆబోతుల కొనుగోలు మరియు నిర్వహణతోసహా పశు సంవృద్ధి మరియు పశు చికిత్సకై ఏర్పాట్లు;

(*xvi*) సంతల, జాతరల మరియు ఉత్సవముల నియంత్రణ;

(*xvii*) ప్రసూతి మరియు శిశు సంక్షేమ కేంద్రముల స్థాపన మరియు నిర్వహణ;

(*xviii*) గ్రామమునందలి సాముదాయక అభివృద్ధి పనులకై స్వచ్ఛంద శ్రామికుల సంఘటన;

(*xix*) గ్రామ రక్షణ వ్యవస్థను ఏర్పాటు చేయుట;

(*xx*) కరువు మొదలైన సంక్షోభముల సందర్భమున సహాయమునకై ఏర్పాట్లు;

(*xxi*) యజమానులు లేక విచ్చలవిడిగా తిరుగాడు కుక్కల నిర్మూలన;

(*xxii*) నిరుద్యోగుల సంఖ్యా వివరములు తయారు చేయుట;

(*xxiii*) సార్వజనిక అంగళ్లను ఏర్పాటు చేయుట, నిర్వహించుట;

(*xxiv*) సార్వజనిక వధ్యశాలను ఏర్పాటు చేయుట, నిర్వహించుట;

(*xxv*) భూ సంస్కరణ చర్యలను గ్రామమునందమలు పరచుట; కమతముల ఏకీకరణ, భూసార సంరక్షణ;

(*xxvi*) వివిధ కులముల మధ్య సామరస్యము మరియు సాంఘిక సమైక్యతను సాధించు సంస్థలను నెలకొల్పుట, అస్పృశ్యతా నివారణ, హరిజనులకు ఇళ్ల స్థలముల ఏర్పాటు, లంచగొండితనమును నిర్మూలించుట, ఆరోగ్యమునకు హానికరమైన మత్తు పానీయముల లేక ఔషధముల వాడకమును నిషేధించుట లేక పరిమితము చేయుట, జూదము మరియు వ్యాజ్యలంపటత్వములను నిరుత్సాహ పరచుట;

(*xxvii*) గ్రామస్థుల యొక్క భద్రత, ఆరోగ్యము, సదుపాయము సౌకర్యము లేక నైతిక సాంఘిక, ఐహిక సంక్షేమములను పెంపొందించు ఇతర ప్రజోపయుక్త చర్యలు.

56. ఉమ్మడి ఆసుపత్రులు, శిశుసంక్షేమ కేంద్రములు మున్నగు వాటి నిర్వాహణ:— ఈ చట్టము యొక్కయు దీని ననుసరించి చేయబడిన నియమావళి యొక్కయు నిబంధనలకు లోబడి, రెండు లేక అంతకెక్కువ పంచాయతీలు కలిసి ఉమ్మడి ఆస్పత్రులను, శిశు సంక్షేమ కేంద్రములను, నిర్ణయింపబడిన ఇతర సంస్థలను నెలకొల్పి నిర్వహించవచ్చును.

57. అడవులను పంచాయతీల అధీనమునకు మార్చుట:— ప్రస్తుతము అమలులోయున్న ఏ చట్టమునకు లోబడి ప్రభుత్వము ఆంధ్రప్రదేశ్ గజెట్‌లో ప్రకటన ద్వారా పంచాయతీ సమ్మతితో మరియు అంగీకరించబడిన షరతులతో ఏ గ్రామ పంచాయతీకైనను ఆ గ్రామమును అనుకొనియున్న అడవులను నిర్వహించుటకు మరియు పోషించుటకు మార్చవచ్చును, అదే విధముగా గ్రామ పంచాయతీకి సమాధానము చెప్పుటకు అవకాశము ఇచ్చి ప్రకటన ద్వారా అట్టి అధికారమును ఉపసంహరించవచ్చును.

(2) ఉపవిభాగము (1) ననుసరించి గ్రామపంచాయతీకి నిర్వహణకు మార్చబడిన అడవివల్ల వచ్చు ఆదాయము, నిర్వహణార్థమగు ఖర్చు ప్రభుత్వము మరియు పంచాయతీకి మధ్య ప్రభుత్వముచే ఉత్తరువు ద్వారా నిర్ణయించిన ప్రకారము పంచబడవలెను.

58. సంస్థలకు లేక పనులను పంచాయతీలకు బదిలీచేయుటకు:- (1) నిర్ణయింపబడిన నియమములకు లోబడి, ప్రభుత్వము, రెవిన్యూ బోర్డు కలెక్టరు లేక రెవిన్యూ డివిజినల్ ఆఫీసరు, పంచాయతీ సమితి లేదా జిల్లా పరిషత్తు లేదా ఏవరేని వ్యక్తి లేక సంఘము, ఈ చట్టములో నిబంధింపబడినను లేకున్నను, గ్రామములోపలనున్న లేక వెలుపలనున్న ఏదేని సంస్థయొక్క నిర్వహణ, లేదా ఏదేని అధికారము యొక్క వినియోగము లేక కర్తవ్య నిర్వహణను పంచాయతీకి, దాని అంగీకారముతోను, ఒప్పందము చేసికొనబడిన షరతులకు లోబడి బదిలీ చేయవచ్చును.

(2) (1)వ విభాగము క్రింద ఏదేని సంస్థయొక్క నిర్వహణ పంచాయతీకి బదిలీ చేయబడిన మీదట, దానికి సంబంధించిన ఆస్తులు, ధర్మాదాయములు, నిధులన్నియు, అట్టి బదిలీ సమయమున అవి చట్ట సమ్మతముగా ఏ కార్యముల కొరకు వినియోగించబడదగియుండునో అట్టి కార్యముల నిమిత్తము పంచాయతీ అధీనములో ట్రస్టు రూపమున నుండును.

59. ధర్మాదాయములు, ఇనాముల నియంత్రణను బదిలీ చేయుటకు లేక వశపరచుకొనుటకు రెవిన్యూబోర్డు వారి అధికారము:— (1) (ఏ) ప్రభుత్వమువారి నియంత్రణకు లోబడి రెవిన్యూ బోర్డువారు, ప్రకటన ద్వారా, పంచాయతీ యొక్క అంగీకారముతో దానికి, 1817, ఆంధ్రప్రదేశ (ఆంధ్ర ప్రాంత) ధర్మాధాయమును, ఎశ్చీట్ల రెగ్యులేషను (1817లో 7వ రెగ్యులేషను) యొక్క నిబంధనల

ననుసరించి లేక ప్రస్తుతము అమలునందున్న అదే విధమైన ఏదేని ఇతర శాసనము ననుసరించి ఏ దాన ధర్మాదాయము విషయములో రెవిన్యూబోర్డు వారు, అధికారములు, కర్తవ్యములు కలిగియుండిరో అట్టి ఏదేని దాన ధర్మాదాయ నిర్వహణను, పర్యవేక్షణను బదిలీ చేయవచ్చును. అటుపై ఆ విషయములో రెవిన్యూబోర్డు వారికి చెందిన అధికారములు, విధులన్నియు, సదరు రెగ్యులేషనులో పంచాయతీని ప్రత్యేకముగా పేర్కొనియుండిన ఎట్లో అట్లే, పంచాయతీకి చెందును. పంచాయతీ అట్టి ధర్మాదాయమును నిర్వహించవలెను, పర్యవేక్షించవలెను.

(బి) రెవిన్యూ బోర్డు వారు తమంతట తామే ఆంధ్రప్రదేశ గెజెటులో ప్రకటన ద్వారా, (ఏ) ఖండము క్రింద పంచాయతీకి బదిలీ చేయబడిన ధర్మాదాయ నిర్వహణను పర్యవేక్షణను తిరిగి తమ హస్తగతము చేసికొనవచ్చును. ప్రభుత్వము వారు ఆదేశించినచో సదరు నిర్వహణను, పర్యవేక్షణను తమ హస్తగతము చేసికొనవలెను, అట్లు హస్తగతము చేసికొనిన మీదట, ధర్మాదాయము విషయములో పంచాయతీకున్న అధికారములు, విధులు అంతము కావలెను.

(2) ప్రభుత్వమువారు, వారిచే లేక ఎవరేని ఇతర అధికారిచే తీసుకొనబడిన ధర్మార్థమైన ఇనాములను పంచాయతీకి దాని అంగీకారముతో అప్పగించ వచ్చును. అయితే అట్టి ఇనాముయొక్క నికర ఆదాయము ఆ పంచాయతీ నిధులు ఏ కార్యము కొరకు వినియోగించవచ్చునో అట్టి ఏవేని కార్యముల కొరకు మాత్రమే వినియోగించబడవలెను. ప్రభుత్వమువారు అట్లు చేయబడిన అప్పగింతను రద్దుకూడ చేయవచ్చును.

(3) చెప్పదలచినది చెప్పుకొనుటకు పంచాయతీకి అవకాశము ఇచ్చిననే తప్ప. (1)వ ఉప విభాగము (3) (బి) ఖండము క్రింద హాస్తగతపు ఉత్తరువు గాని, (2)వ ఉప విభాగము క్రింద రద్దు ఉత్తరువు గాని చేయబడరాదు,

60. విరాళములను, ట్రస్టులను స్వీకరించుటకు పంచాయతీ యొక్క అధికార పరిమితి:— ఒక పంచాయతీయొక్క నిధులు ఏ కార్యముల నిమిత్తము వినియోగింపబడవచ్చునో ఆ కార్యముల కొరకును వాటికి సంబంధించిన పనుల కొరకును మాత్రమే అది విరాళములను లేక ట్రస్టులను స్వీకరించవచ్చును.

61. గ్రామపంచాయతీలకు బందిలీ దొడ్ల మార్పిడి మరియు వాటి నిర్వహణ:— (1) 1871లోని హద్దుమీరెడి పశువుల చట్టములో యున్న ఏ విషయమైన కాక

(i) ఈ చట్టము అమలులోనికి వచ్చుసరికి ఆ గ్రామములో ప్రభుత్వముచే స్థాపించబడి మరియు నిర్వహించ బడుచున్న ప్రతి బందిలి దొడ్డియు ఆ గ్రామ పంచాయతీకి మార్చబడును.

(ii) ఆ విధముగా గ్రామపంచాయతీకి మార్చబడిన బందిలి దొడ్డిగాని, లేక గ్రామపంచాయతీ ఈచట్టము ననుసరించి స్థాపించిన బందిలి దొడ్డిగాని, గ్రామపంచాయతీ అధీనములో యుండును మరియు నిర్వహింపబడును.

(iii) ఖండము (ii) లో వివరించిన ప్రతి బందిలి దొడ్డికి ఒక దొడ్డి కాపరిని గ్రామపంచాయతీ నియమించును.

(iv) జరిమానాలు మరియు ఖండము (ii) లో వివరించిన బందిలి దొడ్లలోని హద్దుమీరెడి పశువుల చట్టము 1871 ననుసరించి

ఎవరుకోరని పశువుల అమ్మకము వల్ల వచ్చిన అదనపు రాబడుల మొత్తము గ్రామ పంచాయతీ నిధికి జమకట్ట బడును.

(2) ఉప విభాగము (1) లోని విషయములకు లోబడి, ఉప విభాగపు (i) ఖండము (ii) లో వివరించిన బందిలి దొడ్లకు, హద్దు మీరెడి పశువుల చట్టము 1871 వర్తించును.

62. పబ్లికు రోడ్లు పంచాయతీ ఆధీనములో నుండుట:— (1) జాతీయ రహదారులు, రాష్ట్ర రహదారులు, జిల్లా పరిషత్తులు లేక పంచాయతీ సమితుల ఆధీనములో ఉన్న రోడ్లు తప్ప గ్రామము లోని సమస్త పబ్లికు రోడ్లు వాటికి సంబంధించిన కాలిబాటలు, రాళ్లు వాటికి చెందిన ఇతర వస్తు సామగ్రి, వాటికై ఏర్పాటు చేయబడిన యావత్తు పనులును, సామగ్రియును ఇతర వస్తువులును, అట్టి రోడ్డుల లోను, వాటి ప్రక్కలలోను లేదా వాటి క్రిందను పంచాయతీ నిధితో నిర్మింపబడినట్టి వైనను లేక ఇతర విధముగా నిర్మింపబడినట్టి వైనను యావత్తు జలదారులును, కాలువలును, డ్రైనేజీ వర్కులును, తూములును, చిన్న వంతెనలును వాటికి సంబంధించిన యావత్తు పనులును వస్తు సామగ్రియును పంచాయతీ ఆధీనములో ఉండవలెను.

అయితే పంచాయతీలో ఉన్న జాతీయ రహదారి కానట్టి ఏ రోడ్డుపైనైనా దురాక్రమణలను తొలగించుటకు, అనధీకృత విని యోగమును నివారించుటకు పంచాయతీ హక్కు కలిగియుండ వలెను,

(2) విన్నపము చేసికొనుటకు పంచాయతీకి అవకాశము ఇచ్చిన తరువాత ప్రభుత్వము వారు ఆంధ్రప్రదేశ గెజెటులో ప్రకటన ద్వారా అట్టి ఏదేని పబ్లికు రోడ్డును, జలదారిని, కాలువను, డ్రైనేజి వర్కును, తూమును, చిన్న వంతెనను ఈ చట్టముయొక్క

అమలు నుండి మినహాయించవచ్చును; మరియు అట్టి ప్రకటనను సవరించవచ్చును లేదా రద్దుచేయవచ్చును.

63. ప్రోగుచేయబడిన చెత్త, చెదారము పంచాయతీకి చెందుట: ఈ చట్టము ననుసరించి ఒక పంచాయతీచే ప్రోగుచేయబడిన యావత్తు చెత్త, చెదారమును, ఇతర పదార్థము దానికి చెందియుండవలెను.

64. సాముదాయక ఆస్తియు, రాబడియు పంచాయతీ ఆధీనములో నుండుట:— ఉమ్మడి గ్రామస్థులందరికి గాని లేక గ్రామ భూమిని లేదా ప్రత్యేక రకపు భూములను లేదా ఒక ప్రత్యేక నీటి పారుదల ఆధారము క్రింది భూములను ఉమ్మడిగా కలిగియున్న వ్యక్తులకు గాని ఆచారమును బట్టి చెందియున్న లేదా వారి లాభము నిమిత్తము పరిపాలించబడు చుండిన ఏట్టి ఆస్తిగాని లేదా రాబడిగాని పంచాయతీకి చెందవలెను, మరియు అట్టి ఏ ఆస్తి లేదా రాబడి పైన చెప్పిన గ్రామస్థుల లేదా వ్యక్తుల లాభము నిమిత్తము పంచాయతీచే పరిపాలింపబడవలెను.

65. నీటి పారుదల పన్నుల నిర్వహణ, కుడి మరమ్మతు మున్నగువాటి నిర్వహణ:— (1) (ఏ) నిర్ణయింపబడు షరతులకు, నియంత్రణకు లోబడి, ఏదేని గ్రామ నీటి పారుదల పనిని రక్షించుటను, నిర్వహించుటను చిన్న నీటి పారుదల వంతుల నిర్వహణను లేక ఏ నీటి పారుదల వర్కు నుండియైనను, దాని మీద ఆధారపడి యుండు పొలములకు నీటి పంపకమును క్రమపరచుటను ప్రభుత్వము వారు ఏ పంచాయతీ కైనను బదిలీ చేయవచ్చును. (బి) నిర్ణయించబడే షరతులకు అధికారమునకులోనై నీటి పారుదల చెరువులలో చేపలు పట్టు హక్కులు అట్టి చెరువులలో కలుపుమొక్కల వేలపు హక్కును మరియు చెరువుల కట్టలపై చెట్లు నాటుట, వాటివల్ల

వచ్చు ఫలితమును అనుభవించుటకు గ్రామ పంచాయతీ అధికారము కలిగే యుండును.

(2) నిర్ణయింపబడగల నిర్బంధములకు నియంత్రణకు లోబడి, గ్రామములోని ఏదైన నీటివనరుకు కుడి మరమ్మతు చేయుటకును, నిర్ణయింపబడగల విధముగా సదరు కార్యములకుగాను నిర్ణయింప బడిన రేట్ల చొప్పున రుసుమును విధించుటకును పంచాయతీ అధి కారము కలిగియుండవలెను.

అయితే ఈ విభాగములోని దేదియు, నీటి వనరుకు పంచా యతీ కుడి మరమ్మతు చేయని సందర్భములో 1858, ఆంధ్రప్రదేశ్ (ఆంధ్రప్రాంత)నిర్బంధ శ్రమ చట్టము(1858లో 1వ కేంద్ర చట్టము) క్రింద లేక ప్రస్తుతము అమలునందున్న అదే విధమైన ఏదైన ఇతర శాసనము క్రింద గ్రామములోని ఏదైన నీటి వనరుల పట్ల గ్రామ సంఘము లేక దాని సభ్యులలో ఎవరి యొక్కయైన బాధ్యత నుండి దానిని లేక వారికి విముక్తము చేసినట్లు భావింపబడకూడదు.

66. రేవులను గ్రామ పంచాయతీల నిర్వహణకు అప్పగించుట:-

(1) ఆంధ్రప్రదేశ్ (ఆంధ్రప్రాంతపు) కాలువలు మరియు రేవుల చట్టము 1890, మరియు ఆంధ్రప్రదేశ్ (తెలంగాణ) రేవుల చట్టము 1314 ఫసలీలో ఏమి యున్నప్పటికి ఆంధ్ర ప్రాంతములో పబ్లిక్ రేవుల మరియు తెలంగాణలో ప్రభుత్వ రేవుల నిర్వహణ ఉప విభాగము (2) లో చెప్పబడిన రేవులు తప్ప ఈ క్రింద చెప్పబడిన విధముగా చెందియుండును.

(ఎ) ఒక వేళ పబ్లిక్ రోడ్డును కలిపే రేవు గ్రామ పంచా యతి నిర్వహణలో, గ్రామ పంచాయతి అధికార క్షేత్రములో

యుండిన, అట్టి గ్రామ పంచాయతిలో, ఒక వేళ పబ్లిక్ రోడ్డును కలిపే రేవు గ్రామ పంచాయతి అధికార క్షేత్రమునందు యుండిన మరియు ఒకదానికంటె ఎక్కువ పంచాయతీలలో యుండిన అట్టి సంబంధమున్న పంచాయతీల సంయుక్త కమిటి అధీనములో యుండును.

(బి) ఒక వేళ రేవు పబ్లిక్ రోడ్డును కలుపుచు పంచాయతి సమితి నిర్వహణలో యుండిన మరియు పంచాయతి సమితి అధికార క్షేత్రములోనే యుండి ఆ పంచాయతి సమితి అధికారములో, ఒక వేళ రేవు పబ్లిక్ రోడ్డును కలపుచు పంచాయతి సమితి నిర్వహణలో యుండిన మరియు ఒక పంచాయతీకన్న ఎక్కువ పంచాయతి సమితుల అధికార క్షేత్రములందు యుండినదానికి సంబంధించిన పంచాయతి సమితుల సంయుక్త కమీటీల అధీనములో యుండును.

(2) ప్రభుత్వముచే అంగీకరించబడి నటువంటి షరతులలో, జాతీయ లేక రాష్ట్ర రహదారితో కలసిన రేవు పూర్తిగా పంచాయతి లేదా పంచాయతి సమితి అధికార క్షేత్రమునందుండిన అటువంటి పంచాయతి లేదా పంచాతి సమితి ఆధీనములోకి, ఒక వేళ ఒక గ్రామ పంచాయతికన్న ఎక్కువ లేదా పంచాయతి సమితుల అధికార క్షేత్రమునందుండిన, దీనికి సంబంధించిన జిల్లా పరిషత్తు నిర్వహణలోనికి మార్చబడును.

(3) ఉప విభాగము (1) లో వివరించిన సంయుక్త కమిటీ కమిటీ నిర్మాణము, అధికారములు, కార్యక్రమమును గురించి దానికి సంబంధించిన స్థానిక సంస్థల మధ్య భేదాభిప్రాయములు కలిగినప్పుడు పరిష్కరించే మార్గము, నిర్ణయించబడిన నిబంధన ప్రకారముగా యుండును.

(4) ఉపవిభాగము (1) లేదా ఉపవిభాగము (2) ననుసరించి, జిల్లా పరిషత్తు పంచాయతి సమితి లేదా గ్రామ పంచాయతి నిర్వహాణలో యున్న రేవులవల్ల వచ్చిన రాబడి వాటి నిధులలో భాగముగా యుండును. ఉపవిభాగము (1) లో వివరించిన సంయుక్త కమీటి లేదా, ఉపవిభాగము (2) లో వివరించి జిల్లా పరిషత్తు నిర్వహాణలో యున్న రేవులవల్ల వచ్చిన రాబడి ఆ స్థానిక సంస్థలకు సమానముగా పంచబడి వాటి నిధులలో భాగముగా యుండగలదు.

వివరణ :—విభాగముకొరకు ఆంధ్రి ప్రాంతములో "పబ్లిక్ రేవు" మరియు తెలంగాణ ప్రాంతమునకు "ప్రభుత్వ రేవు" అను పదములు ఆంధ్రి ప్రదేశ్ (ఆంధ్ర ప్రాంతపు) కాలువల మరియు పబ్లిక్ ఫెరీల చట్టము 1890, మరియు ఆంధ్ర ప్రదేశ్ (తెలంగాణ ప్రాంతము) ఫెర్రీల చట్టము 1314 ఫసలీలో యున్న అర్థమే వర్తించును.

67. కొన్ని పోరంబోకులు పంచాయతి ఆధీనములో వుండుట మున్నగునవి :— (1) ప్రభుత్వమువారి ఆధీనములో వుండి ఏదైనా నిర్దిష్టమైన కార్యము నిమిత్తము వారికి అవసరములేని కొన్ని పోరంబోకులు అనగా పచ్చిక బీళ్లు, కళ్లములు, స్మశాన వాటికలు, పశువులు నిలుచు స్థలములు, బండ్లు నిలుచు స్థలములు, తోపులు నిర్ణయించ బడగల నిర్బంధములకును, నియంత్రణకును లోబడి ఈ చట్టము ప్రారంభమున పంచాయతి ఆధీనము కావలెను.

(2) (1)వ ఉప విభాగములో తెలిపిన ఏదైనా పోరంబోకు ఏదేని ప్రత్యేక కార్యము నిమిత్తము ప్రభుత్వమువారికి అవసరమైన యెడల ప్రభుత్వమువారు ఎప్పుడైనను ఆంధ్ర ప్రదేశ్ గెజెటులో ప్రకటన ద్వారా అవి పంచాయతి ఆధీనములో వుండుట నిలిచిపో

వలెనని ఆదేశించవచ్చును. అటుపై అట్టి పోరంబోకు ప్రభుత్వము వారి అధీనము కావలెను.

(3) నిర్ణయింపబడగల నిర్బంధములకును నియంత్రణకు లోబడి, ప్రభుత్వమువారి ఉత్తరువుచే ఈ విషయమున పంచాయతీకి అధికార మీయబడిన యెడల, ప్రభుత్వవారి స్వాధీనములో నుండు ఏదేని ఇతర పోరంబోకు యొక్క ఉపయోగమును క్రమపరచుటకు కూడ పంచాయతి అధికారమును కలిగి యుండవలెను.

(4) నిర్ణయింపబడగల నిర్బంధములకును నియంత్రణలకును లోబడి, ఏ పోరంబోకుల యొక్క ఉపయోగము (3) వ ఉప విభాగము ననుసరించి పంచాయతీచే క్రమ పరచబడునో ఆ పోరం బోకులలో, పంచాయతి, చెట్లు నాటవచ్చును.

వివరణ :— ఈ విభాగము యొక్క కార్యముల నిమిత్తము, ఒక భూమి పోరంబోకు అగునా కాదా అను సమస్య ఉత్పన్న మయినచో అట్టి సమస్యా పరిష్కారమునకై ప్రభుత్వము వారికి పంప బడవలెను. ప్రభుత్వమువారి నిర్ణయము అంతిమమైనదై యుండ వలెను.

68. పంచాయతీకి కావలసిన స్థిరాస్తి 1894, భూసేకరణ చట్టము క్రింద సేకరించబడవచ్చును :—ఈ చట్టము యొక్క లేక ఈ చట్టము క్రింద చేయబడిన నియమావళి, యొక్క కార్యముల నిమిత్తము పంచాయతీకి కావలసిన ఏ స్థిరాస్తి పైనను 1894. భూసేకరణ చట్టము యొక్క నిబంధనల ననుసరించి సేకరింప వచ్చును. మరియు అట్టి ఆస్తి విషయములో సదరు చట్టము ననుసరించి ఈయబడు పరిహార ద్రవ్యమును దానిని సేకరించుట కగు ఇతర ఖర్చులును చెల్లించిన మీదట సదరు ఆస్తి పంచాయతీ వశమై యుండవలెను.

★

# 4 వ అధ్యాయము

## పన్ను విధింపు, ఆర్థిక విషయములు

69. పంచాయతీచే వసూలు చేయబడదగు పన్నులు :— (1) పంచాయతి గ్రామములో ఈ క్రింద తెలుపబడిన పన్నులను వసూలు చేయవలెను :—

(ఏ) ఇంటి పన్ను ;

(బి) (ఇందులో ఇటు తరువాత వృత్తి పన్ను అని పేర్కొన బడు) వృత్తులు, వర్తకములు పనులపై పన్ను;

(సి) నిర్ణయించబడ గల నియమములకు లోబడి ప్రభుత్వము వారు ఆంధ్రప్రదేశ్ గెజెటులో ప్రకటన ద్వారా ఏదైనా పంచాయతి లేక పంచాయతీల వర్గము వసూలు చేయవలెనని అదేశించునట్టి ఇతర పన్నులు ;

అయితే రాష్ట్ర శాసనమండలి ఉభయ సభల యొక్క పూర్వామోదముతో తప్ప అట్టి ఏ ప్రకటనగాని జారీ చేయబడరాదు. లేక అట్టి ఏ నియమముగాని చేయబడరాదు.

(2) 73 వ విభాగపు నిబంధనల ననుసరించి ప్రతి గ్రామము లోను కొన్ని రకముల ఆస్తి బదిలీలపై కూడ సుంకము విధించ బడవలెను.

(3) నిర్ణయింపబడ గల నియమముకు లోబడి పంచాయతీ. గ్రామములో ఈ క్రింది పన్నులను కూడ విధించవచ్చును—

అయితే గ్రామ పంచాయతి, ఏ ప్రాంతమునకైతే రాష్ట్రములో అమలులో యున్న చట్టప్రకారముగా, వ్యవసాయ వస్తువులను, పశువులు, పశువులవల్ల తయారగు వస్తువులను కొనుటకును, అమ్ముటకును మరియు వాటికొరకు మార్కెటు ఏర్పరుచుటకు నిబంధనల ప్రకారము మార్కెట్టు కమిటీ ఏర్పరచ బడినదో, ఆ ప్రాంతములో ఏలాంటి సుంకము లేదా పన్నులు వసూలు చేయకూడదు.

(*i*) కొలగారం లేక కాటా రుసుము అనగా తూకము, కొలత లేక సంఖ్యా లెక్కతో గ్రామములో విక్రయించబడిన గ్రామ ఉత్పత్తులపై పన్ను.

(*ii*) బండ్ల పన్ను;

(*iii*) ప్రత్యేక కార్యముకొరకు వ్యవసాయ భూమిపై పన్ను;

(*iv*) భవనములచే ఆక్రమింపబడనట్టియు, లేక భవనములకు ప్రక్కగానున్న వాటికి సంబంధించినవియు కానట్టి ఆక్రమిత భూములన్నిటిపై సంవత్సరవారి అద్దె విలువలో రూపాయకు రెండు నయాపైసల రేటు చొప్పున భూమిసెస్సు;

(*v*) పంచాయతి నియంత్రణ క్రింద గల పోరంబోకులు లేదా సాముదాయక భూముల వాడకమునకు గాను రుసుములు;

(*vi*) పంచాయతి నియంత్రణలో గల చావడీలు, సత్రములు మొదలగు భవనముల ఆక్రమణపై పన్ను;

(4) గ్రామములో త్రవ్వబడిన వస్తువులపై ప్రభుత్వము వారు వసూలు చేసిన సీనియరేజీ రుసుముపై సర్-చార్జి రూపములో ప్రతి పంచాయతి సుంకము కూడ విధించవచ్చును;

అయితే అట్టి సుంకపు రేటును పంచాయతీ ప్రభుత్వమువారి పూర్వామోదముతో నిర్ణయించవలెను.

(5) ప్రతి గ్రామపంచాయతి, నిర్ణయించబడిన అధికారి ఆమోదముతో తన అధికార క్షేత్రములో భూములపైన సర్ చార్జి రూపములో పన్ను విధించవచ్చును కాని రూపాయికి 25 నయాపైసలకన్న ఆపన్ను మించకూడదు.

ఏ) ఆంధ్ర ప్రాంతములో ఆంధ్ర ప్రదేశ్ (ఆంధ్ర ప్రాంత) జిల్లా బోర్డుల చట్టము 1920, విభాగము 78 ననుసరించి విధించబడు భూమిసెస్సు, మరియు ఆంధ్రప్రదేశ్ (ఆంధ్రప్రాంత) ప్రాథమిక విద్యాచట్టము 1920, విభాగము 34 ననుసరించి విధించబడు విద్యా పన్నును విధించవచ్చును.

బి) తెలంగాణ ప్రాంతములో, ఆంధ్రప్రదేశ్ (తెలంగాణ ప్రాంత) జిల్లా బోర్డుల చట్టము 1955, విభాగము 135 ననుసరించి స్థానిక సెస్సును విధించవచ్చును.

(6) కమీషనరు యొక్క ముందు అనుమతి లేనిదే, గ్రామ పంచాయతీ ప్రస్తుతమున్న పన్నును రద్దు చేయుచు లేక అమలులో యున్న రేటును తగ్గించుచూ ఏదైన తీర్మానము చేసిన, అమలులోనికి రాబడదు,

70. ఇంటి పన్ను :— (1) 2వ షెడ్యూలులోని నియమములకును నిర్ణయింపబడునట్టి ఇతర నియమములకును లోబడి, 69వ విభాగము యొక్క (1)వ ఉపవిభాగము (ఏ) ఖండములో తెలుపబడిన ఇంటి పన్ను, ఈ క్రింద తెలుపబడిన ఆధారములలో ఏ ఒక్క ఆధారము ననుసరించియైన గ్రామములోని అన్ని ఇండ్లపై విధింపబడవలెను, అవే వనగా .

(ఏ) సంవత్సర వారి అద్దె విలువ ;

(బి) మూల ధనపు విలువ ; లేక

(సి) నిర్ణయింపబడునట్టి ఏదేని ఇతర ఆధారము

(2) ఇంటి పన్ను, ఆ ఇంటి స్థలము విషయమున ప్రభుత్వము వారికి బాకీగా ఉండు భూమి శిస్తు ఏదైన ఉన్న యెడల దానిని ముందుగా చెల్లించుటకు లోబడి, ఇంటి మీదను, దానిలో లేక దాని మీద ఉండునట్టిన్ని, అట్టి పన్నును చెల్లించుటకు బాధ్యుడైన వ్యక్తికి చెందినట్టిన్ని చరాస్తి యేదైన వున్న యెడల దానిపై మొదటి చార్జిగా ఉండవలెను,

(3) ఇంటి పన్ను ప్రతి సంవత్సరమునకు విధించబడవలెను. అది, 2వ షెడ్యూలులో అన్యథా నిబంధింపబడిననే తప్ప, యజమానిచే సంవత్సరము యొక్క ప్రారంభమునుండి ముప్పది దినములలో పల చెల్లింపబడవలెను. అది, పంచాయతీ అనుసరించిన పన్ను విధింపు ఆధారము దృష్ట్యా నిర్ణయింపబడు కనీసపు రేట్లకు తగ్గియుండకుండను గరిష్ఠ రేట్లకు మించియుండకుండను. పంచాయతీచే నిర్ణయింపబడు రేట్లచొప్పున విధించబడవలెను.

(4) ప్రభుత్వమువారు ఈ దిగువ విషయములను నిబంధించుచు నియమములు చేయవచ్చును ;

(*i*) నిర్దేశింపబడిన తరగతులకు చెందిన యిండ్లను పన్ను నుండి మినహాయించుట ;

(*ii*) ఇండ్ల యొక్క సంవత్సరవారి విలువను లేదా మూల ధనపు విలువను తెలుసుకొను విధము లేదా పన్నువిధింపు కార్యము నిమిత్తము ఇండ్ల తరగతులు ;

(*iii*) పన్నును చెల్లించుటకు బాధ్యులగు వ్యక్తులు ఇండ్ల బదిలీలను గురించి నోటీసుల నిచ్చుట ;

(*iv*) పేదరికము కారణముపై పన్ను నుండి మినహాయింపులను చేయుట ;

(*v*) వేకెన్సీ తదితర మాఫీలను యిచ్చుట;

(*vi*) ఏ సంవత్సరములోనైనను నిర్మింపబడిన, పునర్నిర్మాణము చేయబడిన లేక పడగొట్టబడిన లేదా గ్రామములో చేరియున్న లేక దాని నుండి మినహాయింపబడిన ప్రాంతములోని ఇండ్లపై పూర్తి పన్ను లేదా పన్నులో కొంత భాగము చెల్లించవలసిన బాధ్యత ఉండెడి లేక విరమించెడి సందర్భములు. షరతులు,

(5) ఇంటిలో కాపురమున్న వ్యక్తి దాని యజమాని తరపున ఇంటిపన్ను చెల్లించు నెడల, అట్టి వ్యక్తి ఆ మొత్తమును యజమాని నుండి రాబట్టు కొనుటకు హక్కు కలిగి యుండును. మరియు యజమానికి ఆయన అప్పుడు చెల్లించవలసియున్న లేక అటు తరువాత చెల్లించవలసిన అద్దె నుండి దానిని తగ్గించుకొనవచ్చును.

71. ప్రభుత్వమువారి ఆదేశము ననుసరించి ఇంటి పన్ను వసూలు:— ప్రభుత్వమువారు ఆంధ్రప్రదేశ గెజెటులో ప్రచురించు ఉత్తరువు ద్వారా, ఆ ఉత్తర్వులో నిర్దిష్ట పరచబడిన ప్రత్యేక కారణములనుబట్టి ఏపంచాయతీ పైనను, 61వ విభాగము యొక్క (1)వఉపవిభాగము (ఏ)ఖండములో తెలుపబడిన ఇంటిపన్నును, ఆ ఉత్తరువులో నిర్దిష్ట పరుపబడు రేట్ల ప్రకారము మరియు ఉత్తరువు ప్రచురించబడిన సంవత్సరమునకు తరువాత సంవత్సరపు మొదటి దినమునకన్న ముందుగా కాకుండా అట్టి తేదీ నుండి వసూలు చేయవలసినదిగా ఆదేశించవచ్చును.

(2) (1)వ ఉపవిభాగము ననుసరించి ఒక ఉత్తరువు ప్రచురింపబడినప్పుడు ఇంటి పన్నును గురించి ఈ చట్టములో గల నిబంధనలు, అట్టి ఉత్తరువు ప్రచురింపబడిన తేదీన ఆ ఉత్తరువులో నిర్దిష్ట పరుపబడిన రేటు చొప్పున మరియు అట్టి తేదీ మొదలుకొని పన్ను వసూలుచేయుటకు పంచాయతీ ఒక తీర్మానము ద్వారా నిశ్చయించియుండిన ఎట్లో మరియు ఇంటి పన్ను ఏ రేటు చొప్పున మరియు ఏ తేదీ మొదలుకొని వసూలు చేయబడవలయునో నిశ్చయించుచు 69వ విభాగము ననుసరించి పంచాయతీచే చేయబడునట్టి ఏ తీర్మానము కూడ అమలులో రాకుండిన ఎట్లో అట్లే వర్తించవలెను.

(3) ఉపవిభాగము (1) ననుసరించి ఈయబడిన ఉత్తరువు ప్రకారము ఇంటి పన్ను చెల్లించవలసిన రేటును మార్చుటగాని అట్టి పన్నును రద్దుచేయుటగాని ప్రభుత్వము నుండి ముందుగా అనుమతి పొందిననే తప్ప పంచాయతీ చేయరాదు.

72. వృత్తి పన్ను :- (1) 69వ విభాగము యొక్క (1)వ ఉపవిభాగము (బి) ఖండములో తెలుపబడిన వృత్తి పన్ను, 2వ షెడ్యూలులోని నియమములకును, నిర్ణయించబడగల ఏదేని ఇతర నియమములకును లోబడి గ్రామములో ప్రతి సంవత్సరమునను—

(*i*) ఆ సంవత్సరము నందు మొత్తములో. దినముల కంటె తక్కువ కాకుండ అట్టి గ్రామములో వ్యాపారముచేయు ప్రతి కంపెనీకి విధింపబడవలెను ;

(*ii*) ప్రతి వ్యక్తి ఆ సంవత్సరములో—

(ఎ) వృత్తి, కళ, పని లేక వ్యాపారముచేయు లేక ఏదైన పబ్లికు లేదా ప్రయివేటు ఉద్యోగమును కలిగిన లేక చేసిన విధింపవచ్చును.

(2) (1)వ ఉపవిభాగము ననుసరించి ఒక ఉత్తరువు ప్రచురింపబడినప్పుడు ఇంటి పన్నును గురించి ఈ చట్టములో గల నిబంధనలు, అట్టి ఉత్తరువు ప్రచురింపబడిన తేదీన ఆ ఉత్తరువులో నిర్దిష్ట పరుపబడిన రేటు చొప్పున మరియు అట్టి తేదీ మొదలుకొని పన్ను వసూలుచేయుటకు పంచాయతీ ఒక తీర్మానము ద్వారా నిశ్చయించియుండిన ఎట్లో మరియు ఇంటి పన్ను ఏ రేటు చొప్పున మరియు ఏ తేదీ మొదలుకొని వసూలు చేయబడవలయునో నిశ్చయించుచు 69వ విభాగము ననుసరించి పంచాయతీచే చేయబడునట్టి ఏ తీర్మానము కూడ అమలులో రాకుండిన ఎట్లో అట్లే వర్తించవలెను.

(3) ఉపవిభాగము (1) ననుసరించి ఈయబడిన ఉత్తరువు ప్రకారము ఇంటి పన్ను చెల్లించవలసిన రేటును మార్చుటగాని అట్టి పన్నును రద్దుచేయుటగాని ప్రభుత్వము నుండి ముందుగా అనుమతి పొందిననే తప్ప పంచాయతీ చేయరాదు.

72. వృత్తి పన్ను :- (1) 69వ విభాగము యొక్క (1)వ ఉపవిభాగము (బి) ఖండములో తెలుపబడిన వృత్తి పన్ను, 2వ షెడ్యూలులోని నియమములకును, నిర్ణయించబడగల ఏదేని ఇతర నియమములకును లోబడి గ్రామములో ప్రతి సంవత్సరమునను—

(*i*) ఆ సంవత్సరము నందు మొత్తములో. దినముల కంటె తక్కువ కాకుండ అట్టి గ్రామములో వ్యాపారముచేయు ప్రతి కంపెనీకి విధింపబడవలెను ;

(*ii*) ప్రతి వ్యక్తి ఆ సంవత్సరములో—

(ఎ) వృత్తి, కళ, పని లేక వ్యాపారముచేయు లేక ఏదైన పబ్లికు లేదా ప్రయివేటు ఉద్యోగమును కలిగిన లేక చేసిన విధింపవచ్చును.

(i) మొత్తముమీద 60 దినములకంటె తక్కువ కాకుండ, అట్టి గ్రామము లోపల లేక.

(ii) మొత్తము మీద 60 దినముల కంటె తక్కువ కాకుండ అట్టి గ్రామములో కాపుర ముండి, అట్టి గ్రామము వెలుపల,

(iii) మొత్తములో 60 దినములకు తక్కువ కాకుండ అట్టి గ్రామములో కాపుర ముండి ఏదైన పింఛను లేక పెట్టుబడుల నుండి ఆదాయమును పొందు ప్రతి వ్యక్తికి విధింపబడ వలెను.

వివరణ:— ఈ విభాగము కొరకు "వ్యక్తి" అనగా వ్యాపార సంస్థ, సంఘము లేదా హిందూ సమిష్టి కుటుంబము కలియును.

(2) వృత్తి పన్ను పంచాయతీచే నిర్ణయింపబడ గల రేట్ల చొప్పున విధింపబడవలెను. అట్టి పన్ను 2వ షెడ్యూలులో నిర్దిష్టపరుప బడిన కనీసపు రేట్లకంటె తక్కువ కాకుండా గరిష్ఠ రేట్లకు మించ కుండ యుండ వలెను.

(3) పన్ను విధింపబడదగినవిగా ఉపవిభాగము (1) లో నిర్దే శింపబడిన ఆదాయ మార్గములన్నింటి నుండియు వచ్చిన మొత్తము ఆదాయమునుబట్టి ఒక వ్యక్తి ఏ తరగతి క్రిందికి వచ్చునో ఆ తరగతి క్రింద ఆ వ్యక్తికి పన్ను విధింపబడవలయును.

(4) ఒక కంపెని లేక వ్యక్తి ఈ చట్టము క్రింద విధింపబడిన వృత్తి పన్ను లేక స్థానికాధికార సంస్థలకు సంబంధించిన ఏదేని శాస నము క్రింద విధింపబడిన వృత్తి పన్ను లేదా వృత్తి పన్నును పోలిన పన్ను రాష్ట్రములోని ఏదేని పంచాయతికిగాని ఇతర స్థానికాధికార సంస్థకుగాని చెల్లించినట్లు రుజువుపరచిన యెడల, అట్టి కంపెని లేక వ్యక్తి వ్యాపారస్థలమును, వృత్తిని కళను లేక ఉద్యోగమును లేక

కాపుర స్థలమును మార్చిన కారణములనుబట్టి మాత్రమే. అట్టి మొత్తమునకును, ఈ చట్టము క్రింద లేక స్థానికాధికార సంస్థలకు సంబంధించిన ఏదేని ఇతర శాసనము క్రింద ఆ సంవత్సరమునకు ఆ కంపెనీ లేక వ్యక్తి చెల్లించవలసియుండెడు మొత్తమునకును, మధ్య గల వ్యత్యాసమునకు మించి, ఏదేని ఇతర పంచాయతి లేక ఇతర స్థానికాధికార సంస్థకు చెల్లించనవసరములేదు.

(5) ఈ విభాగములోని దేదియు ఒక స్థానిక అధికార సంస్థ యొక్క స్థానిక సరిహద్దుల లోపల కాపురముండి ఏదైన ఇతర స్థానిక అధికార సంస్థ లేక సంస్థలయొక్క సరిహద్దుల లోపల వృత్తిని, కళను లేక పనినిచేయు లేక వ్యాపారమును చేయు లేక ఏదైన ఉద్యోగము కలిగియుండు వ్యక్తి, ఆ స్థానిక అధికార సంస్థలలో అన్నిటికంటే ఎక్కువపన్ను విధించెడి సంస్థ విధించగల పన్ను మొత్తముకంటె అధికముగా వృత్తి పన్నును చెల్లించుటకు అతనిని బాధ్యునిగా చేయునట్టిదిగా భావింపబడకూడదు. అట్టి సందర్భములో, ప్రభుత్వమువారు, తాము యుక్తమని భావించువిధముగా, ఆ స్థానిక అధికార సంస్థల మధ్య ఆ పన్నును విభజించవలెను. ప్రభుత్వమువారి నిర్ణయము అంతిమమైనదిగా నుండవలెను;

అయితే సంబంధించిన స్థానిక అధికార సంస్థలలో ఒకటి కంటోన్మెంటు అధికార సంస్థ లేక పోర్టు అధికార సంస్థ అయి యున్నచో ప్రభుత్వ నిర్ణయము కేంద్ర ప్రభుత్వమువారి అంగీకారమునకు లోబడి యుండవలెను.

(6) ఒక ఫరము, అసోసియేషను లేక సమష్టి హిందూ కుటుంబముపై విధింపబడదగిన వృత్తి పన్ను సదరు ఫరము, అసోసియేషను లేక సమష్టి హిందూ కుటుంబము యొక్క ఏ వయోజన సభ్యునిపైనైనను విధింపబడవచ్చును.

(7) (ఏ) ఒక కంపెనీ లేక వ్యక్తి ఏ స్థానిక ప్రాంతములో నైనను వ్యాపారము చేయు నిమిత్తము ఆ కంపెనీ లేక వ్యక్తికి ప్రతినిధిగా వ్యవహరించుటకు ఒక ఉద్యోగిని లేక ఏజంటును నియమించునెడల, అట్టి కంపెని లేక వ్యక్తి ఆ స్థానిక ప్రాంతములో వ్యాపారము చేయుచున్నట్లు భావింపబడవలెను. మరియు అట్టి కంపెని లేక వ్యక్తి తరపున ఆ ఉద్యోగి లేక ఆ ఏజంటు బాధ్యత కలిగించునట్టి కరారులను చేయుటకు అధికారము కలిగియున్నను, లేకున్నను అట్టి కంపెనీ లేక వ్యక్తి యొక్క వ్యాపారము విషయంలో అట్టి ఉద్యోగి లేక ఏజంటు వృత్తి పన్నును చెల్లించుటకు బాధ్యుడుగా నుండవలెను.

(బి) ఒక కంపెనీ లేక వ్యక్తి మరియొక కంపెనీ లేక వ్యక్తి యొక్క ఏజంటుగా నున్నచో, మొదట చెప్పబడిన కంపెనీ లేక వ్యక్తి ప్రధాన కంపెనీ లేక వ్యక్తి యొక్క అదే ఆదాయముపై వేరుగా పన్ను చెల్లించుటకు బాధ్యత కలిగియుండకూడదు.

73. ఆస్తి బదిలీమీద సుంకము :—(1) ఆస్తి బదిలీమీద సుంకము ప్రభుత్వముచే—

(ఏ) ఒక పంచాయతీ అధికార క్షేత్రములోగల ప్రాంతములో నుండు స్థిరాస్తికి సంబంధించినదై ఈ క్రింద నిర్దేశింపబడిన ప్రతి దస్తావేజుమీద రాష్ట్రములో తత్కాలమున అమలులోనున్న 1899 భారత స్టాంపు చట్టముచే విధింపబడెడు సుంకముమీద సర్ చార్జి రూపములోను,

(బి) ఈ క్రింద అట్టి దస్తావేజుకు ఎదురుగా నిర్దేశింపబడిన మొత్తంమీద నూటికి అయిదు వంతులకు మించకుండ ప్రభుత్వము వారిచే నిర్ణయింపబడగల రేటు చొప్పునను విధించబడవలెను:

| దస్తావేజు యొక్క వివరము | సుంకము విధింపబడదగు మొత్తము |
|---|---|
| (1) స్థిరాస్తి విక్రయము | ... దస్తావేజులో తెలపబడిన ప్రకారము విక్రయ ప్రతిఫలము లేక విలువ. |
| (2) స్థిరాస్తి వినిమయము | ... దస్తావేజులో తెలపబడిన ప్రకారము అత్యధిక విలువగల ఆస్తి యొక్క విలువ. |
| (3) స్థిరాస్తి కానుక | ... దస్తావేజులో తెలపబడిన ప్రకారము ఆస్తి విలువ. |
| (4) స్థిరాస్తి స్వాధీనతనఖా | ... దస్తావేజులో తెలుపబడిన, ప్రకారము తనఖాపై తీసికొన్న మొత్తము. |
| (5) స్థిరాస్తి శాశ్వత కౌలు | ... దస్తావేజులో తెలుపబడిన ప్రకారము గుత్త యొక్క మొదటి పబది సంవత్సరముల విషయమున చెల్లింపబడు మొత్తములో లేక అప్పగించబడు అద్దెల విలువలో ఆరవ భాగమునకు సమానమైన మొత్తము. |

(2) పైన తెలుపబడిన సుంకమును ప్రవేశపెట్టిన మీదట,—

(ఏ) పంచాయతీ యొక్క అధికార క్షేత్రములోపలను వెలుపలను ఉండు ఆస్తి యొక్క వివరములను విడివిడిగా తెలుపవలె నని నిర్దిష్టముగా కోరునట్లుగా 1899, వ భారత స్టాంపు చట్టము (1899 లో 2 వ కేంద్ర చట్టము) యొక్క 27 వ విభాగమును అర్థము చేసికొనబడవలెను;

(బి) అదే చట్టము యొక్క 64 వ విభాగము, ప్రభుత్వ ముతో బాటు పంచాయతిని కూడ సంకేతించుచున్నట్లు అర్థము చేసి కొనబడవలెను.

(3) ఈ విభాగము క్రింద వసూలు చేయబడిన పన్ను గ్రామ పంచాయతి, పంచాయతి సమితి, మరియు జిల్లా పరిషత్తుల మధ్య నిర్ణయించబడిన ప్రకారము పంచబడవలెను.

(4) పన్ను వసూలును క్రమపరచుట కొరకును, దానిని పంచా యతికి పంచాయతి సమితి మరియు జిల్లా పరిషత్తుకు చెల్లించుట కొరకును, అట్టి వసూలు నిమిత్తము ప్రభుత్వమున కగు ఏదైన ఖర్చును అందునుండి మినహాయించుట కొరకును ఈ చట్టపు నిబంధ నలకు అసంగతముగా లేనట్టి నియమములను ప్రభుత్వమువారు చేయ వచ్చును.

(5) ప్రభుత్వము ఉత్తరువుద్వార కొన్ని వివరించబడిన నియ మములకు షరతులకులోనై ఏదైన దస్తావేజు లేదా కొన్నివిధముల దస్తావేజులను ఈ విభాగము క్రింద సుంకము లేకుండ మినహాయించ వచ్చును.

74. బండ్ల పన్ను:—69 వ విభాగము యొక్క (3) వ ఉప విభాగములో (*ii*) వ ఖండములో పేర్కొనబడిన బండ్ల పన్ను. 2 వ షెడ్యూలులోని నియమములకును మినహాయింపులకును నిర్బంధ

ములకును సంబంధించిన నియమములను కలుపుకొని నిర్ణయింపబడ గల నియమములకును లోబడి, గ్రామములోపల ఉంచుకొనబడు లేక ఉపయోగింపబడు సమస్తములైన బండ్ల మీద నిర్ణయింపబడిన కనీసపు రేట్లను తక్కువ కాకుండను గరిష్ట రేట్లకు మించకుండను పంచాయతీచే నిశ్చయింపబడు రేట్ల చొప్పున ప్రతి సంవత్సరము విధించబడవలెను.

వివరణ:—ఈ విభాగములో "బండి" అనగా రోడ్డు మీద లేక ఇనుప కమ్మీలమీద ఉపయోగమునకు తగినట్టి వాహనము అని అర్థము. దీనిలో ఏ విధమైన క్యారేజి, బండి, వాగను, బరువులను త్రోసే ఒంటి చక్రపు చేతి బండ్లు, ట్రక్కు, బైసికలు, ట్రైసికలు, రిక్షా యైన చేరును. కాని 1939, మోటారు బండ్ల చట్టములో నిర్వచింపబడిన మోటారుబండి చేరదు.

75. పంచాయతీచే విధింపబడదగు ప్రత్యేక పన్నులు:— నిర్ణయింపబడిన నియమములకు లోబడి ఒక గ్రామ పంచాయతీ ఇండ్లపైన ఒక ప్రత్యేక పన్నును నిర్ణయింపబడిన రేటు ప్రకారముగా నీటి అభివృద్ధికి లేదా డ్రైనేజ్ పనులకు, లేదా పబ్లిక్ స్థలములకు, మార్గములకు వెలుతురు ఏర్పాటు, రక్షణ, బాగు విస్తరణ మొదలగు నిర్మాణము పనుల కొరకు విధించవచ్చును.

76. ఫ్యాక్టరీ యజమాని లేదా బిల్డింగుల సమూహముగలవారు చెల్లించవలసిన పన్ను:—నిర్ణయింపబడిన నియమములకు లోబడి ఒక గ్రామ పంచాయతి, ఒక ఫ్యాక్టరీ యజమాని లేక బిల్డింగుల సమూహముగలవారు దరఖాస్తు పెట్టుకొన్న, ఈ చట్టము ననుసరించి చెల్లించవలసిన పన్నులన్నింటిని లేదా కొన్నింటిని, అతను మరియు గ్రామపంచాయతీ అంగీకరించిన వాటిని కలిపి వసూలుచేయవచ్చును.

ఎక్కడైతే అంగీకారము కుదురదో నిర్ణయించిన పద్ధతి ప్రకారము ప్రభుత్వము నిర్ణయము కొరకు పంపవచ్చును. గ్రామ పంచాయతీకి, ఫ్యాక్టరీ లేదా బిల్డింగుల సమూహముగలవారికి వారి విషయములు చెప్పుకొను అవకాశము కల్పించి, ప్రభుత్వము ఫ్యాక్టరీ యజమాని లేదా బిల్డింగుల సమూహముగలవారు ఎంత మొత్తము డబ్బు కట్ట వలెనో నిర్ణయించును. ఈ విషయంలో ప్రభుత్వ నిర్ణయమే అంతి మముగా యుండును.

77. రాబట్టుకొనుటకు వీలులేని మొత్తములను కొట్టివేయుటకు **అధికారము:—** నిర్ణయింపబడిన నిర్బంధ నియంత్రణకు లోబడి, ఒక పంచాయతీ ఒక కరారును బట్టి యైనను లేదా ఇతర విధముగా నైనను దానికి రావలసియుండు ఏదైన పన్నును రుసుమును లేదా దానికి చెల్లింపబడవలసియుండు ఏ పైకము నైనను అట్టి పన్ను రుసుము, మొత్తముల పైకము రాబట్టుకొనుటకు వీలులేదని అభి ప్రాయపడిన ఎడల, వసూలు చేయుటకు వీలుగానివిగా కొట్టివేయ వచ్చును;

అయితే, పంచాయతీకి రావలసిన ఎట్టి పన్నునైనను రుసుము నైనను లేదా ఇతర మొత్తమునైనను వసూలు చేయుటకు కలెక్టరు లేదా ఆయన తాబేదారులు ఎవరైన బాధ్యులై యుండు సందర్భ ములో అట్టి పన్ను రుసుము లేదా మొత్తము లేదా దానికి చెల్లింప బడవలసి యుండు ఏ పైకముగాని అది రాబట్టుకొనబడ జాలదను కారణమునుబట్టి కొట్టివేయుటకు గల అధికారము రెవిన్యూ బోర్డు వారిచే లేదా వారి నియంత్రణకు లోబడి కలెక్టరుచే అధికారమిచ్చు ఏ ఉద్యోగిచే నైన ఉపయోగింప బడవలెను.

78. పంచాయతికి చెల్లింపవలసిన పన్నులను. రుసుములను **వసూలు చేయవలసినదిగా ఆ గ్రామాధికారిని కోరుటకు అధికారము :—**

నిర్ణయింపబడగల నియమములకు లోబడి, కార్య నిర్వాహకాధికారి, గ్రామము మీద లేక అందలి ఏ భాగము మీదనైన అధికారము గల గ్రామాధికారిని లేక గ్రామ మునసబును, పంచాయతీకి బాకీగా రావలసియుండిన ఎట్టి పన్నునుగాని లేక రుసుమునుగాని, వసూలు చేయుమని కోరుటకు అధికారము కలిగి యుండవలెను. అయితే, అట్లు వసూలు చేయబడిన మొత్తము పైకములో నూటికి $6\frac{1}{4}$ వంతులకు మించకుండ కలెక్టరు సామాన్య లేక ప్రత్యేక ఉత్తరువు మూలముగా నిర్ణయించగల ప్రతిఫలము గ్రామాధికారికి లేక గ్రామ మునసబుకు చెల్లించబడవలెను.

వివరణ :— తెలంగాణా ప్రాంతమునకు సంబంధించి, ఈ విభాగములో "గ్రామాధికారి" అనగా "మాలీ పటేలు" అని అర్థము చేసికొనవలెను.

79. పంచాయతి నిధి :—(1) పంచాయతికి వచ్చు యావత్తు పైకములును "పంచాయతి నిధి" అని చెప్పబడు ఒక నిధిగా ఏర్పాటు చేయబడవలెను. వాటిని ఈ చట్టము యొక్క లేక ఇతర శాసనముల యొక్క నిబంధనల ప్రకారము వినియోగించవలెను, లేక పరిష్కారము చేయవలెను;

అయితే, నిర్ణయింపబడగల నియమములకు లోబడి ఈ చట్టము ననుసరించి విధించబడిన ఎట్టి పన్ను మూలముననైనను వచ్చిన పైకము, నిర్దిష్టమైన ఏదేని ప్రజా కార్యమునకై ద్రవ్యమును సమకూర్చుటకై ప్రత్యేకింపబడిన ఒక ప్రత్యేక నిధికి జమకట్ట బడవలెను. అట్టి ప్రత్యేక నిధియొక్క ఆదాయ వ్యయములను తెలుపుచు ఒక ప్రత్యేక లెక్క వ్రాసి యుంచబడవలెను.

(2) ఉప విభాగము (1) యొక్క నిబంధనలకు లోబడి, పంచాయతి నిధికి జమకట్టవలసిన ఆదాయములలో ఈ క్రిందివి చేరవలెను.

(*i*) ఈ చట్టము ననుసరించి విధింపబడిన ఇంటి పన్ను, వృత్తి పన్ను మరియు ఏదైన ఇతర పన్ను లేక సెస్సు లేక రుసుము;

(*ii*) విభాగము 69, ఉపవిభాగము 4 క్రింద వసూలు చేసిన సుంకము;

(*iii*) 73 విభాగము క్రింద, ఆస్తి బదిలీలమీద విధింపబడి పంచాయతీకి చెల్లించబడిన సుంకము మూలమున వచ్చిన మొత్తము;

(*iv*) ఆంధ్ర ప్రాంతములో, 1920, ఆంధ్ర ప్రదేశ (ఆంధ్ర ప్రాంత) జిల్లా బోర్డుల చట్టము (1920లో 14వ చట్టము) 78 వ విభాగము క్రింద విధించబడిన భూమి సెస్సులో ఆ చట్టము యొక్క 92 వ విభాగము క్రింద పంచాయతీకి కేటాయించబడగల వాటా; తెలంగాణా ప్రాంతములో, 1955, ఆంధ్ర ప్రదేశ (తెలంగాణా ప్రాంత) జిల్లా బోర్డుల చట్టము (1956 లో 1వ చట్టము) 135 వ విభాగము క్రింద విధించబడిన స్థానిక సెస్సులో ఆ చట్టము యొక్క 136 వ విభాగము క్రింద గ్రామ పంచాయతికి కేటాయించబడగల వాటా.

(*v*) 1933 ఆంధ్ర ప్రదేశ్ (ఆంధ్ర ప్రాంత) వాణిజ్య పంటల మార్కెట్ల చట్టము (1933 లో 20 వ చట్టము) యొక్క 11 వ విభాగము (3) వ ఉప విభాగము ననుసరించి లేక తత్కాలమున అమలులో నున్నట్టి ఆ విధమైన ఏదేని ఇతర శాసనము ననుసరించి ఒక మార్కెట్టు కమిటీచే పంచాయతీకి చెల్లింపబడిన ఏదేని మొత్తము;

(*vi*) 1939, (ఆంధ్ర ప్రాంత) ప్రజా ఆరోగ్య చట్టము (1939 లో 3వ చట్టము) యొక్క 117, 118 విభాగముల ననుసరించి లేదా రాష్ట్రములో తత్కాలమున అమలులో నున్నట్టి దానిని పోలిన ఏదేని ఇతర శాసనము యొక్క తద్విధమైన నిబంధనలననుసరించి గ్రామములో విధింపబడిన పన్నులు, సుంకములు;

(*vii*) 1939 ఆంధ్ర ప్రదేశ్ వినోదపు పన్ను చట్టము (1939 లో 10 వ చట్టము) 13 వ విభాగము క్రింద వసూలు చేసి, ప్రభుత్వము గ్రామ పంచాయతీకి ఇచ్చినటువంటి డబ్బు.

(*viii*) పంచాయతీ సమితి మార్కెట్లుగా వర్గీకరణ చేయబడ్డ మార్కెట్లనుండి వచ్చిన డబ్బులో లేదా 117వ విభాగము క్రింద మార్కెట్లనుండి వచ్చిన డబ్బులో విభాగము చేయబడి పంచాయతీ సమితి, గ్రామ పంచాయతీకి ఇచ్చిన డబ్బు, 66వ విభాగము గా వివరించ బడి జిల్లా పరిషత్తు లేదా ఏదైన సంయుక్త కమిటీలు రేవుల నిర్వ హణ వల్ల వచ్చిన రాబడిలోనుండి గ్రామ పంచాయతీకి రావలసిన వాటా ధనము;

(*ix*) గ్రామములోని గ్రామ స్థలములను, రోడ్లను, అదే విధ మైన ఇతర పబ్లికు స్థలములను లేదా వాటి భాగములను తాత్కా లికముగా ఆక్రమించినందుకు రుసుములు ;

(*x*) ఈ చట్టములోని ఏ నిబంధననైన లేక ఈ చట్టము క్రింద చేయబడిన నియమము లేక ఏ ఉత్తరువునైన అనుసరించి పంచాయ తీచే విధింపబడిన రుసుము ;

(*xi*) పంచాయతీ యొక్క నిర్వహణక్రింద నున్న ధర్మాదా యముల నుండి ట్రస్టుల నుండి వచ్చిన ఆదాయము ;

(*vi*) 1939, (ఆంధ్ర ప్రాంత) ప్రజా ఆరోగ్య చట్టము (1939 లో 3వ చట్టము) యొక్క 117, 118 విభాగముల ననుసరించి లేదా రాష్ట్రములో తత్కాలమున అమలులో నున్నట్టి దానిని పోలిన ఏదేని ఇతర శాసనము యొక్క తద్విధమైన నిబంధనలననుసరించి గ్రామములో విధింపబడిన పన్నులు, సుంకములు;

(*vii*) 1939 ఆంధ్ర ప్రదేశ్ వినోదపు పన్ను చట్టము (1939 లో 10 వ చట్టము) 13 వ విభాగము క్రింద వసూలు చేసి, ప్రభుత్వము గ్రామ పంచాయతీకి ఇచ్చినటువంటి డబ్బు.

(*viii*) పంచాయతీ సమితి మార్కెట్లుగా వర్గీకరణ చేయబడ్డ మార్కెట్లనుండి వచ్చిన డబ్బులో లేదా 117వ విభాగము క్రింద మార్కెట్లనుండి వచ్చిన డబ్బులో విభాగము చేయబడి పంచాయతీ సమితి, గ్రామ పంచాయతీకి ఇచ్చిన డబ్బు, 66వ విభాగము గా వివరించ బడి జిల్లా పరిషత్తు లేదా ఏదైన సంయుక్త కమిటీలు రేవుల నిర్వహణ వల్ల వచ్చిన రాబడిలోనుండి గ్రాను పంచాయతీకి రావలసిన వాటా ధనము;

(*ix*) గ్రామములోని గ్రామ స్థలములను, రోడ్లను, అదే విధమైన ఇతర పబ్లికు స్థలములను లేదా వాటి భాగములను తాత్కాలికముగా ఆక్రమించినందుకు రుసుములు ;

(*x*) ఈ చట్టములోని ఏ నిబంధననైన లేక ఈ చట్టము క్రింద చేయబడిన నియమము లేక ఏ ఉత్తరువునైన అనుసరించి పంచాయతీచే విధింపబడిన రుసుము ;

(*xi*) పంచాయతీ యొక్క నిర్వహణక్రింద నున్న ధర్మాదాయముల నుండి ట్రస్టుల నుండి వచ్చిన ఆదాయము ;

(*xii*) ఈ చట్టము ప్రారంభమైన తరువాత ప్రభుత్వము వారిచే తీసికొనబడిన సర్వీసు ఇనాముల మీద నికరపు పన్ను ;

(*xiii*) కలుపు మొక్కలు, రెల్లులతో సహా పంచాయతీ అధీనములో నున్న గ్రామ చేపల కేంద్రముల నుండి వచ్చిన ఆదాయము ;

(*xiv*) పంచాయతీ నిర్వహణక్రింద నున్న రేవుల నుండి ఆదాయము ;

(*xv*) బేవారసు డిపాజిట్లు, ఇతర కోలుపాట్లు

(*xvi*) గ్రామములో ఖనిజములు, చిన్నతరహా ఖనిజములు మినహా వస్తువులను గ్రామములో త్రవ్వుకొనుటకు అనుమతింపబడిన వ్యక్తులవద్ద ప్రతి సంవత్సరము ప్రభుత్వము వారిచే వసూలు చేయబడు సీనియారేజి రుసుమునకు సమానమైన మొత్తము ;

(*xvii*) గ్రామ పంచాయతి అధీనములోయున్న పోరంబోకు భూముల, లేదా గ్రామ పంచాయతీ నిబంధనలలో వాటి ఉపయోగ మువల్ల వచ్చిన మొత్తము రాబడి మరియు ఏమైన జరిమానాలు మరియు జరిమానా పన్నులు; ఏవైతే ప్రస్తుతము అమలులోయున్న చట్టము వ్యతిరేకంగా అనుమతి లేకుండ అధీనములో పెట్టుకొన్న వారిదగ్గర వసూలుచేసిన డబ్బు.

(*xviii*) పోరంబోకుల అనుభవము పంచాయతీకి సంక్రమింప చేయబడనప్పటికి ఆ పోరంబోకులలో ఉండు చెట్లనుండి వచ్చిన ఆదాయము అంతయు ;

(*xix*) పంచాయతీచే పొందబడిన ప్రభుత్వ ఆస్తియొక్క కౌలునుండి వచ్చిన ఆదాయము ;

(*xx*) ఈ చట్టముక్రింద లేక ఈ చట్టము ననుసరించి చేయబడిన ఏదైన నియమము లే. ఉప–నియమముక్రింద లేక ఇందు నిమిత్తము నిర్ణయింప బడిన ఏదేని ఇతర శాసనముయొక్క నిబంధన క్రింద, గ్రామములో చేయబడిన నేరముల విషయములో మేజిస్ట్రేటు చేతను న్యాయ పంచాయతీ చేతను విధింపబడిన జరిమానాల మూలమున ప్రతి సంవత్సరము ప్రభుత్వము వారికి వచ్చు మొత్తము ఆదాయములో పదింట తొమ్మిది వంతులకు సమానమైన మొత్తము ;

(*xxi*) ప్రభుత్వము వారు, జిల్లా పరిషత్తు మరియు పంచాయతీ సమితి ఇచ్చిన గ్రాంటులు ;

(*xxii*) పంచాయతీ నిధిలోనుండి తీసిన మొత్తమును పెట్టుబడి పెట్టుటవలన వచ్చిన ఆదాయము ;

(*xxiii*) ఈ చట్టములో నిర్దిష్ట పరుపబడిన పంచాయతీ యొక్క ఆదాయ మార్గముల నుండి వచ్చిన ఇతర ఆదాయము లన్నియు ;

(*xxiv*) పైన తెలుపబడిన మొత్తము పైకములు కాక పంచాయతీ నిధినుండి పోషింపబడు లేదా ధన సహాయము చేయబడు లేదా పంచాయతీచే నిర్వహింపబడు ఎట్టి సంస్థ లేక సర్వీసులనుండి వైయెన రాశుల లేదా వాటి సహాయార్థము లేదా వాటిపై ఖర్చు పెట్టుటకుగాను అందిన ఇతర పైకపు మొత్తములు ;

(3) పంచాయతీకి వచ్చిన సమస్తములైన పైకములను ఉంచుటయు, పంచాయతీ నిధిలో నుండి చెల్లింపులు చేయుటయు, 2వ షెడ్యూలులోని 2వ భాగమునందలి నియమముల ప్రకారముగను నిర్ణయింపబడిన ఇతర నియమముల ప్రకారము గను జరుగవలెను.

80, పంచాయతీ నిధినుండి వ్యయము:—(1) పంచాయతీ నిధి వినియోగింపబడగల కార్యములలో ఈ చట్టము లేదా దీనిని అనుసరించి చేయబడిన నియమముల లేదా ఏ ఇతర శాసనములు లేక నియమములచే గాని విధిగా లేక నివేదనానుసారముగా చేయవలసినట్లు స్పష్టముగా ప్రకటింపబడినట్లు యావత్తు కార్యములును చేరి యుండును. సదరు నిధి, దానికి ప్రభుత్వము వారు నిర్ణయించ గల లేక జారీచేయగల నియమములకును ప్రత్యేక ఉత్తరువులకును లోబడి గ్రామములోపలి కార్యములకై వినియోగింప బడవలయును. పైన చెప్పిన వాటికి లోబడి, ఆ ఖర్చుకు ఈ చట్టముచే అనుమతింపబడిన యెడల లేదా కమిషనరుచే ప్రత్యేకముగా మంజూరు చేయబడిన యెడల గ్రామము వెలుపలి కార్యములకు కూడ వినియోగింపబడవలెను.

(2) (ఏ) ఈ క్రింది వాటిని చెల్లించుటకు ఏర్పాటు చేయుట ప్రతి పంచాయతీ విధియై యుండవలెను :—

(i) దానిచే చేయబడిన ఎట్టి ఋణముల క్రింద నైనను బాకీ పడిన ఏవేని మొత్తములు ;

(ii) పంచాయతీకి ఎన్నికలను జరుపుటకై నట్టిన్ని, ఎన్నిక సిబ్బందిని నిర్వహించుటకై నట్టిన్ని ఖర్చుతో సహా ఎన్నిక ఖర్చులు ;

అయితే ఓటర్ల పట్టిని తయారు చేయుటకును, దానిని సవరించుటకును అయిన ఖర్చును అట్లు తయారు చేయుటకై, సవరించుటకై నియమించ బడిన ఎన్నికల సిబ్బంది నిర్వహణ ఖర్చును ప్రభుత్వము వారు భరించ వలెను.

వివరణ:— ఎన్నిక సిబ్బందిని నిర్వహించు ఖర్చుతో ఎన్నికలను జరుపుటకు నియమింపబడిన ప్రభుత్వము వారి లేదా ఏ ఇతర అధికార సంస్థ యొక్కయైన ఉద్యోగులకు నౌకరులకు, జీతము, పించను సెలవు బత్తెములు చెల్లింపవలసి యున్నచో అవికూడ చేరియుండును.

(*iii*) దాని ఉద్యోగుల యొక్కయు, నౌకరుల యొక్కయు జీతములు, అలవెన్సులు పించనులు, పించనుకైన వంతు పైకములు, ప్రావిడెంటు ఫండుకైన వంతు పైకములు;

(*ii*) కోర్టువారి ఎట్టి డిక్రి లేక ఉత్తరువు ననుసరించియైన చెల్లింపవలసిన పైకములు

(*v*) పంచాయతీ సమితి ఏవైనా విరాళాలు వసూలుచేసినచో, అవి;

(*vi*) ఈ చట్టముచే లేక యితర శాసనముచే గాని అవశ్యములైన ఏ ఇతర ఖర్చులుగాని,

(బి) ప్రభుత్వమువారు ప్రతి సంవత్సరము (ఏ) ఖండము యొక్క (*ii*) వ ఉప ఖండములో చెప్పబడిన ఎన్నిక ఖర్చుల మొత్తమును నిర్ణయించవలెను. వారి నిర్ణయము అంతిమమైనదిగాను పంచాయతీని నిర్బంధించునదిగాను ఉండవలెను. అట్టి మొత్తమును 84 వ విభాగములో తెలుపబడిన ఋణములు అడ్వాన్సులతో సహా, అనుమతింపబడిన ఋణములను తీర్చుటకైన ఖర్చులున్ను, 47 వ విభాగములోను, 49 వ విభాగము (2) వ ఉప-విభాగములోను నిర్దేశింప బడిన ఖర్చులున్ను తప్ప యావత్తు యితర ఖర్చులకంటె ముందుగా చెల్లించవలెను.

(శి) పంచాయతీ, ప్రభుత్వమువారి అనుమతితో, భారత దేశ రక్షణకు సంబంధించిన ఏ నిధికైన చందా నియ్యవచ్చును.

(4) కమిషనరు యొక్క అనుమతితో పంచాయతీ—

(*i*) గ్రామములోని ఏదేని పబ్లిక్ ప్రదర్శనమునకు, ఉత్సవమునకు లేదా వినోదమునకైన ఖర్చుకుగాను ద్రవ్య సహాయము చేయవచ్చును:

(*ii*) ఏదేని ధర్మ నిధికి లేదా బీద జనుల కష్టమును నివారణ చేయు లేక వ్యాధికి లేక అశక్తతకు చికిత్స చేయు లేదా వ్యాధిగ్రస్థులైన లేక అశక్తులైన వారిని చేర్చుకొను లేదా వ్యాధి కారణములను పరిశోధించు ఎట్టి సంస్థయొక్క నిధులకైనను సహాయ ద్రవ్యమును ఇయ్యవచ్చును.

(*iii*) సాంఘికాభివృద్ధికి లేదా పంచాయతీరాజ్ ఉద్దేశములను ఆచరణలో పెట్టుటకు ఏర్పాటుచేయబడిన ఏ సంస్థకైనా ద్రవ్యము ఇవ్వవచ్చును.

(*iv*) ఏ ఇతర సాధారణ ఖర్చులనైనా భరించవచ్చును;

81. బడ్జెటుతయారీ, ఆమోదము:—(1) కార్యనిర్వాహకాధికారి, ప్రతి సంవత్సరము నవంబరు 15 వ తేదీ దాటకుండ, రాబోవు సంవత్సరములో బహుశః రాగల ఆదాయమును; కాగల ఖర్చులను కనబరచుచు ఒక బడ్జెటు తయారు చేసి పంచాయతీ ఎదుట పెట్టవలెను. పంచాయతీ, దాని ఎదుట బడ్జెటు పెట్టబడిన తేదీనుండి ఒక నెలలోపల, దానికి ఉచితమని తోచిన సవరణలు ఏవైన ఉన్న ఎడల అట్టి సవరణలతో బడ్జెటును మంజూరు చేయవలెను.

(2) అట్లు మంజూరు చేయబడిన బడ్జెటును, కార్యనిర్వాహకాధికారి నిర్ణయింపబడగల తేదీన లేదా అంతకు పూర్వము పంచాయతీ సమితికి పంపవలెను. పంచాయతీ సమితి ఆ బడ్జెటును ఎట్టి

మార్పు చేయకుండ గాని తాము యుక్తమని భావించు మార్పులతోగాని ఆమోదించి అది అందిన తేదీనుండి ఒక నెలలోపల పంచాయతికి వాపసు పంపవలెను.

అయితే, పంచాయతి సమితి పైన తెలిపిన నెల గడువు లోపల బడ్జెటును పంచాయతికి తిరిగి పంపనిఎడల, ఆ బడ్జెటు పంచాయతీ సమితికి పంపబడిన రూపములో దానిచే ఆమోదించబడినట్టు భావించబడవలెను.

(3) ఒక పంచాయతీ యొక్క ఆదాయ విషయములో గాని, అది చేయపూనుకొను వివిధ పనులమీద ఖర్చు చేయవలసిన మొత్తములను పంపకము చేయు విషయములో గాని బడ్జెటులో చూపియుండు అంకెలను మార్చుట అవసరమని సంవత్సర మధ్యమున అది తెలుసుకొనిన ఎడల (1) వ, (2)వ ఉప-విభాగములలో నిబంధింపబడిన విధముగా ఒక సప్లిమెంటలు బడ్జెటుగాని సవరింప బడిన బడ్జెటు గాని తయారు చేయబడవచ్చును. మంజూరు చేయబడవచ్చును, పంపబడవచ్చును, మరియు సవరింపబడవచ్చును.

(4) ఒక వేళ గ్రామ పంచాయతీ, పంచాయతీ సమితి కొన్ని మార్పులు చేస్తూ ఆమోదించిన బడ్జెటుతో సంతృప్తి చెందని ఎడల, పంచాయతీ సమితి పంపిన బడ్జెటు ముట్టిన 15 రోజులలో గ్రామ పంచాయతీ, జిల్లా పరిషత్తు యొక్క ఆర్థిక మరియు పన్నుల స్థాయి సంఘముయొక్క నిర్ణయముకొరకు పంపవచ్చును. స్థాయీ సంఘము పంపిన నెల రోజులలో నిర్ణయముచేసి పంపవలెను. ఈ విషయములో స్థాయీ సంఘ నిర్ణయము తుదిదై యుండును.

82. ఆడిటర్ల నియామకము:—(1) పంచాయతి నిధియొక్క ఆదాయ వ్యయముల లెక్కలను తనిఖీ చేయుటకు ఆడిటర్లను ప్రభు

త్వమువారు నియమించవలెను. అట్టి ఆడిటర్లు ఇండియన్ పీనలు కోడు యొక్క 21 విభాగము యొక్క తాత్పర్యము ప్రకారము "సార్వజనికోద్యోగులుగా" భావింపబడవలెను.

(2) అట్టి ఆడిటర్ల జీతము, బత్తెము మరియు పంచాయతీ లెక్కలను ఆడిటుచేయు సందర్భములో అయిన ఇతర ఖర్చులైనను పంచాయతీ నిధినుండి. ప్రభుత్వము వసూలుచేయకూడదు.

83. ఇతరస్థానిక సంస్థలచే చేయబడిన ఖర్చుకు వంతుపైకము:- ఈ చట్టముచే లేదా ఈ చట్టము ననుసరించి అధికార మీయబడిన యేదేని కార్యము నిమిత్తము ప్రభుత్వము వారిచే లేదా ఇతర పంచాయతీచే లేదా పంచాయతీ సమితిచే లేదా జిల్లా పరిషత్తుచే లేదా రాష్ట్రములోని యే ఇతర స్థానిక అధికార సంస్థచే గాని చేయబడిన ఖర్చు, గ్రామములో నివసించు వారికి లాభము కలుగ జేయునదిగా నున్నయెడల, ఆ పంచాయతీ కమీషనరు యొక్క అను మతితో దానికైన ఖర్చులో కొంత భాగము చెల్లించవచ్చును, కమి షనరు అట్లు ఆదేశించినయెడల అట్టివంతు పైకమును చెల్లించవలెను.

84. ప్రభుత్వము వారిచే ఈయబడిన అప్పుల, అడ్వాన్సుల వసూళ్ళు:—(1) 1913. స్థానిక అధికార సంస్థల ఋణముల చట్టము (1914 లోని 9 వ కేంద్ర చట్టము) లో లేక ప్రస్తుతము అమలు నందున్న ఆ విధమైన ఏదేని ఇతర శాసనములో ఏమి యున్నను ప్రభుత్వమువారు:—

(ఏ) ఈ చట్టముక్రింద పంచాయతీ నిధులను వినియోగించు ఏ కార్యము నిమిత్తమైనను దానికి ప్రభుత్వము ఇచ్చిన ఏదైనఋణ ములు లేక అడ్వాన్సులు, అధికార మీయబడిన ఋణములను తీర్చు చార్జీలు తప్ప, అట్టి నిధియొక్క ఏదైన ఇతర చార్జీలకంటే ముందుగా

వారికి చెల్లించునట్లు, పంచాయతీ నిధిని స్వాధీనమునందు కలిగిన ఏ వ్యక్తినైనను ఉత్తరువు ద్వారా ఆదేశించవచ్చును.

(బి) అట్టి ఏదైన ఋణమును లేక అడ్వాన్సును దావా వేయుట ద్వారా రాబట్టుకొనవచ్చును.

(2) (1) వ ఉపవిభాగము యొక్క (ఏ) ఖండములో తెలుపబడిన ఉత్తరువు ఏ వ్యక్తికి పంపబడినదో ఆ వ్యక్తి అట్టి ఉత్తరువును పాటించుటకు బద్ధుడై యుండవలెను.

# 5 వ అధ్యాయము

## ప్రజా భద్రత, సౌకర్యము, ఆరోగ్యము

85. నీటి సరఫరా నిర్మాణములు పంచాయతీ అధీనములో నుండుట:—(1) ఈ చట్టము యొక్క ప్రారంభ సమయమున ఉన్నవైనను లేదా తరువాత వేయబడినవైనను, లేదా నిర్మింపబడినవైనను మరియు పంచాయతి ఖర్చుతోనైనసరే ఇతర విధముగానైన సరే ఏర్పాటు చేయబడిన, వేయబడిన లేదా నిర్మింపబడిన, (ఉపయోగించుటకు అనాది హక్కును కలుగజేయునంత మేరకు జన సామాన్యముచే ఉపయోగింపబడు వాటిని కలుపుకొని,) యావత్తు పబ్లికు జలమార్గములును ఊటలును, రిజర్వాయరులును, చెరువులును, తొట్లును, చెలమలును, బావులును స్టాండు పైపులును, ఇతర నీటి సరఫరా నిర్మాణములును మరియు ప్రయివేటు ఆస్తి కాక వాటికి సంబంధించి ఉండు ఏదేని భూమికూడ పంచాయతి వశమందుండి దాని నియంత్రణకు లోబడి యుండవలెను:

అయితే ఈ ఉప-విభాగములోని దేదియును ఒక నీటి పారుదల నిర్మాణముగానుండు లేదా దానికి సంబంధించియుండు ఏ నిర్మాణమునకు గాని లేదా అట్టి యేనిర్మాణమునకైన సంబంధించిన ప్రక్కన నుండు ఎట్టి భూమికి గాని వర్తించ కూడదు.

(2) ఉప విభాగము (1) ననుసరించి గ్రామ పంచాయతీకి సంక్రమించిన నీటి సరఫరా నిర్మాణములలో చేపలపై అధికారము, నిర్ణయించబడిన సుంకము చెల్లించబడిన తరువాత విత్తనములు పెంచు భూభాగములకు నీరు సరఫరాచేయు అధికారము, వాటి

ననుసరించి యున్న భూములలో చెట్టు పెట్టుటకు, వాటి నుండి వచ్చిన ఫలితములను పొందుటకు అధికారము కలిగియుండును.

(3) ప్రభుత్వము వారు, ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రకటన ద్వారా, అట్టి నియంత్రణను నిర్వచింపవచ్చును లేదా మిత పరుపవచ్చును. లేదా పంచాయతీతో సంప్రదించి దాని ఆక్షేపణలు ఏవైన నున్నఎడల వాటిని బాగుగా గమనించిన మీదట ఏదైన పబ్లికు నీటి సరఫరా వనరు యొక్కయు దానికి ప్రక్కన నుండు నట్టిన్ని దానికి సంబంధించినట్టిన్ని పబ్లికు భూమి యొక్కయు నిర్వహణను స్వీకరింపవచ్చును.

86. పబ్లికు చెరువులు మున్నగువాటిని కొన్ని కార్యములకొరకు ప్రత్యేకించుట:—(1) (ఎ) పంచాయతీ జనసామాన్యము యొక్క ఆరోగ్య రక్షణ కొరకు ఏదైన పబ్లికు చెలమ, చెరువు లేక బావి లేక ఏదేని పబ్లికు జల మార్గము లేక అందలి భాగములో జంతువులను కడుగుట లేక గుడ్డలను ఉతుకుట లేక ఇతర వస్తువులను కడుగుట లేక చేపలను పట్టుటను క్రమపరుచ వచ్చును లేక నిషేధించ వచ్చును. మరియు అట్టి ఏ స్థలమునైన నీరు త్రాగుటకు లేక స్నానము చేయుటకు లేక జంతువులను కడుగుటకు లేక గుడ్డలను ఉతుకుటకు లేక నిర్దిష్టమైన ఏ ఇతర కార్యమునకైనను ప్రత్యేకించ వచ్చును.

(బి) (ఏ) ఖండముచే లభ్యమైన అధికారములను పంచాయతీ, ఏదైన ప్రయివేటు చెలమ, చెరువు, బావి లేక జలమార్గము సందర్భములో అట్టి స్థలము యొక్క ఖామందు అంగీకారముతో వినియోగించ వచ్చును.

(సి) పంచాయతీ, జనసామాన్యము యొక్క ఆరోగ్య రక్షణ నిమిత్తము ప్రజలు మంచి నీటిని తెచ్చుకొనుటకు హక్కు కలిగి

యున్న ఏదైన ప్రయివేటుచెలమ, బావి లేక జలమార్గములో జంతువులను కడుగుటను, గుడ్డలు ఉతుకుటను ఇతర వస్తువులను శుభ్రము చేయుటను క్రమపరచవచ్చును లేక నిషేధించవచ్చును.

(2) కార్యనిర్వాహక అధికారి, గ్రామములో ప్రజలకు అందుబాటులో నున్న ఏదైన బావి, చెరువు, చెలమ, లేక ఇతర నీటి సరఫరా వనరు నీరు అపాయకరమైన వ్యాధిని బహుళ కలిగించునని లేక వ్యాపింపచేయునని తెలుపుచు ప్రభుత్వము యొక్క, పంచాయతీ యొక్క లేక పంచాయతీ సమితియొక్క లేక జిల్లా పరిషత్తు యొక్క ఉద్యోగములో నున్న ఏ ఆరోగ్య లేక వైద్య అధికారి నుండి అయిన ఒక సర్టిఫికేటు అందిన మీదట, పబ్లికు నోటీసు ద్వారా, అట్టి నీటిని ఉపయోగించుటను నిషేధించవలెను. అట్టి నోటీసు, నీటి వనరునకు సమీపమున దాని నకలును అంటించుట మూలముగను దండోరా వేయుట మూలముగను తెలుపబడవలెను. నిషేధమెన్ని దినములుండునో ఆ దినముల సంఖ్యను అందు తెలియచేయవలెను. కార్యనిర్వాహక అధికారి ఇంకెట్టి సర్టిఫికేటునుగాని హాజరు పరచకుండ సదరు నోటీసును సవరింపవచ్చును లేక అట్టి నోటీసు అమలు కాలపరిమితిని పొడిగించ వచ్చును.

87. అట్లు ప్రత్యేకింపబడిన స్థలమును ప్రకటించబడిన కార్యములు కాక ఇతర కారణముల కొరకు ఉపయోగించుటను నిషేధించుట:- ఏ వ్యక్తిగాని—

(ఏ) ఒక పంచాయతీచే లేక ప్రయివేటు ఆస్తి సందర్భములో దాని ఖామందుచే త్రాగుట కొరకు లేక వంటచేయు కార్యముల నిమిత్తము వాడుకొనుటకు ప్రత్యేకించబడిన ఏ స్థలములోని నీటిలోనైన స్నానముచేయకూడదు లేక అట్టినీటిని మురికిచేయకూడదు;లేక

(బి) త్రాగుటకై పైన తెల్పబడిన విధముగా ప్రత్యేకింపబడిన ఏ స్థలము యొక్కనైన పొడిగా నుండు జలాశయము గర్భములో అసహ్యకరమైన లేక హానికరమైన ఏ పదార్థమునుగాని ఉంచ కూడదు; లేక

(సి) త్రాగుటకొరకు పైన తెలుపబడిన విధముగా ప్రత్యేకించ బడిన ఏ స్థలమందైనను గుడ్డలను ఉతుక కూడదు ; లేక

(డి) త్రాగుటకు లేక స్నానము చేయుటకు లేక గుడ్డల నుతుకుటకు పైన తెలుపబడిన విధముగా ప్రత్యేకించబడిన ఏ స్థలము లోనైన ఏ జంతువునైన లేక వంటపాత్ర లేక ఉన్ని, తోళ్లు లేక దుర్గంధముతో కూడిన లేక ఉపద్రవకరమైన ఇతర పదార్థమును కడుగ కూడదు. లేక ఉపద్రవకరమైన లేక హానికరమైన ఏ పదార్థ మునుగాని అందు ఉంచకూడదు ; లేక

(ఇ) అతనికి చెందిన లేక అతని ఆక్రమణలో నుండు ఏ భవ నము లేక భూమినుండి యైనను ప్రవహించు మురుగు గుంటను, మురుగు కాలువ, జలదారి, ఇంజను లేక బాయిలరు నుండి నీటిని లేక అతనికి చెందిన ఏ ఇతర ఉపద్రవకరమైన పదార్థము నైనను, త్రాగుటకు లేక స్నానము చేయుటకు లేక గుడ్డల నుతుకుటకు పైన తెలుపబడిన విధముగా ప్రత్యేకించ బడిన ఏ స్థలములోనికిగాని వచ్చు నట్లు చేయకూడదు.

88. తీర్థయాత్ర స్థలములు మున్నగువాటిపై నియంత్రణ వహించు వ్యక్తుల నుండి వంతు పైకములు:- మసీదు, దేవాలయములు, మఠము లేదా ఎట్టి మత సంబంధమైన ఆరాధన స్థలము లేదా బోధనా స్థలము లేదా సంతలను ఉత్సవములను జరుపుటకు లేదా అదే విధ మైన ఇతర కార్యముల కొరకు ఉపయోగింపబడు ఏ ఇతర స్థలముల

గాని గ్రామ హద్దులలోపు లేదా దాని చుట్టు ప్రక్కలలో ఉండి, సంవత్సరము నందంతట లేదా ప్రత్యేక సమయములలో చాలమంది జనులు అచ్చటికి వచ్చుచుండు సందర్భములో జన సామాన్యము యొక్క ఆరోగ్యమునకు భద్రత లేదా సౌకర్యమునకు అవసరమగు శాశ్వతమైన లేదా తాత్కాలికమైన ఎట్టి ప్రత్యేక ఏర్పాట్లుగాని పంచాయతీచే చేయబడవలెను. అయితే ప్రభుత్వము వారు అట్టి స్థలము మీద అధికారము కలిగియున్న ట్రస్టీతో లేక ఇతర వ్యక్తితో సంప్రదించిన మీదట తాము నిర్ణయింపగల విధముగా లేక నాన్ రికరింగువంతు పైకమును పంచాయతీ యొక్క నిధులకు ఈయవలసి నదిగా ఆయనను ఆదేశించవచ్చును.

89. ప్రయివేటు పాయిఖానాలను శుభ్రపరచుట:— పంచాయతీ యొక్క కార్యనిర్వాహక అధికారి, తనకు యుక్తమని అగుపడు విధముగ, ఏ ఆవరణ యొక్కయైన యజమాని లేక ఆక్రమణదారు తోనైనను, అట్టి ఆవరణ నుండి లేక దానికి సంబంధించిన ఏ స్థలము నుండి యైన చెత్తచెదారము లేక మురికి లేక ఏదో ఒక ప్రత్యేకమైన రకమునకు చెందిన చెత్త చెదారము లేక మురికిని, ఎన్నిసారులు, ఏ కాలపరిమితులలో తొలగించవలెనను విషయమును తదితర విష యములను గురించిన షరతుల మీద, అట్టి పనికగు ఖర్చుకుగాను పంచాయతి నిర్ణయించు రేటు చొప్పున రుసుము చెల్లింపబడిన మీదట తొలగించుటకు ఒప్పందము చేసికొనవచ్చును.

90. శవములు పూడ్చబడునట్టి, దహనము చేయబడునట్టి స్థల ముల రిజిస్ట్రేషను:- (1) ఈ చట్టము యొక్క ప్రారంభ సమయమున శవములను పూడ్చుటకు, దహనము చేయుటకు లేక ఇతర విధముగా పరిష్కారము చేయుటకై ఉపయోగింపబడు ఏ స్థలము యొక్కయైన ప్రతి ఖామందు లేక అట్టి స్థలముపై నియంత్రణ కలిగియున్న ప్రతి

వ్యక్తి, అట్టి స్థలము ఇదివరకే దానికి వర్తించు ఏదైన శాసనము క్రింద రిజిష్టరు చేయబడని ఎడల అట్టి స్థలమును ఈ చట్టము క్రింద రిజిష్టరు చేయుటకై పంచాయతీకి దరఖాస్తు పెట్టుకొనవలెను.

(2) అట్టి స్థలమునకు ఎట్టి ఖామందుగాని లేక దాని మీద నియంత్రణ కలిగియున్న వ్యక్తిగాని లేడని పంచాయతీకి తెలిసిన యెడల పంచాయతీ దానిపై నియంత్రణ వహించి అట్టి స్థలమును రిజిష్టరు చేయవలెను లేక దానిని మూసివేయవచ్చును,

91. శవములు పరిష్కారము చేయబడు స్థలముల విషయములో లైసెన్సులు ఇచ్చుట:— (1) శవములను పరిష్కారము చేయుట కొరకు ఎట్టి క్రొత్త స్థలముగాని, అది పబ్లికుదైనను ప్రయివేటుదైనను, దరఖాస్తు పెట్టుకొనబడిన మీదట పంచాయతీ నుండి పొందిననే తప్ప, స్థాపించబడ కూడదు. ఏర్పాటు చేయబడ కూడదు. నిర్మింపబడ కూడదు లేక ఉపయోగింపబడ కూడదు,

(2) లైసెన్సుకొరకు పెట్టుకొనబడు దరఖాస్తుతో, ఏ స్థలము విషయములో లైసెన్సు కోరబడినదో ఆ స్థలము యొక్క ప్లాను పంపబడవలెను, అందులో ఆ స్థలపు ప్రాంతము, దాని ఎల్లలు విస్తీర్ణము దానితో సంబంధముగల ఖామందు పేరు లేక వ్యక్తిపేరు లేక వర్గము పేరు, నిర్వహణ పద్ధతి మరియు పంచాయతీచే కోరబడు ఇతర వివరములు తెలుపబడ వలెను.

(3) దరఖాస్తు ఏ పంచాయతీకి పెట్టుకొనబడినదో ఆ పంచాయతీ—జిల్లా ఆరోగ్యాధికారితో సంప్రదించి—

(ఏ) లైసెన్సును ఈయవచ్చును లేక నిరాకరించవచ్చును ; లేక —

(బి) పంచాయతీచే సబబైనవని భావించబడిన ఆక్షేపణలు ఏవైన యున్నచో అవి తొలగించబడువరకు లేక దానిచే అడుగ బడిన ఏమైన వివరములు పంపబడువరకు లైసెన్సును జారీచేయుట వాయిదా వేయవచ్చును,

(4) (3)వ ఉపవిభాగము క్రింద పంచాయతీచే జారీచేయ బడిన ఏ ఉత్తరువునైనను జిల్లా కలెక్టరు రద్దు చేయవచ్చును; లేక సవరించవచ్చును.

92. శవములు పూడ్చబడు, దహనము చేయబడు స్థలములను ఏర్పాటు చేయుట:— పంచాయతీ శవములను పూడ్చుటకు, దహ నము చేయుటకు స్థలములను పంచాయతీ నిధి ఖర్చులతో ఏర్పాటు చేయవచ్చును. సదరు స్థలముల విషయమై తగిన ఏర్పాటు లేని యెడల పంచాయతీ అట్లు ఏర్పాటు చేయవలెను, వాటిని ఉపయో గించుటకు అద్దెలను లేక రుసుములను విధించవచ్చును.

93. రిజిష్టరు చేయబడిన లైసెన్సు ఈయబడిన లేక ఏర్పాటు చేయబడిన స్థలము విషయములో ఒక పుస్తకమును వ్రాసియుంచుట:— (1) 90వ విభాగము, 91వ విభాగము లేక 92వ విభాగము క్రింద రిజిష్టరు చేయబడిన, లైసెన్సు ఈయబడిన లేక ఏర్పాటు చేయబడిన స్థలములు, మరియు ఈ చట్టము యొక్క ప్రారంభమునకు పూర్వము రిజిష్టరు చేయబడిన లైసెన్సు ఈయబడిన లేక ఏర్పాటు చేయబడిన స్థలములన్ని వ్రాయబడు ఒక పుస్తకము ప్రతి పంచాయతీ యొక్క కార్యాలయములోను ఉంచబడవలెను.

(2) పైన తెలుపబడిన విధముగా అట్టి స్థలము రిజిష్టరు చేయ బడినదని లైసెన్సు ఈయబడినదని లేక ఏర్పాటు చేయబడినదని ఆంగ్ల భాషలోను, గ్రామముయొక్క ప్రధాన భాషలోను నోటీసు

అట్టి స్థలముయొక్క ప్రవేశ ద్వారమున లేక ప్రవేశ ద్వారమునకు సమీపములో స్పష్టముగా కనిపించునట్లు అంటించబడవలెను.

91 అధికారము పొందని స్థలములలో శవములను పూడ్చుట లేక దహనము చేయుటపై నిషేధము :— పైన తెలుపబడిన విధముగా రిజిష్టరు చేయబడిన, లైసెన్సు ఈయబడిన లేక ఏర్పాటు చేయబడిన స్థలము కాక ఇతర స్థలములో, నివాస స్థలము లేక మంచి నీటి సరఫరా వనరునకు 200 మీటర్లలోపల ఏస్థలమునందైనను ఏ వ్యక్తిగాని ఏ శవమునైనను పూడ్చకూడదు, దహనము చేయకూడదు లేక ఇతర విధముగా పరిష్కారము చేయకూడదు లేక పూడ్చబడునట్లు, దహనము చేయబడునట్లు లేక ఇతర విధముగా పరిష్కరించబడునట్లు చేయకూడదు, లేక అట్లు అనుమతించగూడదు.

95. శవములను పూడ్చుట మున్నగు వాటి విషయములో పంచాయతీకి నోటీసు ఇచ్చుట :— శవములు పరిష్కారము చేయబడు స్థలముపై నియంత్రణ వహించిన వ్యక్తి పంచాయతీచే నియమింపబడిన ఏ వ్యక్తికైనను అట్టి స్థలములో ప్రతి శవము పూడ్చబడుట, దహనము చేయబడుట లేక ఇతర విధముగా పరిష్కరించబడుటను గురించి సమాచారమును అందచేయవలెను.

96. ప్రజల ఆరోగ్యమునకు అపాయకరముగనున్న లేక సమాధులతో కిక్కిరిసిపోయియున్న శవములు పూడ్చబడు లేక దహనము చేయబడు స్థలములను ఉపయోగించుటపై నిషేధము :—
(1) పంచాయతీ: —

(ఏ) శవములను పరిష్కారము చేయుటకొరకు రిజిష్టరు చేయబడిన లేక లైసెన్సు ఈయబడిన ఏ స్థలమైనను దానికి సమీపమున నివసించుచుండు ప్రజల ఆరోగ్యమునకు అపాయకరమగు లేక బహుశః అపాయకరము గాగల స్థితిలో లేక పరిస్థితిలో నున్నదని; లేక

(బి) శవములు పూడ్చబడు ఏ స్థలముగాని సమాధులతో కిక్కిరిసిపోయినదని, మరియు శవములు పూడ్చబడు లేక దహనము చేయబడు లేక పైన తెలుపబడిన ఇతర పబ్లికు స్థలము విషయములో శవ పరిష్కారము కొరకు అధికారమీయబడిన మరి యొక అనుకూలమైన స్థలమున్నదని లేక అట్టి స్థలమును సామాన్యముగా ఉపయోగించు వ్యక్తుల నిమిత్తము ఏర్పాటు చేయబడినదని;

విశ్వసించిన ఎడల కమీషనరు యొక్క ఆమోదముతో ఒక నోటీసు, అందు నిర్దిష్టపరపబడు రెండు నెలల కంటె తక్కువ కాని కాలపరిమితి గడచిన తరువాత అట్టి స్థలములో ఏ శవము నైనను పూడ్చుట, దహనము చేయుట లేక ఇతర విధముగా పరిష్కరించుట చట్ట సమ్మతము కాదని ఈయవచ్చును.

(2) ఉపవిభాగము (1) క్రింద ఈయబడు ప్రతి నోటీసు, పంచాయతీ ఆఫీసు నోటీసు బోర్డుపై అంటించుట ద్వారాను, గ్రామములో దండోరా వేయుటద్వారాను ప్రకటింపబడవలెను.

(3) ఏ వ్యక్తిగాని ఈ విభాగము క్రింద ఈయబడిన ఏనోటీసు కైనను విరుద్ధముగాను అట్టి నోటీసులో పేర్కొనబడిన కాలపరిమితి గడచిపోయిన తరువాతను, అట్టి స్థలములో ఏ శవమును గాని పూడ్చకూడదు. దహనము చేయకూడదు లేక ఇతర విధముగా పరిష్కారము చేయకూడదు లేక పూడ్చబడునట్లు, దహనము చేయబడునట్లు లేక ఇతర విధముగా పరిష్కరింపబడునట్లు చేయకూడదు లేక అనుమతించ కూడదు.

97. లైసెన్సులేని పందులను, కుక్కలను వధించుటకు అధికారము:—(1) పంచాయతీచే నిర్దిష్టపరుపబడిన హద్దులలో లైసెన్సు లేకుండ తిరుగు పందులు లేక కుక్కలు వధించబడునని పబ్లికు

నోటీసు ఈయవచ్చును. జిల్లా మెజిస్ట్రేటుచే కోరబడినచో పంచాయతీ సదరు రీతిగా నోటీసు ఈయవలెను

(2) అట్టి నోటీసు ఈయబడిన పిదప, ఏ వ్యక్తియైనను, అట్టి హద్దుల లోపల తిరుగుచున్న లైసెన్సులేని, సందర్భానుసారముగా, ఏ పందిని గాని ఏ కుక్కనుగాని నోటీసు యొక్క షరతులకు విరుద్ధముగా లేకుండునట్లు ఏ విధముగానైనను వధించవచ్చును.

98. మురికి నీటిని బయటకు ప్రవహింప జేయుటపై నిషేధము:—ఏ ఆవరణ ఖామందుగాని ఆక్రమణదారుగాని ఆ ఆవరణ లోని ఏదేని జలమడుగు, మురుగు కాలవ, పాయిఖానా లేక పశువులదొడ్డి లేక ఏదైన ఇతర మురికి పదార్థము నుండు నీటిని మురుగు కాలువ లోనికి లేక మురికి నీటి గుంటలోనికితప్ప పబ్లికు రోడ్డు యొక్క ఏ భాగము మీదికిగాని ప్రవహించునట్లు చేయరాదు లేదా అట్టి ఆవరణ నుండి ఆ నీరు లేక మురుగు పదార్థము, గోడలలో లేక అట్టి పబ్లికు రోడ్డులో భాగముగానున్న మురుగు కాలువ ప్రక్క స్థలములో ఇంకిపోయి కంటకము కలిగింపచేయు విధముగా ప్రవహించునట్లు చేయరాదు.

99. పారిశుధ్యము, కన్సర్వెన్సీకు సంబంధించిన అధికారములు:—(1) గ్రామములోని ఏ ప్రాంతములోనైన పారిశుధ్య పరిస్థితిని అభివృద్ధిపరచుట అవసరమని తోచినచో కార్యనిర్వాహక అధికారి లిఖితపూర్వకమైన నోటీసు ద్వారా, ఆ ప్రాంతములోని ఏ యే భూముల యొక్కయు ఇండ్ల యొక్కయు ఖామందును లేక ఆక్రమణదారును, ఆ నోటీసులో నిర్దిష్టపరుపబడిన సబబైన గడువు లోపల:—

(ఏ) ఒక గుడిసెను లేక మరుగు స్థలమును పూర్తిగాగాని లేదా కొంత భాగముగాని తొలగించుటకు;

(బి) ఒక భవనములో ప్రయివేటు మురుగు కాలువను నిర్మించుటకు లేక దానిని మార్పుచేయుటకు లేదా తొలగించుటకు;

(సి) ఏదేని స్థలము లేక, భవనమును కార్యనిర్వాహక అధికారికినచ్చు విధముగా శుభ్రము చేయించుటకు;

(డి) ఏదేని స్థలములోగాని భవనములోగాని బావి, గుంట, కొలను, కోయి మడుగు చెరువు లేక మురుగు కాలువ, మురికి పదార్థము లేక నిలువ నీరుఉండి అది, యిరుగు పొరుగున వారి ఆరోగ్యమునకు భంగము కలిగించునట్లుగా లేక ఉపద్రవకరముగా లేక ఇతర విధముగా అసహ్యమును కలిగించునట్టిదిగా ఉన్న ఎడల, దానిని పూడ్చివేయుటకు లేక శుభ్రపరచుటకు లేక ఇంకను లోతుగా త్రవ్వుటకు లేదా అందులోనుండి నీరు తీసివేయుటకు లేక దాని నుండి కాలువ త్రవ్వి నీటిని బయటికి పంపివేయుటకు లేక కార్యనిర్వాహక అధికారికి అవసర మని తోచిన విధముగా మరొక చర్యగైకొనుటకు;

(ఇ) ఏదేని స్థలములో గడ్డి గాదము, చెట్టు చేమా, ముళ్ళ కంపలు, లేక అడవి పెరిగియుండి అది ఏవిధముగాగాని ప్రజల ఆరోగ్యమునకు భంగకరమై లేదా ప్రజలకు ప్రమాదకరమై లేదా ఇరుగుపొరుగువారికి ప్రమాదకరమై లేదా గాలి వెలుతురు ప్రసరించుటకు ఆటంకము కలిగించినచో అట్టి వానిని కొట్టివేయుటకు లేక తొలగించుటకు;

(ఎఫ్) ఏదేని దిగుడుబావిని చేద బావిగా మార్చుటకు; ఆదేశింపవచ్చును:

అయితే ఈ విషయమై ఏ వ్యక్తికి నోటీసు జారీచేయబడినదో ఆ వ్యక్తిచే తెలుపబడు అభ్యంతరములను కార్యనిర్వాహక అధికారి విచారించి నిర్ణయము చేయవలెను.

(2) (1)వ ఉప విభాగము క్రింద చేయబడవలసిన పని నోటీసులో పేర్కొనబడిన గడువు లోపల చేయబడక పోయినచో ఆపనిని కార్యనిర్వాహకాధికారియే చేయించి అందుకగు ఖర్చులను లేదా వాటిలో కొంత భాగమును (1)వ ఉప విభాగములో తెలుపబడిన ఖామందు నుండిగాని లేక ఆక్రమణదారునుండి గాని ఇందులో ఇటు తరువాత నిబంధింపబడు విధముగా వసూలు చేయవచ్చును.

100. పబ్లికు రోడ్ల సమీపములో రాళ్ల త్రవ్వకముపై నిషేధము:—(1) ఏ వ్యక్తి గాని పంచాయతీ ఆధీనము నందుండు లేక దానికి చెందియుండు పబ్లికు రోడ్డుకుగాని ఇతర స్థిరాస్తికిగాని ఇరువది మీటర్ల లోపల నున్న ఎట్టి స్థలములోనైన, పంచాయతీచే జారీ చేయబడిన లైసెన్సు క్రింద తప్ప, రాళ్లు త్రవ్వకూడదు లేదా అచటి నుండి రాళ్లను, మట్టిని లేదా ఇతర పదార్థములను తొలగించ కూడదు. పంచాయతీ లైసెన్సును మంజూరు చేయవచ్చును లేక నిరాకరించవచ్చును. నిరాకరించు సందర్భములో సంబంధించిన వ్యక్తికి నిరాకరించుటకు గల కారణములను తెలియజేయవలెను.

(2) పంచాయతీ యొక్క అభిప్రాయములో ఏ రాళ్ళనైనను త్రవ్వుట లేక ఏ స్థలమునుండి యైన రాళ్లు, మట్టి లేక ఇతర పదార్థమును తొలగించుట, దాని చుట్టు ప్రక్కల కాపురముండు లేక చుట్టు ప్రక్కల పోవుటకు చట్టరీత్యా హక్కు కలిగియున్న ఏ వ్యక్తికైనను అపాయకరముగా నున్నఎడల లేక కంటకము కలిగించుయెడల లేక కంటకము కలిగించు స్థితిలో నున్నయెడల, అట్టి రాళ్లు త్రవ్వకపు భాగము లేక స్థలముయొక్క ఖామందును లేక దానిపై నియంత్రణగల వ్యక్తిని అట్లు రాళ్లుత్రవ్వుట మానవలసినదిగా లేక అట్టి స్థలము నుండి రాళ్లు, మట్టి లేక ఇతర పదార్థమును తీయుట మానవలసినదిగా లేక దానినుండి ఏర్పడు లేక బహుశః ఏర్పడగల అపాయమును అపుటకు

లేక కంటకమును నివారించుటకు పంచాయతీ అవసరమని భావించు చర్యను అట్టి రాళ్ళ ప్రత్యేకపు భాగము లేక స్థలము విషయములో తీసికొనవలసినదిగా పంచాయతీ ఆదేశించవచ్చును.

101. పబ్లికు రోడ్లపై ఆటంకములు కలిగించుటపై నిషేధము:— ఇందులో ఇటు తరువాత నిబంధింపబడిన విధముగా తప్ప ఏ వ్యక్తి యైనను, ఏ పబ్లికు రోడ్డుపైగాని ఎట్టి గోడను నిర్మించకూడదు లేక దడికట్ట కూడదు లేక యితర ఆటంకమును కలుగజేయకూడదు లేక ముందుకు పొడుచుకొని వచ్చు దానిని నిర్మించకూడదు లేక ఇతర అక్రమ ఆక్రమణ చేయకూడదు.

102. బయటకు తెరువబడు తలుపు, గేటు, కమ్మి, లేక క్రింది అంతస్తు కిటికీ విషయములో నిషేధము మరియు వాటిని క్రమ పరుచుట.—(1) ఏట్టి తలుపు, గేటు, కమ్మి లేక క్రింది అంతస్తు కిటికీ గాని కార్యనిర్వాహకాధికారి నుండి లైసెన్సు పొందిననే తప్ప, పంచాయతికి చెందిన పబ్లికు రోడ్డు మీదికి వచ్చునట్లుంచబడకూడదు లేక దాని మీదికి వెలుపలి వైపుకు తెరచుకొనునట్లు ఉంచబడ కూడదు.

(2) కార్యనిర్వాహకాధికారి, అట్టి తలుపు, గేటు, కమ్మి లేక కిటికీ యొక్క ఖామందును, అది తెరువబడినపుడు దాని భాగ మేదైనను పబ్లికు రోడ్డు మీదకు పొడుచుకొని రాకుండునట్లు మార్చ వలసినదిగా నోటీసు ద్వారా ఆదేశించవచ్చును.

103. అక్రమ ఆక్రమణల తొలగింపు:—(1) కార్యనిర్వాహ కాధికారి, ఏ భవనముయొక్క యైన ఖామందునుగాని లేక ఆక్ర మణ దారునిగాని అట్టి భవనమున ఎదురుగా లేక ముందర మరియు పంచాయతీకి చెందిన ఏ పబ్లికు రోడ్డులోగాని లేక మీదగాని ఉండు తలుపు, గేటు, కమ్మి, లేక క్రింది అంతస్తు కిటికీతప్ప, ఏదేని ముం

దుకు పొడుచుకొనివచ్చి యుండు వస్తువును అక్రమ ఆక్రమణను లేక ఆటంకమును తొలగించవలసినదిగా లేక మార్చవలసినదిగా నోటీసు ద్వారా ఆదేశించవచ్చును.

(2) అట్టి ముందుకు వచ్చియుండు వస్తువు, అక్రమ ఆక్రమణ, లేక ఆటంకము కాలదోష శాసనము క్రింద ఏ వ్యక్తికైనను దాని విషయమున చిరకాలానుభవ హక్కు కలుగచేయుటకు చాలినంత కాల పరిమితివరకు ఉన్నదని లేక ఆ విషయమున అధికారము పొందిన ఏదేని స్థానికాధికార సంస్థ యొక్క అనుమతితో లేక లైసెన్సుతో అది నిర్మింపబడెనని లేక అది చేయబడెనని అట్టి అనుమతి లేక లైసెన్సు ఏ కాలపరిమితివరకు చెల్లునో ఆ కాలపరిమితి. ఏదైన ఉన్న యెడల, అది ఇంకను గడిచిపోలేదని ఆ భవనము యొక్క ఖామందు లేక ఆక్రమణదారు ఋజువుపరచు నెడల, దానిని తొలగించుటవలన లేక మార్చుట వలన నష్టపడిన ప్రతి వ్యక్తికి పంచాయతి సబబైన పరిహారము ఈయవలెను.

104. కొన్ని ముందుకు పొడుచుకొని వచ్చిన వాటిని మరియు నిర్మాణములను అనుమతించుటకు అధికారము:— (1) కార్యనిర్వాహకాధికారి, పంచాయతీ యొక్క ఆమోదముతో, అట్టి పంచాయతీ అధీనములో నున్న పబ్లికు రోడ్డు మీద ముందుకు పొడుచుకొని వచ్చునట్లు వరండాలు, బాల్కనీలు, సన్ షేడులు, వెదర్ ఫ్రేములు, మరియు తదితరములైన వాటిని నిర్మించుటకు లేక ఆ భవనములోనికి పోవుటకు అవసరముగా నుండు ఏదైన మెట్టును లేక మురుగు కాలువమీద కప్పును వేయుటకు ఏ ఆవరణ యొక్కయైన ఖామందుకుగాని ఆక్రమణ దారునకుగాని ఆయన యుక్తమని తలంచు షరతులకును, నిర్బంధములకును లోబడి లైసెన్సును మంజూరు చేయవచ్చును.

(2) కార్యనిర్వాహకాధికారి, పంచాయతీ అధీనములో నున్న పబ్లికు రోడ్ల మీద లేక పంచాయతీ నియంత్రణలో గల ఏదేని ఇతర పబ్లికు స్థలములలో తాత్కాలికముగా పందిళ్ళను వేయుటకు లేక ఇతర కట్టడములను నిర్మించుటకు, ఆయన యుక్తమని భావించు షరతులకును, నిర్బంధములకును లోబడి లైసెన్సు మంజూరు చేయ వచ్చును.

(3) కార్యనిర్వాహకాధికారి, పంచాయతీ ఆమోదముతో, అట్టి పంచాయతీ అధీనములో గల రోడ్డు పార్శ్వములను పంచాయ తీచే నిర్ణయింపబడునట్టి నియమములపైనను షరతులపైనను అట్టి కాలపరిమితి వరకును కౌలు కిచ్చుటకు అధికారము కలిగియుండ వలెను.

(4) కాని, సందర్భానుసారముగా, ముందుకు వచ్చియుండు భాగము, నిర్మాణము లేక ఆక్రమణ, బహుశః ఆరోగ్యమునకు భంగ ముగా నుండు ఎడల లేక జనసామాన్యమునకు అసౌకర్యము కలి గించు నెడల లేక ఆ రోడ్డును అట్లు ఉపయోగించుటకు ప్రస్తుతము ఇతర విధముగా ఆటంకము కలిగించు నెడల (1)వ ఉపవిభాగము క్రింద లైసెన్సుగాని (3)వ ఉపవిభాగము క్రింద కౌలుగాని ఈయ బడకూడదు,

(5) ఏ పంచాయతీగాని (1),(3) ఉపవిభాగముల క్రింది అధి కారములను వినియోగించుటను, ప్రభుత్వమువారు, ఆంధ్రప్రదేశ గెజెటులో ప్రకటన ద్వారా పరిమితబరచ వచ్చును, మరియు తాము యుక్తమని భావించు నియంత్రణ క్రింద ఉంచవచ్చును.

(6) ఈ విభాగము క్రింద ఏ కాల పరిమితికొరకు లైసెన్సు మంజూరు చేయబడినదో ఆ కాలపరిమితి గడచిన మీదట, కార్య నిర్వాహకాధికారి, నోటీసు ఈయకుండగనె (2)వ ఉపవిభాగము

క్రింద ఏర్పరుపబడిన ముందుకు పొడుచుకొని వచ్చిన భాగమును లేక వేయబడిన నిర్మాణమును తొలగింపజేయవచ్చును. అట్లు తొలగించుటకై అయిన ఖర్చును ఏ వ్యక్తికి లైసెన్సు మంజూరు చేయబడినదో ఆ వ్యక్తి నుండి ఇందులో ఇటు తరువాత నిబంధింపబడిన విధముగా రాబట్టుకొనవలెను.

105. జలదారి, మురుగు కాలువ మున్నగువాటిపై అనుమతి లేకుండ భవనములను నిర్మించుటపై నిషేధము:— (1) కార్యనిర్వాహకాధికారి యొక్క గాని లేక అట్టి కార్యనిర్వాహకాధికారిచే అధికార మీయబడిన ఏ వ్యక్తి యొక్కగాని లిఖిత పూర్వకమైన అనుమతి లేకుండ ఏదైన జలదారి లేక మురుగు కాలువమీద లేక జలదారి లేక మురుగు కాలువయొక్క ఏ భాగము మీదనైనను లేక రోడ్డును ఊడ్చుటచే లభించిన కుప్ప లేక ఇతర చెత్త చెదారముచే కప్పబడిన ఎత్తుచేయబడిన లేక పూర్తిగాగాని కొంత భాగముగాని చదును చేయబడిన ఏ భూమి మీదనైన ఎట్టి భవనముగాని నిర్మింపబడకూడదు.

(2) కార్యనిర్వాహకాధికారి లేక పైన తెలుపబడిన విధముగా ఆయనచే అధికార మీయబడిన వ్యక్తి, నోటీసు ద్వారా అట్టి అనుమతి లేకుండ లేక అట్టి అనుమతి యొక్క షరతులకు వ్యతిరేకముగా లేక అసంగతముగా భవనమును నిర్మించిన ఏ వ్యక్తినైనను అట్టి భవనమును పడగొట్టివేయవలసినదిగా ఆదేశించవచ్చును.

106. పబ్లికు రోడ్డులో గోతులు త్రవ్వుట, ఆటంకములు కలిగించుటపై నిషేధము. (1) కార్యనిర్వాహకాధికారి యొక్క అనుమతిని ముందుగా పొందియు, ఆయన విధించగల షరతులకు లోబడియు తప్ప ఏ వ్యక్తియైనను పంచాయతీ అధీనములో నున్న ఏ పబ్లికు

రోడ్డులోగాని గోతిని త్రవ్వకూడదు లేక ఎట్టి ఆటంకమునైన కలిగించ కూడదు

(2) అట్టి అనుమతి ఈయబడిన మీద, ఆ వ్యక్తి తన సొంత ఖర్చుతో అట్టి గోతిని నింపువరకు లేక అట్టి ఆటంకము తొలగించువరకు అట్టి గోతికి లేక ఆటంకమునకు బాగుగా దడి కట్టించి ఆవరణ ఏర్పరచవలెను ; మరియు రాత్రులందు అట్టి గోతికి లేక ఆటంకమునకు చాలినన్ని దీపములను ఏర్పాటు చేయవలెను.

(3) ఏ వ్యక్తియైనను ఈ విభాగము యొక్క నిబంధనలను ఉల్లంఘించినచో కార్యనిర్వాహకాధికారి, సందర్భానుసారముగా, గోతిని పూడ్చివేయవలెను లేక ఆటంకము తొలగించవలెను, లేక గోతికి లేదా ఆటంకమునకు దీపములు ఏర్పాటు చేయించవలెను. అట్లు చేయుటకైన ఖర్చును ఆ వ్యక్తి నుండి రాబట్టుకొన వచ్చును.

107. అనుమతిలేకుండ పబ్లికు రోడ్లు మున్నగువాటిపై చెట్లను నాటుట లేక కొట్టివేయుటపై నిషేధము:— (1) కార్యనిర్వాహకాధికారి యొక్క పూర్వానుమతితోను ఆయన విధించు షరతుల మీదను తప్ప ఏ వ్యక్తియైనను పంచాయతీ అధీనములో నున్న లేక పంచాయతీకి చెందిన పబ్లికు రోడ్డు మీదగాని ఇతర ఆస్తి మీద గాని ఏ చెట్టునైనను నాటకూడదు.

(2) కార్యనిర్వాహకాధికారి యొక్క పూర్వ అనుమతి లేక ఉత్తరువుతోను ఆయనచే విధించబడు షరతుల మీదను తప్ప, ఏ వ్యక్తియైనను పంచాయతీ అధీనములో నుండు లేక పంచాయతీకి చెందియుండి ఏదేని అట్టి పబ్లికు రోడ్డుపై లేక ఆస్తిపై పెరుగుచున్న ఏ చెట్టునుగాని నరికివేయ కూడదు, తొలగించ కూడదు, నాశనము చేయకూడదు, లేక చెట్టునుండి బెరడు నరకకూడదు లేక ఒలువ

కూడదు, ఆకులు లేక పండ్లు కోయ కూడదు లేక ఇతర విధముగా దానికి నష్టము కలిగించ కూడదు.

108. భూమి విషయములో అనధికార ఆక్రమణకు జరిమానాలు పరిహారమును రాబట్టు కొనుట:— (1) ఏ వ్యక్తియైనను పంచాయతీ యొక్క పూర్వానుమతిని పొందకుండ ఏదైన ప్రజోపయోగము కొరకు ప్రత్యేకించబడి పంచాయతీ అధీనములోనికి వచ్చిన లేక పంచాయతీకి చెందిన ఏ భూమినైనను ఆక్రమించినచో, అట్టి ఆక్రమణ విషయములో జరిమానాగా పంచాయతీచే అడుగబడిన మొత్తమును ఆయన చెల్లించుటకు బద్ధుడై యుండవలయును. అట్టి మొత్తము ఇందులో ఇటు తరువాత నిబంధింపబడిన విధముగా రాబట్టు కొన వచ్చును.

(2) కార్యనిర్వాహకాధికారి నోటీసు ద్వారా, (1)వ ఉప విభాగము క్రింద జరిమానా విధింపబడిన లేక విధించబడగల ఏ వ్యక్తినైనను అట్టి భూమిని ఖాళీ చేయవలసినదిగా ఏదైన భవనమును లేక ఇతర నిర్మాణమును లేక దాని మీద ఉంచబడిన ఏదైన వస్తువును తొలగించవలసినదిగా ఆదేశించ వచ్చును.

(3) ఏదైన భూమిని ఆక్రమించినందుకు గాను (1)వ ఉప విభాగము క్రింద జరిమానా చెల్లించుటకు బాధ్యుడైన ఏ వ్యక్తిచేనైనను పంచాయతీ యొక్క ఆస్తికి ఏదైన నష్టము కలుగజేయబడినచో, ఆ వ్యక్తి, అతనికి విధించబడిన లేక అతని నుండి రాబట్టుకొనబడు ఏ జరిమానాకైనను అదనముగాను మరియు దానితో నిమిత్తము లేకుండాను ఆయన అట్టి నష్టమునకుగాను పంచాయతీకి పరిహారము చెల్లించుటకు బాధ్యుడై యుండవలెను. అట్టి నష్టపరిహారము మొత్తము విషయములో తగాయిదా ఏర్పడిన సందర్భములో

ఇందు ఇటు తరువాత నిబంధింపబడిన విధముగా నిశ్చయింపబడి రాబట్టుకొనబడవలెను.

109. పబ్లికు మార్కెట్లు:— (1) పంచాయతీ, పబ్లికు మార్కెట్లుగా ఉపయోగించబడుటకు స్థలములు ఏర్పాటు చేయవచ్చును. మరియు కమీషనరు యొక్క అనుమతితో అట్టి యే మార్కెట్టునుగాని లేక అందలి భాగమునుగాని మూసివేయవచ్చును.

(2) నిర్ణయింపబడగల నియమములకు లోబడి, పంచాయతీ ఏదేని పబ్లికు మార్కెట్టులో, అందు నిమిత్తము గరిష్ఠ రేట్లు ఏవైన నిర్ణయింపబడినచో యుక్తమని తోచగల రేట్లు ప్రకారము ఈ క్రింది రుసుములలో ఏదైన ఒక దానిని గాని వాటిని గాని విధించవచ్చును—

(ఏ) అట్టి మార్కెట్టును ఉపయోగించుటకు లేక దానిలో సరకులను విక్రియము కొరకు ప్రదర్శించు హక్కు కొరకు రుసుములు.

(బి) అట్టి మార్కెట్లలో దుకాణములను, స్టాలులను, దొడ్లను లేక స్టాండులను ఉపయోగించుటకు రుసుములు.

(సి) అట్టి మార్కెట్టులో విక్రయమునకుగాను యెట్టి సరుకులనైనను తీసికొని వచ్చు 1939, మోటారు బండ్ల చట్టములో నిర్వచింపబడిన బండ్లను కలుపుకొని బండ్ల మీదను, జంతువుల మీదను, మనుష్యుల మీదను రుసుములు ;

(డి) అట్టి మార్కెట్టులోనికి విక్రయమునకు గాను తీసికొని రాబడునట్టి గాని లేక అందులో విక్రయింపబడు నట్టిగాని జంతువుల మీద రుసుములు ;

(ఇ) అట్టి మార్కెట్టులో తమ వృత్తిని జరుపుకొను దళారీల మీద, కమీషను ఏజంట్ల మీద, తూనిక తూచు వారి మీద లైసెన్సు రుసుములు.

110. ప్రయివేటు మార్కెట్లకు లైసెన్సు:— (1) పంచాయతీ నుండి లైసెన్సు పొందకుండ ఏ వ్యక్తియు క్రొత్తగా ప్రయివేటు మార్కెట్టును స్థాపించరాదు లేక ఇదివరకున్న ప్రయివేటు మార్కెటును నడుపరాదు,

(2) ఏ స్థలము విషయములో అట్టి లైసెన్సు కోరబడునో, ఆ స్థలము యొక్క ఖామందుచే, సందర్భాను సారముగా, ఆ స్థలమును మార్కెట్టుగా ఉపయోగించు కాలము నాటికి లేక ఏ సంవత్సరము నకై లైసెన్సు పునరుద్ధరింపబడవలసి యున్నదో ఆ సంవత్సర ప్రారంభమునకు 30 దినములకు తక్కువ కాకుండ, 90 దినములకు మించకుండ, లైసెన్సు కొరకు దరఖాస్తు పెట్టుకొనబడవలెను.

(3) పర్యవేక్షణకు తనిఖీకి సంబంధించినట్టి రెగ్యులేషనులకు పారిశుధ్యము, మురుగు పారుదల, నీటివసతి, బాటల, మార్గముల యొక్క వెడల్పు, అట్టి మార్కెటులో ఉపయోగింపబడు తూనికలు, కొలతలు, విధింపబడు అద్దెలు రుసుములకు సంబంధించి పంచాయతి ఉచితమని భావించునట్టి షరతులపై ఇదివరకే చట్టసమ్మతముగా స్థాపించబడిన ప్రయివేటు మార్కెట్ల విషయములో పంచాయతీ లైసెన్సు ఈయవలెను. క్రొత్తగా స్థాపించబడిన ప్రయివేటు మార్కెట్ల విషయములో పంచాయతీ సదరు రీతిగా లైసెన్సు ఈయవచ్చును లేదా ఏదేని క్రొత్త ప్రయివేటు మార్కెట్టు విషయములో పంచాయతి లిఖితపూర్వకముగా రికార్డు చేయవలసిన కారణముల వలన లైసెన్సు నిరాకరించవచ్చును. అయినను పంచాయతీ, ఎప్పుడైన లైసెన్సులోని షరతులు ఉల్లంఘించబడి నందుకు ఈ విభాగము

క్రింద ఈయబడిన లైసెన్సును నిలుపుదల చేయవచ్చును లేదా రద్దు చేయవచ్చును. పంచాయతీ లైసెన్సులోని ఏదేని షరతును ఒక నిర్దిష్ట తేదీ నుండి అమలులోనికి వచ్చునట్లుగా సవరించవచ్చును.

(4) ఈ విభాగము క్రింద లైసెన్సు మంజూరు చేయబడినపుడు, తిరస్కరించ బడినపుడు, నిలుపుదల చేయబడినపుడు, రద్దు చేయబడినపుడు లేక సవరించబడినపుడు పంచాయతీ, అట్టి మంజూరీని, నిరాకరణను నిలువుదలను, రద్దును లేక సవరణను గురించిన నోటీసు, ఆంగ్ల భాషలోను మరియు ఆ గ్రామము యొక్క ప్రధాన భాషలోను, ఏ స్థలము విషయములో లైసెన్సు కోరబడినదో లేక పొందబడినదో ఆ స్థలమునకు ప్రవేశ మార్గమున గాని సమీపమున గాని స్పష్టముగా కనుపించు విధముగా అంటింపించవలెను.

(5) ఈ విభాగము క్రింద ఈయబడిన ప్రతి లైసెన్సు సంవత్సరాంతమున అంతమగును.

(6) (3) వ ఉప విభాగము క్రింద పంచాయతీచే ఈయబడిన ఉత్తరువు వలన నష్టపడిన ఏ వ్యక్తియైనను అట్టి ఉత్తరువుపై కమీషనరుకు అప్పీలు చేసికొనవచ్చును. కమీషనరు ఉచితమని భావించిన ఎడల, అప్పీలు పరిష్కారముగువరకు, ఆ యుత్తరువు అమలు కాకుండ నిలుపు చేయవచ్చును.

111. లైసెన్సు రుసుము — 110 విభాగము క్రింద లైసెన్సు ఈయబడినపుడు 109 వ విభాగము (2)వ ఉపవిభాగములో నిర్దిష్ట పరుపబడిన రూపమున రుసుము ఏదైన విధించబడుటకు అనుమతించబడిన యెడల, క్రిందటి సంవత్సరము ఖామందుకు ఆమార్కెట్టు నుండి వచ్చిన మొత్తము ఆదాయములో నూటికి 15 వంతులకు మించకుండ పంచాయతీచే అట్టిలైసెన్సుకు రుసుము వసూలు చేయబడవలెను.

112. పబ్లికు మార్కెట్ల విషయములో కార్యనిర్వాహకాధికారిచే వినియోగించబడదగు అధికారములు:— కార్యనిర్వాహకాధికారి ఏ పబ్లికు మార్కెట్టు నుండి యైనను తత్కాలమందు అట్టి మార్కెటులో అమలులోనున్న ఏ నిబంధనలనైనగాని ఉల్లంఘించిన ఉల్లంఘించినందుకు శిక్షింపబడిన వ్యక్తిని లేక అట్లు ఏ వ్యక్తియొక్క ఉద్యోగి శిక్షింపబడెనో ఆ వ్యక్తిని వెడలగొట్ట వచ్చును. అట్టి వ్యక్తిని స్వయముగాగాని ఏజంట్ల ద్వారా గాని అటు తరువాత ఆ మార్కెట్టులో ఏ వ్యాపారమునైనను లేక ఏ వర్తకమునైనను చేయకుండునట్లు ఆటంక పెట్టవచ్చును లేక ఆ మార్కెట్టులోని ఏ దుకాణము నైనను కొట్టునైనను లేక ఇతర స్థలములనైనను ఆక్రమించుకొనకుండ ఆటంక పెట్టవచ్చును. మరియు అట్టి ఏ దుకాణము, కొట్టు, స్థలము విషయములో ఆ వ్యక్తి కలిగియుండిన ఏదేని కౌలును లేక భూస్వామ్యమును అంతయు చేయవచ్చును.

113. ప్రయివేటు మార్కెట్ల విషయములో పంచాయతీ వినియోగించదగు అధికారములు:— (1) పంచాయతీ, నోటీసు ఇచ్చుట ద్వారా, ఏ ప్రయివేటు మార్కెట్టు యొక్క గాని ఖామందును, అనుభవదారును, లేక కౌలుదారును;—

(ఏ) అట్టి మార్కెటులోనికి ప్రవేశించుటకు రోడ్లు, ప్రవేశములు, దారులు, గేట్లు మురుగు కాలువలు, మురుగు నీటి గుంటలు నిర్మించవలసినదిగా మరియు పంచాయతీయుక్తమని తలంచు రకమునకు చెందినట్టి పాయిఖానాలు అట్టి స్థలములోను అట్టి సంఖ్యలోను ఆమ్మార్కెటులో ఏర్పాటుచేయవలసినదిగాను;

(బి) మార్కెటుకు పూర్తిగా లేక అందలి ఏ విభాగమునకైనను పై కప్పు వెయ్యవలసినదిగా లేక గచ్చు చేయవలసినదిగా లేదా నేల యొక్క ఏ భాగమునకైన నీళ్లు ఇంకకుండునట్లు వెంటనే శుభ్ర

పరచుటకు వీలుండునట్లు, పంచాయతీ వారి అభిప్రాయములో అను కూలమైన పదార్థముతో గచ్చు చేయవలసినదిగాను;

(సి) గాలి, వెలుతురు సరిగా ప్రసరించునట్లు చేసి నీటి సర ఫరాను ఏర్పాటుచేయవలసినదిగాను;

(డి) కొట్ల మధ్యచాలినంత వెడల్పు గల త్రోవలను ఏర్పాటు చేయవలసినదిగా మరియు పంచాయతీ ఆదేశించు విధముగా కొట్లలో, త్రోవలలో, దుకాణములలో, తలుపులలో లేక మార్కెట్టుయొక్క ఇతర భాగములలో మార్పులు చేయవలసినదిగాను;

(ఇ) దానిని శుభ్రముగాను, క్రమమైన స్థితిలోను ఉంచి దానిలో నున్న చెత్త చెదారము త్రోపుడు పదార్థమునంతయు తొలగించి వాటిని, పంచాయతీ ఆదేశించునట్టి స్థలములలోను అట్టి విధముగాను పరిష్కరించవలసినదిగాను;

(ఎఫ్) పంచాయతీ అవసరమని భావించగల ఇతర పారి శుధ్యపు ఏర్పాట్లను చేయవలసినదిగాను ఆదేశించవచ్చును.

(2) ఏ వ్యక్తిగాని, పంచాయతీచే అందు నిమిత్తము అతనికి నోటీసు ఈయబడిన పిదప సదరు నోటీసులో తెలుపబడినట్టి కాల పరిమితి లోపల అట్టి విధముగా, (1)వ ఉపవిభాగములో నిర్దిష్టపరు బడిన పనులలో దేనినైనను చేయకుండిన ఎడల, పంచాయతీ, ఆవ్యక్తి యొక్క లైసెన్సును తాత్కాలికముగా నిలిపియుంచవచ్చును లేక అట్టి పని పూర్తిచేయబడునంత వరకు లైసెన్సు నిచ్చుట నిరాకరించ వచ్చును.

(3) అట్లు లైసెన్సు నిలిపి యుంచబడిన కాలములో లేక పునరుద్ధరింపబడు నంతవరకు ఏ వ్యక్తియైనను ఏ ప్రయివేటు మార్కె ట్టునుగాని తెరచియుంచుట చట్టసమ్మతముగానుండ రాదు.

(4) ఏ ప్రయివేటు మార్కెట్టు మీదనైన లేక అందలి ఏ దుకాణము, కొట్టు, షెడ్డు లేక ఇతర స్థలముల మీదనైన అధికారము కలిగియున్న ఎట్టి ఖామందు, అనుభవదారు, ఏజంటు లేక మేనేజరు గాని అది కంటకముగా నుండునట్లు దానిని ఉంచకూడదు, లేక అట్టి మార్కెట్టులో, దుకాణములో, కొట్టులో, షెడ్డులో లేక ఇతర స్థలములో కంటకముగా నుండు దేనినైనను పంచాయతీ నిర్దిష్టపరచు స్థలమునకు వెంటనే తొలగింపబడునట్లు చేయకుండ ఉండరాదు.

114. ఏవేని స్థలములు మార్కెట్లు అవునా కాదా యను వివాదము తీర్పు.— ఏదేని స్థలము మార్కెట్టు అవునా కాదా అను సమస్య ఉత్పన్నమయిన ఎడల పంచాయతీ దానిని పరిష్కారమునకై ప్రభుత్వమువారికి తెలుపవలెను ప్రభుత్వమువారి తీర్పు అంతిమమైనదై యుండవలెను.

115 లైసెన్సు పొందని ప్రయివేటు మార్కెట్లు మున్నగు వాటిలో విక్రయముపై నిషేధము:— ఏ వ్యక్తిగాని:-

(ఎ) లైసెన్సు పొందబడని ఎట్టి ప్రయివేటు మార్కెటులో గాని ;

(బి) సందర్భానుసారముగా, కార్యనిర్వాహకాధికారి యొక్క లేదా లైసెన్సు పొందిన వ్యక్తి యొక్క లేక ఆయనచే అధికారమీయబడిన ఏ వ్యక్తియొక్క అయినా అనుమతి పొందకుండ ఎట్టి పబ్లికు మార్కెట్టుగాని, లేక లైసెన్సు పొందిన ప్రయివేటు మార్కెట్టులో గాని,

ఎట్టి జంతువునుగాని వస్తువునుగాని విక్రయించకూడదు లేక విక్రయమునకు ప్రదర్శించకూడదు.

116. పబ్లిక్ రోడ్డులలో లేక వాటిమీద విక్రయించుటపై నిషేధము:— కార్యనిర్వాహకాధికారి, పంచాయతీ యొక్క అనుమతితో, పబ్లికు రోడ్డులో లేక స్థలములో లేక అందలి భాగములో లేక దానిమీద ఎట్టి జంతువులనుగాని వస్తువులనుగాని విక్రయించుటను లేక విక్రయమునకు ప్రదర్శించుటను పబ్లికు నోటీసు ద్వారా నిషేధించ వచ్చును లేక అందుకు లైసెన్సు ఏర్పాటు చేయవచ్చును లేక దానిని క్రమపరచవచ్చును.

117. మార్కెట్ల వర్గీకరణ:— (1) ఒక గ్రామములోనుండు పబ్లికు మరియు ప్రయివేటు మార్కెట్లను జిల్లా పరిషత్తు మార్కెట్లుగాను పంచాయతీ సమితి మార్కెట్లుగాను, పంచాయతీ మార్కెట్లుగాను వర్గీకరించుటకును, అట్టి ఏ మార్కెట్టు మీదనైన నియంత్రణ చేయుటకును దాని నుండి వచ్చిన ఆదాయమును జిల్లా పరిషత్తుకు పంచాయతి సమితి పంచాయతీల మధ్య పంపిణీ చేయుటకును లేదా సందర్భానుసారముగా, పంచాయతీ లేక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుకు వంతు పైకము చెల్లించుటకు ఏర్పాటు చేయుటకును ప్రభుత్వము వారు అధికారము కలిగియుండవలెను.

(2) జిల్లా పరిషత్తు మార్కెట్లుగా లేక పంచాయతీ సమితి మార్కెట్లుగా వర్గీకరింపబడిన మార్కెట్ల విషయములో పంచాయతీయును దాని కార్యనిర్వాహకాధికారియును 109 నుండి 116 వరకు (రెండింటిని కలుపుకొని) గల విభాగములచే వారికి ఈయబడిన అధికారములలో దేనినిగాని వినియోగింపకూడదు.

118. ప్రభుత్వము తీసుకొన్న ఎస్టేట్లలో యున్న మార్కెట్లను పంచాయతీలకు ఇచ్చుట:—1948 ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర ప్రాంత) ఎస్టేట్లు (రద్దు మరియు రైతు వారి మార్పు) చట్టములోని 41 వ విభాగము యొక్క (1) వ ఉప విభాగము ననుసరించి అంతిమ నష్ట

పరిహారము చెల్లించిన తేది నుండి మరియు ఆ తరువాత అట్టి ఎస్టేట్లలో ఏవైన స్థలములు మార్కెట్లుగా యుండి పై చట్టముననుసరించి ప్రభుత్వమునకు సంక్రమించునో, అవి గ్రామ పంచాయతీ అధికార క్షేత్రములో యుండిన అవి గ్రామపంచాయతీకి బదిలీ కాబడి దానికి సంక్రమించును. అటుపై గ్రామ పంచాయతీ అట్టి స్థలమును పబ్లిక్ మార్కెట్టుగా ఏర్పాటు చేయవలెను.

*119.* పబ్లికు రోడ్లు, సంతలు, ఉత్సవములు మొదలైన వాటి వర్గీకరణ:—(1) ఏ పంచాయతీ ప్రాంతమునకైనను చెందిన పబ్లికు రోడ్లు, సంతలు, ఉత్సవములు, సత్రములు, డిస్పెన్సరీలు,గ్రంథాలయములను జిల్లా పరిషత్తుకు, పంచాయతి సమితికి లేక, పంచాయతీకి చెందినవిగా కమీషనరు—

(ఏ) పబ్లికు రోడ్ల విషయములో కలెక్టరుతోను, హైవేస్ చీఫ్ ఇంజనీరు తోను;

(బి) సంతలు, ఉత్సవముల విషయములో పబ్లికు హెల్తు డైరెక్టరుతోను;

(సి) సత్రముల విషయములో రెవిన్యూ బోర్డు వారితోను;

(డి) ఆధునిక వైద్యమునకు చెందిన డిస్పెన్సరీల విషయములో మెడికల్ సర్వీసుల డైరెక్టరుతోను;

(ఇ) ఆధునిక వైద్యమునకు చెందని ఇతర డిస్పెన్సరీల విషయములో దేశీయ మందుల (ఇండియన్ మెడిసిన్) ప్రత్యేక ఆఫీసరుతోను;

(ఎఫ్) గ్రంథాలయముల విషయములో సార్వజనిక గ్రంథాలయముల డైరెక్టరుతోను;

సంప్రదించి వర్గీకరించవలెను.

(2) (1) వ ఉప విభాగము క్రింద ఏ వర్గీకరణగాని చేయబడుటకు ముందు సంబంధించిన జిల్లా పరిషత్తుకు, పంచాయతి సమితికి, పంచాయతీకి తమ అభిప్రాయమును తెలుపుకొనుటకు సబబైన అవకాశము ఈయబడవలెను.

(3) (1) వ ఉప విభాగము క్రింద కమీషనరుచే చేయబడిన ఏ వర్గీకరణనైననుగాని సవరించుటకు ప్రభుత్వమువారు అధికారము కలిగియుండవలెను.

120. పబ్లికు నిలుచు స్థలములు, బండ్లు నిలుపు స్థలములు మున్నగునవి:—నిర్ణయింపబడు నియమములకు లోబడి, పంచాయతీ-

(ఏ) పబ్లికు నిలుపు స్థలములను, ఆపు స్థలములను, బండ్లు నిలుపు స్థలములను (ఈ చివరి మాటలో జంతువులు, మోటారుబండ్లు కలుపుకొని ఎట్టి బండ్లుగాని నిలుచు స్థలములు చేరును) ఏర్పాటు చేయవచ్చును. వాటిని ఉపయోగించినందుకై రుసుములను విధించవచ్చును;

అయితే గ్రామ పంచాయతీ, అట్టి రుసుమునకు బదులు తనచే నిర్ణయింపబడిన మొత్తము ధనమును చెల్లించిన ఏ వ్యక్తినైనను, సదరు రుసుమును వసూలుచేసికొనుటకు అనుమతించవచ్చును.

(బి) అట్టి ఏదేని స్థలము లేదా నిలుపు స్థలములు ఏర్పాటు చేయబడినప్పుడు అదే కార్యము నిమిత్తము ఏ వ్యక్తియైన, కమీషనరు యొక్క నియంత్రణకు లోబడి పంచాయతిచే నిర్దిష్టపరుపబడు

దూరములోపల ఏదేని పబ్లికు స్థలమునుగాని, పబ్లికు రోడ్డు యొక్క ప్రక్కలనుగాని వాడుకోకుండునట్లు నిషేధించవచ్చును.

121. ప్రయివేటు బండ్లు నిలుచుస్థలములు:—(1) ఏ వ్యక్తిగాని క్రొత్తగా ప్రయివేటు బండ్లు నిలుచు స్థలమును, పంచాయతీలనుండి లైసెన్సు పొందిననే తప్ప స్థాపించకూడదు లేదా అట్టి ప్రయివేటు బండ్లు నిలుచు స్థలమును తెరచియుంచకూడదు అట్టి లైసెన్సు ప్రతి సంవత్సరము పునరుద్ధరింపబడవలెను.

(2) పంచాయతీ, పర్యవేక్షణ, తనఖీ, కన్సర్వెన్సీ, నిర్ణయింప బడగల ఇతర విషయములను గురించి అది యుక్తమని భావించు షరతులకు లోబడి, ఇదివరకే చట్టసమ్మతముగా ఏర్పాటు చేయబడిన ప్రయివేటు బండ్లు నిలుచు విషయములో లైసెన్సు కొరకు పెట్టు కొనబడినట్టి దరఖాస్తు మంజూరుచేయవలెను. క్రొత్తగా స్థాపించ బడు ప్రయివేటు బండ్లు నిలుచు స్థలముల విషయములో లైసెన్సు కొరకు పెట్టుకొనబడిన దరఖాస్తును పంచాయతివారు సదరు రీతిగా తమ విచక్షణనుబట్టి మంజూరు చేయుటకు పంచాయతీ నిరాక రించవచ్చును.

(3) పంచాయతీ లైసెన్సు యొక్క షరతులు నిర్దిష్టపరుప బడిన తేదీ నుండి అమలులోనికి వచ్చునట్లు సవరించవచ్చును.

(4) పంచాయతీ, ఎప్పుడైనను (2)వ ఉప విభాగము క్రింద జారీ చేయబడిన ఏ లైసెన్సునుగాని దాని షరతులు ఉల్లంఘించబడి నందుకుగాను నిలిపియుంచవచ్చును లేదా రద్దు చేయవచ్చును.

(5) పంచాయతీ, ఈ విభాగము ననుసరించి లైసెన్సును మంజూరు చేయునప్పుడు లేక పునరుద్ధరించునపుడు ప్రతిసారి రెండు ఫంధల రూపాయలకు మించకుండ రుసుము విధించవచ్చును.

122. పబ్లికు జంతు వధశాలలు:— ప్రతి పంచాయతీ, నిర్ణయింపబడగల నియమములకు లోబడి, పబ్లికు జంతువధ శాలలుగా ఉపయోగించబడుటకు స్థలములను ఏర్పాటుచేసి వాటిని ఉపయోగించినందుకు అద్దెలు రుసుములు విధించవచ్చును.

123. జంతువులు వధచేయబడు స్థలముల వినియోగమును నిషేధించుట లేక క్రమపరచుట మరియు జంతువులను వధచేయువారికి లైసెన్సులు ఇచ్చుట:— ప్రభుత్వము వారు —

(ఏ) పబ్లికు జంతు వధశాలలు కానట్టి ఇతర స్థలములలో నియమములలో మినహాయింపు చేయబడని అన్ని సమయములందును వాటిలో నిర్దిష్టపరుపబడిన జంతువులను వధించుటను, కోయుటను లేక చర్మము తీయుటను నిషేధించుటకొరకు, లేక క్రమపరచుట కొరకు ;

(బి) జనసామాన్యమునకు విక్రయించు కార్యముల నిమిత్తము, నియమములలో నిర్దిష్టపరుపబడిన జంతువులను వధించు వ్యక్తులకు లైసెన్సు లిచ్చుటకొరకు ;

(సి) జంతు వధశాలలను, వాటిలోని మాంసమును తనిఖీ చేయుట కొరకును, అట్టి తనిఖీ నిమిత్తము నియమించబడిన ఉద్యోగులకు ప్రతిఫలమును చెల్లించుట కొరకు ; నియమములను చేయుటకు అధికారము కలిగియుండవలెను.

124. లైసెన్సు లేకుండ స్థలములు వినియోగించబడరాని కార్యములు:— (1) కార్యనిర్వాహకాధికారిచే జారీ చేయబడిన లైసెన్సు లేకుండ మరియు అట్టి లైసెన్సులో నిర్దిష్ట పరుపబడిన షరతుల ప్రకారము తప్ప, 3వ షెడ్యూలులో నిర్దిష్ట పరుపబడిన ఏదేని ఒక కార్య

ముకొరకు లేక ఎక్కువ కార్యములకొరకు గ్రామము యొక్క సరిహద్దులలోపల నుండు ఏ స్థలముగాని ఉపయోగింపబడ కూడదని నిర్ణయింపబడు విధముగా పంచాయతీ ప్రకటించ వచ్చును.

అయితే, అట్టి ఏ ప్రకటనగాని అది ప్రకటించబడిన తేదీనుండి అరువది దినములు గడచువరకు అమలులోనికి రాకూడదు.

(2) అట్టి ప్రతి స్థలము యొక్క ఖామందు లేక అనుభవదారు, అట్టి నోటీసు ప్రకటించబడిన ముప్పది దినములలోపల, అట్టి కార్యములకొరకు ఉపయోగించు కొనుటకై లైసెన్సుకొరకు కార్యనిర్వాహకాధికారికి దరఖాస్తు పెట్టుకొనవలెను.

(3) కార్యనిర్వాహకాధికారి, తాను యుక్తమని భావించు నిర్బంధములతోను రెగ్యులేషనులతోను అట్టి లైసెన్సు మంజూరు చేయవచ్చును లేక మంజూరుచేయుట నిరాకరించవచ్చును.

(4) అట్టి ప్రతి లైసెన్సు. ప్రత్యేక కారణములవలన కార్యనిర్వాహకాధికారి అది ముందు తేదీన అంతము కావలెనని భావించిననే తప్ప, సంవత్సరాంతమున అంతము కావలెను. కార్యనిర్వాహకాధికారిచే సదరు రీతిగా భావింపబడినప్పుడు అట్టి లైసెన్సు అందులో నిర్దిష్ట పరుపబడు విధముగా ముందు తేదీన అంతము కావలెను.

(5) అట్టి లైసెన్సుల పునరుద్ధరణకొరకు దరఖాస్తులు, ప్రతి సంవత్సరము అంతమగుటకు ముప్పది దినములకు తక్కువ కాకుండ తొంబది దినములకు ఎక్కువ కాకుండ, ముందుగా పెట్టుకొనబడవలెను. క్రొత్తగా స్థాపించబడగల స్థలములకై లైసెన్సుల కొరకు

కాకుండ తొంబది దినములకు ఎక్కువ కాకుండ, ముందుగా పెట్టు కొనబడవలెను.

125. ఆవిరి శక్తి లేక ఇతర శక్తి వినియోగించుటకు ఉద్దేశింప బడిన ఫ్యాక్టరీని కర్మాగారమును లేక పని స్థలమును నిర్మించుటకొరకు, స్థాపించుటకొరకు లేక ఏర్పాటు చేయుటకొరకు దరఖాస్తు పెట్టుకొనుట: (1) ప్రతి వ్యక్తియు;

(ఏ) ఆవిరి శక్తి, నీటి శక్తి లేక ఇతర యంత్రి శక్తి లేక విద్యుచ్ఛక్తి వినియోగించబడుటకు ఉద్దేశించబడిన ఎట్టి ఫ్యాక్టరీని గాని, కర్మాగారమునుగాని, పని స్థలమునుగాని నిర్మించుటకు, లేక స్థాపించుటకు లేక

(బి) పైన తెలుపబడిన విధముగా ఆవిరిచే, నీటిచే లేక ఇతర శక్తిచే నడుపబడు ఎట్టి యంత్రమును గాని మాన్యుఫ్యాక్చరింగు ప్లాంటుగాని ఏదేని ఆవరణలో స్థాపించుటకు ;

ఉద్దేశించుచున్న యెడల అట్లు నిర్మించుట, స్థాపించుట లేక ఏర్పాటు చేయుటకు ముందు, అట్లు ఉద్దేశింపబడిన పనిని చేపట్టుటకై అనుమతికొరకు పంచాయతీకి లిఖిత పూర్వకమైన దరఖాస్తు పెట్టు కొనవలెను.

(2) దరఖాస్తుతోపాటు,

(*i*) ఫ్యాక్టరీ, కర్మాగారము, పని స్థలము లేక అవరణ యొక్క ప్లాటు ప్రతులు నిర్ణయింపబడినన్నియు ;

(*ii*) శక్తి యంత్రము, ప్లాంటు లేక ఆవరణల విషయములో; ఇందు నిమిత్తము చేయబడు నిబంధనల ద్వారా పంచాయతీచే కోర

(3) దరఖాస్తు అందిన తరువాత సాధ్యమైనంత త్వరలో పంచాయతీ:—

(ఏ) దరఖాస్తులో కోరబడిన అనుమతిని, ఎట్టి షరతులు లేకుండగాని విధించుటకు తాము యుక్తమని భావించునట్టి షరతులకు లోబడిగాని మంజూరు చేయవలెను, లేక

(బి) దాని చుట్టు ప్రక్కల జనసమ్మర్ధత కారణమున గాని అది బహుశః కంటకము కలిగించునను కారణమువలన గాని అట్టి నిర్మాణము, స్థాపన లేక ఏర్పాటు పంచాయతీ అభిప్రాయములో ఆక్షేపణీయమైనచో అనుమతిని నిరాకరించవలెను.

(4) (3) వ ఉప-విభాగము క్రింద అనుమతిని మంజూరు చేయుటకు పూర్వము పంచాయతీ—

(ఎ) వీటికి సంబంధించి ఫ్యాక్టరీ కర్మాగారము, పని స్థలము లేక ఆవరణ యొక్క ప్లానును గురించి, 1948, ఫ్యాక్టరీల చట్టము ననుసరించి నియమింపబడి ఆ గ్రామముపై విచారణాధికారము కలిగియుండిన ఫ్యాక్టరీల ఇనస్పెక్టరు యొక్క లేదా అట్టి ఇనస్పెక్టరు ఒకరికంటె ఎక్కువ మంది యున్నచో, ఇందు నిమిత్తమై ప్రభుత్వము వారిచే సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువు ద్వారా పేర్కొనబడిన ఇనస్పెక్టరు యొక్క ఆమోదమును ఈ క్రింది విషయముల దృష్ట్యా పొందవలెను ;

(i) తగినంత గాలి, వెలుతురు ఏర్పాటు;

(ii) చాలినంత ఎత్తు, కొలతలు గల గదులు, తలుపుల ఏర్పాటు ;

(iii) అగ్ని ప్రమాదము ఏర్పడినప్పుడు ఉపయోగించుటకు

(iv) నిర్ణయింపబడగల ఇతర విషయములు ;

(బి) ఫ్యాక్టరీ, కర్మాగారము, పని స్థలము లేక ఆవరణ ప్రదేశము దః ఖాస్తులో తెలుపబడిన కార్యములకు అనుకూలమగునా కాదా యను విషయములో, జిల్లా బోర్డు వారు జిల్లా ఆరోగ్యాధికారిని నియమించిన యెడల ఆయనతో, ఇతర సందర్భములలో జిల్లా వైద్యాధికారితో సంప్రదించి ఆయన అభిప్రాయమును తగినట్లు పరిగణింపవలెను.

(సి) (i) ఫ్యాక్టరీ, కర్మాగారము, పని స్థలము లేక ఆవరణ ప్రదేశము తగినదా, సరిపోవునా అను విషయమును గూర్చి; మరియు (ii) భవనముల ఏర్పాటు గురించి, వాస్తు శిల్పము గురించి టౌను ప్లానింగ్ డైరెకరు అనుమతిని పొందవలెను.

126. ఆవిరి లేక ఇతర శక్తిచే కలిగింపబడు కంటకమును తగ్గించుటకొరకు ఆదేశములు జారీ చేయుటకు పంచాయతీకి అధికారము :— (1) ఆవిరి శక్తి, నీటి శక్తి లేక ఇతర యంత్ర శక్తి లేక విద్యుచ్ఛక్తి ఉపయోగింపబడు ఏదేని ఫ్యాకరీ, కర్మాగారము లేక పని స్థలములో ఒక ప్రత్యేక రకమైన ఇంధనము వినియోగించుట వలన లేక దానివలన ఏర్పడు ధ్వని లేక కంపనమువలన కంటకము కలిగినచో, పంచాయతీ, అది యుక్తమని భావించు విధముగా, అందు నిమిత్తము నిర్దిష్టపరుపబడు కాలపరిమితిలో కంటకము తగ్గించవలసినదిగా ఆదేశములను జారీచేయవచ్చును.

(2) బుద్ధిపూర్వకముగా అట్టి ఆదేశములు పాటింపబడకున్నచో లేక అట్టి తగ్గింపు ఆచరణ రీత్యా సాధ్యము కాదని కనుగొనబడినచో పంచాయతీ,—

(ఏ) వినియోగింపబడు ప్రత్యేకరకమైన ఇంధనమును ఉపయోగింపబడుటను నిషేధించవచ్చును; లేక

(బి) ఫ్యాక్టరీని గాని, కర్మాగారమును గాని లేక పని స్థలమును గాని రాత్రి 9–30 గంటల లగాయతు ఉదయము 5–30 గంటల మధ్య కాలములో పనిచేయుట నిషేధించి ధ్వనిని లేక కంపనమును పరిమిత పరచవచ్చును.

127. లైసెన్సులు, నోటీసులు, అనుమతుల యొక్క నమూనా:- (1) ఈ చట్టపు నిబంధనల క్రింద సందర్భానుసారముగా ఈయబడు, జారీచేయబడు లేక మంజూరు చేయబడు లైసెన్సులు, నోటీసులు, అనుమతులు వ్రాతరూపకముగా నుండవలెను.

(2) ఏ లైసెన్సు, అనుమతి, నోటీసు, బిల్లు, సమను లేక ఇతర పత్రము, ఈ చట్టముచే లేక ఈ చట్టము క్రింద చేయబడిన ఏదేని నియమము, నిబంధన లేక రెగ్యులేషన్ ననుసరించి కార్యనిర్వాహకాధికారి లేక పంచాయతీయొక్క ఇతర అధికారియొక్క సంతకము కలిగియుండవలెనని కోరబడినదో అట్టి ప్రతి లైసెన్సు అనుమతి, నోటీసు, బిల్లు, సమను లేక ఇతర పత్రము, దానిపై సందర్భానుసారముగా, కార్యనిర్వాహకాధికారి లేక అట్టి పంచాయతీ యొక్క ఇతర అధికారి యొక్క సంతకము ముద్రవేయబడియున్నచో దానిపై సక్రమముగా సంతకము చేయబడినట్లు భావింపబడవలెను.

(3) (2) వ ఉప-విభాగములోని దేదియు పంచాయతీ నిధి నుండి తీయబడు చెక్కు విషయములో గాని పంచాయతీతో చేసికొనబడిన ఏదేని పత్రము లేక ఖరారు విషయములో గాని వర్తించునట్లు భావింపబడకూడదు.

128. ఉత్తరువులను జారీ చేయుటకు లేక ఆదేశముల నిచ్చుటకు ప్రభుత్వమువారి అధికారము :— ప్రభుత్వమువారు, సామాన్య

ముగా గాని లేక ఏదేని ప్రత్యేక సందర్భములో గాని 124 వ విభాగము, 125 వ విభాగము లేక 126 వ విభాగము ననుసరించి తీసికొనిన లేక తీసికొనని ఏ చర్య విషయములో గాని వారు యుక్తమని భావించునట్టి ఉత్తరువు చేయవచ్చును లేదా ఆదేశములను ఈయవచ్చును.

129. 1888 ఆంధ్రప్రదేశ (ఆంధ్ర ప్రాంత) జన విహార స్థలముల చట్టము యొక్క సవరణ :— 1888 ఆంధ్రప్రదేశ (ఆంధ్ర ప్రాంత) జన విహార స్థలముల చట్టము (1888 లో 2 వ చట్టము)లో లేక రాష్ట్రములో ప్రస్తుతము అమలునందున్న తద్వ్యధమైన ఏదేని ఇతర చట్టములో ఏదియున్నను, ప్రభుత్వమువారు అట్టి చట్టమును ఏదేని గ్రామమునకు లేక అందలి భాగమునకు విస్తరింపచేసినప్పుడు,-

(ఏ) సినిమాటోగ్రాపు దర్శనములను జరుపుటకుగాకుండ ప్రత్యేకముగా ఇతర కార్యముల నిమిత్తము ఉపయోగింపబడు ఎట్టి స్థలము లేక భవనము విషయములోనైన ఆ చట్టము ననుసరించి లైసెన్సు కొరకు దరఖాస్తు ఏ అధికారికి పెట్టుకొనబడవలెనో మరియు అట్టి లైసెన్సును ఏ అధికారి ఈయవచ్చునో లేక నిరాకరించవచ్చునో ఆ అధికారి కార్య నిర్వాహకాధికారిగా నుండవలెను; మరియు

(బి) ఆ చట్టము ననుసరించి లైసెన్సును ఇచ్చు, నిరాకరించు, రద్దుచేయు లేక నిలిపియుంచు కార్యనిర్వాహకాధికారి యొక్క ఉత్తరువుమీద అప్పీలు పంచాయతీకి చేసికొనుటకు వీలుండవలెను.



# 6 వ అధ్యాయము

## సామాన్య విషయములు, నానావిధ విషయములు

130. వీధులకు పేర్లు పెట్టుటకు, భవనములకు నెంబర్లు వేయుటకు అధికారము :— (1) పంచాయతీ, నిర్ణయింపబడిన విధముగా, ఏ వీధికి గాని పేర్లు పెట్టబడునట్లు చేయవచ్చును. ఏ భవనము యొక్క ప్రక్క లేక వెలుపలి తలుపుకు లేక ఆ భవనము యొక్క ప్రవేశ ద్వారమునందు ఏదో స్థలమున నెంబరు వేయబడునట్లు కూడ చేయవచ్చును. అదే విధముగా అప్పుడప్పుడు, అట్టి పేరు లేక నెంబరు సవరింపబడునట్లు చేయవచ్చును.

(2) ఏ వ్యక్తి గాని, చట్టసమ్మతమైన అధికారము లేకుండ, అట్టి పేరును లేక నెంబరును లేక అట్టి ఏ ప్రాంతములోనైన ఏదేని భవనమునకు వేయబడిన నెంబరును రూపుమాపకూడదు, తీసివేయకూడదు, లేక తుడిచివేయకూడదు.

(3) నెంబరు వేయబడినమీదట, భవనముయొక్క కామందు ఆ నెంబరును అట్లే ఉంచుటకును అది తొలగింపబడిన లేక తుడిచి వేయబడిన యెడల దాని స్థానమున మరల నెంబరు వేయుటకును బద్ధుడుగా నుండవలెను. ఆయన అట్లు చేయకుండినచో, నిర్ణయింపబడిన అధికారి, ఆయనను ఆ నెంబరు తిరిగి వేయవలసినదిగా నోటీసు ఇచ్చుట ద్వారా ఆదేశించవచ్చును.

131. లైసెన్సులు, అనుమతుల గురించి సాధారణ నిబంధనలు:— (1) ఈ చట్టము ననుసరించి లేక ఈ చట్టము క్రింద చేయబడిన

ఏదేని నియమము లేక ఉప నియమము ననుసరించి మంజూరు చేయ బడిన ప్రతి లైసెన్సులోను అనుమతిలోను. అది ఏ కాల పరిమితి కొరకు మంజూరు చేయబడినదో అట్టి కాలపరిమితి మరియు అది ఏ నిర్బంధములకు, పరిమితులకు, షరతులకు లోబడి మంజూరు చేయ బడినదో అవి తెలుపబడవలెను. దానిపై సంబంధించిన కార్యనిర్వా హకాధికారిచే లేక అందునిమిత్తము ఆయనచే అధికారమీయబడిన ఇతర వ్యక్తిచే సంతకము చేయబడవలెను.

(2) ఈ చట్టములో స్పష్టముగా ఇతర విధముగా నిబంధింప బడిననే తప్ప, లేదా ఈ చట్టము ననుసరించి ఇతర విధముగా నిర్ణ యింపబడురీతిగా తప్ప, అట్టి ప్రతిలైసెన్సు లేక అనుమతి విషయ ములో పంచాయతీచే నిర్ణయింపబడు యూనిట్లమీదను, రేట్ల చొప్పు నను రుసుములు విధింపబడవచ్చును.

(3) ఈ చట్టముననునరించి లేక ఈ చట్టము క్రింద చేయబడిన నియమములేక ఉపనిబంధన ననుసరించి ఉత్తరువు జారి చేయుటకు అధికారము కలిగియున్న ప్రతిఅధికారిచే లైసెన్సును లేక అనుమతిని నిరాకరించుచు, నిలిపివేయుచు, రద్దుచేయుచు లేక మార్పుచేయుచు ఈయబడు ప్రతిఉత్తరువు వ్రాతరూపకముగా నుండవలెను. అందులో ఆ ఉత్తరువుకుగల కారణములు తెలుపబడవలెను.

(4) ప్రయివేటు మార్కెటులను గురించి 6వ అధ్యాయము లోని ప్రత్యేక నిబంధనలకు లోబడి, ఈ చట్టముక్రింద లేక ఈచట్టము ననుసరించి చేయబడిన ఏదేని నియమము లేక ఉప-నియమము క్రింద మంజూరు చేయబడిన ఏదేని లైసెన్సు లేక అనుమతి అందుకు సంబం ధించి అందులో తెలుపబడిన నిర్బంధములు, నియమములు లేక షర తులు లైసెన్సుదారునిచే లేక అనుమతి పొందిన వ్యక్తిచే తప్పించు

కొనబడినచో లేక ఉల్లంఘించబడినచో లేక ఆయన, అట్టి లైసెన్సు లేక అనుమతికి సంబంధించిన విషయములో ఈ చట్టము యొక్క లేక ఈ చట్టముక్రింద చేయబడిన ఏదేని నియమము, ఉప-నియమము లేక రెగ్యులేషను యొక్క నిబంధనలను ఉల్లంఘించి నందులకు శిక్షింపబడిన ఎడల; లేదా ఆయన అట్టి లైసెన్సును లేక అనుమతిని తప్పుడు సమాచారము తెలియ జేయుట ద్వారా లేక మోసము చేయుట ద్వారా పొందిన ఎడల ఏ సమయమందైనను కార్య నిర్వాహ కాధి కారిచే అది నిలిపివేయబడవచ్చును లేక రద్దు చేయబడవచ్చును.

(5) ఈ చట్టము ద్వారా గాని లేక ఈ చట్టము ననుసరించి గాని ఏ స్థలముల విషయములో లైసెన్సు లేక అనుమతి అవసరమో ఆ స్థలమును తనిఖి చేయుట కార్య నిర్వాహ కాధికారి కర్తవ్యమై యుండవలెను. అట్టి ఏ స్థలములో నైనను ఆయన సూర్యోదయము సూర్యాస్తమయముకు మధ్య ప్రవేశించవచ్చును. అది సూర్యాస్తమయ సూర్యోదయముల మధ్య జనసామాన్యము ప్రవేశించదగుస్థలమైనచో లేక అట్టి స్థలములో ఆ సమయమందు ఏదైన పరిశ్రమ కొనసాగింప బడు చున్నచో ఆయన అప్పుడు కూడ అందులో ప్రవేశించవచ్చును. ఏ స్థలమునందైనను. ఈ చట్టము ద్వారా లేక ఈ చట్టముననుసరించి లైసెన్సు లేక అనుమతి అవసరముగల ఏదేని పని అట్టి లైసెన్సు లేక అనుమతి లేకుండ చేయబడుచున్నదని లేక దానికి అనుగుణముగా కాక ఇతర విధముగా చేయబడుచున్నదని విశ్వసించుటకు కారణ మున్నచో, ఆయన, ఏదేని శాసనము, నియమములు, ఉప-నియమ ముల యొక్క నిబంధనలు, లైసెన్సు లేక అనుమతి యొక్క ఏదేని షరతు, ఏదేని చట్టసమ్మతమైన ఆదేశము లేక నిషేధము ఉల్లంఘించ బడు చున్నదాయను విషయమును నిర్ధారించుకొను నిమిత్తము అట్టి స్థలములో రాత్రిగాని పగలుగాని ఏ సమయమునందైనను ప్రవేశించ వచ్చును. కార్యనిర్వాహకాధికారిచే లేక చట్టసమ్మతముగా ఆయన

తన అధికారములను అప్పగించిన ఏ వ్యక్తిచే గాని ఈ ఉప-విభాగము క్రింద అధికారములు వినియోగింప బడుటలో ఆవశ్యకమై యుండి కలిగిన నష్టములేక ఇబ్బందికిగాను లేక ఈ ఉప-విభాగము ననుసరించి ప్రవేశించుటకై అవసరమైయుండిన బలమును ఉపయోగించుటవలన కలిగిన నష్టము లేక ఇబ్బందికిగాను ఏ వ్యక్తిచే గాని ఎట్టి క్లెయిమయి నను చేయబడుటకు వీలు లేదు.

(6) ఏదేని లైసెన్సు లేక అనుమతి నిలిపివేయబడినప్పుడు లేక రద్దు చేయబడి నప్పుడు లేదా అది ఏ కాల పరిమితివరకు మంజూరు చేయబడినదో ఆ కాల పరిమితి లేక ఏ కాల పరిమితిలో పునరుద్ధరణ కొరకు దరఖాస్తు పెట్టుకొనవలయునో ఆకాల పరిమితి ఇందులో ఏది తరువాత వచ్చునో అది గడచినప్పుడు. ఈ చట్టము యొక్క లేక ఈ చట్టము ననుసరించి చేయబడిన ఏదేని నియమము లేక ఉప-నియమము యొక్క కార్యముల నిమిత్తము లైసెన్సుదారు. సందర్భాను సార ముగా లైసెన్సును లేక అనుమతిని నిలిపివేయుచు లేక రద్దుచేయుచు చేయబడిన ఉత్తరువు రద్దు చేయబడువరకు లేదా (11)వ ఉప-విభాగ మునకు లోబడి లైసెన్సు లేక అనుమతి పునరుద్ధరింప బడువరకు లైసెన్సు లేకుండ లేక అనుమతి పొందకుండ యున్నటుల భావించ బడవలెను.

(7) ప్రతి లైసెన్సు దారుడు లేక అనుమతి దారుడు, అట్టి లైసెన్సు లేక అనుమతి అమలులోనున్న కాలములో కార్యనిర్వాహ కాధికారి కోరినచో అట్టి లైసెన్సును లేక అనుమతిని సబబైనఅన్ని వేళల యందు తెచ్చి చూపవలెను.

(8) ఈ చట్టము యొక్క లేక ఈ చట్టముక్రింద చేయబడిన ఏదేని నియమము లేక ఉప-నియమము యొక్క నిబంధనలచే కోర బడిన లైసెన్సు లేక అనుమతి పొందకుండ ఉండిన లేక రిజిస్ట్రేషను

చేయించకుండ ఉండిన సందర్భములో ఒక నేరమునకై ఏ వ్యక్తిగాని ఎప్పుడైన శిక్షింపబడినప్పుడు, మేజిస్ట్రేటు, విధింపబడదగు ఏదేని జరిమానాకు అదనముగా లైసెన్సు కొరకు లేక అనుమతి కొరకు లేక రిజిస్ట్రేషను కొరకు విధింపబడదగు రుసుము మొత్తమును త్వరగా రాబట్టుకొని పంచాయతీకి చెల్లించవలెను. మేజిస్ట్రేటు తన విచక్షణను బట్టి. ప్రాసిక్యూషను ఖర్చులుగా తాను నిర్ణయించు మొత్తముపదైన యున్నచో అదికూడ రాబట్టుకొని పంచాయతీకి చెల్లించవలెను.

(9) ఈ చట్టములో స్పష్టముగా నిబంధింపబడి యుండిననేతప్ప లేక ఈ చట్టము ననుసరించి నిర్ణయింపబడు విధముగతప్ప, ఈ చట్టము లేక దీనిననుసరించి చేయబడిన ఏదేని నియమము లేక రెగ్యులేషను క్రింద లైసెన్సు అనుమతి లేక రిజిస్ట్రేషను కొరకు లేక దాని పునరుద్ధరణ కొరకు పెట్టుకొనబడు ప్రతి దరఖాస్తు, వాటి కాలము ఆరంభమగుటకు లేదా ఆ దరఖాస్తులో పేర్కొనబడిన, అంతకు తక్కువ కాలము ఆరంభమగుటకు పూర్వము ముప్పది దినములకు తక్కువ కాకుండను, తొంబది దినములకు ఎక్కువ కాకుండ పెట్టుకొన బడవలెను.

(10) (8)వ ఉప-విభాగము క్రింద రుసుము రాబట్టుకొనుట వలన, శిక్షింపబడిన వ్యక్తిపైన తెలుపబడిన విధముగా లైసెన్సుకు, లేక అనుమతికి లేక రిజిస్ట్రేషనుకు హక్కు కలిగి యుండరాదు.

(11) లైసెన్సు లేక అనుమతి లేక రిజిస్ట్రేషనుకొరకు రుసుము పంచాయతీచే లేక పంచాయతీ తరపున ముందుగా స్వీకరింపబడుట, అట్లుముందుగా చెల్లించువ్యక్తికి, సందర్భానుసారముగా లైసెన్సుకు లేక రిజిస్ట్రేషనుకు హక్కు కలిగించక అట్టి లైసెన్సు లేక అనుమతి లేక రిజిస్ట్రేషను నిరాకరింపబడు సందర్భములలో అట్టి మొత్తము

వాపసు పొందుటకు మాత్రమే హక్కు కలిగించవలెను. కాని, లైసెన్సు లేక అనుమతి లేక రిజిస్ట్రేషను పునరుద్ధరణ కొరకు దరఖాస్తు దారుడు, తన దరఖాస్తుపై చేయబడిన ఉత్తరువులు తనకు తెలియ జేయబడునంతవరకు, లైసెన్సు లేక అనుమతి లేక రిజిస్ట్రేషను పున రుద్ధరింప జేయబడి యుండిన ఎట్లో అట్లే వ్యవహరించుటకు హక్కు కలిగి యుండవలెను. ఈ చట్టములో ప్రత్యేకముగా ఇతర విధముగా నిబంధింపబడిననే తప్ప, లైసెన్సులేక అనుమతి లేక రిజిస్ట్రేషనుకొరకు పెట్టుకొనబడిన దరఖాస్తుపై చేయబడిన ఉత్తరువులు అట్టి దరఖాస్తు కార్యనిర్వాహకాధికారికి అందిన తరువాత ముప్పది దినముల లోపల లేక ఏదేని ఒక తరగతికి చెందిన వాటి సందర్భములో నిర్ణయింపబడ గల అంతకంటె ఎక్కువ కాలములోపల దరఖాస్తు దారునకు తెలియ జేయబడని ఎడల, దరఖాస్తు, సాధారణముగా అది అనుమతింపబడి యుండెడి కాలము ఏదైన వున్నచో ఆ కాలము కొరకును సాధా రణముగా విధించబడి యుండెడి శాసనములకు ఉప-నియమములకు, రెగ్యులేషనులకు మరియు అన్ని షరతులకు లోబడియు మంజూరు చేయబడినదని భావింపబడవలెను.

132. కార్యనిర్వాహకాధికారి ఉత్తరువుపై అప్పీలు:—

(1) పంచాయతీకి—

(ఎ) ఒక లైసెన్సును లేక అనుమతిని మంజూరు చేయుచు, నిరాకరించుచు. తాత్కాలికముగా నిలిపి వేయుచు లేక రద్దు చేయుచు కార్యనిర్వాహకాధికారి ఇచ్చిన ఏ ఉత్తరువుపైనైనను ;

(బి) 217వ విభాగముక్రింద చేయబడిన నియమావళి ప్రకా రము అప్పీలు చేసి కొనదగినదై యుండి కార్యనిర్వాహకాధికారిచే ఈయబడిన ఇతరమైన ఏ ఉత్తరువుపై నైనను;

అప్పీలు చేసికొన వచ్చును.

(2) (1)వ ఉపవిభాగము ననుసరించి అట్టి ఏ అప్పీలు పై నైనను పంచాయతీ ఇచ్చిన తీర్పుపై రెండవఅప్పీలు ఏర్పాటుచేయ బడు అధికారికి యుండగలదు. ఆ అధికారి ఇచ్చిన తీర్పు అంతిమమై యుండవలెను.

133. అప్పీలుకు కాలపరిమితి:— ఈ చట్టము యొక్క పై నిబంధనల క్రింద అనుమతింపబడిన ఏదైన అప్పీలును దాఖలు చేసి కొనుటకు సదరు నిబంధనలలో కాల నిర్ణయము ఏమియు చేయబడని సందర్భములో అట్టి అప్పీలు, 1918 ఇండియను లిమిటేషను చట్టము యొక్క 5వ విభాగవు నిబంధవలకు లోబడి, ఏ ఉత్తరువుపై అప్పీలు దాఖలు చేయబడునో ఆ ఉత్తరువు అందిన తేది తర్వాత ముప్పది దినముల లోపల దాఖలు చేసికొనబడవలెను.

134. ప్రభుత్వము, మార్కెట్టు కమిటీలు లైసెన్సులు మరియు అనుమతులు పొందనక్కర లేకుండుట :- ఈ చట్టములోగాని దీని క్రింద చేయబడిన ఏదైన నియమము ఉప-నియమము లేక రెగ్యులే షనులో గాని ఉన్న దేదియు, రాష్ట్ర లేక కేంద్ర ప్రభుత్వము యొక్క లేదా 1933 ఆంధ్రప్రదేశ (ఆంధ్రప్రాంత) వాణిజ్య పంటల మార్కెట్ల చట్టము (1933 లో 20వ చట్టము) క్రింద లేక దానిని పోలినదై తత్కాలమున ఆమలులో వున్న మరొక చట్టముక్రింద స్థాపింపబడిన మార్కెట్టు కమిటీ యొక్క ఆక్రమణలో లేదా నియం త్రణలో గల ఏదైన స్థలము విషయముమునగాని రాష్ట్ర లేక కేంద్ర ప్రభుత్వము యొక్క ఏదైన ఆస్తి లేదా అట్టి మార్కెట్టు కమిటీకి చెందిన ఏదైన ఆస్తి విషయమున గాని ఈ చట్టము క్రింద లేక అట్టి ఏదైన నియమము, ఉప-నియమము లేక రెగ్యులేషను క్రింద లైసె న్సును తీసికొనవలెనని లేదా అనుమతి పొందవలె నని ఆదేశించు చున్నట్లుగా అన్వయింపబడరాదు.

135. నోటీసు, ఉత్తరువు మున్నగు వాటిని పాటించుటకు గడువు, మరియు పాటింపబడని సందర్భమున దానిని అమలు జరిపించు అధికారము:— (1) ఈ చట్టము క్రింద లేదా దీని క్రింద చేయబడిన ఏదైన నియమము, ఉప–నియమము లేక రెగ్యులేషను క్రింద ఈయబడిన ఏదైన నోటీసు, ఆదేశము లేక ఉత్తరువుద్వారా ఏ వ్యక్తియైనను ఏదైన పనిని జరిపించ వలసినదిగా, ఏవైన చర్యలు తీసికొనవలసినదిగా, లేదా ఏదైన విషయము చేయవలసినదిగా ఆదేశింపబడినప్పుడెల్లను ఆ పనిని జరిపించవలసిన, ఆ చర్యలు తీసికొనవలసిన లేదా ఆ విషయము చేయవలసిన న్యాయమైన గడువు అట్టి నోటీసు ఆదేశము లేక ఉత్తరువులో పేర్కొన బడవలెను.

(2) అట్లు పేర్కొన బడిన గడువు లోపల అట్టి నోటీసు, ఆదేశము లేక ఉత్తరువు పాటింపబడనిచో,—

(ఏ) కార్యనిర్వాహకాధికారి అట్టి పనిని జరిపించ వచ్చును లేదా ఆ నోటీసును ఆదేశమును, లేక ఉత్తరువును తగు విధముగా అమలు జరుపు నిమిత్తము తన అభిప్రాయము ప్రకారము అవసరమగు ఏ చర్యలనైనను తీసికొన వచ్చును లేక ఏ విషయమునైనను చేయవచ్చును. మరియు దాని వలన పంచాయతీకి అయిన ఖర్చులన్నియు నోటీసు ఈయబడిన వ్యక్తి లేక వ్యక్తులచే చెల్లింపబడవలెను. ఆ ఖర్చులు ఇందు ఇటు తరువాత నిబంధింపబడిన విధముగా వసూలు చేసికొనదగి యుండ వలెను ; ఇంతేకాక

(బి) అట్టి నోటీసు, ఆదేశము లేక ఉత్తరువును పాటించనందుకు ఈ చట్టములో ప్రత్యేకముగా ఎట్టి దండన ఏర్పాటు చేయబడి యుండని సందర్భములో సదరు వ్యక్తి అట్టి ప్రతి నేరము విషయమునను ఏబది రూపాయలకు మించని జుర్మానాతో శిక్షింపబడదగి యుండవలెను.

136 ప్రవేశించుటకు, తనిఖీ చేయుటకు అధికారము:— (1) నిర్ణయింపబడు పరిమితులకు షరతులకు లోబడి, కార్యనిర్వాహకాధికారి లేదా ఆయనచే అధికారము ఈయబడిన ఏ వ్యక్తియైనను, ఈ చట్టపు నిబంధనల ద్వారా లేదా దీనిక్రింద చేయబడిన ఏదైన నియమము, ఉప-నియమము రెగ్యులేషను లేక ఉత్తరువులోని నిబంధనల ద్వారా అధికారము ఈయబడినట్టి లేదా ఈ చట్టపు కార్యములలో వేని నిమిత్తమైనను లేక సదరు నిబంధనలను బట్టి అవసరమైన దర్యాప్తు, తనిఖీ, పరీక్ష, పరిశీలన, సర్వే. కొలతలు లేక మూల నిర్ధారణ చేయు నిమిత్తము లేదా మరేదైనపని జరిపించు నిమిత్తము ఏ దినము నయినను సూర్యోదయ సూర్యాస్తమయ మధ్యకాలమున, నోటీసు ఇచ్చిగాని ఈయకుండా గానీ సహాయకులను లేక పనివాండ్రను వెంటబెట్టుకొని గాని లేకుండాగానీ, ఏదైన స్థలములో భవనములో లేక భూమిపై ప్రవేశించ వచ్చును.

(2) (1)వ ఉప—విభాగము క్రింద అధికారములను గాని సదరు ఉప—విభాగము ననుసరించి ప్రవేశమును సాధించు నిమిత్తము అవసరమగు బలప్రయోగమును గాని ఉపయోగించి నందువలన అవసరముగా కలిగించిన ఏదైననష్టము లేక అసౌకర్యమునకుగాను ఏ వ్యక్తిపైనైనను ఎట్టి క్లెయిము గాని చేయబడరాదు.

137. తూనికల కొలతల పరీక్ష:— కార్యనిర్వాహకాధికారి గాని, ఆయనచే అధికార మీయబడిన ఏ వ్యక్తిగాని గ్రామమందలి మార్కెట్లలోను, దుకాణములలోను ఉపయోగింపబడుచున్న తూనికలకు కొలతలకు సంబంధించి భారత శిక్షాస్మృతి యందలి 13వ అధ్యాయములో నిర్వచింపబడిన నేరములు జరుగకుండ నివారించుటకు, జరిగినచో అందుకు శిక్షింపజేయుటకు సదరు తూనికలను, కొలతలను పరిశీలించి పరీక్షించవచ్చును.

138. గ్రామ హెడ్‌మను, మునసబు, లేక కరణము వద్దనుండి సమాచారమును తెప్పించుకొనుటకు అధికారము:– (1) కార్యనిర్వాహకాధికారి పంచాయతీ అధికార క్షేత్రము లోపలగల ఏదైన రెవిన్యూ గ్రామాధికారిని మునసబును లేక కరణమును, అట్టి గ్రామమునకు లేక దాని భాగమునకు లేదా అందలి ఏ వ్యక్తి, లేక ఆస్తికైనను సంబంధించి నిర్ణయింపబడు వర్గముల క్రిందికివచ్చు ఏదేని విషయమును గురించిన సమాచారమును తనకు అందజేయ వలసినదని లిఖిత పూర్వకమైన ఉత్తరువు ద్వారా ఆదేశించ వచ్చును. అట్టి గ్రామాధికారి, మునసబు, కరణము అట్టి ఉత్తరువును పాటించ వలెను.

వివరణ :— ఈ విభాగములో 'గ్రామ హెడ్‌మన్' మరియు 'కరణము'అను మాటలను తెలంగాణా ప్రాంతము విషయములో క్రమముగా 'మాలీపటేలు' మరియు 'పట్వారీ' లను ఉద్దేశించి వుపయోగింపబడిన మాటలుగా అన్వయించు కొనవలెను,

(2) ఒక ఉత్తరువు ఏగడువులోపల పాటింపబడవలెనో ఆ ఉత్తరువులో నిర్దిష్టపరుపబడవలెను. అయితే కార్యనిర్వాహకాధికారి అట్టి గడువును ఆయా సమయములందు పొడిగించ వచ్చును.

139. బకాయీవసూళ్ళ నిమిత్తము కాలపరిమితి:- ఈ చట్టము క్రింద లేదా దీనిక్రింద చేయబడిన ఏదేని నియమము, ఉపనియమము, రెగ్యులేషను లేక ఉత్తరువు, క్రింద పంచాయతీకి రావలసిన ఏదైన పన్ను లేక ఇతర మొత్తము విషయమున మొట్ట మొదట జప్తు చేయ వలసియుండిన, మొట్ట మొదట దావా దాఖలు చేయవలసియుండిన లేదా అభియోగము మొట్ట మొదట ఆరంభించవలసి యుండిన తేదీ నుండి మూడు సంవత్సరముల కాలము గడచిపోయిన మీదట అట్టి పన్ను లేక మొత్తము విషయమున సందర్భానుసారముగా జప్తు ఏ

దియు చేయకూడదు, దావా ఏదియు దాఖలు చేయబడకూడదు లేదా అభియోగము ఏదియు ఆరంభింప బడకూడదు,

140. అభియోగము తెచ్చుటకు అధికారముగల వ్యక్తులు:— ఈ చట్టములో మరియొక విధముగా స్పష్టముగా నిబంధింపబడి యున్న సందర్భములలో తప్ప, ఈ చట్టమునకుగానీ దీని క్రింద చేయ బడిన ఏదేని నియమము లేక ఉపనియమము నకుగాని వ్యతిరేకముగా జరిగిన ఏదైన నేరమునకై ఏ వ్యక్తిపై నైనను ఆ నేరము జరిగిన 12 నెలల లోపల పోలీసుచేగానీ కార్యనిర్వాహకాధికారిచే గాని ఇందు నిమిత్తమై పంచాయతీ లేక కార్యనిర్వాహకాధికారిచే స్పష్ట ముగా అధికారము ఈయబడిన వ్యక్తిచేగాని ఫిర్యాదు చేయబడిననే తప్ప విచారణ జరుపబడరాదు.

అయితే ఈ చట్టము క్రింద తీసికొనవలసిన లైసెన్సును తీసి కొనకుండుట లేదా పొందవలసిన అనుమతిని పొందకుండుట లేక చేయించుకొనవలసిన రిజిస్ట్రేషనును చేయించుకొన కుండుట అనునది, ఆలైసెన్సు, అనుమతి లేక రిజిస్ట్రేషను కొంత గడువు దాక అవసర మని ఏర్పాటు చేయబడియున్నచో ఆ గడువు గడచిపోవు నంత వరకు, ఈ విభాగము యొక్క కార్యముల నిమిత్తము. నిరంతర ముగా కొనసాగుచున్న నేరముగా భావింపబడవలెను. గడువు ఏదియు నిర్దిష్టము చేయబడి యుండనిచో నేరము ఆరంభమై నప్పటి నుండి పంద్రెండు నెలల లోపల ఎప్పుడైనను ఫిర్యాదు చేయబడ వచ్చును.

141. నేరముల విషయమున రాజీచేసుకొను అధికారము:— (1) కార్యనిర్వాహకాధికారి నిర్ణయింపబడు పరిమితులకు, నియంత్ర ణకు లోబడి, ఈ చట్టమునకుగాని, దీని క్రింద చేయబడిన ఏదేని నియ మము లేక ఉపనియమమునకుగాని వ్యతిరేకముగా జరిగినట్టియు,

రాజీ చేసికొనుటకు వీలైనదని నియమావళి ద్వారా ప్రకటింపబడి నట్టియు ఏదైన నేరము విషయమువ ఐదు వందల రూపాయలకు మించని మొత్తమునకై రాజీచేసికొనవచ్చును.

(2) పరిహారము రూపమున సొమ్ము చెల్లింపబడిన మీదట, అట్లు రాజీచేసికొనబడిన నేరమును లేక ఆరోపింపబడిన నేరమును పుర స్కరించుకొని ఆ నేరస్థునిపై ఆ పైన ఎట్టి చర్యలను తీసికొనుటగాని కొనసాగించుటగాని చేయబడరాదు.

(3) ఈ విభాగములోగల దేదియు ఎన్నికలకు సంబంధించిన నేరములకు వర్తించదు.

142 అభియోగములను, రాజీలను పంచాయతీకి తెలుపవలసి యుండుట:— కార్యనిర్వాహకాధికారిచే ఆరంభింపబడిన అభియోగము లేదా రాజీచేసికొన్న నేరము పంచాయతీకి దాని మరుచటి సమావే శములో ఆయనచే నివేదింపబడవలెను.

143. పంచాయతీ, న్యాయపంచాయతీ లేక పరిష్కార సంఘము యొక్క సర్పంచుపై, సభ్యునిపై అభియోగము తెచ్చుటకు మంజూరి:- పంచాయతీ యొక్క సర్పంచు కార్యనిర్వాహకాధికారి లేక సభ్యుడు లేక న్యాయ పంచాయతీ యొక్క న్యాయాధ్యక్షుడు లేక ఒక సభ్యుడు లేక పరిష్కార సంఘము యొక్క అధ్యక్షుడు లేక సభ్యుడు తన అధికార కర్తవ్యములను నిర్వర్తించుచు వ్యవహరించు చుండగా లేదా వ్యవహరించుచున్నట్లు తోచుచుండగా ఆయన ఏదైన నేరము చేసినట్లు ఆరోపింపబడి నిందింపబడినప్పుడు ప్రభుత్వమునుండి మొదట మంజూరి పొందిననే తప్ప ఏ న్యాయాలయము కూడ అట్టి నేరమును విచారణకై తీసికొనరాదు,

144. పంచాయతీ, న్యాయ పంచాయతీ, పరిష్కార సంఘము మొదలగువాటిపై తీసికొనదలచిన చర్యయొక్క నోటీసు:- (1) 142వ విభాగము యొక్క నిబంధనలకు లోబడి ఈ చట్టము ననుసరించి చేయబడిన లేక చేయబడినట్లు భావించబడిన ఎట్టి చర్య విషయమున గాని లేదా ఈ చట్టమును లేక దీని ననుసరించి చేయబడిన ఏదేని నియమము ఉప నియమము లేక రెగ్యులేషను లేక దాని క్రింద చేయబడిన ఉత్తరువును అమలుజరుపుటలో చేసినట్లారోపింపబడిన ఏదేని ఉపేక్ష లేక తప్పిదము విషయమున గాని, చర్య తీసికొనుటకు గల కారణమును, కోరబడిన నష్టపరిహారము యొక్క స్వభావమును, కోరబడిన నష్టపరిహారము యొక్క మొత్తమును, వాదిగా ఉంచుటకు ఉద్దేశించిన వ్యక్తియొక్క పేరును, నివాస స్థలమును తెలియజేయుచు లిఖితపూర్వకమైన నోటీసు పంచాయతీ, న్యాయ పంచాయతీ లేక పరిష్కార సంఘము యొక్క కార్యాలయములో దాఖలు చేయబడిన తరువాత మరియు సదరు చర్యలు అట్టి సర్పంచుమీద, న్యాయాధ్యక్షునిమీద, అధ్యక్షునిమీద కార్యనిర్వాహకాధికారిమీద సభ్యుని మీద, ఉద్యోగిమీద, నౌకరుమీద, లేక అట్టి పంచాయతీ, న్యాయ పంచాయతీ, పరిష్కార సంఘము, సర్పంచు యొక్క, న్యాయాధ్యక్షుని యొక్క, అధ్యక్షుని యొక్క, కార్యనిర్వాహకాధికారియొక్క, సభ్యుని యొక్క, ఉద్యోగి యొక్క, లేక నౌకరు యొక్క ఆదేశము ననుసరించి వ్యవహరించునట్టి వ్యక్తిమీద తీసికొని రాబడుటకుద్దేశించు నప్పుడు ఆయనకు కూడ అది అందజేయబడిన లేదా ఆయనయొక్క నివాస స్థలములో ఈయబడిన తరువాత రెండు నెలలు గడుచునంత వరకు అట్టి ఏ పంచాయతీ, న్యాయ పంచాయతీ లేక పరిష్కార సంఘముమీద గాని లేదా అట్టి పంచాయతీ యొక్క సర్పంచుమీద, కార్యనిర్వాహకాధికారిమీద, సభ్యునిమీద, ఉద్యోగిమీద, నౌకరు మీద గాని అట్టి న్యాయ పంచాయతీ యొక్క న్యాయాధ్యక్షునిమీద

గాని, సభ్యునిమీద గాని అట్టి పరిష్కార సంఘము యొక్క అధ్యక్షుని లేదా అట్టి వ్యక్తిమీద గాని, ఎట్టి దావా గాని ఇతర చట్టసమ్మతమైన చర్య గాని తీసికొని రాబడకూడదు మరియు అట్టి నోటీసు ఈయబడిననే తప్ప కోర్టువారు అట్టి దావాను లేక చట్టసమ్మతమైన చర్యను స్వీకరించకూడదు.

(2) అట్టి ప్రతి చర్యయు, అది స్థిరాస్తిని రాబట్టుటకైన చర్యగా లేదా దాని హక్కు యొక్క ప్రకటనకైన చర్యగా వున్ననే తప్ప, చర్యకు గల కారణము ఏర్పడిన తేదీ తరువాత ఆరు నెలల లోపల లేదా కొనసాగుచున్న హాని లేక నష్టము విషయములో అట్టి కొనసాగుదల కాలములో లేదా అది ఆగిపోయిన తరువాత ఆరు నెలలలోపల ప్రారంభింపబడవలెను.

(3) ఉప-విభాగము (1) ననుసరించి నోటీసు ఈయుబడిన ఎట్టి పంచాయతీ న్యాయ పంచాయతీ, లేక పరిష్కార సంఘము గాని, వ్యక్తి గాని చర్య ప్రారంభింపబడుటకు ముందు వాదికి నష్టపరిహారము ఈయజూపినపుడు, మరియు అట్లు ఈయజూపబడిన మొత్తము కంటె ఎక్కువ మొత్తమును వాది అట్టి చర్యలో రాబట్టుకొనని పక్షమున అట్లు ఈయజూపబడిన తరువాత ఆయనకు అయిన ఎట్టి ఖర్చులను గాని ఆయన తిరిగి రాబట్టుకొనకూడదు. అట్లు ఈయజూపబడిన తరువాత ప్రతివాదికి అయిన యావత్తు ఖర్చులను గూడ వాది చెల్లించవలెను.

145. సదుద్దేశముతో వ్యవహరించు పంచాయతీ, న్యాయ పంచాయతీ, లేక పరిష్కార సంఘము యొక్క సర్పంచు, న్యాయాధ్యక్షుడు మున్నగువారికి రక్షణ :— ఈ చట్టము ననుసరించి చేయబడిన లేదా చేసినట్లు అర్థమునిచ్చు ఏ చర్య విషయములోనైన లేదా ఈ చట్ట

మును లేక దీని ననుసరించి చేయబడిన ఏదేని నియమము, ఉప నియమము, రెగ్యులేషను లేక ఉత్తరువును అమలుజరుపుటలో చేసినట్లు ఆరోపింపబడిన ఎట్టి ఉపేక్ష లేదా తప్పిదము విషయములోనైన,అట్టి చర్య సదుద్దేశముతో చేయబడిన ఎడల లేదా అట్టి ఉపేక్ష లేక తప్పిదము సదుదేశము వలన జరిగిన యడల, ఒక పంచాయతీ యొక్క సర్పంచుమీద, కార్యనిర్వాహకాధికారిమీద లేక సభ్యుని మీద, ఉద్యోగి లేక నౌకరుమీద లేదా ఒక న్యాయ పంచాయతీ యొక్క న్యాయాధ్యక్షునిమీద లేక సభ్యునిమీద లేక పరిష్కార సంఘము యొక్క అధ్యక్షునిమీద లేక సభ్యునిమీద లేదా పంచాయతీ, న్యాయ పంచాయతీ లేక పరిష్కార సంఘము యొక్క గాని అట్టి సర్పంచు, న్యాయాధ్యక్షుని, అధ్యక్షుని, కార్యనిర్వాహకాధికారి, సభ్యుని, ఉద్యోగి లేక నౌకరు యొక్క గాని ఆదేశము ననుసరించి వ్యవహరించు వ్యక్తిమీద ఎట్టి దావా లేదా ఇతర చట్టసంబంధమైన చర్య గాని తీసికొని రాబడకూడదు; కాని అట్టి ఏ చర్యయైనను, అది ఒక కోర్టుచే స్వీకరింపదగు మేరకు 150 వ విభాగము ననుసరించి తేబడిన దావాల విషయములో తప్ప పంచాయతీపై న్యాయ పంచాయతీపై లేక పరిష్కార సంఘముపై తీసికొని రాబడవలెను.

146. సర్పంచు మొదలగువారు ప్రభుత్వ ఉద్యోగులు :- గ్రామ పంచాయతీ సర్పంచు, కార్యనిర్వాహకాధికారి లేక ఏ సభ్యుడైన, ఆఫీసరు లేక ఉద్యోగి, లేక న్యాయాధ్యక్షుడు, న్యాయ పంచాయతీ సభ్యుడు లేదా అధ్యక్షుడు లేదా ఏదైనా పరిష్కార సంఘ సభ్యుడు భారత శిక్షాస్మృతి విభాగము 21 లో యున్న అర్థమును బట్టి ప్రభుత్వ ఉద్యోగిగా పరిగణింపబడవలెను.

147. ఎన్నికలకు సంబంధించిన చర్యలలో నివారణాజ్ఞలు మంజూరు చేయ వీలులేకుండుట :— 1908, సివిలు ప్రొసీజరు కోడు లో లేదా తత్కాలమందు అమలులో నుండు ఏ ఇతర చట్టములోనైన ఏదియున్నను దానితో నిమిత్తము లేకుండ, ఏ వోటర్ల జాబితానైనను తయారు చేయుటకు లేక ప్రకటించుటకు లేదా ఎట్టి ఎన్నికనైనను జరుపుటకు ఈ చట్టము ననుసరించి తీసికొనబడుచుండు లేదా తీసికొనబడనున్న ఎట్టి చర్యనైనను నిలిపి యుంచుటకు ఏ కోర్టుగాని ఎట్టి శాశ్వతపు లేక తాత్కాలికపు నివారణాజ్ఞను ఈయకూడదు లేదా ఎట్టి మధ్యకాలిక ఉత్తరువును చేయకూడదు.

148. ఎన్నికల కార్యము నిమిత్తము ఆవరణల అధియాచన:- (1) ఈ చట్టము ననుసరించి ఒక పంచాయతీకై జరుగు ఏదైన ఎన్నికకు సంబంధించి రాష్ట్రములోపల ఏవైన ఆవరణలు పోలింగు స్టేషనుగా ఉపయోగించు కార్యము నిమిత్తము లేక పోలింగు జరిగిన తరువాత బాలెట్ పెట్టెలను ఉంచుటకై అవసరమని లేదా బహుశా అవసరము కాగలదని ప్రభుత్వమువారికి తోచినయెడల వ్రాతపూర్వకమైన ఉత్తరువు ద్వారా ప్రభుత్వమువారు అట్టి ఆవరణలను అధియాచించవచ్చును. మరియు అట్టి అధియాచన సందర్భములో అవసరమని లేక యుక్తమని తమకు తోచినట్టి మరేవైన వుత్తరువులు చేయవచ్చును.

(2) ఏ వ్యక్తి ఆవరణల యజమాని లేక స్వాధీనము కలిగియున్న వ్యక్తియని ప్రభుత్వమువారు భావించుదురో ఆ వ్యక్తికి లిఖితపూర్వకమైన ఉత్తరువు ద్వారా అధియాచన చేయబడవలెను. అట్టి ఉత్తరువు ఏ వ్యక్తి పేరిట ఉన్నదో ఆ వ్యక్తికి నిర్ణయింపబడు విధానములో అందచేయబడవలెను.

(3) (1) వ ఉప-విభాగము ననుసరించి ఏదైనా ఆవరణను అధియాచించునప్పుడు అట్టి అధియాచన గడువు, ఆ ఉప-విభాగములో తెలిపిన ఏవైనా కార్యముల కొరకు అట్టి ఆవరణలు అవసరమగునట్టి కాలమునకు మించరాదు.

వివరణ :— ఈ విభాగపు కార్యముల నిమిత్తము "ఆవరణలు" అనగా ఏదైన భూమి, భవనము లేక భవనములో భాగము అని అర్థము. ఇందులో గుడిసె, షెడ్డు లేక ఇతర నిర్మాణము లేక దానిలో ఏదైనా భాగము చేరును.

149. నష్టపరిహారము చెల్లింపు:— 148వ విభాగమును పురస్కరించుకొని ప్రభుత్వమువారు ఏదైన ఆవరణను అధియాచించినప్పుడు, హక్కు కలిగియున్న వ్యక్తులకు నష్టపరిహారము చెల్లించబడవలెను. అట్టి మొత్తము ఈ క్రింది అంశములను పరిగణనలోనికి తీసికొని నిర్ణయించబడవలెను. అవేమనగా-

(i) ఆవరణ విషయములో చెల్లింపదగు అద్దె లేక ఎట్టి అద్దె గాని చెల్లింపబడనిచో ఆ ప్రాంతములో ఆ విధమైన ఆవరణకై చెల్లింపదగు అద్దె ;

(ii) ఆవరణల అధియాచన పర్యవసానముగా, హక్కు గలిగి యున్న వ్యక్తి తన నివాస స్థానమును లేక వ్యాపార స్థలమును మార్చవలసిన యెడల అట్లు మార్చుటకు ఏవైనా ఖర్చులు అవసరమైన యెడల సబబైన ఖర్చులు.

అయితే హక్కు కలిగియున్న ఏ వ్యక్తియైనను అట్లు నిర్ణయించబడిన నష్టపరిహార మొత్తము విషయములో నష్టపడినందువల్ల ఆ విషయమును మధ్యవర్తికి పంపుటకై ప్రభుత్వము వారికి నిర్ణీత గడువులోపల దరఖాస్తు పెట్టుకొనినచో చెల్లించబడవలసిన నష్టపరి

హార మొత్తము ప్రభుత్వము వారిచే ఇందు నిమిత్తము నియమించ బడిన మధ్యవర్తి నిర్ణయించునట్టిదై యుండవలెను;

అంతేకాకుండా నష్టపరిహారమును పొందు హక్కు విషయ ములో లేక నష్టపరిహారము మొత్తము కేటాయింపు విషయములో ఏదైనా తగాదా వున్న సందర్భములో అది నిర్ణయించబడుటకై ప్రభుత్యమువారిచే ఇందు నిమిత్తము నియమించబడిన మధ్యవర్తికి పంపబడి అట్టి మధ్యవర్తి తీర్పు ననుసరించి నిర్ణయించబడవలెను.

వివరణ:— ఈ ఉప-విభాగములో హక్కు కలిగియున్న వ్యక్తి అనగా 148వ విభాగము ననుసరించి అధియాచించిన ఆవర ణను బట్టి అధియాచనకు సద్యః పూర్వము వాస్తవమైన స్వాధీన ములో కలిగియున్న వ్యక్తి అని అర్థము. లేక ఏ వ్యక్తిగాని అట్టి వాస్తవ స్వాధినము కలిగి యుండని సందర్భములో అట్టి ఆవరణ యజమాని అని అర్థము.

150. ఆస్తి నష్టమగుటకు, వృధా వ్యయమగుటకు లేదా దుర్వినియోగ మగుటకు సర్పంచు యొక్క కార్యనిర్వాహకాధికారి యొక్క, సభ్యులయొక్క బాధ్యత :— (1) పంచాయతీ యొక్క సర్పంచు, కార్యనిర్వాహకాధికారి, ప్రతి సభ్యుడు పంచాయతీ దైనట్టి లేదా దాని వశమందున్నట్టి ఎట్టి పైకమైనను లేదా ఇతర ఆస్తియైనను నష్టమగుటకు, వృధా వ్యయమగుటకు లేదా దుర్వినియోగమగుటకు ఆయన యొక్క అజాగ్రత్త లేదా దుర్నడత ప్రత్యక్ష కారణముగా ఉండిన ఎడల, అట్టి నష్టము నకు, వృధా వ్యయమునకు లేదా దుర్వినియోగమునకు బాధ్యుడై ఉండవలెను. కమీషనరు యొక్క అనుమతిని ముందుగా పొంది పంచాయతీ, తగిన విచారణాధికారముగల ఏ కోర్టులోనైన ఆయన మీద పరిహారముకొరకు దావా దాఖలు చేయవచ్చును.

(2) అట్టి ప్రతి దావా, చర్యాహేతువు ఏర్పడిన తేదీ నుండి మూడు సంవత్సరముల లోపల ప్రారంభింపబడవలెను.

151. పన్ను నిర్ధారణలు మున్నగు వాటి విషయమున నేరము మోప చేయుటకు వీలు లేకుండుట:— (1) ఈ చట్టముయొక్క అధికారమును బట్టి ఎట్టి పన్ను నిర్ధారణ చేయుట, లేక డిమాండు చేయుట లేక ఛార్జి (ఖర్చు) విధించుట గాని,

(ఎ) ఏ వ్యక్తి యొక్కయైన పేరు, నివాస స్థలమును వ్యాపార స్థలమును లేదా వృత్తి స్థలములను గురించి, లేక

(బి) ఏదైన ఆస్తిని లేక వస్తువులను వివరించుటను గురించి, లేక

(సి) నిర్ధారణ చేయబడిన, డిమాండు చేయబడిన లేక విధింపబడిన మొత్తమును గురించి,

ఏదైన వ్రాత పొరపాటు సంభవించినదనెడి కారణమువలన లేక ఏదైన తప్పు సంభవించినదనెడి కారణమువలన ముఖ్య విషయములలో నేరము మోపబడ కూడదు లేక మార్పుకు గురి చేయ బడ కూడదు. అయితే ఈ చట్టముయొక్క నిబంధనలు ఖచ్చితముగా పాటింపబడి యుండవలెను. ఈ చట్టమును బట్టి జరిగిన ఏ చర్యలను గాని వాటి రూపమందలి లోపముచేత మాత్రము ఏ న్యాయస్థానము వలననైనను కొట్టి వేయబడకూడదు లేక రద్దు చేయబడకూడదు.

(2) ఈ చట్టముయొక్క అధికారమును బట్టి వసూలు చేయబడిన ఏ పైకపు మొత్తము నైనను రాబట్టు కొనుటకు లేక సదరు అధికారము ననుసరించి పన్ను మొదలైనవి నిర్ధారణ చేసి నందువల్ల గాని పైకము వసూలు చేసినందువల్లగాని కలుగు నష్టమునకు గాను

నష్ట పరిహారము రాబట్టుకొనుటకు ఏ దావా గాని ఏ కోర్టులో నైనను తేబడకూడదు.

అయితే ఈ చట్టముయొక్క నిబంధనలు ముఖ్యవిషయములలో ఖచ్చితముగా పాటింపబడి యుండవలెను,

(3) ఈ చట్టము యొక్కయు దీని క్రింద చేయబడిన నియమములయొక్కయు, ఉప-నియమముల యొక్కయు నిబంధనలు ముఖ్య విషయములలో ఖచ్చితముగా పాటించబడినయెడల, ఈ చట్టము ననుసరించి చేసిన జప్తుతో లేక విక్రయముతో సంబంధము కలిగియుండు బిల్లు, నోటిసు, షెడ్యూలు, నమూనా, సమనులు, డిమాండు నోటీసు, జప్తువారంటు, వస్తువుల జాబితా లేక ఇతర ప్రొసీడింగులలో ఏ పొరపాటు, లోపము లేక క్రమలోపమైనను ఉన్నందువలన అట్టి జప్తు లేక విక్రయము చట్ట సమ్మతము కానిదిగా భావించబడకూడదు. మరియు దానిని చేయు ఏ వ్యక్తియైనను హద్దుమీరి నడచిన వ్యక్తిగా తలంపబడకూడదు.

అయితే ఏదైన క్రమలోపము వల్ల నష్టమునకు గురియైన ప్రతి వ్యక్తియు తనకు కలిగిన ప్రత్యేకమైన ఏ నష్టమును గురించి అయినను పరిహారము పొందవచ్చును.

(4) 1908 సివిలు ప్రొసీజరు కోడులో లేదా తత్కాలమందు అమలులో నుండు ఏ ఇతర చట్టములోనైన ఏదియున్నను దానితో నిమిత్తము లేకుండ, అసెస్సుమెంటు పుస్తకముల రివిజను లేక సవరణకు ఈ చట్టము ననుసరించి తీసికొనబడుచుండు లేక తీసికొనబడబోవు ఎట్టి ప్రొసీడింగునైనను నిలిపియుంచుటకు లేక అట్టి రివిజను లేక సవరణ అమలు జరుగకుండ నిలిపియుంచుటకు ఎట్టి కోర్టు

గాని ఎట్టి శాశ్వతపు లేక తాత్కాలికపు నివారణాజ్ఞను ఈయ కూడదు. లేక మధ్యకాలిక ఉత్తరువును చేయకూడదు.

152. పంచాయతీకి పోలీసు సహాయము:— ఒక గ్రామము ఏ పోలీసు అధికారియొక్క అధికార ప్రాంతములో నున్నదో అట్టి ప్రతి పోలీసు అధికారియు ఆగ్రామపంచాయతీ, దాని ఉద్యోగులు, నౌకర్లు, శాసన బద్ధమైన తమ అధికారమును వినియోగించుటలో వారికి తప్పక సహాయము చేయవలెను.

# 7 వ అధ్యాయము

## సివిలు మరియు క్రిమినలు న్యాయపాలన

### 1 వ భాగము—పరిష్కార సంఘము

153. నిర్వచనములు:— ఈ భాగములో "వివాదము" అనగా ఏ వివాదము విషయములో న్యాయ పంచాయతీ సివిలు దావాను విచారణకై స్వీకరించవచ్చునో ఆ వివాదము అని అర్థము.

154. పరిష్కార సంఘ నిర్మాణము:— (1) 2వ భాగముక్రింద ఒక న్యాయ పంచాయతీలో దావా వేయబడినపుడు 205వ విభాగముక్రింద అట్టి దావాకు సంబంధించిన దరఖాస్తు ఏ వ్యక్తికి పెట్టుకొనబడినదో ఆ వ్యక్తి, ఆ న్యాయ పంచాయతీ అధికార క్షేత్రము లోపల వున్నట్టి ఏ గ్రామము యొక్క స్థానిక హద్దుల లోపల—

(ఏ) ప్రతివాది లేక ఒకరికంటె ఎక్కువమంది ప్రతివాదు లున్నప్పుడు వారిలో ఒక్కొక్క ప్రతివాదియు, దావా ప్రారంభమైన సమయమున వాస్తవముగను ఐచ్ఛికముగను నివసించుచుండునో లేక వ్యాపారము చేయుచుండునో లేక ఆర్జనకై స్వయముగా పనిచేయుచుండునో లేక

(బి) ప్రతివాదులు ఒకరికంటె ఎక్కువమంది వున్నప్పుడు వారిలో దావా ప్రారంభమైన సమయమున వాస్తవముగాను, ఐచ్ఛికముగాను నివసించుచుందురో లేక వ్యాపారము చేయుచుందురో లేక ఆర్జనకై స్వయముగా పని చేయుచుందురో,

అయితే అట్టి కేసులో న్యాయ పంచాయతీ అనుమతి పొంద బడవలెను. లేక పైన తెలిపిన రీతిగా నివసించని లేక వ్యాపారము కొనసాగించని, లేక స్వయముగా ఆర్జనకై పనిచేయని ప్రతివాదులు అట్లు దావావేయుటకు సమ్మతించవలెను ; లేక

(సి) చర్యాహేతువు పూర్తిగా గాని, కొంతవరకు గాని ఏర్పడినదో,

ఆ గ్రామ పంచాయతీయొక్క సర్పంచుకు కక్షిదారుల మధ్య పరిష్కారము కుదుర్చుటకొరకై ప్రయత్నముచేయుటకు ఆ వివాద మును పంపవలెను.

అట్లు పంపు వ్యక్తిచే అందునిమిత్తముచేయబడిన గ్రామము యొక్క నిర్ణయము అంతిమమైనదిగా నుండవలెను. దానిపై ఎట్టి అప్పీలు గాని రివిజనుగాని వుండరాదు.

వివరణ :— రద్దుచేయబడిన లేక విఘటిత పరచబడిన పంచా యతీ విషయములో, పంచాయతీ విధులను నిర్వర్తించుటకై నియ మించబడిన వ్యక్తి ఈ భాగపు కార్యములనిముత్తము సర్పంచుగా భావించబడవలెను.

(2) ఆ విధముగా పంపబడిన తగాదా అందినమీదట అట్టి గ్రామపంచాయతీయొక్క సర్పంచు వెంటనే వాదినీ, ప్రతివాదినీ వారి తరపున పరిష్కార సంఘములో సభ్యులుగా నుండుటకు ప్రతి వైపునుండి ఒకరు లేక ఇద్దరు న్యాయ పంచాయతీ సభ్యులు కాని యితర వ్యక్తుల నామ నిర్దేశము 14 రోజులలోగా చేయమని కోర వలెను. ఆవిధముగా నామ నిర్దేశము చేయబడిన సభ్యులు ఏకగ్రీవముగా న్యాయ పంచాయతీ సభ్యుడు కాని, ఒక వ్యక్తిని ఆ పరిష్కార సంఘ అధ్యక్షునిగా 14 రోజుల లోపల ఎన్నుకొనవలెను, వాది గాని, ప్రతి

వాది గాని, ఆ విధముగా పరిష్కార సంఘ సభ్యుల నామనిర్దేశము చేయనియెడల లేక ఆ సభ్యులు పై విధముగా అధ్యక్షుని ఎన్నుకొనని యెడల, పరిష్కారము విఫలమైనట్లుగా భావించబడవలెను.

155. వ్యవహారములయొక్క స్థలము :- సంఘము తన వ్యవహారములను పంచాయతీ కార్యాలయము ఉన్నచో అందులో లేక గ్రామములోపల ఏ స్థలములో నైనను జరుపవచ్చును.

156. పరిష్కార ప్రొసీడింగుల ఆరంభము:— 154వ విభాగము క్రింద సంఘం ఏర్పాటు చేయబడిన వెంటనే సంఘాధ్యక్షుడు, వివాదమును విచారించుటకై ఏదేని, సమయమును, స్థలమును నిర్ణయించి వివాదముయొక్క కక్షిదారులకు తెలియజేయు నోటీసు నిచ్చుచు వారు హాజరగుటకు సబబైన గడువును ఈయవలెను.

(2) ఆ నోటీసులో ఆదేశింపబడిన ప్రకారముగ వివాదముయొక్క ఉభయ కక్షిదారులును సంఘము ఎదుట హాజరు కావలెను.

(3) పైన తెలిపిన ప్రకారముగా వివాదముయొక్క ఏ కక్షిదారైనను తగు కారణమువలన సంఘము ఎదుట హాజరుకాజాలనిచో ఆయన హాజరు కాజాలననియు అందుకు గల కారణమును సంఘమునకు అట్లు నిర్ణయింపబడిన తేదీ లేక అంతకుపూర్వము తెలియజేయవలెను. ఆ పైన సంఘము తనకు యుక్తమని తోచిన ప్రకారముగా వ్యవహారములను వాయిదావేయవచ్చును లేక రద్దుచేయవచ్చును.

(4) ఏ కక్షిదారైనను అట్టి నోటీసును పాటించకున్నచో ఆయన పది రూపాయలవరకు జరిమానాకు మరియు ఆ తరువాత కూడ పాటింపనిచో అట్టి పాటింపని ప్రతి పర్యాయము యిరువది రూపాయల జరిమానాకు పాత్రుడై యుండవలెను. జరిమానా న్యాయ

పంచాయతీచే విధింపబడిన జరిమానావలె వసూలుచేయబడి పంచా యతీ నిధికి జమకట్టబడవలెను.

(5) సంఘము వ్యవహారములలో ప్రజలను రానీయరాదు.

(6) సంఘ వ్యవహారములు 159వ విభాగములో నిబంధింపబడి నంతమేరకు తప్ప వ్రాతరూపములో నుండవలెను. సాధ్యమైనంత వరకు వరుసగా ఉండవలెను. 154 వ విభాగముక్రింద పంచాయతీ సర్పంచుకు వివాదము అందిన తేదీనుండి 90 దినములలోగా పూర్తి చేయబడవలెను.

(7) పైన తెలుపబడిన రీతిగా 90 దినముల లోపల పరిష్కా రము కుదరనిచో పరిష్కారపు వ్యవహారములు విఫలమైనట్లు భావింప బడవలెను.

157. సాక్షులు :— సంఘము కక్షిదారులు హాజరుపెట్టిన సాక్షులను గాని లేక తమకు తామై హాజరైన సాక్షులను గాని విచా రించవలెను. కాని ఏ సాక్షినైనను హాజరై సాక్ష్యమునీయవలసినదిగా సమను పంపి పిలిపించు అధికారము సంఘమునకు లేదు. ఎట్టి సాక్ష్య మునుకూడ వ్రాసియుంచరాదు.

158. సంఘము ప్రమాణము చేయించరాదు:— కక్షిదారులచేగాని వారి సాక్షులచే గాని ప్రమాణము చేయించు అధికారము సంఘ మునకుఉండరాదు.

159. పరిష్కార వ్యవహార ఫలితమును వ్రాసియుంచవలెను :— (1) పరిష్కార వ్యవహారములు ముగిసినమీదట లేక రద్దయినమీదట, అట్టి వ్యవహారముల ఫలితములను సంఘము వ్రాసియుంచవలెను. అందులో ఈ దిగువ వివరములను నిర్దిష్టపరచవలెను:—

(ఎ) వ్యవహారములు జరిగిన తేదీ, సమయము, స్థలము ;

(బి) కక్షిదారుల పేర్లు, వారియొక్క న్యాయసమ్మతమైన ప్రతినిధులు ఎవరైన హాజరైనచో వారి పేర్లు ;

(సి) ప్రతి కక్షిదారుని వాదనయొక్క సంగ్రహ వివరణ ;

(డి) వివాదము, దాని విషయము మరియు సాక్ష్య సంగ్రహము.

(ఇ) పరిష్కారము కుదిరినచో, అది ;

అయితే రాజీ ఏమియు కుదురనిచో పైన తెలిపిన (ఎ), (బి) (సి) అంశములను మాత్రమే పేర్కొని రాజీ కుదురలేదన్న విషయమునుకూడ వ్రాయవలెను.

(2) వ్యవహారముల రికార్డును (1) ఉప విభాగమునసుసరించి వ్రాసినతరువాత అందలి అంశములు ఉభయపక్షములవారికి చదివి వినిపించవలెను లేదా చదువుకొనుటకై వారికి ఈయవలెను. ఆ అంశములు సరిగా ఉన్నవని వారు అంగీకరించిన విషయమునుగూడ దానిపై వ్రాయవలెను. ఆ పైన ఆ వ్యవహారముల రికార్డుపై వివాదమునకు చెందిన ఉభయపక్షములవారును పరిష్కార సంఘ సభ్యులందరును సంతకములు పెట్టవలెను. సంఘాధ్యక్షుడు సదరు వ్యవహారముల రికార్డును వెంటనే న్యాయ పంచాయతీయొక్క న్యాయాధ్యక్షునికి పంపవలెను.

160. పరిష్కార వ్యవహారముల రిజిష్టరును నిర్వహించుట :— 154వ విభాగములో చెప్పబడిన సర్పంచు 159వ విభాగములో నిర్దిష్టము చేయబడిన వివరములను వ్రాయుచు పరిష్కార వ్యవహారముల రిజిష్టరు నొకదానిని నిర్వహించవలెను.

(2) వివాదపు కక్షిదారులు లేక వారి న్యాయసమ్మత ప్రతినిధులు సదరు వ్యవహారముల నకలు నొకదానిని ఒక్కొక్క నకలుకు ఒక రూపాయి చొప్పున చెల్లించి తీసుకొనుటకు హక్కు కలిగియుండవలెను. అట్లు ఈయబడిన ప్రతి నకలుపైనను దరఖాస్తుదారు పేరు, దరఖాస్తు యిచ్చిన తేదీ, నకలు యిచ్చిన తేది వ్రాయబడి సంఘాధ్యక్షునిచే ధృవీకరింపబడవలెను.

161. పరిష్కారమును అమలుపరచుట :— (1) సంఘముచే చేయబడిన పరిష్కారము న్యాయ పంచాయతీ లేక విచారణాధికారములు గల కోర్టుచే ఈయబడిన డిక్రీ లేక ఉత్తరువువలె భావించబడి అమలుపరచబడవలెను.

(2) పరిష్కారము అమలుపరుపబడిన విషయమును న్యాయ పంచాయతీ గాని లేదా సందర్భమునుబట్టి కోర్టు గాని 154వ విభాగమునందు చెప్పబడిన సర్పంచుకు తెలియచేయవలయును. సర్పంచు అ విషయమును 160వ విభాగము ననుసరించి నిర్వహింపబడుచున్న రిజిష్టరులో వ్రాసుకొనవలెను.

(3) పత్రముల రిజిస్ట్రేషనుకు సంబంధించి తత్కాలమున అమలులోనున్న శాసనములో ఏమి వున్నప్పటికిని, 159వ విభాగము ననుసరించి జరిగిన పరిష్కారము రిజిష్టరు చేయబడుటకు పాత్రము కారాదు.

162. వ్యవహారములను రహస్యముగా ఉంచుట:- (1) సంఘము యొక్క ఎట్టి సభ్యుడు గాని అధ్యక్షుడు గాని పరిష్కార వ్యవహారముల సందర్భమున తనకు తెలియవచ్చిన ఏ విషయమునైనను ఏ వ్యక్తికి గాని, కోర్టుకు గాని, అధికారికి గాని వెల్లడించరాదు. అట్టి

వ్యవహారములకు సంబంధించిన ప్రశ్నకు సమాధానము ఈయవలసి నదిగా అతనిని ఎట్టి కోర్టు గాని, అధికారి గాని నిర్బంధము చేయ రాదు.

163. ఈ భాగపు కార్యముల నిమిత్తము నియమములు చేయుటకు ప్రభుత్వమునకు అధికారము :— ప్రభుత్వమువారు ఆంధ్రప్రదేశ గెజెట్‌లో ప్రకటనద్వారా—

(ఎ) సంఘ కార్యకలాపముల నిర్వహణను ;

(బి) సంఘముపై వినియోగించబడదగు నియంత్రణము ;

(సి) ఈ భాగపు నిబంధనలను అమలుపరచు నిమిత్తము అవసరమైన మరే విషయమునైనను క్రమబద్ధముచేయుచు నియమములను చేయవచ్చును.



# 2వ భాగము

## న్యాయ పంచాయతీలు

164. నిర్వచనములు:— ఈ భాగములో—

(ఎ) "కేసు" అనగా న్యాయ పంచాయతీచే విచారింపబడదగు ఏ నేరమును గురించియైన జరుపబడు క్రిమినలు వ్యవహారము అని అర్థము.

(బి) "దావా" అనగా న్యాయ పంచాయతీచే విచారింపబడదగు సివిలు దావా అని అర్థము.

165. న్యాయ పంచాయతీల స్థాపన:— నిర్ణయింపబడునట్టి నియమములకు లోబడి కలెక్టరు, సివిలు మరియు క్రిమినలు న్యాయ నిర్వహణ నిమిత్తము ప్రకటన ద్వారా, అట్టి ప్రకటనలో నిర్దిష్టము చేయబడు విధముగా అయిదింటికి మించకుండను మూడింటికి తగ్గకుండను గ్రామముల సముదాయమునకై న్యాయ పంచాయతీ నొకదానిని స్థాపించవచ్చును.

166. న్యాయ పంచాయతీ నిర్మాణము:— ప్రతి న్యాయపంచాయతీలోను ఈ దిగువ సభ్యులుండవలెను. (*i*) న్యాయ పంచాయతీ స్థాపింపబడిన గ్రామ సముదాయ మందలి ప్రతి గ్రామము యొక్క పంచాయతీచే ఈ క్రింది సభ్యులలో నుండి నిర్ణీత విధముగా ఎన్నుకొనబడవలసిన ఒక సభ్యుడు:—

(ఎ) పంచాయతీ సర్పంచు మినహా పంచాయతీ సభ్యులు, లేక

(బి) పంచాయతీ సభ్యులుగా వుండుటకు అనర్హులు కాని గ్రామములో నివసించే ఇతర వ్యక్తులు ;

(*ii*) షెడ్యూలు కులములకు, లేక షెడ్యూలు తెగలగు ప్రాతినిధ్యము వహించు ఒక సభ్యుడు, స్త్రీలకు ప్రాతినిధ్యము వహించు ఒక సభ్యురాలు ; వీరు అట్టి సముదాయములోని అన్ని పంచాయతీల సభ్యులచే సమిష్టిగా ఈ క్రింది వారిలో నుండి నిర్ణీత విధముగా ఎన్నుకొనబడ వలెను:—

(ఎ) అట్టి సముదాయములోని అన్ని పంచాయతీలలోని షెడ్యూలు కులాల లేక షెడ్యూలు తెగల సభ్యులు లేక సందర్భమునుబట్టి సభ్యురాండ్రు, లేక

(బి) ఒక పంచాయతీ సభ్యులుగా వుండుటకు అనర్హులు కానట్టి గ్రామ సముదాయములోని పదేని గ్రామములో నివసించు చున్న షెడ్యూలు కులాలకు లేక షెడ్యూలు తెగలకు చెందిన ఇతర వ్యక్తులు లేక సందర్భమునుబట్టి ఇతర స్త్రీలు.

వివరణ:— ఒక పంచాయతీ రద్దు లేక విఘటన, అట్లు రద్దు చేయబడిన లేక విఘటన చేయబడిన పంచాయతీ సభ్యుడుగా వుండిన న్యాయపంచాయతీ సభ్యుడు, ఆ న్యాయ పంచాయతీ సభ్యుడుగా కొనసాగుటకు అనర్హునిగా చేయునట్లు భావింపబడరాదు.

167. న్యాయపంచాయతీ సభ్యుల పదవీకాల పరిమితి:— (1) ఈ భాగములో మరొక విధముగా నిబంధింపబడినట్లు తప్ప, న్యాయ పంచాయతీ సభ్యుల పదవీ కాలపరిమితి 168వ విభాగము క్రింద దాని న్యాయాధ్యక్షుడు ఎన్నుకొనబడిన తేదీ నుండి మూడు సంవత్సరములు వుండవలెను.

(2) పదవి నుండి తొలగిపోయే సభ్యుల పదవీ కాల పరిమితి పునర్నిర్మాణము చేయబడిన పంచాయతీ న్యాయాధ్యక్షుడు ఎన్నుకొనబడిన తేదీకి సద్యఃపూర్వపు దినము వరకు ఉండునట్లు లేక ఆ తేదీన అంతమగునట్లు భావింపబడవలెను.

(3) న్యాయ పంచాయతీ సభ్యుల పదవిలో ఏర్పడు సాధారణ ఖాళీలు, యాదృచ్ఛిక ఖాళీలు 168వ విభాగపు నిబంధనల ప్రకారము సందర్భానుసారముగా సాధారణ ఎన్నికలలో లేక యాదృచ్ఛిక ఎన్నికలలో భర్తీచేయబడవలెను. ఆ విభాగములో ఎన్నిక విషయము నిర్దిష్టముగా నిబంధింపబడని ఖాళీలు నిర్ణయింపబడునట్టి విధముగా భర్తీచేయబడవలెను ఒక యాదృచ్ఛిక ఖాళీలో ఎన్నుకొనబడిన సభ్యుడు వెంటనే పదవిలో చేరవలెను. అయితే అయన ఏ సభ్యుని స్థానములో ఎన్నుకొనబడినాడో ఆ సభ్యుడు ఖాళీ ఏర్పడకుండిన యెడల ఎంత కాలము వరకు పదవియందు వుండుటకు హక్కు కలిగియుండెడివాడో అంత కాలము వరకు మాత్రమే పదవియందుండవలెను.

168. న్యాయపంచాయతీ న్యాయాధ్యక్ష, న్యాయ ఉపాధ్యక్షుల ఎన్నిక:— 166వ విభాగము క్రింద సభ్యుల ఎన్నిక జరిగిన తర్వాత సాధ్యమైనంత శీఘ్రముగా మరియు ఇందు నిమిత్తమై చేయబడు నియమములకు లోబడి, న్యాయపంచాయతీ సభ్యులు, ఈ కార్యమునకై ఏర్పాటు చేయబడిన సమావేశములో తమలోనుండి ఒక వ్యక్తిని న్యాయపంచాయతీ యొక్క న్యాయాధ్యక్షునిగను మరొకరిని న్యాయఉపాధ్యక్షునిగను ఎన్నుకొనవలయును.

169. సభ్యుల, న్యాయాధ్యక్ష, న్యాయఉపాధ్యక్షుల రాజీనామా:— (1) న్యాయపంచాయతీ సభ్యుడు లేక న్యాయ ఉపాధ్యక్షుడు దాని న్యాయాధ్యక్షునకు వ్రాతమూలకముగా నోటీసునిచ్చి తన పదవికి

రాజీనామా చేయవచ్చును. అట్టి రాజీనామా న్యాయాధ్యక్షునకు అది అందిన తేదీన అమలులోనికి రావలెను.

(2) న్యాయ పంచాయతీ న్యాయాధ్యక్షుడు న్యాయ పంచాయతీకి వ్రాతమూలకమైన నోటీసునిచ్చి తన పదవికి రాజీనామా చేయవచ్చును అట్టి రాజీనామా అది న్యాయ పంచాయతీ సమావేశములో పెట్టబడిన తేదీన అమలులోనికి రావలెను.

(3) న్యాయాధ్యక్షుడు గ్రామములో లేని యెడల లేక తీవ్రమైన జబ్బుతో అశక్తుడైన యెడల, (1)వ ఉపవిభాగములో చెప్పబడిన నోటీసు న్యాయ పంచాయతీకి ఇవ్వవలెను. అట్టి రాజీనామా న్యాయ పంచాయతీ సమావేశము ముందుంచిన తేదీనుండి అమలులోనికి రాగలదు.

170. న్యాయ పంచాయతీయొక్క న్యాయాధ్యక్ష, న్యాయ ఉపాధ్యక్ష, సభ్యుల సస్పెన్షను లేక తొలగింపు:- (1) అధికారముగల జిల్లా మున్సబు, న్యాయ పంచాయతీ యొక్క న్యాయాధ్యక్షుని, న్యాయ ఉపాధ్యక్షుని, లేక సభ్యులను అశక్తి కారణముగాగాని, కర్తవ్యమును ఉపేక్షించిన కారణముగా గాని, దుష్ప్రవర్తన కారణముగా గాని సస్పెండు చేయవచ్చును లేక పదవిలోనుండి తొలగింపవచ్చును.

అయితే సంబంధించిన వ్యక్తికి తన విన్నపము చెప్పుకొనుటకు అవకాశమీయకుండ అట్టి ఉత్తరువు ఏదీ చేయరాదు.

(2) సస్పెన్షను లేక తొలగింపుయొక్క ప్రతి ఉత్తరువుపైనను జిల్లా మరియు సెషన్సు జడ్జికి ఒక నెలలోపల అప్పీలు దాఖలుచేసుకొనవచ్చును. ఆయన తీర్పు అంతిమమైయుండవలెను.

(3) (1)వ ఉపవిభాగము ననుసరించి సస్పెండు చేయబడిన లేక తొలగింపబడిన వ్యక్తి ఒక పంచాయతీ సభ్యుడు అయినచో, అట్టి

సస్పెన్షను లేక తొలగింపు కారణమువలన మాత్రమే పంచాయతీ సభ్యుడుగా ఉండుటకు అయోగ్యుడు కాజాలడు.

(4) న్యాయ పంచాయతీలోనుండి (1)వ ఉప విభాగముననుసరించి తొలగింపబడిన వ్యక్తి న్యాయపంచాయతీలో సభ్యుడుగా తిరిగి తొలగింపబడిన తేదీనుండి ఐదు సంవత్సరములవరకు ఎన్నుకొనబడుటకు అర్హుడు కారాదు.

171. న్యాయ పంచాయతీ ముద్ర :- ప్రతి న్యాయ పంచాయతీకి నిర్ణయింపబడిన ఆకారము, కొలతలు గల ముద్ర ఒకటి ఉండవలెను.

172. న్యాయపంచాయతీ కార్యకలాపముల నిర్వహణ :- (1) న్యాయపంచాయతీ తన కార్యకలాపములను నిర్వహించు విషయమున నిర్ణయింపబడు నియమముల ననుసరించవలెను.

(2) న్యాయ పంచాయతీ ఎదుట ఇచ్చిన వాఙ్మూల సాక్ష్యము ప్రమాణము లేదా పవిత్రమైన అంగీకారముతో ఉండవలెను. మరియు ప్రతి వ్యక్తి చెప్పిన విషయను సంగ్రహముగా వ్రాయబడి నిర్ణయించిన పద్ధతిలో రికార్డులో భాగముగా పెట్టవలెను.

(3) ఈ చట్టములో లేక దీని క్రింద చేయబడిన నియమములలో ఇతర విధముగా నిబంధింపబడినట్లు తప్ప 1872 భారత సాక్ష్యముల చట్టముయొక్కయు 1898 క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ యొక్కయు 19(8 సివిల్ ప్రొసీజర్ కోడ్ యొక్కయు నిబంధనలు న్యాయ పంచాయతీ ప్రొసీడింగులకు వర్తించరాదు,

173. న్యాయపంచాయతీ సమావేశమునకు అధ్యక్షత :- ప్రతి న్యాయ పంచాయతీకి న్యాయాధ్యక్షుడు అధ్యక్షత వహించవలెను,

ఆయన హాజరు కానప్పుడు న్యాయ ఉపాధ్యక్షుడు అధ్యక్షత వహించవలెను. న్యాయాధ్యక్షుడు, న్యాయ ఉపాధ్యక్షుడు - వీరిద్దరు హాజరు కానప్పుడు అప్పటికి అధ్యక్షత వహించుటకై న్యాయ పంచాయతీచే ఎన్నుకొనబడిన ఒక సభ్యుడు అధ్యక్షత వహించవలెను.

174. న్యాయ పంచాయతీ సమావేశములలో కోరం మరియు తీర్పు :- న్యాయ పంచాయతీ సమావేశముల కోరం నిమిత్తము సభ్యులు ముగ్గురుండవలెను. హాజరైన సభ్యులలో అధిక సంఖ్యాకుల తీర్పు న్యాయ పంచాయతీ తీర్పు అగును.

175. న్యాయ పంచాయతీలకు పూర్తి సివిల్ క్రిమినల్ అధికారము :- 1898 క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ లో లేక 1908 సివిల్ ప్రొసీజరు కోడ్‌లో లేక రెవెన్యూ కోర్టులో విచారణకై స్వీకరించదగు దావాలకు లేక దరఖాస్తులకు సంబంధించిన తత్కాలమందు అమలునందున్న ఏదైన ఇతర శాసనములో ఏమి యున్నప్పటికిని దానితో నిమిత్తము లేకుండును. ఈ చట్టపు నిబంధనలకు లోబడియు న్యాయ పంచాయతీలు 176వ విభాగములో నిర్దిష్టపరచ బడినట్టి దావాలను, 195వ విభాగములో నిర్దిష్ట పరచబడినట్టి నేరములను విచారించుటకు పూర్తి అధికారమును కలిగియుండవలెను

## సివిలు విచారణాధికారము

176. న్యాయ పంచాయతీచే స్వీకరించబడదగు దావాలు:- ప్రభుత్వము ఆంధ్రప్రదేశ గెజిట్‌లో ప్రకటనద్వారా అట్టి ప్రకటనలో పేర్కొనబడిన తేదీనుండి ఈ దిగువ తెలుపబడిన ఏ దావానైనను, దాని విలువ 250 రూపాయలకు మించియుండనిదైనచో న్యాయ పంచాయతీ స్వీకరించుటకు అధికారమివ్వవచ్చును.

(ఎ) (జి) ఖండములో మరొకవిధముగా నిబంధింపబడి యున్నట్లు తప్ప స్థిరాస్తికి సంబంధించిన ఖరారు కాక మరొక ఖరారుమూలమున రావలసిన డబ్బును రాబట్టుకొనుటకైన దావా;

(బి) చరాస్తిని గాని అట్టి ఆస్తి మూల్యమును గాని రాబట్టు కొనుటకైన దావా ;

(సి) చరాస్తి అక్రమముగా తీసుకొన్నందుకు గాని దానికి నష్టము కలిగించినందుకు గాని పరిహార నిమిత్తమైన దావా ;

(డి) పశువుల అక్రమ ప్రవేశమువలన కలిగిన నష్టమునకు పరి హార నిమిత్తమైన దావా ;

(ఇ) స్థానిక అధికార సంస్థకు రావలసిన పన్ను, రుసుము లేక తదితరమైన మొత్తముయొక్క చెల్లింపు నిమిత్తమైన దావా ;

(ఎఫ్) పంచాయతీనుండి రావలసిన పన్ను, రుసుము లేక తది తరమైన మొత్తమును వాపసు అడుగుటకైన దావా ;

(జి) భూమియొక్క కౌలు ధనము నిమిత్తమైన దావా.

(2) రైపేరియన్ ఈజిమెంట్లు కాక ఇతర ఈజిమెంట్లకు సంబంధించిన దావాలుకూడ న్యాయ పంచాయతీచే విచారణకు స్వీక రించబడవలెను.

177. న్యాయ పంచాయతీచే స్వీకరింపబడవగని దావాలు :— న్యాయపంచాయతీకి ఈ దిగువ దావాలను స్వీకరించుటకు అధికార ముండదు.

(i) భాగస్వామ్యపు లెక్కల శేష ధనమును కక్షిదారులుగాని వారి ఏజంట్లు గాని కొట్టివేసిననే తప్ప అట్టి శేషధనము నిమిత్తమై వేసిన దావా ;

(ii) వీలునామా లేకుండ సంక్రమించిన వాటా లేక వాటాలోని భాగమునకు గాని వీలునామా ప్రకారము సంక్రమించిన ఆస్తి లేక ఆస్తిలోని భాగమునకు గాని సంబంధించిన దావా;

(iii) రాష్ట్రప్రభుత్వము లేక కేంద్ర ప్రభుత్వముచే వేయబడిన లేదా ఒక ప్రభుత్వోద్యోగి తన అధికారహోదాలో చేసిన పనులను పురస్కరించుకొని అతనిచే లేక అతనిపై వేయబడిన దావా;

(iv) 176వ విభాగపు (జి) ఖండములో తెలిపిన దావా మినహా ఒక రెవెన్యూ కోర్టుచే దావా లేక దరఖాస్తు విచారణకై స్వీకరించబడదగు ఏదైన వివాదమును లేక విషయమును పురస్కరించుకొని దాఖలు చేయబడు దావా.

178. దావాల రాజీ :- ఒక దావా ప్రమాణపూర్వకముగా గాని న్యాయ సమ్మతమైన ఒడంబడిక రాజీ లేక ప్రతిఫలము మూలముగా గాని సంపూర్ణముగా లేక కొంత భాగము పరస్పరముసర్దుబాటు చేసికొనబడినదని తమకు సంతృప్తికరముగా ఋజువుచేయబడినచో న్యాయ పంచాయతీ అట్టి ఒడంబడికను, రాజీ లేక ప్రతిఫలమును వ్రాసియుంచవలసినదిగా ఉత్తరువుచేసి ఆ దావాకు సంబంధించినంత వరకు ఆ ప్రకారముగనే డిక్రీ ఈయవలెను.

అయితే న్యాయ పంచాయతీ ఈ విభాగముక్రింద ఒడంబడిక, లేక రాజీ ప్రతిఫలము ననుసరించి డిక్రీ ఈయనిచో అందుకు గల కారణములను అది వ్రాసియుంచవలెను.

179. దావా దాఖలుచేయవలసిన న్యాయ పంచాయతీ :- న్యాయ పంచాయతీచే స్వీకరింపబడదగు ప్రతి దావాయు—

(ఏ) ప్రతివాది లేదా ఒకరికన్న ఎక్కువమంది ప్రతివాదు లున్నచో వారిలో ఒక్కొక్కరును దావా ప్రారంభమైన సమయ ములో ఏ న్యాయ పంచాయతీయొక్క స్థానిక హద్దులలో వాస్తవ ముగాను, ఐచ్ఛికముగాను నివసించుచున్నారో లేదా వ్యాపారము చేయుచున్నారో లేదా ఆర్జన నిమిత్తము స్వయముగా పనిచేయు చున్నారో ఆ న్యాయ పంచాయతిలో దాఖలు చేయబడవలెను; లేక

(బి) ఒకరికన్న ఎక్కువమంది ప్రతివాదులున్న సందర్భములో వారిలో ఎవరైనను దావా ప్రారంభమైన సమయములో ఏ న్యాయ పంచాయతీయొక్క స్థానిక హద్దులలో వాస్తవముగాను ఐచ్ఛికము గాను నివసించుచుందురో లేదా వ్యాపారముచేయుచుందురో లేదా ఆర్జన నిమిత్తము స్వయముగా పనిచేయుచుందురో ఆ న్యాయ పంచా యతీలో దాఖలుచేయబడవలెను; అయితే అట్టి సందర్భములో న్యాయ పంచాయతీ అనుమతి పొందబడవలెను. లేక పైన చెప్పిన రీతిగా నివసించుచుండని ప్రతి వాదులు అట్లు దాఖలుచేయుటకు సమ్మతించవలెను; లేక.

(సి) ఏ న్యాయ పంచాయతీయొక్క స్థానిక హద్దులలో చర్యా హేతువు పూర్తిగా గాని కొంతవరకు గాని పర్పడునో ఆ న్యాయ పంచాయతీలో దాఖలు చేయబడవలెను.

వివరణ :— ఒక వ్యక్తి ఒక స్థానములో శాశ్వత నివాస స్థానము కలిగియుండి మరొక స్థలములో తాత్కాలిక నివాస స్థానముకూడ కలిగియున్న సందర్భములో ఆయన తాత్కాలిక నివాసము కలిగియున్న స్థలములో పర్పడు పదైనా చర్యాహేతువు విషయములో ఆయన రెండు స్థలములలోను నివసించుచున్నట్లు భావింపబడవలెను.

180. దావాలలో మొత్తము క్లెయిమును చేర్చుట :- (1) న్యాయ పంచాయతీకి దాఖలుచేయబడిన ప్రతి దావాలో వివాద విషయము పురస్కరించుకొని వాది ఎంత మొత్తమును క్లెయిము చేయుటకు హక్కు కలిగివున్నాడో అంత మొత్తము పూర్తిగా చేర్చబడవలెను. కాని ఆ దావాను న్యాయ పంచాయతీయొక్క విచారణాధికారము క్రిందికి తెచ్చు నిమిత్తము అతడు తన క్లెయిములో ఏదేని భాగమును వదలుకొనవచ్చును.

(2) ఒకవేళ వాది తన క్లెయిములో ఏదేని భాగమునుగురించి బుద్ధిపూర్వకముగా దావా వేయుటకు మానినచో లేక వదలుకొన్నచో అట్లు దావా వేయుట మానిన లేదా వదలుకొన్న భాగమును గురించి ఆ తరువాత అతడు దావా వేయకూడదు.

181. న్యాయ పంచాయతీ సమక్షములో దావాల్లో ప్రొసీడింగుల ప్రారంభము :— నాయ్య్య పంచాయతీలో దాఖలుచేయబడిన దావాకు సంబంధించిన ప్రొసీడింగులు, 159వ విభాగపు (2)వ ఉపవిభాగము క్రింద పరిష్కార వ్యవహారముల రికార్డు ఆ తగాదా విషయములో పరిష్కార వ్యవహారములు విఫలమైనవని తెలిపినప్పుడు మాత్రమే ప్రారంభించబడవలెను.

182. న్యాయ పంచాయతీచే స్వీకరింపబడరాని విషయములను గురించి సందర్భవశముగా నిర్ణయముచేయుట -: న్యాయ పంచాయతీచే ఒకదావాపై తీర్పుచెప్పబడునప్పుడు, స్థిరాస్తికి సంబంధించిన హక్కు విషయమునగాని కక్షిదారుల న్యాయ సమ్మతమైన స్థానమునుగురించి గాని కక్షిదారులకు ఎవరివలన హక్కు సంక్రమించినదో వారి స్థానమును గురించి గాని ఏదైన ఖరారు లేక బాధ్యతయొక్క ఉనికిని గురించి గాని ఆ దావాకు సంబంధించిన కక్షిదారుల మధ్య వివాదము ఏర్పడి ఆ వివాద విషయమే ఆ దావాలోని ముఖ్యవిషయమై

వుండినచో అది ఈ చట్టము ననుసరించి న్యాయ పంచాయతీచే స్వీక రింపబడరానిదై ఉండినప్పటికిని దానిని కూడ సందర్భవశమున పరి ష్కరించుట అవసరముగా వుండినచో న్యాయ పంచాయతీ అట్టి దావాపై తీర్పు చెప్పుటకు అవసరమైనంత మేరకు మాత్రమే అట్టి హక్కు, న్యాయ సమ్మత స్థానము, ఖరారు లేక బాధ్యతకు సంబం ధించిన వివాదములను పరిష్కరించుటకు న్యాయ పంచాయతీకి అధి కార ముండును. కాని అట్టి పరిష్కారము ఆ కక్షిదారుల మధ్యనే లేక వారి ప్రతినిధుల మధ్యనే జరుగుచున్నదైనను సరే మరొక వ్యవ హారములో అట్టి హక్కుకు న్యాయసమ్మత స్థానమునకు ఖరారు లేక బాధ్యతకు నిదర్శనముగా ఉండరాదు.

183. స్వయముగా హాజరగుట లేక ప్రతినిధిని పంపుట :— ఒక దావాకు సంబంధించిన ఏ కక్షిదారుని పక్షమున నైనను న్యాయ పంచాయతీ సమక్షమున ఎట్టి న్యాయవాది గాని, అతనికి న్యాయ వాద యోగ్యతలు ఉన్నను సరే లేకున్నను సరే హాజరగుటకు అనుమతింపబడరాదు. కాని ఏ కక్షిదారైనను తన పక్షమున హాజరై వాదించు నిమిత్తము నౌకరుకు, గుమాస్తాకు, భాగస్వామికి, చుట్ట మునకు లేక స్నేహితునకు అధికారము ఈయవచ్చును.

అయితే, న్యాయము జరుగునిమిత్తము అవసరమని న్యాయ పంచాయతీ భావించినచో దావాకు సంబంధించిన కక్షిదారులలో ఎవరినైనను స్వయముగా హాజరు కావలసినదిగా ఆదేశించుటకు న్యాయ పంచాయతీకి అధికారముండును. అట్లు ఆదేశింపబడిన కక్షి దారు స్వయముగా హాజరు కాకున్నచో అతడు స్వయముగా గాని ప్రతినిధిద్వారా గాని హాజరుకాకుండినచో ఎట్టి ఫలితములను పొంద గలిగియుండెడి వాడో అట్టి ఫలితములకే లోబడి యుండవలెను.

184. దావాలలో స్వయముగా హాజరగుటనుండి కొందరు వ్యక్తులకు మినహాయింపు :— దేశ సంప్రదాయ ఆచారములనుబట్టి ప్రజల ఎదుట హాజరు కావలసినదిగా నిర్బంధించదగనట్టి స్త్రీలును, కోర్టులలో స్వయముగా హాజరగుటనుండి మినహాయింపబడిన వ్యక్తులును, వ్యాధి లేక శారీక అశక్తత కారణమున తీవ్రమైన అసౌకర్యమునకు పాల్పడకుండ హాజరు కాజాలనట్టి వ్యక్తియును ఏ దావాలోనైనను న్యాయ పంచాయతీ ఎదుట స్వయముగా హాజరగుటనుండి మినహాయింపబడవలెను. కాని అట్టి ఏ వ్యక్తియొక్క సాక్ష్యమైనను అవసరమైనచో న్యాయ పంచాయతీ అట్టి వ్యక్తియొక్క సాక్ష్యమును అతని లేక ఆమె గృహములో తీసికొనవలెను.

185. కాలపరిమితి :- 1908 భారత కాలపరిమితి చట్టముయొక్క నిబంధనలు ఈ చట్టము ననుసరించి న్యాయ పంచాయతీ స్వీకరింపబడదగు దావా లకు వర్తించవలెను.

186. కక్షిదారుల మరణము :- దావాలో డిక్రీ ఇచ్చుటకు ముందే వాది గాని, ప్రతివాది గాని మరణించినచో ప్రతి కక్షిదారు గాని మరణించిన వ్యక్తియొక్క న్యాయసమ్మతపు ప్రతినిధి గాని దరఖాస్తు పెట్టుకొన్నచో మరణించిన వ్యక్తి స్థానమున రికార్డులో అతని చట్ట సమ్మత ప్రతినిధి పేరు వ్రాయబడవచ్చును. కాని మరణించిన ప్రతివాదియొక్క న్యాయసమ్మత ప్రతినిధికి ప్రతికూలముగా మరణించిన వ్యక్తినుండి అతనికి లభించిన మరియు తగు రీతిగా లెక్కజూపబడని ఆస్తుల విలువకు మించి ఎట్టి డిక్రీకూడ ఈయబడరాదు.

(2) వాది లేక ప్రతివాది మరణించిన తేదీనుండి అరువది దినముల లోపల అట్టి ఏ దరఖాస్తుకూడ పెట్టుకొనబడనిచో ఆ దావా కొట్టివేయబడవలెను. మరియు ఆ వివాద కారణమునుబట్టియే మరల దావా వేయుటకు అనుమతింపబడరాదు.

(3) ఒకరికన్న ఎక్కువమంది వాదులు గాని, ప్రతివాదులు గాని వుండి అందులో ఎవరైన చనిపోయి అతని ప్రతినిధి పైన తెలిపిన విధముగా చేర్చబడనిచో ఆ దావా బ్రతికియున్న వాది లేక వాదుల కోరికపై లేక బ్రతికియున్న ప్రతివాది లేక ప్రతివాదులపై కొనసాగింపబడవలెను.

(4) డిక్రీ పూర్తిగా అమలుజరుపబడకముందే డిక్రీదారు చనిపోయినచో ఆ మరణించిన వ్యక్తి స్థానమున డిక్రీదారుగా తన పేరును చేర్చవలసినదిగా కోరుచు అతని చట్ట సమ్మత ప్రతినిధి న్యాయ పంచాయతీకి దరఖాస్తు పెట్టుకొనవచ్చును. న్యాయ పంచాయతి నిర్ణీత ఋణగ్రస్తునికి నోటీసు నిచ్చిన పిమ్మట మరణించిన వ్యక్తికి దరఖాస్తుదారే న్యాయ సమ్మత ప్రతినిధి యని సంతృప్తిపడినచో డిక్రీదారుగా రికార్డులో అతని పేరు వ్రాయవలెను.

(5) నిర్ణీత ఋణగ్రస్తుడు డిక్రీ పూర్తిగా అమలుపరచబడక ముందు మరణించినచో డిక్రీదారు దరఖాస్తు పెట్టుకొనినమీదట దానిని నిర్ణీత ఋణగ్రస్తుని యొక్క న్యాయసమ్మత ప్రతినిధిపై మరణించిన వ్యక్తినుండి లభించిన మరియు తగు విధముగా లెక్కజూపబడని ఆస్తులమేరకు అమలు జరిపించవచ్చును.

187. న్యాయ పంచాయతీ కొన్ని దావాలను జిల్లా మునిసిఫ్‌కు బదిలీ చేయవచ్చును :- ఒక దావాకు సంబంధించిన ప్రొసీడింగుల యొక్క ఏ దశయందుగాని, ఆ దావా జిల్లా మునిసిఫ్‌చే నిర్ణయించబడవలసిన క్లిష్టమైన అంశముతో కూడియున్నదని న్యాయ పంచాయతీకి తోచినయెడల అది తనంత తానుగా లేక కక్షిదారులలో ఎవరైనా దరఖాస్తు పెట్టుకొన్నమీదటగాని ఆ దావాను అధికారము గల జిల్లా మునిసిఫ్‌కు సమర్పించవలెను. జిల్లా మునిసిఫ్ దానిని తన కోర్టుకు బదిలీచేసుకొనవచ్చును.

188. కొన్ని దావాల బదిలీ :— (1) అధికారము గల జిల్లా మునిసిఫ్ న్యాయము జరుగుటకు అవసరమని తాను భావించినప్పుడు ఒక న్యాయ పంచాయతీ సముఖమున పెండింగులోవున్న ఏదైనా దావాను తన కోర్టుకు గానీ, తన అధికార క్షేత్రములోపల నున్న ఏదైనా ఇతర న్యాయ పంచాయతీకి గాని బదిలీ చేయవచ్చును.

(2) ఏదైనా న్యాయ పంచాయతీ రద్దుచేయబడి దాని స్థానములో వెంటనే క్రొత్త న్యాయ పంచాయతీ ఏదీ గాని ఏర్పాటు చేయబడని సందర్భములో అట్టి న్యాయ పంచాయతీ సముఖమున ఉన్న అన్ని దావాలను, ప్రొసీడింగులను జిల్లా మునిసిఫ్ తన కోర్టుకు గాని, తన అధికార క్షేత్రములోపల వున్న ఏదైనా ఇతర న్యాయ పంచాయతీకిగాని బదిలీచేయవలెను.

189. విచారణ ముగిసినమీదట న్యాయ పంచాయతీ డిక్రీ ఈయవలెను:-ఉభయ పక్షముల యొక్క లేదా వారి ప్రతినిధుల యొక్క వాదములను విని ఉభయ పక్షముల సాక్ష్యమును పరిశీలించినమీదట న్యాయపంచాయతీకి న్యాయమని తోచినవిధముగా డిక్రీ ఈయవలెను.

190. డిక్రీలో ఉండవలసిన అంశములు.— డిక్రీలో దావా సంఖ్యయు ఉభయ కక్షిదారుల పేర్లును, క్లెయిము వివరములును, పరీక్షింపబడిన సాక్షుల పేర్లును, చదువబడిన ప్రదర్శిత పత్రముల పేర్లును, దానిపై ఇచ్చిన తీర్పును, అట్టి తీర్పునకుగల కారణములును ఉండవలెను. ఇంతే కాక తీర్పు ద్వారా ఈయబడిన మొత్తమును, ఈయవలసిన చరాస్థిని, అది ఈయకున్నచో చెల్లించవలసిన మొత్తమును అట్టి ఖర్చులను, ఎవరెవరు ఎంతెంత చెల్లించవలసియున్నదియు అందులో వ్రాయబడవలెను.

డిక్రీ ఏ దినమున ఈయబడినదో ఆ తేది దానిపై వేసి దానిని ఆమోదించిన న్యాయ పంచాయతీ సభ్యులు సంతకములు చేయవలెను. ఆమీదట డిక్రీ ప్రతి కక్షి దారునకు నిర్ణీత విధమున ఈయబడవలెను.

191. వడ్డీ చెల్లించ వలసినదిగా లేదా వాయిదాలలో చెల్లింపు చేయవలసినదిగా డిక్రీ ఆదేశించ వచ్చును.—పైకపు దావాలలో, న్యాయపంచాయతీ డిక్రీ ఈయబడిన పైకము పై దావా తేదీనుండి చెల్లింపు తేదీవరకు సంవత్సరమునకు నూటికి ఆరు రూపాయలకు, మించకుండ వడ్డి చెల్లించవలసినదిగా డిక్రీ ఈయవచ్చును.

న్యాయపంచాయతీ డబ్బు చెల్లింపు నిమిత్తము డిక్రీ యిచ్చునవుడు ఆ డబ్బు వడ్డీ లేకుండా గాని పైన తెలిపిన రేటుకు మించని వడ్డితో గాని వాయిదాలలో చెల్లించవలసినదిగా ఆదేశింపవచ్చును.

192. డిక్రీ చెల్లింపును లేక సర్దుబాటును వ్రాసి పెట్టవలెను.— డిక్రీదారుకాని నిర్ణీత రుణగ్రస్తుడుకాని దరఖాస్తు పెట్టుకొన్న మీదట డిక్రీ ఇచ్చిన న్యాయపంచాయతీ విచారణ జరిపిన పిమ్మట డిక్రీ పూర్తిగా లేక కొంత భాగముగా పరిష్కారము చేసికొనబడినదని కనుగొన్నచో న్యాయ పంచాయతీ దావాల నిర్ణీత రిజిష్టరులో ఆ విషయమును వ్రాసి యుంచవలెను.

193. డిక్రీ అమలు.—న్యాయ పంచాయతీచే ఈయబడిన. డిక్రీ లేక ఉత్తరువు నిర్ణయింపబడిన విధమున అమలు జరుపబడవలెను.

అయితే అట్టి ఏదైన డిక్రీలేక ఉత్తరువును అమలు పరుచుటలో ఏ స్థిరాస్తిగాని జప్తు చేయబడరాదు లేక విక్రయించబడరాదు.

194. పునర్విమర్శ.—(1) న్యాయ పంచాయతీచే ఏదేని డిక్రీ లేక ఉత్తరువు ఈయబడిన తేదీనుండి అరువదిదినముల లోపల అట్టి డిక్రీ లేక ఉత్తరువు పై సంబంధించినజిల్లా మునిసిఫ్‌కు అప్పీలు ఉండును.

(2) అట్టి ఏ పిటిషను నైనను విచారణ చేయుచున్న కాలమున ఆది పరిష్కారము చేయబడుచుంతవరకు జిల్లా మునసబు డిక్రీ లేక ఉత్తరువు యొక్క అమలును నిలిపియుంచవచ్చును.

(3) అట్టి అప్పీలులో జిల్లా మునసబునిర్ణయమే తుదినిర్ణయ మగును.

## క్రిమినలు విచారణాధికారము.

195. న్యాయ పంచాయతీలు కొన్ని నేరములను స్వీకరించి విచారించుట :-(1) ప్రభుత్వము ఆంధ్రప్రదేశ గెజిటులో ప్రకటన ద్వారా ఆప్రకటనలో పేర్కొనబడిన తేదీనుండి ఈదిగువ నేరములు ఒక న్యాయ పంచాయతీయొక్క అధికార ప్రాంతములో జరిగిన ఎడల వాటినన్నిటిని లేక కొన్నిటిని స్వీకరించి విచారించుటకు న్యాయ పంచాయతీకి అధికారము ఈయవచ్చును, అవేవనగా:-

(ఎ) భారత శిక్షాస్మృతి యొక్క 160, 277, 283, 290, 323, 334, 352, 358, 504, 510 విభాగముల క్రింద శిక్షింపదగిన నేరములు;

(బి) పది రూపాయలకు మించని విలువగల ఆస్తివిషయములో భారత శిక్షాస్మృతి యొక్క 379వ విభాగము క్రింద శిక్షింపదగిన నేరములు;

(సి) కలిగిన నష్టము లేక హాని పదిరూపాయలకు మించనిదైనచో భారత శిక్షాస్మృతియొక్క 426వ విభాగముక్రింద శిక్షింపదగిన నేరములు;

(డి) 1871 పశువుల అక్రమ ప్రవేశ చట్టము యొక్క 5 వ అధ్యాయము క్రింద పశువులను చట్టవిరుద్ధముగా జప్తు చేయుటకు లేక నిర్బంధములో వుంచుటకు సంబంధించిన ఫిర్యాదులు, పశువులను

జప్తుచేయుటను బలవంతముగా ఆటంక పరచినందుకు లేక విడిపించి నందుకు ఆ చట్టము యొక్క 24వ విభాగముక్రింద శిక్షింపదగిన నేరములు, పందులు లేక పశువులు, భూమికి లేక పైరులకు లేక పబ్లిక్ రోడ్లకు హాని కలిగించి నందుకు ఆ చట్టము యొక్క 26 వ విభాగము క్రింద శిక్షింపదగిన నేరములు.

అయితే పైన తెలిపిన 5వ అధ్యాయము క్రింద పశువులను చట్టవిరుద్ధముగా జప్తుచేసిన దానికి లేక నిర్బంధములో ఉంచినదానికి సంబంధిబచి ఫిర్యాదు విషయములో న్యాయ పంచాయతీ ఇప్పించు నష్టపరిహారము ఇరువదిఐదు రూపాయలకు మించరాదు.

(ఇ) 1889 ఆంధ్రప్రదేశ పట్టణ కంటకముల చట్టముయొక్క 3వ విభాగములోని (9), (11), (12)వ ఖండములక్రింద శిక్షింపదగు నేరములు ;

(ఎఫ్) ఈ చట్టము క్రింద శిక్షింపదగు నేరములు.

(జి) భారత శిక్షాస్మృతి క్రింద గాని ఏదేని ప్రత్యేక లేక స్థానిక చట్టముక్రింద గాని కేవలము జరిమానాతో మాత్రమే లేదా ఆరు నెలలకు మించని ఖైదు శిక్షతో మాత్రమే లేదా రెండింటితో శిక్షింపదగియుండి ఈ విషయమై ప్రభుత్వమువారు ఆంధ్రప్రదేశ గెజిటులో ప్రకటనద్వారా నిర్దిష్టపరచు నేరములలో ఏ నేరమైనను.

అయితే (బి),(సి) ఖండములలో తెలుపబడిన నేరముల విషయములో ప్రభుత్వమువారు న్యాయ పంచాయతీయొక్క విచారణాధికారము, తొలగింపబడిన ఆస్తియొక్క విలువ లేదా కలిగిన నష్టము లేక హాని ఇరువది రూపాయలకు మించని కేసులకుకూడ విస్తరింప జేయవచ్చును.

వివరణ :- ఈ విభాగములో పేర్కొనబడిన నేరములలో అట్టి నేరములకు సహాయపడుట అను నేరములుకూడ చేరును,

(2) (ఎ) నిందితుడు సదరు నేరములలో దేనినైనను చేసియున్నట్లు న్యాయ పంచాయతీ కనుగొన్నచో అది అతనికి ఈ క్రింది శిక్ష విధించవచ్చును :-

(i) భారత శిక్షాస్మృతియొక్క 510వ విభాగముక్రింద శిక్షింపదగిన నేరము విషయములో పదిరూపాయలకు మించని జుర్మానా, మరియు,

(ii) ఇతరప నేరము విషయములోనైనను పదునైదు రూపాయలకు మించని జుర్మానా ;

అయితే (1)వ ఉప-విభాగము, (బి), (సి) ఖండములలో తెలిపిన నేరము ఋజువైన సందర్భములో దొంగిలింపబడిన ఆస్తియొక్క విలువకు లేదా కలిగిన నష్టమునకు లేక హానికి రెట్టింపువరకు జుర్మానా విధించవచ్చును.

(బి) అసలు ఖైదు శిక్షగాని జుర్మానా చెల్లించనందుకు ఖైదు శిక్ష గాని ఏదియు పంచాయతీచే విధించబడరాదు.

(3) న్యాయ పంచాయతీ జుర్మానా చెల్లించుటకు న్యాయమైన గడువును ఈయవచ్చును. లేదా జుర్మానాను వాయిదాలలో చెల్లింపవలసినదిగా ఉత్తరువు ఈయవచ్చును; కాని ఆదేశించిన ప్రకారము జుర్మానా చెల్లింపబడని పక్షములో న్యాయ పంచాయతీ ఆ జుర్మానాను న్యాయ పంచాయతీచే ఈయబడిన డిక్రీ క్రింద రావలసిన సొమ్ముగా భావించి అదేవిధముగా వసూలుచేసికొనవలెను. విధించబడిన జుర్మానా పైన తెలుపబడిన ప్రకారము వసూలుచేసికొనబడ

జప్తుచేయుటను బలవంతముగా ఆటంక పరచినందుకు లేక విడిపించి నందుకు ఆ చట్టము యొక్క 24వ విభాగముక్రింద శిక్షింపదగిన నేరములు, పందులు లేక పశువులు, భూమికి లేక పైరులకు లేక పబ్లిక్ రోడ్లకు హాని కలిగించి నందుకు ఆ చట్టము యొక్క 26వ విభాగము క్రింద శిక్షింపదగిన నేరములు.

అయితే పైన తెలిపిన 5వ అధ్యాయము క్రింద పశువులను చట్టవిరుద్ధముగా జప్తుచేసిన దానికి లేక నిర్బంధములో ఉంచినదానికి సంబంధిచి ఫిర్యాదు విషయములో న్యాయ పంచాయతీ ఇప్పించు నష్టపరిహారము ఇరువదిఐదు రూపాయలకు మించరాదు.

(ఇ) 1889 ఆంధ్రప్రదేశ పట్టణ కంటకముల చట్టముయొక్క 3వ విభాగములోని (9), (11), (12)వ ఖండములక్రింద శిక్షింపదగు నేరములు ;

(ఎఫ్) ఈ చట్టము క్రింద శిక్షింపదగు నేరములు.

(జి) భారత శిక్షాస్మృతి క్రింద గాని ఏదేని ప్రత్యేక లేక స్థానిక చట్టముక్రింద గాని కేవలము జరిమానాతో మాత్రమే లేదా ఆరు నెలలకు మించని ఖైదు శిక్షతో మాత్రమే లేదా రెండింటితో శిక్షింపదగియుండి ఈ విషయమై ప్రభుత్వమువారు ఆంధ్రప్రదేశ గెజిటులో ప్రకటనద్వారా నిర్దిష్టపరచు నేరములలో ఏ నేరమైనను.

అయితే (బి),(సి) ఖండములలో తెలుపబడిన నేరముల విషయములో ప్రభుత్వమువారు న్యాయ పంచాయతీయొక్క విచారణాధికారము, తొలగింపబడిన ఆస్తియొక్క విలువ లేదా కలిగిన నష్టము లేక హాని ఇరువది రూపాయలకు మించని కేసులకుకూడ విస్తరింపజేయవచ్చును.

జాలదని న్యాయ పంచాయతీకి ఏ సందర్భములోనైన తోచినచో అది ఆ కేసును విచారణాధికారముగల మొదటి తరగతి మేజస్ట్రేటుకు సమర్పించవలెను. ఆయన అట్టి తప్పిదమునకు శాసనముద్వారా అధికారము ఈయబడినంతటి ఖైదు శిక్ష విధించవచ్చును.

అయితే ఆ విధముగా విధింపబడు ఖైదు శిక్షయొక్క కాల పరిమితి ఏ సందర్భములోనైనను ఒక వారమునకు మించరాదు.

(4) ఇందునిమిత్తమై ప్రభుత్వము చేయునట్టి నియమములకు లోబడి, క్రిమినలు విచారణలో న్యాయ పంచాయతీచే అవలంబింపబడవలసిన కార్యవిధానము ఈ దిగువ రీతిగా ఉండవలెను.

న్యాయపంచాయతీ ఎదుట ఇచ్చిన వాఙ్మూల సాక్ష్యము ప్రమాణము లేక పవిత్రమైన అంగీకారముతో ఇచ్చియుండవలెను. మరియు అట్టి న్యాయ పంచాయతీ ఎదుట ఇచ్చిన ప్రతి సాక్షియొక్క సాక్ష్య సారాంశమును క్లుప్తముగా వ్రాసి రికార్డులో భాగముగా నిర్ణయించబడిన పద్ధతిలో ఉంచవలెను. క్రమబద్ధమైన ఛార్జిని రూపొందించుట చేయనక్కరలేదు. కాని నిర్ణయింపబడిన రిజిష్టరులో ఈ దిగువ వివరములను నమోదుచేయవలెను :—

(ఎ) క్రమ సంఖ్య;

(బి) నేరము చేయబడిన తేదీ;

(సి) రిపోర్టు లేక ఫిర్యాదు చేయబడిన తేదీ;

(డి) ఫిర్యాదు చేసిన వ్యక్తియొక్కయు,నిందితునియొక్కయు పరీక్షింపబడిన సాక్షుల యొక్కయు పేర్లు, తండ్రుల పేర్లు, నివాసములు;

(ఇ) ఫిర్యాదు చేయబడిన నేరము, ఏదైన నేరము రుజువైనచో అదియు, (1)ఏ ఉప-విభాగముయొక్క (బి), (సి) ఖండములలో తెలుపబడిన కేసుల విషయములో దొంగిలించబడిన ఆస్తియొక్క విలువ లేదా కలిగిన నష్టము లేక హానియొక్క మొత్తము;

(ఎఫ్) నిందితుని వాదము, వాఙ్మూలము ఏదైనవున్నచో, అది ;

(జి) తేలిన విషయము, మరియు శిక్ష విధింపబడిన సందర్భములో దాని కారణము సంగ్రహ వివరణ;

(హెచ్) విధించబడిన జుర్మానా మొత్తము ;

(ఐ) ప్రొసీడింగులు ముగిసిన తేది.

(5) ఇందునిమిత్తమై చేయబడు నియమములద్వారా మరొకరీతిగా నిబంధింపబడి యున్నట్లు తప్ప ఎట్టి న్యాయ వాదియు, అతనికి న్యాయవాది యోగ్యతలు ఉన్నను సరే లేకున్నను సరే, ఫిర్యాది పక్షమున గాని నిందితుని పక్షమున గాని హాజరగుటకు అనుమతింపబడరాదు.

(6) విచారణ జరుగుచున్నప్పుడెప్పుడైనను ఆ కేసు మేజిస్ట్రేటుచే విచారింపబడవలసినట్టిదని న్యాయ పంచాయతీకి తోచినచో లేదా విచారణ ముగియు సమయమున నిందితుడు దోషియే యనియు అతనిపై తాము విధించుటకు అధికారము కలిగియున్న శిక్షకన్న భిన్నమైన లేదా తీవ్రమైన శిక్షను విధించుట ఉచితమనియు న్యాయపంచాయతీ అభిప్రాయపడినచో అది ఆ కేసును విచారణాధికారము గల మొదటి తరగతి మేజిస్ట్రేటునకు అప్పగించవలెను,

ఆయన ఆ కేసును తన కోర్టుకే కాని తన క్రింది మేజిస్ట్రేటు కోర్టుకు కాని బదలీ చేయవచ్చును.

(7) (ఎ) సెషన్సు జడ్జికాని విచారణాధికారముగల మొదటి తరగతి మేజిస్ట్రేటుగాని న్యాయము జరుపుటకు అవసరమని భావించి నచో ఎప్పుడైనను న్యాయ పంచాయతీ సమక్షమున విచారించ బడుచున్న ఏ కేసునైనను తన కోర్టుకుగాని తన క్రింద ఏ మేజి స్ట్రేటు కోర్టుకుగాని తన అధికార ప్రాంతములోని మరొక న్యాయ పంచాయతీకి గాని బదిలీ చేయవచ్చును.

(బి) ఒక న్యాయ పంచాయతీ రద్దుచేయబడి దాని స్థాన ములో క్రొ త న్యాయ పంచాయతీ ఏదిగాని ఏర్పాటు చేయబడని సందర్భములో అధికారముగల సెషన్స్ జడ్జి లేక మొదటి తరగతి మేజిస్ట్రేటు, అట్టి న్యాయ పంచాయతీ సమక్షములో పెండింగులో వున్న క్రిమినలు కేసులన్నింటిని తన కోర్టుకుగాని తన క్రింది ఏ మేజి స్ట్రేటు కోర్టుకు గాని తన అధికార క్షేత్రములోపల ఉన్న ఏ ఇతర న్యాయ పంచాయతీకి గాని బదిలీ చేయవలెను.

(8) ఈ విభాగము క్రింద న్యాయ పంచాయతీచే ఈయబడిన ఎట్టి శిక్షపైగాని ఉత్తరువుపై గాని అప్పీలు వుండదు. కాని న్యాయ పంచాయతీచే చట్ట విరుద్ధముగా లేక అక్రమముగా వ్యవహరించుట, లంచము తీసుకొనుట, ఘోరమైన పక్షపాతము చూపుట లేక దుష్ప్ర వర్తన జరిగినదను కారణమును బట్టిగాని ఘోరమైన అన్యాయము జరిగినదను కారణమును బట్టిగాని సెషన్సు జడ్జి లేదా విచారణాధి కారముగల మొదటి తరగతి మేజిస్ట్రేటు ఏ శిక్షనైనను కొట్టివేయ వచ్చును.

(9) 1898 క్రిమినలు ప్రొసీజరుకోడులో ఏమి యున్నప్పటికి దానితో నిమిత్తములేకుండ, ఒక న్యాయపంచాయతీ విచారణకై స్వీకరించదగు నేరమును గురించిన ఫిర్యాదు మేజిస్ట్రేటుకు చేయబడిన యెడల ఆయన అట్టి నేరమును విచారణకై స్వీకరించుటకు బదులు, ఆ నేరము ఏ న్యాయ పంచాయతీ అధికార క్షేత్రము లోపల జరిగినదో ఆ న్యాయ పంచాయతీకి ఫిర్యాదును దాఖలు చేయవలసినదిగా ఫిర్యాదిని ఆదేశించవలెను.

196. దొంగతనము చేసిరని నిందింపబడిన కొందరు వ్యక్తులు న్యాయ పంచాయతీచే విచారింపబడరాదు :— ఈ క్రింద తెలుపబడిన వాటి తాలూకు దొంగతనపు నేరములను న్యాయ పంచాయతీ విచారించరాదు :—

(ఏ) నిందితుడు ఇదివరకొకసారి మూడేండ్లు లేక అంతకన్న ఎక్కువ కాలము వరకు ఖైదు శిక్షతో శిక్షింపబడియున్నను ;

(బి) నిందితుడు ఏదేని న్యాయపంచాయతీచే ఇంతకుముందొక మారు జరిమానా విధింపబడి వున్నను; లేక

(సి) 1898 క్రిమినలు ప్రొసీజరు కోడు యొక్క 109 లేక 110 విభాగము ననుసరించి పెట్టబడిన ప్రొసీడింగులలో నిందితుడు సత్ప్రవర్తనకు పూచి ఇచ్చియున్నను.

197. నేరములను రాజీ చేసికొనుట :— న్యాయ పంచాయతీ నివారణకై స్వీకరింపబడదగియుండి ఈ క్రింది పట్టికలోని మొదటి రెండు వరుసలలో నిర్దిష్టపరచబడిన భారత శిక్షాస్మృతి విభాగముల క్రింద శిక్షింపదగిన నేరములో విషయములో ఆ పట్టిక మూడవ

వరుసలో తెలిపిన వ్యక్తులతో రాజీ చేసికొనవచ్చును:—

| నేరము | వర్తించు భారత శిక్షాస్మృతి విభాగములు | ఏ వ్యక్తులతో నేరములను రాజీ చేసికొన వచ్చునో |
|---|---|---|
| (1) | (2) | (3) |
| గాయపరచుట ... | 323, 334 | గాయపరచబడిన వ్యక్తి, |
| దౌర్జన్యము లేక బలాత్కారము ... | 352, 358 | దౌర్జన్యమునకు లేక బలాత్కారమునకు గురి యైన వ్యక్తి. |
| కుచేష్ట, కలిగిన నష్టము లేక చెరుపు ఒక ప్రైవేటు వ్యక్తికి మాత్రమే కలిగిన దైనప్పుడు. ... | 426 | నష్టమునకు లేక చెరుపుకు గురియైన వ్యక్తి. |
| శాంతికి భంగం కలిగించే ఉద్దేశంతో చేయబడిన అవమానం. | 504 | అవమానమునకు గురియైన వ్యక్తి. |

198. ఫిర్యాదికి పరిహారము మున్నగునవి :— న్యాయ పంచాయతీ ఏదేని జరిమానా విధించినపుడు, రాబట్టబడిన జరిమానాలో కొంత భాగముగాని, పూర్తిగాగాని ఈ క్రింది వాటికి వినియోగించవలెనని ఆదేశించ వచ్చును :—

(ఏ) ఆ కేసులో ఫిర్యాదికి సక్రమముగా అయిన ఖర్చులను చెల్లించుటకు;

(బి) జరిగిన నేరమువలన ఏ వ్యక్తికైనను వస్తురూపములో ఏదైన నష్టము కలిగినచో అందుకు అతనికి పరిహారము చెల్లించుటకు.

199. అబద్ధమైన కేసు పెట్టినందుకు లేక దురుద్దేశముతో కేసు పెట్టినందుకు నిందితునకు నష్ట పరిహారము :— విచారణ ముగిసిన తరువాత, తనముందు పెట్టబడిన కేసు అబద్ధమైనదని, దురుద్దేశముతో పెట్టబడినదని లేక ఇబ్బంది కలిగించుటకు పెట్టబడినదని న్యాయ పంచాయతీ అభిప్రాయపడినచో నిందితునకు ఏబది రూపాయలకు మించకుండా అది సమంజసమని భావించునట్టి మొత్తమును నష్ట పరిహారము క్రింద ఫిర్యాది చెల్లించవలెనని ఉత్తరువు చేయ వచ్చును;

అయితే, అట్లు ఎందుకు చేయకూడదో కారణము తెలువు కొనుటకు ఫిర్యాదికి అవకాశమీయకుండ ఉత్తరువు ఏదీచేయకూడదు.

200. న్యాయ పంచాయతీచే వేయబడిన శిక్ష పూర్వ శిక్ష కాదు:- ఈ చట్టము ననుసరించి న్యాయ పంచాయతీచే వేయబడిన శిక్ష భారత శిక్షాస్మృతి యొక్క 75వ విభాగపు కార్యముల నిమిత్తము పూర్వ శిక్షగా భావింపబడరాదు.

201. 1898 క్రిమినలు ప్రొసీజరు కోడు యొక్క 202 వ విభాగము ననుసరించి న్యాయ పంచాయతిచే దర్యాప్తు :— ఒక న్యాయ పంచాయతీ యొక్క అధికార ప్రాంతములో జరిగిన ఏ నేరమును గురించి ఐనను అట్టి న్యాయ పంచాయతీచే దర్యాప్తు జరుపబడవలసినదిగా మేజిస్ట్రేటు 1898 క్రిమినలు ప్రొసీజరు కోడు యొక్క 202వ విభాగము ననుసరించి ఆదేశించవచ్చును. అప్పుడు న్యాయ పంచాయతీ ఆ కేసు విషయము దర్యాప్తు జరిపి తన నివేదికను సదరు మేజిస్ట్రేటుకు దాఖలు చేయవలెను.

202. బాల నేరస్థులు:— ఒక నేరమునకై శిక్షవేయునపుడు ఆ నేరస్థుడు పదునారు సంవత్సరములకు తక్కువ వయస్సు వాడని న్యాయ పంచాయతీ అభిప్రాయపడినచో అట్టి న్యాయ పంచాయతీ శిక్ష విధించుటకు బదులుగా ఆ బాల నేరస్థుని తగు విధముగా మందలించి వదలిపెట్ట వచ్చును.

203. భార్యా పిల్లల పోషణకు ఉత్తరువు:- (1) న్యాయ పంచాయతీ అధికార క్షేత్రములో యున్న ఏ వ్యక్తి అయినా, సరియగు అవకాశము లున్నప్పటికీ, తన భార్యా లేదా క్రమమైన, లేదా అక్రమమైన పిల్లలను, ఎవరిని వారు పోషించుకోజాలని స్థితిలో యున్నయెడల, ఉపేక్ష చేసిన లేదా పోషించ నిరాకరించినపుడు, న్యాయ పంచాయతీ, అట్టి ఉపేక్ష లేదా నిరాకరణ ఋజువైన యెడల, తనకు సమయోచితమని తోచిన రేటు ప్రకారము, నెలకు 25 రూపాయల మొత్తమునకు మించకుండా నెలవారీ పోషణ వేతన మిమ్మని ఆ వ్యక్తిని ఆదేశించవచ్చును. మరియు సమయాసమయములలో ఏ వ్యక్తికి అది చెల్లింపబడవలయునో నిర్దేశించవచ్చును.

(2) అట్టి వేతనము ఉత్తరువు చేసిన తేదీనుండి గాని లేదా ఆ విధముగా ఉత్తరువుచేసిన, పోషణకు దరఖాస్తు పెట్టుకొన్న తేదీ నుండిగాని చెల్లింపబడవలయును.

(3) తగిన కారణము లేకుండా ఆదేశించబడిన ఏ వ్యక్తి అయినను అట్టి ఉత్తరువును పాటించని యెడల 195వ విభాగములోని (3)వ ఉప విభాగముక్రింద ఏర్పాటుచేయబడిన ప్రకారము వసూలు చేయబడవచ్చును. మరియు అట్టి వ్యక్తిని చెల్లింపవలసిన నెలవారీ పోషణ మొత్తముపై గాని లేక భాగముపై గాని పది రూపాయల వరకు జరిమానావేసి శిక్షింపవచ్చును.

సదరు ఆదేశమును లేక అభ్యర్థనను పాటించకుండనే ఉన్నను ఆ వ్యక్తి పూర్వము శిక్షింపబడిన దినము తరువాత అట్లు తప్పిదము చేయు చున్నంత కాలము ప్రతి దినము సదరు షెడ్యూలు యొక్క నాల్గవ వరుసలో అందు నిమిత్తమై పేర్కొనబడినంత మొత్తము వరకు జుర్మానా విధింపబడదగి యుండును.

వివరణ:—4, 5 షెడ్యూళ్ల మూడవ వరుసలో 'విషయము' అను శీర్షిక క్రింద వ్రాయబడిన అంశములు ఆ షెడ్యూళ్ళలోని ఒకటవ వరుసలోను రెండవ వరుసలోను తెలుపబడిన నిబంధనలలో వివరింపబడిన నేరములను నిర్వచించుటకు ఉద్దేశింపబడినవి కావు. ఆ నిబంధనల సారంశము కూడ కావు. అందులో తెలుపబడిన విషయములకు కేవలము సంకేతములుగా మాత్రమే అవి చేర్చబడినవి.

221. అనర్హుడై కూడ పంచాయతీలో సభ్యుడుగాగాని, సర్పంచుగా గాని, ఉపసర్పంచుగాగాని వ్యవరించినందుకు అపరాధ ధనము:—(1) పంచాయతీ సభ్యత్వ పదవిలో ఉండుటకు తనకు ఈ చట్టము ననుసరించిగాని, దీని క్రింద చేయబడిన నియమముల ననుసరించిగాని అర్హతలేదని లేదా తాను అట్టి అర్హతను కోల్పోయె నని తెలిసియుండియు అట్టి సభ్యుడుగా వ్యవహరించిన ఏ వ్యక్తి యైనను అట్టి ప్రతి నేరమునకు 25 రూపాయలకు మించని జుర్మానాతో శిక్షింపబడదగి యుండును.

(2) పంచాయతీ సర్పంచుగాగానీ, తాత్కాలిక సర్పంచుగా గానీ, ఉపసర్పంచుగా గాని వ్యవహరించుటకు లేదా అతని కర్తవ్యములలో వేటినైనను మరియు ఆయనే కార్యానిర్వాహకాధికారిగా కూడ ఉండినచో అతని కర్తవ్యములలో వేటినైనను వినియోగించుటకు తనకు ఈ చట్టము ననుసరించిగాని, దీని క్రింద చేయబడిన

నియమముల ననుసరించిగాని అర్హత లేదని లేదా తాను అట్టి అర్హతను కోల్పోయెనని తెలిసియుండియు అట్టి పదవిలో వ్యవహరించిన లేక అట్టి కర్తవ్యములను నిర్వహించిన ఏ వ్యక్తియైనను అట్టి ప్రతి నేరమునకును 250 రూపాయలకు మించని జుర్మానాతో శిక్షింపబడదగి యుండును.

(3) (ఎ) ఏ వ్యక్తియైనను ఒక పంచాయతీకి సర్పంచుగా తాత్కాలిక సర్పంచు లేక ఉపసర్పంచుగా ఉండి యుండి పంచాయతీకి వశము చేయబడిన లేదా దానికి చెందినవై తన స్వాధీనములో లేక నియంత్రణ క్రింద ఉన్న లేక వచ్చిన ఏవైన పత్రములనుగాని, ధనమును గాని ఇతర ఆస్తులనుగాని—

(*i*) ప్రతి సందర్భములోను అట్టి సర్పంచుగా తాత్కాలిక లేక ఉపసర్పంచుగా తన పదవి కాలము ముగిసిన వెంటనే; మరియు

(*ii*) ఉపాధ్యక్షుడుగా ఉండిన వ్యక్తి సందర్భములో అధ్యక్షుడు అడిగినప్పుడు కూడ,

ఆ పదవిలో తన తరువాత వచ్చిన వ్యక్తికిగాని నిర్ణయింపబడు ఇతర అధికారికిగాని స్వాధీనము చేయకపోయినచో ఆ వ్యక్తి అట్టి ప్రతి నేరమునకును 250 రూపాయలకుమించని జరిమానాతో శిక్షింపబడదగి యుండును.

(బి) ఏ వ్యక్తియైనను (ఏ) ఖండము ననుసరించి శిక్షింపబడియు పంచాయతీకి వశము చేయబడిన లేక దానికి చెందినవై తన స్వాధీనములో లేక నియంత్రణలో ఉన్న లేక వచ్చిన ఏదేని పత్రములను, ధనమును లేక ఇతర ఆస్తులను ఆ పదవిలో తన తరువాత వచ్చిన వ్యక్తికి స్వాధీనము చేయకపోయినచో అట్లు శిక్షింపబడిన తరువాత

ఆ నేరము కొనసాగుచున్న ప్రతి దినమునకు ఇరువది రూపాయల జరిమానాతో శిక్షింపబడగియుండును.

(4) ఉపవిభాగము (3) క్రిందికి వచ్చు కేసుల సందర్భములో కోర్టు నేరమునకు శిక్ష విధించుటయే కాక పంచాయతీ యొక్క పత్రములను ధనమును లేక ఇతర ఆస్తులను ఆ శిక్షింపబడిన వ్యక్తి నుండి జప్తు చేవయలసినదిగా కూడ ఉత్తరువు చేయవచ్చును.

222. కంట్రాక్టు మున్నగు పనులలో లాభము సంపాదించి నందుకు ఉద్యోగికి లేక నౌకరుకు జరిమానా:— పంచాయతీ యొక్క ఏ ఉద్యోగిగాని నౌకరు గాని ఆ పంచాయతీతో లేక దాని పక్షమున జరిగిన ఏదైన కంట్రాక్టులోగాని ఉద్యోగములో గాని తెలిసి యుండియు ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని భాగస్వామి, ఉద్యోగి, లేక నౌకరు లేక మరి ఏ వ్యక్తి ద్వారా గాని వాటా లేక లాభము పొందినచో ఆ వ్యక్తి భారత శిక్షాస్మృతి యొక్క 168వ విభాగము క్రింద ఒక నేరము చేసినవాడుగా భావింపబడును;

అయితే ఏ వ్యక్తిగాని ఏదైన కంపెనీలో వాటాదారుగా లేక సభ్యుడుగా ఉన్నచో ఆ వ్యక్తి అట్టి కంపెనీకి డైరెక్టరుగా ఉన్న నే తప్ప పంచాయతీకిని అట్టి కంపెనీకిని కుదిరిన ఎట్టి కాంట్రాక్టులో గాని లాభము పొందువాడుగా పరిగణింపబడరాదు.

ఇంతే కాకుండ కమీషనరు యొక్క అనుమతిని పొంది పంచాయతీతో కంట్రాక్టు కుదుర్చుకున్న ఏ వ్యక్తి కి గాని ఈ భాగము లోని దేదియు వర్తించకూడదు.

223. కార్య నిర్వాహకాధికారిని లేక అతని ప్రతినిధిని అక్రమ ముగా అడ్డగించుట :— కార్యానిర్వాహకాధికారినిగాని ఏదైన

స్థానములో భవనములో లేక భూమిపై ప్రవేశించుటకు తనకు గల అధికారములను కార్యనిర్వాహకాధికారి న్యాయసమ్మతముగా సంక్రమింపజేసిన వ్యక్తిని గాని న్యాయసమ్మతమైన అట్టి అధికారము లను ఆయన వినియోగించకుండ ఆటంకపరచిన యేవ్యక్తి అయినను భారత శిక్షాస్మృతి యొక్క 341వ విభాగము క్రింద నేరముచేసినట్టు భావింపబడవలెను.

224. పంచాయతీ ఇత్యాదులను అడ్డగించినందుకు శిక్ష:—ఒక పంచాయతీని గాని లేక పంచాయతీ యొక్క సర్పంచునుగాని కార్యనిర్వాహకాధికారినిగాని సభ్యునిగాని పంచాయతీచే నియ మింపబడిన ఏ వ్యక్తినిగాని ఈచట్టపు నిబంధనల ననుసరించి లేక దీని క్రింద చేయబడిన నియమముల ననుసరించి దాని కర్తవ్యమును నిర్వర్తించుట నిమిత్తము పంచాయతీచే కంట్రాక్టు చేసుకొనబడిన ఏ వ్యక్తినిగాని అడ్డగించినట్టి లేదా ఈ చట్టము ప్రకారము ఏదైన పనిచేయుటకు అధికారము లేక ఆదేశము ఈయబడిన ఏ వ్యక్తి నైనను ఆటంకపరచినట్టి లేక అందుకు ప్రయత్నించినట్టి లేదా ఈ చట్టముచే అధికారమీయబడిన ఏ పనినైనను నిర్వహించుటకు సంబంధించిన ఏదైన చట్టమును లేక మార్గమును సూచించు గుర్తును తొలగించినట్టి లేదా పంచాయతీచే గాని అది ఇచ్చిన అధికారములను బట్టిగాని ప్రకటించబడిన లేక ప్రదర్శింపబడిన ఏదేని నోటీసును తొలగించిన చెడగొట్టిన లేక ఇతర విధముగ చెరిపి వేసిన ఏ వ్యక్తి యైనను ఆ నేరము ఋజువైన మీదట ఏబది రూపాయలకు మించని జరిమానాకు పాత్రుడగును.

225. సమాచారము తెలుపనందుకు లేక తప్పుడు సమాచారము తెలిపినందుకు జరిమానా;-- ఏ వ్యక్తియైనను ఏదైన సమాచారమును తెలుపవలసినదిగా ఈ చట్టముచే లేక దీని క్రింద జారిచేయబడిన ఏదైన నోటీసుచే దాని క్రింద జారిచేయబడిన ఇతర వ్రాసీదిడుగుచే ఆదేశింపబడియు అట్టి సమాచారమును తెలుపకున్నచో లేక బుద్ధి పూర్వకముగా తప్పుడు సమాచారమును తెలిపినచో ఆ వ్యక్తి పది రూపాయలకు మించని జరిమానాతో శిక్షింపబడదగి యుండవలెను.

# 9 వ అధ్యాయము

## అనుబంధ నిబంధనలు.

216. క్రొత్త పంచాయతీలకు ప్రత్యేక నిబంధనలు:—(1) ఈ చట్టములో ఏమి యున్నప్పటికిని స్థానిక ప్రదేశము 3వ విభాగము క్రింద మొట్ట మొదటి సారిగా ఒక గ్రామముగా ప్రకటింపబడినపుడు, సక్రమముగా ఎన్నుకొనబడిన సభ్యులు, సర్పంచు పదవీ స్వీకారము చేయునంతవరకు ఆ పంచాయతీ యొక్కయు సర్పంచు యొక్కయు కార్యనిర్వాహకాధికారి యొక్కయు అధికారములను వినియోగించుటకును కర్తవ్యములను నిర్వర్తించుటకును కమీషనరు ఒక ప్రత్యేకాధికారిని నియమించవలెను.

(2) ప్రత్యేకాధికారి ఆ పంచాయతీకి కమీషనరుచే ఇందు నిమిత్తమై నిర్ణయింపబడు తేదీలోపల పంచాయతీ సభ్యుల ఎన్నికలను జరిపించుటకు ఏర్పాట్లు చేయవలెను.

అయితే ఆ తేదీ లోపల ఏ కారణముచేతనైనను ఎన్నికలు పూర్తిచేయజాలనిచో కమీషనరు సమయానుగుణముగా ఆ నిర్ణయింపబడిన తేదీని వాయిదా వేయవచ్చును.

(3) పంచాయతీ సభ్యులు ఎన్నుకొనబడినతరువాత సాధ్యమైనంత వెంటనే పంచాయతీ సమావేశము ప్రత్యేకాధికారిచే నిర్ణయింపబడు తేదీనను సమయముననను 12వ విభాగపు నిబంధనల ప్రకారము సర్పంచు ఎన్నిక నిమిత్తము జరుపబడవలెను.

(4) ఈ చట్టములో మరొకరీతిగా నిబంధింపబడియున్ననే తప్ప (1) (2) (3) ఉప విభాగములలోని నిబంధనలు వీలైనంత వరకు పంచాయతీ పునర్నిర్మాణ సందర్భము లన్నింటికికూడ వర్తించ వలెను.

227. పబ్లికు రోడ్లు మార్కెట్లు బావులు చెరువులు మున్నగునవి సర్వజనోపయోగములై యుండుట :- పంచాయతీకి వశము చేయబడిన లేక దానిచే నిర్వహింపబడుచున్న సమస్తములైన రోడ్లు, మార్కెట్లు, బావులు చెరువులు రిజర్వాయర్లు జలమార్గములు కుల మతములతో నిమిత్తములేకుండా సర్వజనోపయోగ్యములై యుండవలెను.

228. రుసుముల వసూలును గుత్తకిచ్చుట అధికారము :- ఈ చట్టము ననుసరించి లేక దీని ననుసరించిచేయబడిన ఏదైన నియమము ఉప నిబంధన లేక రెగ్యులేషన్ల క్రింద పంచాయతీకి రావలసిన ఏవైన రుసుముల వసూలును తడవకు మూడు సంవత్సరములకు మించని ఎంతటి గడువుకైనను అది యుక్తమని తలంచు షరతులపై గుత్త కిచ్చు అధికారము పంచాయతీకి ఉండవలెను.

229. జిల్లా మునిసిపాలిటీలకు సంబంధించిన చట్టపు నిబంధనలను లేక వాటిననుసరించి చేయబడిన నియమములను విస్తరింపచేయుట :-

(1) కమీషనరు పంచాయతీ కోరినప్పుడు గాని మరొక విధముగా గాని, తత్కాలమున అమలులో నున్న జిల్లా మునిసిపాలిటీలకు సంబంధించిన చట్టముయొక్క ఏవైన నిబంధనలు లేదా వాటి క్రింద చేయబడిన ఏదైన నియమము పన్ను విధింపుకు సంబంధించిన వాటితోసహా ఒక గ్రామములో లేక అందలి ఏదైన ప్రత్యేక ప్రదేశమునకు విస్తరింపచేయబడి అచ్చట అమలులో ఉండునని ఒక ప్రకటన ప్రకటింప వచ్చును.

(2) అట్లు ప్రకటించబడిన నిబంధనలను ఆ గ్రామమునకు లేదా అందలి ఒక ప్రత్యేక ప్రదేశమునకు వర్తింపజేయు నిమిత్తము అవసరమైనంత మేరకు, లేదా సముచితమగునంత మేరకు కొన్ని మార్పులతో అన్వయించుకొనవలయును. కాని వాటి ముఖ్యాంశమునకు మాత్రము భంగము కలుగరాదు.

(3) పై నిబంధనయొక్క సర్వసాధారణతకు భంగము కలుగకుండ అందులో మునిసిపలు కౌన్సిలు లేక దాని చైర్మను లేక దాని కార్య నిర్వాహకాధికారిని ఉద్దేశించిన మాటలు పంచాయతీ లేక దాని సర్పంచు లేక కార్య నిర్వాహకాధికారిని ఉద్దేశించిన మాటలుగను మునిసిపలు కౌన్సిలుయొక్క ఏ ఉద్యోగినిగాని నౌకరును గాని ఉద్దేశించిన మాటలు పంచాయతీలో వారిని పోలిన ఉద్యోగిని లేక నౌకరును ఉద్దేశించిన మాటలుగను మరియు మునిసిపలు హద్దులను ఉద్దేశించిన మాటలు ఆ గ్రామముయొక్క హద్దులను లేదా సందర్భమునుబట్టి ఆ గ్రామమందలి ప్రత్యేక ప్రదేశపు హద్దులను ఉద్దేశించిన మాటలుగను అన్వయించుకొనబడవలెను.

230. పంచాయతీల కర్తవ్యములను పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు లేక తదితర స్థానిక సంస్థలకును అట్లే వీటి కర్తవ్యములను వాటికిని బదిలీ చేయుట.—ఈ చట్టములో కాని పంచాయతీ సమితి లేక జిల్లా పరిషతు లేక తదితర స్థానిక సంస్థలకు సంబంధించిన శాసనములలో ఏమి యున్నప్పటికిని ప్రభుత్వమువారు సందర్భానుసారముగ పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుతో లేక తదితర స్థానిక సంస్థతోను సంబంధించిన పంచాయతీతోను సంప్రదించి, ఆంధ్రప్రదేశ గెజిటులో ప్రకటన ద్వారా మరియు అందులో నిర్దిష్ట పరుపబడు నిబంధనలకును నియంత్రణకును, రివిజనుకును లోబడి—

(*i*) ఈ చట్టమునకనుసరించి పంచాయతీకి గల ఏదైన అధికారము లేక కర్తవ్యము పంచాయతీసమితికిగాని జిల్లా పరిషత్తుకు గాని ఇతర స్థానిక సంస్థకుగాని బదిలీ చేయబడి దానిచే వినియోగింపబడవలెననియు; నిర్వర్తించబడవలెననియు;

(*ii*) పంచాయతీ సమితికి లేక జిల్లా పరిషత్తు లేక ఇతర స్థానిక సంస్థలకు గల ఏదైన అధికారము లేక కర్తవ్యము పంచాయతీకి బదిలి చేయబడి దానిచే వినియోగింపబడవలెననియు, నిర్వర్తింపబడవలెననియు ఆదేశించవచ్చును.

231. అధికారముల సంక్రమణ మున్నగునవి.—(1) ప్రభుత్వము వారు, ఆంధ్రప్రదేశ గెజిటులో ప్రకటనద్వారా, ఏదైనా స్థానిక ప్రాంతములో, అందలి ఏదైనా పంచాయతీ లేక అన్ని పంచాయతీల విషయములో ఈ చట్టమునకనుసరించి తమకు గల అధికారములను వేటినైనను, నియమములనుచేయు అధికారమొక్కటి తప్ప, వినియోగించుటకు ఏ అధికార సంస్థకుగాని అధికారికిగాని వ్యక్తికిగాని అధికారము ఈయవచ్చును. అట్లే అట్టి అధికారమును ఉపసంహరించుకొనవచ్చును.

(2) కమీషనరు లేక కలెక్టరు ప్రకటన ద్వారా రాష్ట్రమందలి లేదా సందర్భమునుబట్టి రెవిన్యూ జిల్లాయందలి ఏదయిన స్థానిక ప్రాంతములో, అందలి ఏదైన పంచాయతీ లేక అన్ని పంచాయతీల విషయములో కమీషనరు లేక సందర్భమునుబట్టి కలెక్టరుకు గల అధికారములను వేటినైనను వినియోగించుటకు ఏ అధికారికిగాని, వ్యక్తికిగాని అధికారమీయవచ్చును. అట్లే అట్టి అధికారమును ఉపసంహరించుకొనవచ్చును.

(3) ఉపవిభాగము (1) లేక (2) ననుసరించి సంక్రమింప జేయబడిన అధికారము నిర్ణయింపబడు లేదా ప్రకటనలో నిర్దిష్ట పరుపబడు నిర్బంధములకు షరతులకు లోబడి మరియు సంక్రమింప జేసిన అధికారియొక్క నియంత్రణకు రివిజనుకు కూడ లోబడి లేదా సంక్రమింప జేసినది ప్రభుత్వమువారైనచో ఇందు నిమిత్తమై ప్రభుత్వము వారిచే అధికారము ఈయబడిన వ్యక్తియొక్క నియంత్రణకు కూడ లోబడి వినియోగింపపడవలెను. ఇట్లు అధికారమీయబడిన వ్యక్తుల చర్యల పైనను లేదా వ్యవహారముల పైనను నియంత్రించి మార్చు అధికారముకూడ ప్రభుత్వమునకు ఉండును.

(4) ఈ చట్టముయొక్క నిబంధనల ననుసరించి కమీషనరుకు లేక కలెక్టరుకు ఈయబడిన ఏ అధికారమైనను ఈ విభాగపు (2), (3) ఉపవిభాగములలో తెలుపబడినవాటితో సహా. అట్టి అధికారము కమీషనరుచే లేక కలెక్టరుచే స్వయముగా వినియోగింపబడుచున్నను లేక (2)వ ఉపవిభాగము ననుసరించి ఆ అధికారము ఎవరికి సంక్రమింప జేయబడినదో వారిచే వినియోగింపబడుచున్నను, నిర్ణయింపబడు షరతులకును నిబంధనలకును లోబడి మరియు ప్రభుత్వముయొక్క గాని ఇందు నిమిత్తమై ప్రభుత్వముచే అధికారమీయబడిన ఏ వ్యక్తియొక్క గాని నియంత్రణకు కూడ లోబడి వినియోగింపబడవలెను ఇట్లు అధికారమీయబడిన ఏ వ్యక్తుల చర్యలపైనను, వ్యవహారములపైనను నియంత్రించు అధికారముకూడ ప్రభుత్వమునకు ఉండవలెను.

(5) (ఎ) ఎన్నికల అధికారి ప్రకటనద్వారా ఏ అధికారికైనను, లేక వ్యక్తికైనను ఆ రెవిన్యూ జిల్లాలోని ఏ స్థానిక ప్రాంతములోని ఏ గ్రామ పంచాయతీ విషయములలో లేక ఆ ప్రాంతములోని అన్ని గ్రామ పంచాయతీల విషయములలోనైనను

ఈ చట్టము క్రింద ఆయనకు సంక్రమించెడి ఏ అధికారములనయినను, అవి ఒక గ్రామ పంచాయతీకి ఎన్నికలు జరుపుటకు సంబంధించినంత వరకు, అధికారమీయవచ్చును. అట్లే ఆ అధికారమును ఉపసంహరించుకొనవచ్చును.

(బి) ఈ ఉపవిభాగముక్రింద అప్పగించబడిన అధికారమునకు సంబంధించినంత మేరకు, (3) (4) ఉపవిభాగములలోని ఏర్పాట్లు, వీలైనంతవరకు వర్తించును.

232. పునర్విమర్శ —(1) ప్రభుత్వమువారు తమ వివేచనను బట్టి ఏ సమయమందైనను స్వయముగాగానీ, ఎవరైనా దరఖాస్తు పెట్టుకొనినప్పుడుగానీ, ఈ దిగువ వ్యక్తులు ఈ చట్టపు నిబంధనల ననుసరించి జారీచేయబడిన ఏదైన ఉత్తరువుయొక్క రికార్డును గానీ, రికార్డు చేయబడిన వ్యవహారముల రికార్డునుగాని, అట్టి ఉత్తరువు చట్ట సమ్మతముగా లేదా సముచితముగా ఉన్నట్లు లేదా అట్టి వ్యవహారములు క్రమబద్ధముగా ఉన్నట్లు నిర్ధారించు నిమిత్తము తెప్పించుకొని, పరిశీలించి వాటిపై తమకు యుక్తమనితోచు ఉత్తరువు జారీచేయవచ్చును.

(ఎ) కమీషనరు లేక కలెక్టరు లేదా 231వ విభాగపు (2వ ఉపవిభాగమునసరించి కమీషనరు లేక కలెక్టరుచే అధికారమీయ బడిన ఎవరైన అధికారి లేక వ్యక్తి; లేదా

(బి) ఆ విభాగపు (1)వ ఉపవిభాగము ననుసరించి ప్రభుత్వముచే అధికారమీయబడిన అధికార సంస్థ, అధికారి లేక వ్యక్తి, లేదా ఆ విభాగపు (3)వ ఉపవిభాగముననుసరించి వారిచే అధికారమీయ బడిన వ్యక్తి; లేదా

(సి) ఏదయినను మరొక అధికార సంస్థ, ఎవరయిన మరొక అధికారి లేక వ్యక్తి;

అయితే ప్రభుత్వమువారు ఏ వ్యక్తికైనను నష్టము కలుగునట్లుగా, అట్టి వ్యక్తి విజ్ఞాపనము చేసికొనుటకు వీలు కలిగింపబడిననే తప్ప, ఎట్టి ఉత్తరువుగాని జారీ చేయరాదు.

(2) ఉపవిభాగము (1)లో పేర్కొనబడిన అధికారములవంటి అధికారములను ఇందు నిమిత్తమై ప్రభుత్వమువారిచే అధికారమీయబడిన అధికార సంస్థ అధికారి లేక వ్యక్తి కూడ వినియోగింపవచ్చును.

(3) 7వ అధ్యాయము ననుసరించి ఏర్పాటుచేయబడిన సామరస్య సంఘముయొక్క లేక న్యాయ పంచాయతీయొక్క న్యాయ సంబంధమైన వ్యవహారములకు ఈ విభాగములోని దేదియు వర్తించకూడదు.

233. బాకీ మొత్తమును పన్నులవలె రాబట్టుకొనుట:—ఈ చట్టముక్రింద లేక ఏదైన ఇతర శాసనము క్రింద లేక వాటి ననుసరించి చేయబడిన నియమములు లేక ఉపనియమముల క్రింద ఏ వ్యక్తియైన పంచాయతీకి చెల్లించవలసిన అన్ని ఖర్చులు, డామేజీలు, పరిహారము, జరిమానాలు, ఛార్జీలు, పాఠశాల రుసుము కాకుండ ఇతర రుసుములు, వ్యయములు, పంచాయతీ కౌలుకిచ్చిన భూములనుండియు, భవనములనుండియు వచ్చు అద్దె మొత్తములుకాని అద్దెలు, వంతు పైకములు, ఇతర మొత్తములు, వాటి వసూలు విషయమై ఈ చట్టముక్రిందగాని, దాని ననుసరించి చేయబడిన నియమములక్రింద గాని ప్రత్యేకమగు నిబంధన ఏదియు లేని సందర్భములో నియమావళిలోని 2వ షెడ్యూలులో నిబంధింపబడిన రీతిగా బిల్లు ద్వారా డిమాండు చేయబడి అందు నిబంధించబడిన ప్రకారము రాబట్టుకొనబడవలెను.

234. స్థానిక సంస్థల మధ్య ఏర్పడెడు వివాదముల తీర్పు:— (1) ఒక పంచాయితీకిని ఒకటి లేక అంతకెక్కువ స్థానిక సంస్థల మధ్య ఈ చట్టముయొక్కగాని, తదితర చట్టముయొక్కగాని నిబంధనల క్రింద ఏ విషయమును గురించియైనను వివాదము ఏర్పడి, ఆ వివాదమును ఆ పంచాయతీయును, తదితర స్థానిక సంస్థలును పరస్పరము సమాధానము కలుగునట్లుగా తమలోతామే పరిష్కరించుకొనజాలకున్నవని ప్రభుత్వమువారు అభిప్రాయ పడినచో, ప్రభుత్వమువారు ఆ వివాదమును విచారించి :

(ఎ) తామే తీర్పు చెప్పవచ్చును; లేదా

(బి) మధ్యవర్తికిగాని, మధ్యవర్తుల మండలికిగాని ఇందు నిమిత్తమై 42వ విభాగముననుసరించి ఏర్పాటుచేయబడిన సంయుక్త కమిటీకిగాని దర్యాప్తు జరిపి నివేదించు నిమిత్తము అప్పగించ వచ్చును.

(2) ఉపవిభాగము (1) యొక్క (బి) ఖండములో తెలుపబడిన నివేదిక ప్రభుత్వమువారికి సమర్పింపబడవలెను ఆ మీదట ప్రభుత్వమువారు తమకు యుక్తమని తోచిన విధముగా ఆ వివాదమును పరిష్కరించవలెను.

(3) ఉపవిభాగము (1) యొక్క (ఎ) ఖండము ననుసరించిగాని, (2)వ ఉపవిభాగముననుసరించిగాని ఈయబడిన ఏ తీర్పునైనను ప్రభుత్వమువారు సమయానుగుణముగా తమకు యుక్తమని తోచిన ప్రకారము మార్పుచేయుచుండవచ్చును. అంతేగాక అట్టి ఏ తీర్పునైనను ఈ ఉపవిభాగము ననుసరించి అందులో ఏవైన మార్పులు చేయబడినచో వాటినిగూడ ప్రభుత్వమువారు ఏ సమయముననైనను రద్దు చేయవచ్చును.

అట్టి ఏ తీర్పుకుగాని, మార్పుకుగాని పంచాయతీయును సంబంధించిన ఇతర స్థానిక సంస్థలను కట్టుబడి యుండవలెను. వాటిని ఏ న్యాయాలయములోను సవాలు చేయరాదు.

(4) సంబంధించిన స్థానిక సంస్థలలో ఒక సంస్థ కంటో న్మెంటు అధికార సంస్థగానీ పెద్ద తరహా నౌకాశ్రయము యొక్క నౌకాశ్రి యాధికార సంస్థగానీ అయిన సందర్భములో ఈ విభాగము క్రింద ప్రభుత్వమునకుగల అధికారము కేంద్ర ప్రభుత్వము యొక్క అంగీకారముతో మాత్రమే వినియోగింపబడవలెను.

235. సభ్యులచే ప్రమాణ స్వీకారము:- (1) ప్రతిగ్రామ పంచాయతీ సభ్యుడు, తన పదవీ స్వీకారము చేయుముందు, గ్రామ పంచాయతీ సమావేశములో ఈ క్రింద నీయబడిన రూపములో, భారత రాజ్యాంగమునకు తన వినయ విధేయతలను ప్రమాణముచేసి, లేదా ధృవీకరించి స్వీకరించవలెను.

"నేను..............పంచాయతీ సభ్యుడనై దేవుని పేరుతో పవిత్రమైన దృఢ భక్తి వినయములతో ప్రమాణము చేయుచున్నాను. నేను చట్టబద్ధముగా ఏర్పడినటువంటి భారత రాజ్యాంగమునకు సత్యమైన విశ్వాసము మరియు భక్తి విధేయతలు కలిగియుందును. నేను భారతదేశము యొక్క సార్వభౌమత్వమును, నీతి సత్యములను కాపాడగలను. మరియు నేను స్వీకరించబోవు విధులను నమ్మకముతో నెరవేర్చగలను."

(2) ఏ సభ్యుడైనను అతని పదవీకాలము ప్రారంభమైన మూడు మాసములలో లేదా ఆ తేదీనుండి జరిగిన మూడు సమావేశములలో (1)వ ఉపవిభాగములో రూపొందించబడిన ప్రమాణము

స్వీకరించనియెడల, అతనిపదవి అంతమగును. మరియు అతనిస్థానము ఖాళీ అయినట్లు భావింపబడును.

(3) అట్టి సభ్యుడు, ఈ విభాగములో రూపొందించబడిన ప్రకారము ప్రమాణము చేయనిదే గ్రామపంచాయతీ సమావేశములో అతని స్థానమును స్వీకరించరాదు. లేదా అట్టి సభ్యుడుగా ఏవిధమైన పనినీ చేయరాదు.

(4) (2)వ ఉపవిభాగము క్రింద ఒక వ్యక్తి పదవిని పోగొట్టు కొనిన యెడల కార్యనిర్వాహకాధికారి ఆ విషయమును గ్రామ పంచాయతీ తరువాత సమావేశములో తెలియజేయవలయును. మరియు అట్టి వ్యక్తి ఆ ఉపవిభాగము క్రింద పదవిని పోగొట్టుకొనిన ముప్పది దినముల లోపల దరఖాస్తు పెట్టుకొనిన గ్రామ పంచాయతీ అతనికి మూడు నెలలకు తక్కువగాని మరికొంత కాలమును ప్రమాణము స్వీకరించుటకు మంజూరు చేయవచ్చును, అతను ఆ విధముగా మంజూరుచేసిన కాలము లోపల ప్రమాణ స్వీకారముచేసిన యెడల పై ఉపవిభాగములలోగాని లేక 20 వ విభాగములోని (కె) క్లాజులో ఏమి చెప్పబడినప్పటికిని, తన పదవిలోనే యుండగలడు

(5) న్యాయపంచాయతీ యొక్క ప్రతి సభ్యుడు, తన పదవిలో ప్రవేశించుటకు ముందు, (1)వ ఉపవిభాగములో రూపొందించబడిన పద్ధతిలో భారత రాజ్యాంగమునకు తన భక్తివిధేయతలను, ప్రమాణము చేసి, లేదా ధృవీకరించి స్వీకరించవలెను. మరియు (1) నుండి (4)వ ఉపవిభాగములలోని ఏర్పాట్లు, వీలైనంతవరకు న్యాయపంచాయతీ సభ్యులకు కూడ వర్తించును.

236. పంచాయతీల నిర్మాణము లేక పునర్నిర్మాణము విషయములో ఈ చట్టమును 6వ షెడ్యూలుకు లోబడి అన్వయించు

కొనుట:- (1) ఒక గ్రామమునకై మొట్టమొదటిసారిగా నిర్మాణము చేయబడిన పంచాయతీ విషయములోగాని, ఈ చట్టపు నిబంధనల ప్రకారము మొట్టమొదటిసారిగా పునర్నిర్మాణము చేయబడిన పంచాయతీ విషయములోగానీ అట్టి పంచాయతీ ఈ చట్టము ఆరంభమైనప్పుడు ఉన్నట్టిదైనచో లేదా సదరు నిబంధనలు మొట్టమొదటి సారిగా మరొక విధముగా అమలు జరుపునప్పుడుగానీ సదరు నిబంధనలను 6వ షెడ్యూలులోని నియమములకు లోబడి అన్వయించుకొనవలెను.

(2) ప్రభుత్వము వారు ఆంధ్రప్రదేశ్ గెజిటులో ప్రకటన ద్వారా అట్టి షెడ్యూలులోని నియమములలో సవరణలు, చేర్పులు చేయవచ్చును లేక వాటిని రద్దుచేయవచ్చును.

237. చిక్కులను తొలగించు అధికారము:- (1) ఈ చట్టము యొక్క నిబంధనలను మొట్టమొదటిసారి అమలు జరుపుటలో గానీ, ఈ చట్టము ఆరంభమైన తరువాత ఏదేని పంచాయతీ యొక్క ప్రథమ నిర్మాణములేక పునర్నిర్మాణము విషయములోగానీ ఏవైన చిక్కులు ఏర్పడినచో, ప్రభుత్వము ఆ సందర్భమునుబట్టి ఆంధ్రప్రదేశ గెజిటులో ప్రచురింపబడిన ఉత్తరువు ద్వారా, ఆ చిక్కును తొలగించు నిమిత్తము తమకు అవసరమని తోచు ఏ చర్యనైన తీసికొనవచ్చును.

(2) ఉపవిభాగము (1) ననుసరించి చేయబడు ఉత్తరువు లన్నియు అవి చేయబడిన తర్వాత సాధ్యమైనంత శీఘ్రముగా విధాన మండలి యొక్క ఉభయ సభల సమక్షమున ఉంచబడవలెను. ఆమీదట అదే సమావేశములో కాని లేదా తరువాత సమావేశము లోకాని విధాన మండలి వాటిలో సవరణ రూపమున లేక రద్దు రూపమున చేయు మార్పులకు అవి లోబడి యుండును.

238. 1959 ఆంధ్రప్రదేశ 35వ చట్టములోని 31వ విభాగపు సవరణ:—1959 ఆంధ్రప్రదేశ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959లో 35వ ఆంధ్రప్రదేశ చట్టము) 31వ విభాగములో "అది అందిన ఒక మాసము లోపల, పంచాయతీ సమితి, దాని సూచనలను వ్రాసి, అట్టి శాసనముక్రింద బడ్జెటును మార్చుటకు అర్హమగు అధికారికి పంపవలెను. అట్టి అధికారి ఆసూచనలకు తగు ప్రాధాన్యమీయవలెను. "అను మాటలకు బదులుగా" అది అందిన ఒక మాసము లోపల పంచాయతీ సమితి, మార్పు లేకుండాగాని అది యుక్తమని భావించు మార్పులతోగాని ఆమోదించిన మీదట సందర్భానుసారముగా పంచాయతీకిగాని, పట్టణ కమిటీకిగాని బడ్జెటును పంపివేయవలెను" అను మాటలను ఉంచవలెను.

239. రద్దు:—(1) 1950, ఆంధ్రప్రదేశ (ఆంధ్ర ప్రాంతపు) గ్రామ పంచాయతీల చట్టము (1950లో 10వ చట్టము) మరియు 1956, ఆంధ్ర ప్రదేశ (తెలంగాణా ప్రాంతపు) గ్రామ పంచాయతీల చట్టము (1956లో 17వ చట్టము) ఇందు మూలముగా రద్దు చేయబడుచున్నవి.

(2) ఈ చట్టము ఆరంభమైన తేదీనను ఆ తేదీ మొదలుకొనియు 1956 ఆంధ్రప్రదేశ (తెలంగాణా ప్రాంతపు) జిల్లా మునిసిపాలిటీల చట్టము (1956లో 10వ హైదరాబాదు చట్టము) యొక్క 3వ విభాగము క్రింద పట్టణ మునిసిపాలిటీలుగా ప్రకటింపబడిన పట్టణములకు వర్తించకుండును.

సదరు ఆదేశమును లేక అభ్యర్థనను పాటించకుండనే ఉన్నను ఆ వ్యక్తి పూర్వము శిక్షింపబడిన దినము తరువాత అట్లు తప్పిదము చేయుచున్నంత కాలము ప్రతి దినము సదరు షెడ్యూలు యొక్క నాల్గవ వరుసలో అందు నిమిత్తమై పేర్కొనబడినంత మొత్తము వరకు జుర్మానా విధింపబడదగి యుండును.

వివరణ:—4, 5 షెడ్యూళ్ల మూడవ వరుసలో 'విషయము' అను శీర్షిక క్రింద వ్రాయబడిన అంశములు ఆ షెడ్యూళ్ళలోని ఒకటవ వరుసలోను రెండవ వరుసలోను తెలుపబడిన నిబంధనలలో వివరింపబడిన నేరములను నిర్వచించుటకు ఉద్దేశింపబడినవి కావు. ఆ నిబంధనల సారంశము కూడ కావు. అందులో తెలుపబడిన విషయములకు కేవలము సంకేతములుగా మాత్రమే అవి చేర్చబడినవి.

221. అనర్హుడై కూడ పంచాయతీలో సభ్యుడుగాగాని, సర్పంచుగా గాని, ఉపసర్పంచుగాగాని వ్యవరించినందుకు అపరాధ ధనము:—(1) పంచాయతీ సభ్యత్వ పదవిలో ఉండుటకు తనకు ఈ చట్టము ననుసరించిగాని, దీని క్రింద చేయబడిన నియమముల ననుసరించిగాని అర్హత లేదని లేదా తాను అట్టి అర్హతను కోల్పోయెనని తెలిసియుండియు అట్టి సభ్యుడుగా వ్యవహరించిన ఏ వ్యక్తియైనను అట్టి ప్రతి నేరమునకు 25 రూపాయలకు మించని జుర్మానాతో శిక్షింపబడదగి యుండును.

(2) పంచాయతీ సర్పంచుగాగానీ, తాత్కాలిక సర్పంచుగాగానీ, ఉపసర్పంచుగా గాని వ్యవహరించుటకు లేదా అతని కర్తవ్యములలో వేటినైనను మరియు ఆయనే కార్యానిర్వాహకాధికారిగా కూడ ఉండినచో అతని కర్తవ్యములలో వేటినైనను వినియోగించుటకు తనకు ఈ చట్టము ననుసరించిగాని, దీని క్రింద చేయబడిన

నియమముల ననుసరించిగాని అర్హత లేదని లేదా తాను అట్టి అర్హతను కోల్పోయెనని తెలిసియుండియు అట్టి పదవిలో వ్యవహరించిన లేక అట్టి కర్తవ్యములను నిర్వహించిన ఏ వ్యక్తియైనను అట్టి ప్రతి నేరమునకును 250 రూపాయలకు మించని జుర్మానాతో శిక్షింపబడదగి యుండును,

(3) (ఎ) ఏ వ్యక్తియైనను ఒక పంచాయతీకి సర్పంచుగా తాత్కాలిక సర్పంచు లేక ఉపసర్పంచుగా ఉండి యుండి పంచాయతీకి వశము చేయబడిన లేదా దానికి చెందినవై తన స్వాధీనములో లేక నియంత్రణ క్రింద ఉన్న లేక వచ్చిన ఏవైన పత్రములనుగాని, ధనమును గాని ఇతర ఆస్తులనుగాని—

(*i*) ప్రతి సందర్భములోను అట్టి సర్పంచుగా తాత్కాలిక లేక ఉపసర్పంచుగా తన పదవి కాలము ముగిసిన వెంటనే; మరియు

(*ii*) ఉపాధ్యక్షుడుగా ఉండిన వ్యక్తి సందర్భములో అధ్యక్షుడు అడిగినప్పుడు కూడ,

ఆ పదవిలో తన తరువాత వచ్చిన వ్యక్తికిగాని నిర్ణయింపబడు ఇతర అధికారికిగాని స్వాధీనము చేయకపోయినచో ఆ వ్యక్తి అట్టి ప్రతి నేరమునకును 250 రూపాయలకుమించని జరిమానాతో శిక్షింపబడదగి యుండును.

(బి) ఏ వ్యక్తియైనను (ఏ) ఖండము ననుసరించి శిక్షింపబడియు పంచాయతీకి వశము చేయబడిన లేక దానికి చెందినవై తన స్వాధీనములో లేక నియంత్రణలో ఉన్న లేక వచ్చిన ఏదేని పత్రములను, ధనమును లేక ఇతర ఆస్తులను ఆ పదవిలో తన తరువాత వచ్చిన వ్యక్తికి స్వాధీనము చేయకపోయినచో అట్లు శిక్షింపబడిన తరువాత

ఆ నేరము కొనసాగుచున్న ప్రతి దినమునకు ఇరువది రూపాయల జరిమానాతో శిక్షింపబడగియుండును.

(4) ఉపవిభాగము (3) క్రిందికి వచ్చు కేసుల సందర్భములో కోర్టు నేరమునకు శిక్ష విధించుటయే కాక పంచాయతీ యొక్క పత్రములను ధనమును లేక ఇతర ఆస్తులను ఆ శిక్షింపబడిన వ్యక్తి నుండి జప్తు చేవయలసినదిగా కూడ ఉత్తరువు చేయవచ్చును.

222. కంట్రాక్టు మున్నగు పనులలో లాభము సంపాదించి నందుకు ఉద్యోగికి లేక నౌకరుకు జరిమానా:— పంచాయతీ యొక్క ఏ ఉద్యోగిగాని నౌకరు గాని ఆ పంచాయతీతో లేక దాని పక్షమున జరిగిన ఏదైన కంట్రాక్టులోగాని ఉద్యోగములో గాని తెలిసి యుండియు ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని భాగస్వామి, ఉద్యోగి, లేక నౌకరు లేక మరి ఏ వ్యక్తి ద్వారా గాని వాటా లేక లాభము పొందినచో ఆ వ్యక్తి భారత శిక్షాస్మృతి యొక్క 168వ విభాగము క్రింద ఒక నేరము చేసినవాడుగా భావింపబడును;

అయితే ఏ వ్యక్తిగాని ఏదైన కంపెనీలో వాటాదారుగా లేక సభ్యుడుగా ఉన్నచో ఆ వ్యక్తి అట్టి కంపెనీకి డైరెక్టరుగా ఉన్ననే తప్ప పంచాయతీకిని అట్టి కంపెనీకిని కుదిరిన ఎట్టి కాంట్రాక్టులో గాని లాభము పొందువాడుగా పరిగణింపబడరాదు.

ఇంతే కాకుండ కమీషనరు యొక్క అనుమతిని పొంది పంచాయతీతో కంట్రాక్టు కుదుర్చుకున్న ఏ వ్యక్తి కి గాని ఈ భాగము లోని దేదియు వర్తించకూడదు.

223. కార్య నిర్వాహకాధికారిని లేక అతని ప్రతినిధిని అక్రమ ముగా అడ్డగించుట ;— కార్యానిర్వాహ కాధికారినిగాని ఏదైన

స్థానములో భవనములో లేక భూమిపై ప్రవేశించుటకు తనకు గల అధికారములను కార్యనిర్వాహకాధికారి న్యాయసమ్మతముగా సంక్రమింపజేసిన వ్యక్తినిగాని న్యాయసమ్మతమైన అట్టి అధికారము ను ఆయన వినియోగించకుండ ఆటంక పరచిన యే వ్యక్తి అయినను భారత శిక్షాస్మృతి యొక్క 341వ విభాగము క్రింద నేరముచేసినట్లు భావింపబడవలెను.

224. పంచాయతీ ఇత్యాదులను అడ్డగించినందుకు శిక్ష:—ఒక పంచాయతీని గాని లేక పంచాయతీ యొక్క సర్పంచునుగాని కార్యనిర్వాహకాధికారినిగాని సభ్యునిగాని పంచాయతీచే నియమింపబడిన ఏ వ్యక్తినిగాని ఈచట్టపు నిబంధనల ననుసరించి లేక దీని క్రింద చేయబడిన నియమముల ననుసరించి దాని కర్తవ్యమును నిర్వర్తించుట నిమిత్తము పంచాయతీచే కంట్రాక్టు చేసుకొనబడిన ఏ వ్యక్తినిగాని అడ్డగించినట్టి లేదా ఈ చట్టము ప్రకారము ఏదైన పనిచేయుటకు అధికారము లేక ఆదేశము ఈయబడిన ఏ వ్యక్తినైనను ఆటంకపరచినట్టి లేక అందుకు ప్రయత్నించినట్టి లేదా ఈ చట్టముచే అధికారమీయబడిన ఏ పనినైనను నిర్వహించుటకు సంబంధించిన ఏదైన చట్టమును లేక మార్గమును సూచించు గుర్తును తొలగించినట్టి లేదా పంచాయతీచే గాని అది ఇచ్చిన అధికారములను బట్టిగాని ప్రకటించబడిన లేక ప్రదర్శింపబడిన ఏదేని నోటీసును తొలగించిన చెడగొట్టిన లేక ఇతర విధముగ చెరిపి వేసిన ఏ వ్యక్తియైనను ఆ నేరము ఋజువైన మీదట ఏబది రూపాయలకు మించని జరిమానాకు పాత్రుడగును.

225. సమాచారము తెలుపనందుకు లేక తప్పుడు సమాచారము తెలిపినందుకు జరిమానా;— ఏ వ్యక్తియైనను ఏదైన సమాచారమును తెలుపవలసినదిగా ఈ చట్టముచే లేక దీని క్రింద జారిచేయబడిన ఏదైన నోటిసుచే దాని క్రింద జారిచేయబడిన ఇతర ప్రొసీడింగుచే ఆదేశింపబడియు అట్టి సమాచారమును తెలుపకున్నచో లేక బుద్ధి పూర్వకముగా తప్పుడు సమాచారమును తెలిపినచో ఆ వ్యక్తి పది రూపాయలకు మించని జరిమానాతో శిక్షింపబడదగి యుండవలెను.

# 9 వ అధ్యాయము

## అనుబంధ నిబంధనలు.

216. క్రొత్త పంచాయతీలకు ప్రత్యేక నిబంధనలు:—(1) ఈ చట్టములో ఏమి యున్నప్పటికిని స్థానిక ప్రదేశము 3వ విభాగము క్రింద మొట్ట మొదటి సారిగా ఒక గ్రామముగా ప్రకటింపబడినపుడు, సక్రమముగా ఎన్నుకొనబడిన సభ్యులు, సర్పంచు పదవీ స్వీకారము చేయునంతవరకు ఆ పంచాయతీ యొక్కయు సర్పంచు యొక్కయు కార్యనిర్వాహకాధికారి యొక్కయు అధికారములను వినియోగించుటకును కర్తవ్యములను నిర్వర్తించుటకును కమీషనరు ఒక ప్రత్యేకాధికారిని నియమించవలెను.

(2) ప్రత్యేకాధికారి ఆ పంచాయతీకి కమీషనరుచే ఇందు నిమిత్తమై నిర్ణయింపబడు తేదీలోపల పంచాయతీ సభ్యుల ఎన్నికలను జరిపించుటకు ఏర్పాట్లు చేయవలెను.

అయితే ఆ తేదీ లోపల ఏ కారణముచేతనైనను ఎన్నికలు పూర్తిచేయజాలనిచో కమీషనరు సమయానుగుణముగా ఆ నిర్ణయింపబడిన తేదీని వాయిదా వేయువచ్చును.

(3) పంచాయతీ సభ్యులు ఎన్నుకొనబడినతరువాత సాధ్యమైనంత వెంటనే పంచాయతీ సమావేశము ప్రత్యేకాధికారిచే నిర్ణయింపబడు తేదీనను సమయమునను 12వ విభాగపు నిబంధనల ప్రకారము సర్పంచు ఎన్నిక నిమిత్తము జరుపబడవలెను.

(4) ఈ చట్టములో మరొకరీతిగా నిబంధింపబడియున్ననే తప్ప (1) (2) (3) ఉప విభాగములలోని నిబంధనలు వీలైనంత వరకు పంచాయతీ పునర్నిర్మాణ సందర్భము లన్నింటికికూడ వర్తింప వలెను.

227. పబ్లికు రోడ్లు మార్కెట్లు బావులు చెరువులు మున్నగునవి సర్వజనోపయోగములై యుండుట :- పంచాయతీకి వశము చేయబడిన లేక దానిచే నిర్వహింపబడుచున్న సమస్తములైన రోడ్లు, మార్కెట్లు, బావులు చెరువులు రిజర్వాయర్లు జలమార్గములు కుల మతములతో నిమిత్తములేకుండా సర్వజనోపయోగ్యములై యుండవలెను.

228. రుసుముల వసూలును గుత్తకిచ్చుట అధికారము :— ఈ చట్టము ననుసరించి లేక దీని ననుసరించిచేయబడిన ఏదైన నియమము ఉప నిబంధన లేక రెగ్యులేషన్ల క్రింద పంచాయతీకి రావలసిన ఏవైన రుసుముల వసూలును తడవకు మూడు సంవత్సరములకు మించని ఎంతటి గడువుకైనను అది యుక్తమని తలంచు షరతులపై గుత్త కిచ్చు అధికారము పంచాయతీకి ఉండవలెను.

229. జిల్లా మునిసిపాలిటీలకు సంబంధించిన చట్టపు నిబంధనలను లేక వాటిననుసరించి చేయబడిన నియమములను విస్తరింపచేయుట :-

(1) కమీషనరు పంచాయతీ కోరినప్పుడు గాని మరొక విధముగా గాని, తత్కాలమున అములులో నున్న జిల్లా మునిసిపాలిటీలకు సంబంధించిన చట్టముయొక్క ఏవైన నిబంధనలు లేదా వాటి క్రింద చేయబడిన ఏదైన నియమము పన్ను విధింపుకు సంబంధించిన వాటితోసహా ఒక గ్రామములో లేక అందలి ఏదైన ప్రత్యేక ప్రదేశమునకు విస్తరింపచేయబడి అచ్చట అములులో ఉండునని ఒక ప్రకటన ప్రకటింప వచ్చును.

(2) అట్లు ప్రకటించబడిన నిబంధనలను ఆ గ్రామమునకు లేదా అందలి ఒక ప్రత్యేక ప్రదేశమునకు వర్తింపజేయు నిమిత్తము అవసరమైనంత మేరకు, లేదా సముచితమగునంత మేరకు కొన్ని మార్పులతో అన్వయించుకొనవలయును. కాని వాటి ముఖ్యాంశమునకుమాత్రము భంగము కలుగరాదు.

(3) పై నిబంధనయొక్క సర్వసాధారణతకు భంగము కలుగకుండ అందులో మునిసిపలు కౌన్సిలు లేక దాని ఛైర్మను లేక దాని కార్యనిర్వాహకాధికారిని ఉద్దేశించిన మాటలు పంచాయతీ లేక దాని సర్పంచు లేక కార్యనిర్వాహకాధికారిని ఉద్దేశించిన మాటలుగను మునిసిపలు కౌన్సిలుయొక్క ఏ ఉద్యోగినిగాని నౌకరును గాని ఉద్దేశించిన మాటలు పంచాయతీలో వారిని పోలిన ఉద్యోగిని లేక నౌకరును ఉద్దేశించిన మాటలుగను మరియు మునిసిపలు హద్దులను ఉద్దేశించిన మాటలు ఆ గ్రామముయొక్క హద్దులను లేదా సందర్భమునుబట్టి ఆ గ్రామమందలి ప్రత్యేక ప్రదేశపు హద్దులను ఉద్దేశించిన మాటలుగను అన్వయించుకొనబడవలెను.

230. పంచాయతీల కర్తవ్యములను పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు లేక తదితర స్థానిక సంస్థలకును అట్లే వీటి కర్తవ్యములను వాటికిని బదిలీ చేయుట.—ఈ చట్టములోకాని పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు లేక తదితర స్థానిక సంస్థలకు సంబంధించిన శాసనములలో ఏమి యున్నప్పటికిని ప్రభుత్వమువారు సందర్భానుసారముగ పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుతో లేక తదితర స్థానిక సంస్థతోను సంబంధించిన పంచాయతీతోను సంప్రదించి, ఆంధ్రప్రదేశ గెజిటులో ప్రకటన ద్వారా మరియు అందులో నిర్దిష్ట పరుపబడు నిబంధనలకును నియంత్రణకును, రివిజనుకును లోబడి——

(*i*) ఈ చట్టమునను సరించి పంచాయతీకి గల ఏదైన అధికారము లేక కర్తవ్యము పంచాయతీసమితికిగాని జిల్లా పరిషత్తుకుగాని ఇతర స్థానిక సంస్థకుగాని బదిలీ చేయబడి దానిచే వినియోగింపబడవలెననియు; నిర్వర్తించబడవలెననియు;

(*ii*) పంచాయతీ సమితికి లేక జిల్లా పరిషత్తు లేక ఇతర స్థానిక సంస్థలకు గల ఏదైన అధికారము లేక కర్తవ్యము పంచాయతీకి బదిలిచేయబడి దానిచే వినియోగింపబడవలెననియు, నిర్వర్తింపబడవలెననియు ఆదేశించవచ్చును.

231. అధికారముల సంక్రమణ మున్నగునవి.—(1) ప్రభుత్వము వారు, ఆంధ్రప్రదేశ గెజిటులో ప్రకటనద్వారా, ఏదైనా స్థానిక ప్రాంతములో, అందలి ఏదైనా పంచాయతీ లేక అన్ని పంచాయతీల విషయములో ఈ చట్టమునను సరించి తమకు గల అధికారములను వేటినైనను, నియమములనుచేయు అధికారమొక్కటి తప్ప, వినియోగించుటకు ఏ అధికార సంస్థకుగాని అధికారికిగాని వ్యక్తికిగాని అధికారము ఈయవచ్చును. అట్లే అట్టి అధికారమును ఉపసంహరించుకొనవచ్చును.

(2) కమీషనరు లేక కలెక్టరు ప్రకటన ద్వారా రాష్ట్రమండలి లేదా సందర్భమునుబట్టి రెవిన్యూ జిల్లాయందలి ఏదయిన స్థానిక ప్రాంతములో, అందలి ఏదైన పంచాయతీ లేక అన్ని పంచాయతీల విషయములో కమీషనరు లేక సందర్భమునుబట్టి కలెక్టరుకు గల అధికారములను వేటినైనను వినియోగించుటకు ఏ అధికారికిగాని, వ్యక్తికిగాని అధికారమీయవచ్చును. అట్లే అట్టి అధికారమును ఉపసంహరించుకొనవచ్చును.

(3) ఉపవిభాగము (1) లేక (2) ననుసరించి సంక్రమింప జేయబడిన అధికారము నిర్ణయింపబడు లేదా ప్రకటనలో నిర్దిష్ట పరుపబడు నిర్బంధములకు షరతులకు లోబడి మరియు సంక్రమింప జేసిన అధికారియొక్క నియంత్రణకు రివిజనుకు కూడ లోబడి లేదా సంక్రమింపజేసినది ప్రభుత్వమువారైనచో ఇందు నిమిత్తమై ప్రభుత్వము వారిచే అధికారము ఈయబడిన వ్యక్తియొక్క నియంత్రణకు కూడ లోబడి వినియోగింపపడవలెను. ఇట్లు అధికారమీయబడిన వ్యక్తుల చర్యల పైనను లేదా వ్యవహారముల పైనను నియంత్రించి మార్చు అధికారముకూడ ప్రభుత్వమునకు ఉండును.

(4) ఈ చట్టముయొక్క నిబంధనల ననుసరించి కమీషనరుకు లేక కలెక్టరుకు ఈయబడిన ఏ అధికారమైనను ఈ విభాగపు (2), (3) ఉపవిభాగములలో తెలుపబడిన వాటితో సహా. అట్టి అధికారము కమీషనరుచే లేక కలెక్టరుచే స్వయముగా వినియోగింపబడుచున్నను లేక (2)వ ఉపవిభాగము ననుసరించి ఆ అధికారము ఎవరికి సంక్రమింప జేయబడినదో వారిచే వినియోగింపబడుచున్నను, నిర్ణయింపబడు షరతులకును నిబంధనలకును లోబడి మరియు ప్రభుత్వము యొక్క గాని ఇందు నిమిత్తమై ప్రభుత్వముచే అధికారమీయబడిన ఏ వ్యక్తియొక్క గాని నియంత్రణకు కూడ లోబడి వినియోగింపబడవలెను. ఇట్లు అధికారమీయబడిన ఏ వ్యక్తుల చర్యలపైనను, వ్యవహారములపైనను నియంత్రించు అధికారముకూడ ప్రభుత్వమునకు ఉండవలెను.

(5) (ఏ) ఎన్నికల అధికారి ప్రకటనద్వారా ఏ అధికారికైనను, లేక వ్యక్తికైనను ఆ రెవిన్యూ జిల్లాలోని ఏ స్థానిక ప్రాంతములోని ఏ గ్రామ పంచాయతీ విషయములలో లేక ఆ ప్రాంతములోని అన్ని గ్రామ పంచాయతీల విషయములలోనైనను

ఈ చట్టము క్రింద ఆయనకు సంక్రమింపచేసి ఏ అధికారములనయినను, అవి ఒక గ్రామ పంచాయతీకి ఎన్నికలు జరుపుటకు సంబంధించినంత వరకు, అధికారమీయవచ్చును. అట్లే ఆ అధికారమును ఉపసంహరించుకొనవచ్చును.

(బి) ఈ ఉపవిభాగముక్రింద అప్పగించబడిన అధికారమునకు సంబంధించినంత మేరకు, (3) (4) ఉపవిభాగములలోని ఏర్పాట్లు, వీలైనంతవరకు వర్తించును.

232. పునర్విమర్శ —(1) ప్రభుత్వమువారు తమ వివేచనను బట్టి ఏ సమయమందైనను స్వయముగాగానీ, ఎవరైనా దరఖాస్తు పెట్టుకొనినప్పుడుగానీ, ఈ దిగువ వ్యక్తులు ఈ చట్టపు నిబంధనల ననుసరించి జారీచేయబడిన ఏదైన ఉత్తరువుయొక్క రికార్డును గానీ, రికార్డు చేయబడిన వ్యవహారముల రికార్డునుగాని, అట్టి ఉత్తరువు చట్టసమ్మతముగా లేదా సముచితముగా ఉన్నట్లు లేదా అట్టి వ్యవహారములు క్రమబద్ధముగా ఉన్నట్లు నిర్ధారించు నిమిత్తము తెప్పించుకొని, పరిశీలించి వాటిపై తమకు యుక్తమనితోచు ఉత్తరువు జారీచేయవచ్చును.

(ఎ) కమీషనరు లేక కలెక్టరు లేదా 231వ విభాగపు (2వ ఉపవిభాగముననుసరించి కమీషనరు లేక కలెక్టరుచే అధికారమీయ బడిన ఎవరైన అధికారి లేక వ్యక్తి ; లేదా

(బి) ఆ విభాగపు (1)వ ఉపవిభాగము ననుసరించి ప్రభుత్వముచే అధికారమీయబడిన అధికార సంస్థ, అధికారి లేక వ్యక్తి, లేదా ఆ విభాగపు (3)వ ఉపవిభాగముననుసరించి వారిచే అధికారమీయ బడిన వ్యక్తి; లేదా

(సి) ఏదయినను మరొక అధికార సంస్థ, ఎవరయిన మరొక అధికారి లేక వ్యక్తి ;

అయితే ప్రభుత్వమువారు ఏ వ్యక్తికైనను నష్టము కలుగు నట్లుగా, అట్టి వ్యక్తి విజ్ఞాపనము చేసికొనుటకు వీలు కలిగింపబడిననే తప్ప, ఎట్టి ఉత్తరువుగాని జారీ చేయరాదు.

(2) ఉపవిభాగము (1)లో పేర్కొనబడిన అధికారములవంటి అధికారములను ఇందు నిమిత్తమై ప్రభుత్వమువారిచే అధికారమీయ బడిన అధికార సంస్థ అధికారి లేక వ్యక్తి కూడ వినియోగింపవచ్చును.

(3) 7వ అధ్యాయము ననుసరించి ఏర్పాటుచేయబడిన సామరస్య సంఘముయొక్క లేక న్యాయ పంచాయతీయొక్క న్యాయ సంబంధమైన వ్యవహారములకు ఈ విభాగములోని దేదియు వర్తించకూడదు.

233. బాకీ మొత్తమును పన్నులవలె రాబట్టుకొనుట:—ఈ చట్టముక్రింద లేక ఏదైన ఇతర శాసనము క్రింద లేక వాటి నను సరించి చేయబడిన నియమములు లేక ఉపనియమముల క్రింద ఏ వ్యక్తియైన పంచాయతీకి చెల్లించవలసిన అన్ని ఖర్చులు, డామేజీలు, పరిహారము, జరిమానాలు, ఛార్జీలు, పాఠశాల రుసుము కాకుండ ఇతర రుసుములు, వ్యయములు, పంచాయతీ కౌలుకిచ్చిన భూములనుండియు, భవనములనుండియు వచ్చు అద్దె మొత్తములుకాని అద్దెలు, వంతు పైకములు, ఇతర మొత్తములు, వాటి వసూలు విషయమై ఈ చట్టముక్రిందగాని, దాని ననుసరించి చేయబడిన నియమములక్రింద గాని ప్రత్యేకమగు నిబంధన ఏదియు లేని సందర్భములో నియమావళిలోని 2వ షెడ్యూలులో నిబంధింప బడిన రీతిగా బిల్లు ద్వారా డిమాండు చేయబడి అందు నిబంధింప బడిన ప్రకారము రాబట్టుకొనబడవలెను.

234. స్థానిక సంస్థల మధ్య ఏర్పడెడు వివాదముల తీర్పు:— (1) ఒక పంచాయితీకిని ఒకటి లేక అంతకెక్కువ స్థానిక సంస్థల మధ్య ఈ చట్టముయొక్కగాని. తదితర చట్టముయొక్కగాని నిబంధనల క్రింద ఏ విషయమును గురించియైనను వివాదము ఏర్పడి, ఆ వివాదమును ఆ పంచాయతీయును, తదితర స్థానిక సంస్థలును పరస్పరము సమాధానము కలుగునట్లుగా తమలోతామే పరిష్కరించుకొనజాలకున్నవని ప్రభుత్వమువారు అభిప్రాయ పడినచో, ప్రభుత్వమువారు ఆ వివాదమును విచారించి :

(ఎ) తామే తీర్పు చెప్పవచ్చును; లేదా

(బి) మధ్యవర్తికిగాని, మధ్యవర్తుల మండలికిగాని ఇందు నిమిత్తమై 42వ విభాగమననుసరించి ఏర్పాటుచేయబడిన సంయుక్త కమిటీకిగాని దర్యాప్తు జరిపి నివేదించు నిమిత్తము అప్పగించ వచ్చును.

(2) ఉపవిభాగము (1) యొక్క (బి) ఖండములో తెలుప బడిన నివేదిక ప్రభుత్వమువారికి సమర్పింపబడవలెను ఆ మీదట ప్రభుత్వమువారు తమకు యుక్తమని తోచిన విధముగా ఆ వివాదమును పరిష్కరించవలెను.

(3) ఉపవిభాగము (1) యొక్క (ఎ) ఖండము ననుసరించి గాని, (2)వ ఉపవిభాగముననుసరించిగాని ఈయబడిన ఏ తీర్పునైనను ప్రభుత్వము వారు సమయానుగుణముగా తమకు యుక్తమని తోచిన ప్రకారము మార్పుచేయుచుండవచ్చును. అంతేగాక అట్టి ఏ తీర్పునైనను ఈ ఉపవిభాగము ననుసరించి అందులో ఏవైన మార్పులు చేయబడినచో వాటినిగూడ ప్రభుత్వమువారు ఏ సమయమున నైనను రద్దు చేయవచ్చును.

అట్టి ఏ తీర్పుకుగాని, మార్పుకుగాని పంచాయతీయును సంబంధించిన ఇతర స్థానిక సంస్థయును కట్టుబడి యుండవలెను. వాటిని ఏ న్యాయాలయములోను సవాలు చేయరాదు.

(4) సంబంధించిన స్థానిక సంస్థలలో ఒక సంస్థ కంటోన్మెంటు అధికార సంస్థగానీ పెద్ద తరహా నౌకాశ్రయము యొక్క నౌకాశ్రయాధికార సంస్థగానీ అయిన సందర్భములో ఈ విభాగము క్రింద ప్రభుత్వమునకుగల అధికారము కేంద్ర ప్రభుత్వము యొక్క అంగీకారముతో మాత్రమే వినియోగింపబడవలెను.

235. సభ్యులచే ప్రమాణ స్వీకారము:- (1) ప్రతిగ్రామ పంచాయతీ సభ్యుడు, తన పదవీ స్వీకారము చేయుముందు, గ్రామ పంచాయతీ సమావేశములో ఈ క్రింద నీయబడిన రూపములో, భారత రాజ్యాంగమునకు తన వినయ విధేయతలను ప్రమాణముచేసి, లేదా ధృవీకరించి స్వీకరించవలెను.

"నేను..............పంచాయతీ సభ్యుడనై దేవుని పేరుతో పవిత్రమైన దృఢ భక్తి వినయములతో ప్రమాణము చేయుచున్నాను. నేను చట్టబద్ధముగా ఏర్పడినటువంటి భారత రాజ్యాంగమునకు సత్యమైన విశ్వాసము మరియు భక్తి విధేయతలు కలిగి యుందును. నేను భారతదేశము యొక్క సార్వభౌమత్వమును, నీతి సత్యములను కాపాడగలను. మరియు నేను స్వీకరించబోవు విధులను నమ్మకముతో నెరవేర్చగలను."

(2) ఏ సభ్యుడైనను అతని పదవీకాలము ప్రారంభమైన మూడు మాసములలో లేదా ఆ తేదీనుండి జరిగిన మూడు సమావేశములలో (1)వ ఉపవిభాగములో రూపొందించబడిన ప్రమాణము

స్వీకరించనియడల, అతనిపదవి అంతమగును. మరియు అతనిస్థానము ఖాళీ అయినట్లు భావింపబడును.

(3) అట్టి సభ్యుడు, ఈ విభాగములో రూపొందించబడిన ప్రకారము ప్రమాణము చేయనిదే గ్రామపంచాయతీ సమావేశములో అతని స్థానమును స్వీకరించరాదు. లేదా అట్టి సభ్యుడుగా ఏవిధమైన పనినీ చేయరాదు.

(4) (2)వ ఉపవిభాగము క్రింద ఒక వ్యక్తి పదవిని పోగొట్టుకొనిన యడల కార్యనిర్వాహకాధికారి ఆ విషయమును గ్రామ పంచాయతీ తరువాత సమావేశములో తెలియ జేయవలయును. మరియు అట్టి వ్యక్తి ఆ ఉపవిభాగము క్రింద పదవిని పోగొట్టుకొనిన ముప్పది దినముల లోపల దరఖాస్తు పెట్టుకొనిన గ్రామ పంచాయతీ అతనికి మూడు నెలలకు తక్కువగాని మరికొంత కాలమును ప్రమాణము స్వీకరించుటకు మంజూరు చేయవచ్చును, అతను ఆ విధముగా మంజూరుచేసిన కాలము లోపల ప్రమాణ స్వీకారముచేసిన యడల పై ఉపవిభాగములలోగాని లేక 20 వ విభాగములోని (కె) క్లాజులో ఏమి చెప్పబడినప్పటికిని, తన పదవిలోనే యుండగలడు

(5) న్యాయపంచాయతీ యొక్క ప్రతి సభ్యుడు, తన పదవిలో ప్రవేశించుటకు ముందు, (1)వ ఉపవిభాగములో రూపొందించబడిన పద్ధతిలో భారత రాజ్యాంగమునకు తన భక్తివిధేయతలను, ప్రమాణము చేసి, లేదా ధృవీకరించి స్వీకరించవలెను. మరియు (1) నుండి (4)వ ఉపవిభాగములలోని ఏర్పాట్లు, వీలైనంతవరకు న్యాయపంచాయతీ సభ్యులకు కూడ వర్తించును.

236. పంచాయతీల నిర్మాణము లేక పునర్నిర్మాణము విషయములో ఈ చట్టమును 6వ షెడ్యూలుకు లోబడి అన్వయించు

కొనుట:- (1) ఒక గ్రామమునకై మొట్టమొదటిసారిగా నిర్మాణము చేయబడిన పంచాయతీ విషయములోగాని, ఈ చట్టపు నిబంధనల ప్రకారము మొట్టమొదటిసారిగా పునర్నిర్మాణము చేయబడిన పంచాయతీ విషయములోగానీ అట్టి పంచాయతీ ఈ చట్టము ఆరంభమైనప్పుడు ఉన్నట్టిదైనచో లేదా సదరు నిబంధనలు మొట్టమొదటిసారిగా మరొక విధముగా అమలు జరుపునప్పుడుగానీ సదరు నిబంధనలను 6వ షెడ్యూలులోని నియమములకు లోబడి అన్వయించుకొనవలెను.

(2) ప్రభుత్వము వారు ఆంధ్రప్రదేశ్ గెజిటులో ప్రకటన ద్వారా అట్టి షెడ్యూలులోని నియమములలో సవరణలు, చేర్పులు చేయవచ్చును లేక వాటిని రద్దుచేయవచ్చును.

237. చిక్కులను తొలగించు అధికారము:- (1) ఈ చట్టము యొక్క నిబంధనలకు మొట్టమొదటిసారి అమలు జరుపుటలో గానీ, ఈ చట్టము ఆరంభమైన తరువాత ఏదేని పంచాయతీ యొక్క ప్రథమ నిర్మాణములేక పునర్నిర్మాణము విషయములోగానీ ఏవైన చిక్కులు ఏర్పడినచో, ప్రభుత్వము ఆ సందర్భమునుబట్టి ఆంధ్రప్రదేశ గెజిటులో ప్రచురింపబడిన ఉత్తరువు ద్వారా, ఆ చిక్కును తొలగించు నిమిత్తము తమకు అవసరమని తోచు ఏ చర్యనైన తీసికొనవచ్చును.

(2) ఉపవిభాగము (1) ననుసరించి చేయబడు ఉత్తరువులన్నియు అవి చేయబడిన తర్వాత సాధ్యమైనంత శీఘ్రముగా విధాన మండలి యొక్క ఉభయ సభల సమక్షమున ఉంచబడవలెను. ఆమీదట అదే సమావేశములో కాని లేదా తరువాత సమావేశము లో కాని విధాన మండలి వాటిలో సవరణ రూపమున లేక రద్దు రూపమున చేయు మార్పులకు అవి లోబడి యుండును.

238. 1959 ఆంధ్రప్రదేశ 35వ చట్టములోని 31వ విభాగపు సవరణ:—1959 ఆంధ్రప్రదేశ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959లో 35వ ఆంధ్రప్రదేశ చట్టము) 31వ విభాగములో "అది అందిన ఒక మాసము లోపల, పంచాయతీ సమితి, దాని సూచనలను వ్రాసి, అట్టి శాసనముక్రింద బడ్జెటును మార్చుటకు అర్హమగు అధికారికి పంపవలెను. అట్టి అధికారి ఆసూచనలకు తగు ప్రాధాన్యమీయవలెను. "అను మాటలకు బదులుగా" అది అందిన ఒక మాసము లోపల పంచాయతీ సమితి, మార్పు లేకుండాగాని అది యుక్తమని భావించు మార్పులతోగాని ఆమోదించిన మీదట సందర్భానుసారముగా పంచాయతీకిగాని, పట్టణ కమిటీకిగాని బడ్జెటును పంపివేయవలెను" అను మాటలను ఉంచవలెను.

239. రద్దు:—(1) 1950, ఆంధ్ర ప్రదేశ (ఆంధ్ర ప్రాంతపు) గ్రామ పంచాయతీల చట్టము (1950లో 10వ చట్టము) మరియు 1956, ఆంధ్ర ప్రదేశ (తెలంగాణా ప్రాంతపు) గ్రామ పంచాయతీల చట్టము (1956లో 17వ చట్టము) ఇందు మూలముగా రద్దు చేయబడుచున్నవి.

(2) ఈ చట్టము ఆరంభమైన తేదీనను ఆ తేదీ మొదల్కొనియు 1956 ఆంధ్ర ప్రదేశ (తెలంగాణా ప్రాంతపు) జిల్లా మునిసిపాలిటీల చట్టము (1956లో 10వ హైదరాబాదు చట్టము) యొక్క 3వ విభాగము క్రింద పట్టణ మునిసిపాలిటీలుగా ప్రకటింపబడిన పట్టణములకు వర్తించకుండును.



## షెడ్యూలు—1.

పంచాయతీల, వాటి కమిటీల వ్యవహారములకు సంబంధించిన నియమములు

(41వ విభాగము చూడుడు).

1. ప్రతి పంచాయతీయును కమీషనరుచే ఆమోదింపబడు స్థలమున ఒక కార్యాలయము నేర్పాటు చేయవలెను.

2 ప్రతిపంచాయతీయును అది ఏర్పాటు చేసికొన్న దినముల లోను సమయములలోను వ్యవహార నిర్వహణ నిమిత్తము దానికి కార్యాలయములో నెలకు కనీసము ఒకసారియైనను సమావేశము కావలెను. అంతేకాక సర్పంచు ఏర్పాటు చేసినప్పుడు కూడ సమావేశమగుచుండవలెను.

3. (1) సమావేశదినమునకు కనీసము మూడు పూర్తి దినములు ముందుగా సమావేశము ఎన్నడు, ఎచ్చట జరుగునదియు, అందులో ఏయే వ్యవహారములు నిర్వహించ బడునదియు తెలుపుచు నోటీసు ఈయబడిననే తప్ప పంచాయతీ యొక్క ఏ సమావేశము కూడ జరుగరాదు.

(2) అత్యవసర సమయములలో సర్పంచు (1)వ ఉప నియమములో తెలిపిన వ్యవధికన్న తక్కువ వ్యవధితో నోటీసు ఇచ్చి సమావేశము ఏర్పాటు చేయవచ్చును.

4. (1) తత్కాలమున పంచాయతీలోని సభ్యులలో మూడింట ఒక వంతు సభ్యులు లిఖిత పూర్వకముగా కోరినచో పంచాయతీ సర్పంచు పంచాయతీ సమావేశము ఏర్పాటు చేయవలెను. అయితే అట్లు కోరునప్పుడు ఆ సమావేశము ఎప్పటివరకు ఎందు నిమిత్తము ఏర్పాటు చేయబడవలెనో స్పష్టముగా తెలుపబడవలెను. ఆ లిఖిత పూర్వకమైన కోరికను సమావేశ దినమునకు కనీసము పది పూర్తి రోజులు ముందుగా పంచాయతీ కార్యాలయములో, కార్యాలయము పనిచేయు కాలమున, సర్పంచుకుగానీ, కార్యనిర్వాహక ఉద్యోగికి గాని లేక అప్పటికి కార్యాలయ భారము వహించిన వ్యక్తికిగానీ అందజేయవలెను.

(2) అట్టి కోరికను అందజేసిన ఐదు దినములలోపల సర్పంచు కోరికలో తెలుపబడిన గడువులో ఏ దినముననైనను, అందులో తెలుపబడిన అంశములను విచారించు నిమిత్తము సమావేశము ఏర్పాటుచేయుటకు తప్పిపోయినచో ఆ కోరికపై సంతకముచేసి, సభ్యులు పంచాయతీలోని ఇతర సభ్యులకు 3వ నియమము 1వ ఉప నియమములో నిర్ణయింపబడిన ప్రకారము నోటీసునిచ్చి సదరు గడువులోపల అనుకూలమైనపదినముననైనను సమావేశము ఏర్పాటు చేయవచ్చును.

(3) ఉపనియమములు (1) లేక (2) ననుసరించి ఏర్పాటు చేయబడు సమావేశము పంచాయతీ కార్యాలయము ఉన్నచోట తప్ప మరొకచోట జరుపరాదు.

5. పంచాయతీ సమావేశములన్నిటికిని ప్రజలెవ్వరైనను రావచ్చును. అయితే ప్రత్యేకమైన ఏదైన సందర్భములో సామాన్యముగా

ప్రజలందరుగాని, ఎవరైన ప్రత్యేక వ్యక్తిగాని వెడలిపోవలసినదని అధ్యక్షత వహించు వ్యక్తి ఆదేశించవచ్చును.

6. ఏ సమావేశములోనైనను పంచాయతీ సమక్షమునకు వచ్చు విషయములన్నియు ఆ సమావేశమునకు హాజరై ఓటుచేసిన సభ్యుల అధిక సంఖ్యాకుల ఓట్లనుబట్టి నిర్ణయింపబడవలెను. ఓట్లు సమానముగా ఉన్న సందర్భములో అధ్యక్షత వహించు వ్యక్తికి రెండవ లేక నిర్ణాయకపు ఓటు ఉండవలెను. అతడు దానిని వినియోగించవలెను. ఒక తీర్మానము ఏక గ్రీవముగా ఆమోదింపబడని సందర్భములో దానికి అనుకూలముగను, ప్రతికూలముగను ఓటు చేసిన సభ్యుల పేర్లు వ్రాసిపెట్టవలెను.

7. పంచాయతీ సమావేశములో, గాని అప్పుడు ఆ పంచాయతీలో ఉన్న సభ్యుల సంఖ్యలో మూడింట ఒక వంతు సభ్యులు హాజరైననే తప్ప ఆ సమావేశములో ఏ వ్యవహారముకూడ నిర్వహింపబడరాదు.

8. సమావేశమునకై నిర్ణయింపబడిన సమయము తర్వాత అరగంటలోపల కోరం హాజరు కాకున్నచో, హాజరైన సభ్యులందరను మరికొంత సేపు నిరీక్షించుటకు అంగీరించిననే తప్ప, సమావేశము వాయిదా పడవలెను.

9. హాజరు రిజిష్టరు ఒకటి నిర్వహింపబడవలెను అందులో అధ్యక్షత వహించు వ్యక్తి హాజరైన సభ్యులందరి సంతకములను తీసికొని, వారు సమావేశమునకు వచ్చినట్టియు అందులోనుండి వెడలి పోయినట్టియు సమయమును నమోదు చేయవలెను.

10. పంచాయతీయొక్క ఏ తీర్మానము కూడ అది ఆమోదింపబడిన తరువాత మూడు నెలలలోపల మార్పు చేయబడరాదు. లేదా రద్దు చేయబడరాదు. అట్లు చేయవలెనన్నచో అందు నిమిత్తము ప్రత్యేకముగా ఒక సమావేశము ఏర్పాటుచేయబడి, పంచాయతీచే తీర్మానము ఆమోదింపబడవలెను. ఆ తీర్మానము మొత్తము సభ్యులలో సగము మందిచే బలపరచబడవలెను.

11. పంచాయతీయొక్క ప్రతి సమావేశములోను వ్యవహారముల మినిట్లు ఆ గ్రామములోని ముఖ్య భాషలో వ్రాసికొని ఇందు కొరకు ఏర్పాటుచేయబడిన పుస్తకములలో ఎక్కించబడవలెను. దానిపై అధ్యక్షత వహించు వ్యక్తి సంతకము చేయవలెను, సదరు మినిట్లను ఈ చట్టము ననుసరించి ఎట్టిపన్నైనను చెల్లించు ఏ వ్యక్తి అయినను పంచాయతీ కార్యాలయములో సబబైన ఏ సమయముననైనను ఏమియు ఛార్జి లేకుండనే తనిఖీ చేయవచ్చును.

12. పంచాయతీయొక్క కార్యనిర్వాహకాధికారి ఆ పంచాయతీ యొక్కయు, దాని కమిటీల యొక్కయు ప్రొసీడింగులను, రికార్డులను తన రక్షణలో ఉంచవలెను, మరియు ఆయన అట్టి ఏవైన ప్రొసీడింగుల లేక రికార్డుల నకళ్లను, నిర్ణయింపబడునట్టి రుసుములు చెల్లింపబడిన మీదట మంజూరుచేయవచ్చును. నకళ్లు 1872 భారత సాక్ష్యముల చట్టముయొక్క 76వ విభాగములో నిబంధింప బడిన రీతిగా కార్య నిర్వాహాధికారిచే సర్టిఫై చేయబడవలెను. అట్లు సర్టిఫై చేయబడిన నకళ్లు, మునిసిపలు సంస్థయొక్క ప్రొసీడింగులు సదరు చట్టముయొక్క 78వవిభాగములో 5వ ఉపవిభాగము క్రింద ఆ సంస్థయొక్క ప్రొసీడింగు లను ఋజువుపరచుటకు ఏ విధముగా

ఉపయోగింపబడవచ్చునో అదే విధముగా పంచాయతీ లేక కమిటీ యొక్క ప్రొసీడింగులను రికార్డులను ఋజువుచేయుటకు ఉపయోగింపవచ్చును.

13. 3, 6, 7, 8, 9, 10వ నియమములు అవసరమైన మార్పులతో పంచాయతీ కమిటీయొక్క ప్రొసీడింగులకు వర్తించవలెను.

14. పంచాయతీ నియమించునట్టి ప్రతి కమిటీయొక్క ప్రొసీడింగులు లిఖితపూర్వకముగా నమోదుచేయబడి, ఆ పంచాయతీకి సమర్పింపబడవలెను.

# షెడ్యూలు - 2.

## కొన్ని పన్నులకును, పంచాయతీల ఆదాయములకు వచ్చిన పైకమును దాచుటకును, పంచాయతీ నిధినుండి పైకమును చెల్లించుటకును సంబంధించిన నియమములు.

(4వ అధ్యాయము).

1వ భాగము—75వ విభాగములో

తెలుపబడినవిగాక ఇతర పనులకు సంబంధించిన నియమావళి.

### ఏ. సాధారణ విషయములు.

1. (1) ఈ నియమములలో ఇతర విధముగా నిబంధింపబడినట్లు తప్ప, కార్యనిర్వాహకాధికారి ప్రతి వ్యక్తిపై లేక ఆస్తిపై విధింపనగు పన్నును నిర్ణయించవలెను.

అయితే కార్యనిర్వాహకాధికారి చెల్లింపదగు పన్నుల విషయములో పంచాయతీ నిర్ణయించవలెను.

(2) ఒక వ్యక్తి చెల్లింపదగు పన్నును ఈ చట్టము క్రింద మొదటిసారిగా నిర్ణయింపబడిన వెంటనే అట్టి వ్యక్తికి నిర్ణయింపబడిన విధముగా నోటీసు పంపవలెను. దానిపై ఆయన నిర్ణయింపబడిన తేదీన లేదా అంతకుముందు ప్రతి సంవత్సరము క్రొత్తగా ఆ విషయమై నోటీసు ఏదియు లేకుండగనే పన్ను చెల్లించుటకు పాత్రము కావలెను.

2. (ఎ) ఎవరైన వ్యక్తిపై లేక ఏదయిన ఆస్తిపై విధింప వలసిన పన్ను సరిగా నిర్ధారణ చేయబడలేదని, లేక ఏదైన పన్నుకు సంబంధించిన పన్ను నిర్ధారణ పుస్తకమునుండి ఎవరయిన వ్యక్తి లేక ఏదైనఆస్తిపొరపాటునగాని,అక్రమముగాగాని మినహాయింపబడినట్లు లేక ఆ పుస్తకములలోని వ్రాతలోగాని, లెక్కలోగాని ఏదయిన తప్పు ఉన్నట్లు ఎప్పుడయినను పంచాయతీకి తోచినచో, తాను న్యాయ మని లేక అవసరమని భావించునట్టి విధానమున ఆ పుస్తకములను సవరించ వలసినదిగా కార్యనిర్వాహకాధికారిని ఆదేశించవచ్చును.

అయితే పన్నును ఎక్కువ చేయవలసి వచ్చినవుడు, సంబంధించిన వ్యక్తి పన్ను నిర్ధారణ పుస్తకములు ఉద్దేశించిన రీతిగా ఎందుకు సవరింప బడరాదో తగు కారణమును తెలుపు కొనుటకు ఆయనకు తగు అవకాశమిచ్చిననే తప్ప, అట్టి ఆదేశమీయబడరాదు.

(బి) అట్టి సవరణ, ఆ సవరణ చేయుటకు అవసరమైన పరిస్థితులు ఏర్పడిన మొట్టమొదటి తేదీన వర్తమాన సంవత్సరములోగాని ఆ తేదీకి సద్యఃపూర్వపు రెండు సంవత్సరములలోగాని అమలులోనికి వచ్చినట్లు భావింపబడ వలెను.

3. (1) కార్యనిర్వాహకాధికారి పన్ను చెల్లించు ప్రతి వ్యక్తికి తానుగాని, తనచే ఆ విషయమై సక్రమముగా అధికారమీయబడిన మరొక వ్యక్తిగాని సంతకము చేసినట్టి రసీదును ఈయవలెను.

(2) అట్టి రసీదులో ఈ క్రిందివి నిర్దిష్ట పరుపబడవలెను.

(ఎ) ఆ రసీదు మంజూరు చేయబడిన తేది.

(బి) అది ఎవరికి మంజూరు చేయబడుచున్నదో ఆ వ్యక్తి పేరు.

(సి) చెల్లింపు ఏ పన్ను కొరకు చేయబడినదో ఆ పన్ను;

(డి) చెల్లింపు ఏ కాలమునకు చెల్లింపబడినదో ఆ కాలము;

(ఇ) చెల్లింపబడిన మొత్తము.

బి. ఇంటి పన్ను నిర్ధారణ.

4. ఇంటి పన్ను కార్యముకొరకు ఇండ్లయొక్క వార్షిక లేక పెట్టుబడి విలువపై ఇండ్ల పన్నులను నిర్ణయించుటకు పంచాయతీ నిశ్చయించినపుడు, అట్లు నిర్ణయింపబడు పన్ను రేట్లు ఇంటి విలువకు ప్రపోర్షనేటుగాగాని ఇంటి విలువతో పాటు పన్నుకూడ పెరుగునట్లు సిస్టమేటిక్ ప్రోగ్రెషన్‌గా గాని ఉండవచ్చును. కాని ఎట్టి సందర్భములోగాని ఇంటి విలువ పెరిగినప్పుడు పన్ను రేటు తగ్గరాదు.

5. (1) పంచాయతీ ప్రపోర్షనేటు రేటును అనుసరించినపుడు, పన్నులను లెక్కించుట వసూలుచేయుట సులభముగా ఉండునట్లు చేయుటకుగాను గ్రామములోని ఇండ్లను కొన్ని తరగతులుగా విభజింపవచ్చును.

(2) పంచాయతీ ప్రోగ్రెసివు రేటును అనుసరించినపుడు (*i*) వర్గీకరణ సూత్రములను ఇంటి పన్ను నిర్ధారణ చేయుటలో పన్ను లేకుండ కొంత కనీస మొత్తము తగ్గింపబడవలెననుట లేక దిగువ తరగతిలో కొంత శాతమునుండి పెద్ద తరగతిలో కొంత శాతము వరకు ప్రోగ్రెషను అమలు జరుపబడవలెననుట), (*ii*) ఒక్కొక్క తరగతియొక్క నిర్దిష్ట సంఖ్యను పరిమితులను, ఆ పంచాయతీ నిర్ణయింపవలెను.

(3) పంచాయతీ పన్ను విధింపు సూత్రమును ప్రపోర్షనేటు అయినను ప్రోగ్రెసివ్ అయినను సరే భంగమొనర్చు విధముగా తర

గతులను ఏర్పాటు చేయరాదు, మరియు ఎట్టి సందర్భములోగాని తరగతులు ఆరింటికి తక్కువగా వుండరాదు.

6. (1) గ్రామములోగల ఏదయిన ప్రాంతముపై అధికారముగల కరణము లేక పట్వారి కార్యనిర్వాహకాధికారి కోరిన మీదట, అట్టి ప్రాంతములోగల ఇండ్ల జాబితా నొకదానిని తయారుచేసి ఆయనకు అందజేయవలెను. మరియు ఆ ఇండ్ల యజమానుల పేర్లను, అందు నివసించుచున్నవారి పేర్లను ఆ జాబితాలో వ్రాయవలెను.

(2) అట్టి జాబితా తయారు చేయుటకును, కలెక్టరు మంజూరీకి లోబడి పంచాయతీ నిర్ణయించు ఏదైన ప్రతిఫలమును పొందుటకును కరణము లేక పట్వారి హక్కు కలిగి యుండవలెను.

7. 6వ నియమములో పేర్కొనబడిన జాబితాలు అందిన మీదట కార్యనిర్వాహకాధికారి పన్ను నిర్ధారణ పుస్తకములను తయారు చేయించవలెను. ప్రతి ఇంటి యజమాని పేరు, అందు నివసించుచున్న వ్యక్తి పేరు, ఆ ఇల్లు ఏ తరగతి క్రింద చేర్చబడినదో ఆ తరగతి చెల్లింపవలసిన పన్ను, ఆ పన్ను చెల్లింప వలసిన తేదీ, ఈ వివరములు అట్టి పన్ను నిర్ధారణ పుస్తకములలో విడి విడి వరుసల క్రింద చూపబడవలెను.

8. పన్ను నిర్ధారణ పుస్తకములు తయారు చేయబడిన వెంటనే, కార్యనిర్వాహకాధికారి గ్రామములో చాటింపు వేయించుట ద్వారా ఆ విషయమును, ఆపుస్తకములో, ఏ స్థలములో లేక స్థలములలో తనిఖీ చేయబడవచ్చునో ఆ స్థలమును లేక స్థలములను ప్రజలకు తెలియచేయవలెను.

9. (1) సాధారణ రివిజను జరిగిన తరువాత మరొక రివిజను జరుగులోపల ఎప్పుడైనను కార్యనిర్వహాకాధికారి పన్ను నిర్ధారణ పుస్తకములో ఏదైన ఇల్లును చేర్చుట ద్వారా, లేక తొలగించుట ద్వారా, లేక ఏదైన ఇంటి విలువనుగాని, తరగతినిగాని దానిపై చెల్లింపవలసిన పన్నునుకాని మార్చుట ద్వారా లేక ఏదైన ఈ విషయమై ప్రభుత్వమువారు చేయు ఏవైన నియమనములకులోబడి, ఏదైన ఇంటి యొక్క యజమాని పేరును, బదిలీ ద్వారా లేక మరొక విధముగా ఆ ఇంటికి యజమాని అయిన వ్యక్తి పేరును చేర్చుట ద్వారా అట్టి పుస్తకములను సవరించవచ్చును.

(2) అట్టి సవరణ అది ఏ సంవత్సరములో చేయబడినదో ఆ సంవత్సరపు మొదటి తేదీన అమలులోనికి వచ్చినట్లు భావింపబడవలెను.

అయితే పన్ను బకాయిపడి ఉండు తేది ముగిసినమీదట ఏదైన సంవత్సరములో సవరణ చేయబడినప్పుడు అది తత్కాలమున అమలునందున్న భవనముల కౌలును అద్దెను నియంత్రించుటకు సంబంధించిన శాసనము క్రింద సబబైన అద్దెను నిర్ణయించుటకు సవరణ ఉద్దేశింపబడినప్పుడు తప్ప, అటు తరువాత సంవత్సరమునుండి మాత్రమే అమలును కలిగియుండవలెను.

ఇంతేకాకుండ, పైన చెప్పబడిన శాసనము క్రింద ఇంటికి సబబైన అద్దెను నిర్ణయించ వలసిన కారణమున సవరణ అవసరమైనపుడు, సబబైన అద్దె ఏ తేదిన నిర్ణయింపబడునో ఆ తేదినుండి సవరణ అమలునందుండవలెను.

మరియు, ఇంటి యాజమాన్యపు బదిలీకి సంబంధించి వివాదగ్రస్తమైన కేసుపై కార్య నిర్వాహకాధికారి యొక్క నిర్ణయము, ఎవరికి బదిలీ చేయబడినదో ఆ వ్యక్తికి ఆ ఇంటిపై చట్టబద్ధమైన హక్కు నీయరాదు.

(3) ఒక సాధారణ రివిజనుకు మరొక రివిజనుకు మధ్య కాలములో కార్య నిర్వాహ కాధికారి ఇంటి పన్నును మొదటిసారిగా నిర్ణయించు ప్రతి సందర్భములోను లేక విధింపబడవలసిన ఇంటి పన్ను రేట్లు సాధారణముగా పెంచబడినందువలన ఏదైన ఇంటి పన్ను రేటును పెంచు ప్రతి సందర్భములోను, పన్ను రేటును సవరింపవలెనని కోరుచు అర్జీ పెట్టుకొన్నచో ఆ అర్జీ పరిశీలింపబడునని కార్య నిర్వాహ కాధికారి ఒక ప్రత్యేక నోటీసు ద్వారా ఆ ఇంటి యజమానికి లేక అందు నివసించుచున్న వ్యక్తికి తెలియజేయవలెను. అయితే అట్టి అర్జీ రాష్ట్ర లేక కేంద్ర ప్రభుత్వము విషయములో కాని, కంపెనీ విషయములో గాని అయినచో నోటీసు అందజేయబడిన తేదీనుండి అరువది దినములలోగాను, ఇతర సందర్భములలో అట్టి నోటీసు అందజేయబడిన తేదీనుండి ముప్పది దినములలోగాను పంచాయతీ కార్యాలయమునకు చేరవలెను.

10. ఇంటి పన్ను ఆఖరి సారిగా నిర్ణయింపబడిన లేక సవరింపబడిన తరువాత సందర్భానుసారముగా ఆ ఇంటి యొక్క వార్షిక విలువ లేక పెట్టుబడి విలువ తగ్గి పోయినదను కారణముపై రాబోవు సంవత్సరములో ఆ ఇంటిపై తాను చెల్లించవలసిన పన్నును తగ్గించ వలసినదిగా కోరుచు ఏ వ్యక్తి అయినను, ఆ సంవత్సరము ముగియుటకు ముందు కనీసము ముప్పది దినములకు తక్కువ కాకుండ లేక అరువది దినములకు మించకుండ ఎప్పుడైనను కార్య నిర్వాహ కాధికారికి రివిజను అర్జీని పెట్టుకొనవచ్చును.

11. నియమము 9 (3) క్రిందగాని, 10 వ నియమము క్రింద గాని రివిజను అర్జీ పరిష్కరింపబడిన వెంటనే, కార్యానిర్వాహ కాధికారి ఆ అర్జీపై చేయబడిన ఉత్తరువులను అర్జీదారునకు లేక ఆయన అధికారము పొందిన ఏజెంటుకు మౌఖికముగాగాని, లిఖిత పూర్వ

కముగాగాని తెలియజేయవలెను. మరియు అట్టి సమాచారము అందిన తేదీనుండి పదునైగు దినములలోగా లేక పైకము బాకీ లేనిచో అట్లు ఏ తేదీన బాకీపడునో ఆ తేది నుండి పదునైదు దినము లలోగా రివిజనుపై నిర్ణయింపబడిన మొత్తమును చెల్లింపవలసినదిగా ఆయనను ఆదేశించవలెను. అవసరమైనచో పన్ను నిర్ధారణ పుస్తకము లను సరిచేయించ వలెను.

12. (1) కార్యనిర్వాహకాధికారి, ప్రతి సంవత్సరము క్రొత్త జాబితాలను లేక పన్ను నిర్ధారణ పుస్తకములను తయారుచేయించ నవసరములేదు. అయితే చేయబడిన లేక చేయబడు సవరణలతో జరి గిన సంవత్సరపు జాబితాల లేక పుస్తకములనే తరువాత సంవత్సరము నకు ఉపయోగించవచ్చును.

అయితే ప్రతి అయిదు సంవత్సరముల కొకసారి క్రొత్తగా సాధారణ పన్ను నిర్ధారణ జరుపబడవలెను. మరియు ప్రభుత్వము వారు ఆంధ్రప్రదేశ గెజిటులో ప్రకటన ద్వారా సాధారణ పన్ను నిర్ధారణ తేదీని ముందుకు జరుపుట గాని లేక మరికొంత కాలము నకు వాయిదా వేయుటగాని చేయవచ్చును. లేదా అట్టి నిర్ధారణ జరుపబడుటకు విరామములను నిర్ణయించవచ్చును.

(2) అట్టి సవరణలను, సాధారణ పన్ను నిర్ధారణను గురించి 8వ నియమములో నిబంధింపబడిన విధానమున ప్రజలకు తెలియజేయ బడవలెను.

(3) సాధారణ పన్ను నిర్ధారణ ఏ సంవత్సరములో అట్లు ప్రజ లకు తెలియజేయబడినదో ఆ సంవత్సరము యొక్క మొదటి దినము నుండి అమలునందున్నట్లు భావింపబడవలెను,

(డి) కార్యనిర్వాహకాధికారి, రివిజను అధికారిచే కోరబడి నప్పుడు, ఆయన అధికారములు నిర్వహించుటకు, విధులు నిర్వర్తించుటకు, మరియు కార్యములు చేయుటకొరకు, అవసరమగు సిబ్బందిని ఈయవలెను.

(3) ప్రభుత్వము, 2వ ఉప నియమము క్రింద నియమింపబడిన రివిజను అధికారి యొక్క వర్గీకరణను, చేర్చుకొను పద్ధతులను, ఉద్యోగ షరతులను, జీతబత్తెములను, క్రమశిక్షణ మరియు నడవడికలను క్రమబద్ధము చేయవలెను.

సి. వృత్తిపన్ను—విధింపు, కనిష్ఠ మరియు గరిష్ఠ రేట్లు

14. (1) వృత్తి పన్ను నిర్ధారణ కార్యములకొరకై కంపెనీలు, వ్యక్తులు విభజింపబడవలసిన తరగతులు ఎక్కువ తరగతి పై సంవత్సరమునకు విధింపబడదగు కనిష్ఠ మరియు గరిష్ఠ పన్ను ఈ క్రింద తెలుపబడినది.

| తరగతి (1) | సంవత్సరపు ఆదాయము (2) | సం. నకు గరిష్ఠ పన్ను (3) | సం. నకు కనిష్ఠ పన్ను (4) |
|---|---|---|---|
| | | రూ.న.పై. | రూ.న.పై. |
| (i) | రు.30,000లకు మించినచో.... | 250-00 | 200-00 |
| (ii) | రు.24,000లకు మించి, రు.30,000లకు మించనిచో, | 200-00 | 150-00 |
| (iii) | రు. 18,000లకు మించి, రు.24,000లకు మించనిచో. | 150-00 | 100-00 |
| (vi) | రు.12,000లకు మించి, రు. 18,000 లకు మించనిచో. | 100-00 | 50-00 |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| (v) | రు. 9,600లకు మించి, రు. 12,000 లకు మించనిచో. | 50-00 | 24-00 |
| (vi) | రు.6,000లకు మించి, రు. 9,600 లకు మించనిచో. | 24-00 | 12-00 |
| (vii) | రు.3,600లకు మించి, రు. 6,000 లకు మించనిచో. | 12-00 | 8-00 |
| (viii) | రు.2,400లకు మించి, రు. 3,600 లకు మించనిచో. | 8-00 | 4-00 |
| (ix) | రు. 1,200లకు మించి, రు. 2,400 లకు మించనిచో. | 4-00 | 2-00 |
| (x) | రు. 600లకు మించి. రు. 1,200 లకు మించనిచో. | 2-00 | 1-00 |

(2) గ్రామ పంచాయతీ (1)వ ఉప నియమములో నిర్దిష్ట పరచబడిన గరిష్ఠ, కనిష్ఠ మొత్తములకు లోబడి ఒక్కొక్క తరగతి పై విధింపబడదగు పన్నును నిర్ణయించవలెను.

అయితే ఏదైన తరగతిపై పన్ను. ఆ తరగతి యొక్క కనిష్ఠ ఆదాయమునకు ఏ దామాషాలో ఉండునో ఆ దామాషా, ఏదైన తక్కువ తరగతిపై పన్ను [అట్టి తక్కువ తరగతి యొక్క కనిష్ఠ ఆదాయమునకు ఉండు దామాషాకు తక్కువగా వుండరాదు.

(3) పంచాయతీ, (1)వ ఉప-నియమములోని ఏదైన ఒక తరగతిని లేక ఏవైన కొన్ని తరగతులను వృత్తిపన్ను విధింపు నుండి

మినహాయింప వచ్చును. కాని ఏ తరగతి గ్గాని అంతకు తక్కువ తరగతిపై పన్ను విధింపబడినపుడు, పన్ను విధింపు నుండి మినహాయింపబడరాదు.

15. ఒక కంపెనీ లేక ఒక వ్యక్తి ఒక గ్రామములోపల కార్యాలయమును గాని, ఉద్యోగ స్థలమును గాని కలిగియుండినచో అట్టి కంపెనీ లేక వ్యక్తి అట్టి గ్రామములోపల వ్యాపారము చేసినట్లు లేదా వృత్తిని గాని, కళాసుగాని, పనిని గాని నిర్వహించినట్లు లేదా ఉద్యోగము కలిగి యుండినట్లు భావింపబడవలెను.

16. (1) ఒక కంపెనీ లేక వ్యక్తి వడ్డీ వ్యాపారము గాక మరే వ్యాపారమునైనను ఏదేని సంవత్సరములో కేవలము ఒక్క పంచాయతీకి చెందిన ప్రాంతములో మాత్రమే చేసియుండినచో ఈ చట్టము ననుసరించి వృత్తి పన్నును అర్ధ సంవత్సరములో వసూలు చేయు నిమిత్తము అట్టి కంపెనీకి అట్టి వ్యాపారము చేయుటవలన వచ్చిన ఆదాయము—

(ఎ) అట్టి కంపెనీ లేక వ్యక్తిపై సంవత్సరమునకు 1961 ఆదాయపు పన్ను చట్టము ననుసరించి ఆదాయపు పన్ను నిర్ధారణ చేయబడు సందర్భములో, ఆదాయపు పన్ను నిర్ధారణ నిమిత్తము ఆ చట్టముయొక్క 28వ విభాగము ననుసరించి ఏ మొత్తము అట్టి వ్యాపారముల లాభములుగా లెక్క కట్ట బడునో ఆ మొత్తము అని;

(బి) నిర్ణయించుట సాధ్యము కాని సందర్భములో లేదా అట్టి కంపెనీ లేక వ్యక్తిపై ఆదాయపు పన్ను విధింపబడనిచో ఆ సంవత్సరములో లేదా దీనిని నిర్ణయించుటకూడ సాధ్యము కాని సందర్భములో అంతకుముందు సంవత్సరములో పంచాయతీ ప్రాంత

ములో చేయబడిన ఆ వ్యాపారముయొక్క టర్నోవరులో 17వ నియమము దృష్ట్యా లెక్క కట్టబడునట్టి శాతము లేక శాతములు అని భావింప బడవలెను.

(2) ఒక కంపెనీ లేక వ్యక్తి వడ్డీ వ్యాపారము కాక మరే వ్యాపారమునైనను కొంత భాగము పంచాయతీ ప్రాంతములోను, కొంత భాగము పంచాయతీకి వెలుపలి ప్రాంతములోను చేసినపుడు, పంచాయతీ ప్రాంతములో చేసిన అట్టి వ్యాపారమువలన ఆ కంపెనీకి లేక వ్యక్తికి వచ్చిన ఆదాయము, ఈ చట్టముక్రింద వృత్తిపన్ను విధించు కార్యము కొరకు సందర్భానుసారముగా ఆ సంవత్సరములో అట్టి ప్రాంతమందుచేయబడిన అట్టి వ్యాపారము యొక్క టర్నోవరులో 17వ నియమము దృష్ట్యా లెక్క కట్టబడునట్టి శాతము అని భావింపబడవలెను.

(3) (1)వ ఉప-నియమముయొక్క (బి) క్లాజు మరియు (2)వ ఉప--నియమములలోని కార్యముల కొరకు ఏ గ్రామములోనైనను వ్యాపారముయొక్క టర్నోవరు అనగా ఆ గ్రామములో ఉత్పత్తి చేయబడిన, తయారు చేయబడిన, కొనబడిన లేక అమ్మబడిన సరకులయొక్క లేక వడ్డీ వ్యాపారముగాక ఆ గ్రామమందు జరుపబడిన ఏదైన ఇతర వ్యాపారముయొక్క మొత్తముడబ్బు విలువ అని అర్థము.

వివరణ:—ఈ ఉప నియమము క్రింద వ్యాపారపు టర్నోవరును నిర్ణయించునపుడు—

(ఎ) ఒక కంపెనీ లేక వ్యక్తి చేసిన ఏదేని కొనుగోలు మూలముగా జరిగిన కొన్ని సరకుల డెలివరీ మరియు అదే కంపెనీ లేక వ్యక్తి ఆ సరకులను అమ్ముట వలన జరుగు డెలివరీ

ఈ రెండూ ఆంధ్రప్రదేశ రాష్ట్రములోనే జరుపబడినపుడు రెండవది మాత్రమే లెక్కలోనికి తీసికొనబడవలెను.

(బి) ఒక కంపెనీ లేక వ్యక్తి చేసిన ఏదేని కొనుగోలు మూలముగా జరిగిన కొన్ని సరకుల డెలివరీ రాష్ట్రమునకు వెలుపల ఏదేని ప్రదేశములో చేయబడి అదే కంపెనీ లేక వ్యక్తి ఆ సరకులను అమ్మినపుడు డెలివరీ రాష్ట్రములోనే చేయబడినపుడు రెండవ డెలివరీ మాత్రమే లెక్కలోనికి తీసికొనబడవలెను;

(సి) ఒక కంపెనీ లేక వ్యక్తి కొన్న ఏదేని సరకుల డెలివరీ రాష్ట్రములో చేయబడి, అదే కంపెనీ లేక వ్యక్తి ఆ సరకులను అమ్మినపుడు జరుగు డెలివరీ రాష్ట్రమునకు వెలుపల ఏ ప్రదేశములోనైనను జరుపబడినపుడు మొదటిది మాత్రమే లెక్కలోనికి తీసికొనబడవలెను.

17. వృత్తిపన్ను విధింపు కొరకు ఆదాయమును లెక్కకట్టు కార్యము నిమిత్తము 16వ నియమము యొక్క (1)వ ఉప-నియమము (బి) క్లాజు మరియు (2)వ ఉప-నియమము క్రింద వ్యాపారపు టర్నోవరు శాతము ఈ క్రింది పట్టికలోని (1), (2) వరుసలలో నిర్దిష్ట పరుపబడిన విధముగా ఉండవలెను:

అయితే ఏ సందర్భములోనైనను అట్లు లెక్క కట్టబడిన ఆదాయము సదరు పట్టిక (3)వ వరుసలో నిర్దిష్ట పరుపబడిన కనిష్ట మొత్తముకంటె తక్కువగా వున్నచో ఆదాయము అట్టి కనిష్ఠ మొత్తమంత అగునట్లుగా పెంచబడ వలెను.

పట్టిక.

| టర్నోవరు. | శాతము | కనిష్ఠ మొత్తము |
|---|---|---|
| (1) | (2) | (3) |
| వ్యాపారపు టర్నోవరు, రూ. 12 లక్షలు మించినపుడు | 1 | 18.000 |
| వ్యాపారపు టర్నోవరు రూ. 6 లక్షలకు, మించి 12 లక్షల లోపుగా ఉన్నపుడు | 1.5 | 12,000 |
| వ్యాపారపు టర్నోవరు రూ. 3లక్షలకు మించి రూ. 6లక్షలకు లోపుగా ఉన్నపుడు | 2 | 9.000 |
| వ్యాపారపు టర్నోవరు రూ.1,50,000 మించి రూ. 3లక్షలకు లోపుగా ఉన్నపుడు | 3 | 6,000 |
| వ్యాపారపు టర్నోవరు రూ. 1,50,000 రూపాయలకు మించనపుడు | 4 | .... |

18. (1) ఏదైన సంవత్సరమునకు ఏదైన కంపెనీ లేక ఎవరైన వ్యక్తి వృత్తిపన్ను చెల్లించవలెనని లేక చెల్లింపవలసి యుండునని కార్యనిర్వాహకాధికారి భావించినచో, ఆయన ఆ సంవత్సరములోగాని, లేక తరువాత సంవత్సరములోగాని అట్టి కంపెనీకి లేక వ్యక్తికి అదీ లేక ఆయన ఆ సంవత్సరములో ఏ ఆదాయము ప్రాతిపదికపై వృత్తిపన్ను చెల్లింపవలసి యుండునని భావించునో ఆ ఆదాయమును తెలుపు రిటర్నును సమర్పించ వలసినదిగా కోరుచు నోటీసు నీయవలెను. అట్లు సమర్పించుటకు గడువు నోటీసులో నిర్దిష్ట పరుపబడవలెను, అయితే అట్టి గడువు ముప్పది

దినములకు తక్కువగా ఉండరాదు. కంపెనీ లేక వ్యక్తి అట్లు సమర్పించు రిటర్నులో తెలిపిన ఆదాయము ప్రాతిపదికపై ప్రస్తావనలో ఉన్న సంవత్సరమునకు ఆ కంపెనీ లేక వ్యక్తి వృత్తి పన్ను చెల్లింపవలసి యుండును. తరువాత వృత్తిపన్ను ఏ సంవత్సరమునకు కోరబడినదో ఆ సంవత్సరములో లేక గత సంవత్సరములో ఆ కంపెనీ లేక వ్యక్తికి వచ్చిన ఆదాయమును చూపుచు (ఏ) అనుబంధములోనున్న నమూనాలో ఒక రిటర్నును సమర్పించుటకును, అట్టి రిటర్నుకు ఆధారముగా ఏదైన సాక్ష్యమును తెచ్చుటకును అట్టి కంపెనీకి లేక వ్యక్తికి స్వేచ్ఛ వుండ వలెను,

(2) ఉప–నియమము (1) లో కోరబడిన రీతిగా రిటర్ను సమర్పింపబడి, ఆ రిటర్ను సరిగాను పూర్తిగాను వున్నదని కార్యనిర్వాహకాధికారి విశ్వసించినచో, ఆయన అట్టి రిటర్ను ప్రాతిపదికపై ఆ కంపెనీ లేక వ్యక్తి నుండి వృత్తిపన్ను వసూలు చేయవలెను.

వివరణ;–16 నియమము, (1)వ ఉప–నియమముయొక్క (బి) క్లాజు లేక (2)వ ఉప-నియమము క్రిందికి రానట్టి సందర్భములలో, 1961 ఆదాయపు పన్ను చట్టములోని 156వ విభాగము క్రింద ఒక కంపెనీ లేక వ్యక్తికి ప్రస్తావనలో ఉన్న సంవత్సరమునకుగాను ఈయబడిన ఆదాయపు పన్ను డిమాండు నోటీసును ఆ కంపెనీ లేక వ్యక్తి, తెచ్చి చూపినపుడు, వృత్తి పన్ను విధించు కార్యము నిమిత్తము అట్టి డిమాండు నోటీసులో పేర్కొనబడిన ఆదాయము ఈ చట్టము క్రింద వృత్తిపన్ను విధింపబడు ఆదాయముగా కార్యనిర్వాహకాధికారి తీసికొన వలెను.

(3) ఉప-నియమము (1) లో కోరబడినరీతిగా రిటర్ను సమర్పింప బడనిచో లేక అట్లు సమర్పింప బడిన రిటర్ను సక్రమముగా లేదనియు, అసంపూర్తిగా ఉన్నదనియు కార్యనిర్వాహకాధికారి నమ్మినచో, ఆయన ఒక కంపెనీ లేక వ్యక్తియొక్క సంవత్సరపు ఆదాయము ఎంత వుండునని అంచనా వేయునో అంత ఆదాయమునకు తగిన తరగతిని ఆ కంపెనీకి లేక వ్యక్తికి కేటాయించవలెను.

(4) ఉప-నియమము (3) క్రింద ఒక కంపెనీ లేక వ్యక్తికి ఒక తరగతిని కేటాయించునపుడు, నిర్వహింపబడిన వ్యాపారపు స్వభావము, ప్రసిద్ధి, నివాస, వ్యాపార భవనముల పరిమాణము అద్దె, వ్యాపారము జరుపబడు సరకుల పరిమాణము, సంఖ్య నియమింప బడిన వ్యక్తుల సంఖ్య, చెల్లింపబడిన ఆదాయపు పన్ను మున్నగు సాధారణ విషయములను కార్యనిర్వాహకాధికారి దృష్టిలో వుంచుకొని అట్లు కేటాయించ వలెను.

(5) ఏ కంపెనీ లేక వ్యక్తియొక్క అకౌంట్లను గాని తెచ్చి చూపుమనుటకు కార్యనిర్వాహకాధికారికి హక్కు వుండ వుండరాదు.

19. ఏ కంపెనీ లేక వ్యక్తి అయినను బాకీయున్న వృత్తి పన్ను చెల్లింపనిచో, పంచాయతీ యొక్క కార్యనిర్వాహకాధికారి నోటీసు అందజేసిన పదునైదు దినములలో అట్టి పన్నును చెల్లించవలసినదిగా ఆ కంపెనీకి లేక వ్యక్తికి ఒక నోటీసు నీయవలయును.

20. వృత్తి పన్ను నిర్ధారణకు సంబంధించి ఏదైన కంపెనీ లేక ఎవరైన వ్యక్తి ఇచ్చిన అన్ని స్టేటుమెంట్లు, అందజేసిన

రిటర్నులు; లేక తెచ్చిన అక్కౌంట్లు లేక పత్రములు రహస్యమైనవిగా పరిగణింపబడవలెను వాటి నకళ్ళు ప్రజలకు ఈయబడరాదు.

21. ఏదైన భవనమును, భూమిని, హోటలును, భోజన లేక విశ్రాంతి గృహమును, క్లబ్బును లేక నివాస భాగమును ఆక్రమించుకొని యున్న వ్యక్తులందరి పేర్లను వారిలో ప్రతి ఒక్కరు నిర్వహించు చున్న వృత్తి, కళ లేక పని, ఆయన చెల్లించు ఏదైన అద్దె, ఆయన ఆక్రమించుకొని యున్న కాలము ఈ వివరములను స్పష్టముగా తెలుపు నట్టి లిఖిత పూర్వకమైన జాబితా నొకదానిని నిర్దిష్టమగు కాల పరిమితిలోగా తనకు అందజేయ వలసినదిగా కోరుచు కార్య నిర్వాహకాధికారి ఆ భవనము, లేక భూమి యొక్క యజమానికి లేక ఆక్రమణదారుకు గాని, ఆ హోటలు, భోజన లేక విశ్రాంతి గృహము, క్లబ్బు లేక నివాసభాగము యొక్క కార్యదర్శికి లేక మేనేజరుకు గానినోటీసు నీయవచ్చును.

## డి. బండ్లపై పన్ను.

22. (1) కార్యనిర్వాహకాధికారి, బండ్ల పన్ను చెల్లింపవలసి యుండునని భావింపబడు ప్రతి వ్యక్తికి, ఒక ముద్రిత పట్టికను పంపవలెను. ఆవ్యక్తి, తనవద్దగల లేక తాను ఉపయోగించుచున్న బండ్లకు సంబంధించి, పన్ను నిర్ధారణ కొరకు అవసరమని కార్యనిర్వాహకాధికారి భావించునట్టి సమాచారమును ఆ పట్టికలో తెలుపవలెను.

(2) ఆ పట్టిక ఎవరికి పంపబడినదో ఆవ్యక్తి, అది అందిన ఒక వారములోగా అట్టి సమాచారముతో ఆ పట్టికను వ్రాతపూర్వకముగ పూరించేసి దానిపై సంతకము చేసి, తేదీ వేసి,దానిని పంచాయతీ కార్యాలయమునకు పంపవలెను.

(3) ఉప—నియమము (2) లో పేర్కొనబడిన వారము గడువు ముగిసిన మీదట కార్యనిర్వాహకాధికారి బండ్ల పన్ను క్రింద ఆ వ్యక్తి ఎంత మొత్తమును చెల్లింపవలసి యుండునని భావించునో అంత మొత్తమును నోటీసు నందజేయుట ద్వారా, అట్టి నోటీసు అందిన ముప్పదిదినముల లోగా చెల్లింప వలసినదిగా ఆయన ఆవ్యక్తిని కోరవలెను.

23. ఏదైన బండికి సంబంధించి ఏ వ్యక్తిఅయినను తాను చెల్లింపవలసిన పన్ను చెల్లించిన మీదట, కార్యనిర్వాహకాధికారి ఆ పన్ను ఏ కాల పరిమితికి సంబంధించి చెల్లింపబడెనో అంత కాల పరిమితి వరకు ఆ వ్యక్తి అట్టి బండిని ఉంచుకొనుటకు లేక ఉపయోగించుకొనుటకు లైసెన్సును మంజూరు చేయవలెను.

24. నియమము 23 క్రింద లైసెన్సు మంజూరు చేయబడిన ప్రతి బండిపై పంచాయతీ నెంబరు వేయబడవలెను. మరియు అట్టి నెంబరు పంచాయతీ కార్యాలయములోరిజిష్టరు చేయబడవలెను.

అయితే ఏదైన ప్రత్యేక శాసనము యొక్క నిబంధనల క్రింద నెంబరు వేయబడవలసిన బండి విషయములో అట్టి పంచాయతీ నెంబరు వేయ నవసరము లేదు.

25. నియమము 24 చే కోరబడిన రీతిగా ఏదైన బండిపై పంచాయతీ నెంబరుగాని ఏదైన ప్రత్యేక శాసనపు నిబంధనల క్రింద నెంబరుగానీ వేయబడనిచో కార్యనిర్వాహకాధికారి ఎప్పుడైనను ఆ బండిని జప్తు చేసి తమవద్ద వుంచు కొనవచ్చును.

అయితే బైసికిలు, ట్రైసికిలు లేక రిజాలు తప వాస్తవముగా ఎవరైన ప్రయాణీకుని లేక సరకులను మోసుకొని పోవుచున్న ఏ బండినిగాని జప్తు చేయరాదు, లేక తనవద్ద ఉంచుకొనరాదు.

26. (1) జప్తుచేయబడిన బండి క్లెయిము చేయబడక అట్లుజప్తు చేసిన తేదీ నుండి పది దినములలోగా దానిపై చెల్లించవలసిన పన్ను చెల్లింపబడనిచో, కార్యనిర్వాహకాధికారి ఆ బండిని బహిరంగవేలము ద్వారా అమ్మవలెనని ఆదేశింపవచ్చును. అమ్మకమువలన వచ్చిన పైకము ఈ క్రింది వాటికి వినియోగింపబడవలెను.

(*i*) అమ్మబడిన బండిపై ఏదైన పన్ను చెల్లింపవలసి యున్నచో ఆ పన్ను;

(*ii*) పన్ను మొత్తమునకు మించకుండ, కార్యనిర్వాహకాధికారి ఆదేశించునంతటిజరిమానా;

(*iii*)జప్తు, నిలిపియుంచుట, అమ్మకము—వీటికి అయిన ఖర్చు క్రింద ఏబది నయా పైసలు. అమ్మకమువలన వచ్చిన మొత్తములో పై మొత్తములు పోగా మిలిగిన మొత్తము బండి యజమానికి చెల్లింపబడవలెను.

(2) బండి జప్తు చేయబడిన తేదీనుండి పది దినములలోగా లేక అమ్మకమునకు ముందు ఎప్పుడైనను బండిని యజమానిగాని, దానిపై హక్కుగల ఇతర వ్యక్తిగాని బండిని కోరినచో, ఈ క్రింది మొత్తములు చెల్లించిన మీదట ఆ బండి ఆయన కీయబడవలెను.

(*i*) బండిపైచెల్లింపవలసి యున్న పన్ను:

(*ii*) పన్ను మొత్తమునకు మించకుండ, కార్యనిర్వాహకాధికారి ఆదేశించునట్టి జరిమానా ; మరియు

(*iii*)బండిని జప్తు చేసి ఉంచు కొన్నందుకు అయిన ఖర్చుల క్రింద ఇరువది అయిదు నయా పైసల మొత్తము.

## ఇ. అప్పీళ్లు.

27. ఈ క్రింది పన్నుల నిర్ధారణ మరియు విధింపు విషయములో పంచాయతీకి అప్పీలు చేసికొనవచ్చును:—

(ఎ) 7, 12 నియమముల క్రిందను, రివిజను అర్జీపై 14వ నియమముక్రింద కార్యనిర్వాహకాధికారి ఉత్తరువుల క్రిందను చేయబడిన ఇంటి పన్ను నిర్ధారణ, విధింపు;

(బి) కార్యనిర్వాహకాధికారి విధించిన—

(*i*) ఏదైన బండి పన్ను;

(*ii*) ఏదైన వృత్తి పన్ను; మరియు

(సి) ఈ చట్టము క్రింద విధింపుకు కమీషనరు మంజూరు చేసిన వ్యవసాయ భూమిపై పన్ను నిర్ధారణ.

(28) ఏ అప్పీలుగాని పంచాయతీచే అది—

(*i*) ఏ పన్ను విషయమై ఫిర్యాదు చేయబడినదో ఆ పన్నును చెల్లింపుమని నిర్ణయించిన తేదీకి ముందుగా అప్పీలు పంచాయతీ కార్యాలయమునకు చేరిననే తప్ప; మరియు,

(*ii*) పేదతనము కారణముగా కార్యనిర్వాహకాధికారి అన్యథా ఆదేశించినపుడు కాక ఏ పన్ను విషయములో అప్పీలుచేసికొనబడుచున్నదో ఆ పన్ను (*i*) వ క్లాజులో నిర్దిష్టపరుపబడిన తేదీ లోపల పంచాయతీ కార్యాలయములో చెల్లింపబడిననే తప్ప, లేక డిపాజిటు చేయబడిననే తప్ప, అనుమతింపబడరాదు.

అయితే, పంచాయతీ తనకు సంతృప్తికరమైన కారణము చూపబడినచో (i)వ క్లాజులో నిర్దిష్టపరుపబడిన తేదీ తరువాత పదు నైదు దినములలోగా ఏదైన అప్పీలును అనుమతించవచ్చును.

29. పంచాయతీ తనంతట తానుగాని, ఇతర విధముగాగాని, పన్నును తగ్గించుచు లేక మాఫీ చేయుచు కార్యనిర్వాహకాధికారి జారీచేసిన ఏ ఉత్తరువు పైనను రద్దు చేయవచ్చును లేక సవరించ వచ్చును.

30. అప్పీలుపై పంచాయతీ చేసిన ఏదైన ఉత్తరువుల ననుస రించి పన్ను నిర్ధారణ పుస్తకములు సరిచేయబడవలెను; పంచాయతీ ఏదైన పన్ను మొత్తమును తగ్గించిన లేక మాఫీచేసిన సందర్భములో కార్యనిర్వాహకాధికారి ఆ ప్రకారము పైకము వాపసు నీయ వలెను.

31. ఇందులో ఇంతకుముందు నిబంధింపబడిన విధముగా అప్పీలు చేసికొనబడనపుడు మరియు అట్టి అప్పీలు చేసికొనబడినపుడు ఏదైన పన్ను నిర్ధారణపై పంచాయతీ యొక్క తీర్పు, ప్రభుత్వమువారి రివిజనరీ అధికారములకులోబడి, అంతిమమైనదిగా ఉండవలెను.

అయితే ఏదైన పన్ను నిర్ధారణ దాని యొక్క పుస్తకముల ననుసరించి లేనపుడు ఆ పుస్తకముల ననుసరించి క్రొత్తగా పన్ను నిర్ధారణ లేకడిమాండు చేయుటను ఈ నియమములో ఉన్నదేదియు నిషేధించునదిగా భావింపబడరాదు.

32. (1) కమీషనరు ప్రకటన ద్వారా ఆదేశించునట్టి ఏదేని కాలములో ఆయన నియమించునట్టి ప్రత్యేకాధికారిచే 2, 27, 29 నియమముల క్రింద పంచాయతీకిగల అధికారములు, వినియోగింప

బడవలెను. మరియు పంచాయతీ సదరు కాలములో సదరు అధికార ములను వినియోగింపరాదు. 2 మరియు 27 నుండి 31 నియమము లలో "పంచాయతీ, అనుమాట వచ్చు ప్రతిచోట, ఆ మాటకుబదులు, మరియు 28వ నియమ ములోని "కార్యనిర్వాహకాధికారి"అనుమాటకు బదులు "ఈ విషయమై కమీషనరు నియమించిన ప్రత్యేకాధికారి"అను మాటలు ఉన్న ఎట్లో అట్లే ఆ నియమములు అమలునందుండవలెను.

(2) ఉపనియమము (1) క్రింద నియమింపబడిన ప్రత్యేకాధికారి సదరు ఉపనియమము క్రింద తన అధికారములను వినియోగించు కార్యము కొరకు అవసరమైన పంచాయతీ యొక్క మరియు కార్యనిర్వాహకాధికారి యొక్క అధికారము లన్నింటిని కలిగి యుండవలెను, మరియు సందర్భానుసారముగా పంచాయతీ లేక కార్యనిర్వాహకాధికారి పొందవగియున్న రక్షణను ఆయన కూడ పొందుటకు హక్కు కలిగియుండవలెను.

(3) కమీషనరు నిర్ణయించునట్టి వేతన, బత్తెములు పంచాయతీ నిధిలోనుండి ప్రత్యేకాధికారికి చెల్లింపబడవలెను, ప్రత్యేకాధికారిగా ఒక ప్రభుత్వోద్యోగి నియమింపబడినచో, ఆయనచే లేక ఆయన తరపున పించను, సెలవు వేతనముల క్రింద అతని ఉద్యోగ షరతుల ననుసరించి చెల్లింపబడవలసిన మొత్తమును కూడ పంచాయతీ చెల్లింపవలెను.

## ఎఫ్. పన్నుల వసూలు

33. (1) ఎవరైనవ్యక్తి ఇంటిపన్ను చెల్లింపవలసి యున్నప్పుడు పంచాయతీ కార్యనిర్వాహకాధికారి 31వ నియమము యొక్క నిబంధ నలు అమలు జరుపుటకు ముందు బాకీ యున్న మొత్తమునకు ఒక బిల్లును ఆ వ్యక్తికి అందజేయవలెను.

(2) 19వ నియమము క్రింద లేక 22వ నియమము క్రింద ఈయబడు నోటీసుపైనను, (1)వ ఉప-నియమము క్రింది బిల్లు పైనను కార్యనిర్వాహకాధికారి గాని ఆయనచే సక్రమముగా అధికారము పొందిన మరొక వ్యక్తిగాని సంతకము చేయవలెను. మరియు వాటిలో ఈ క్రిందివి ఉండవలెను :—

(ఎ) ఏ వృత్తిపై, ఆస్తిపై లేక వస్తువుపై పన్ను విధింపబడు చున్నదో దాని కాల పరిమితిని వివరణను తెలుపు స్టేటుమెంటు; మరియు

(బి) చెల్లింపు చేయనిచో పొందిన బాధ్యతను గురించి నోటీసు.

(3) పన్ను ఏ సంవత్సరములో చెల్లింపవలసి యుండెనో ఆ సంవత్సరములో గాని లేక తరువాత సంవత్సరములో గాని 19వ నియమములో లేక 22వ నియమములో పేర్కొనబడిన నోటీసుగాని, (1)వ ఉప-నియమములో పేర్కొనబడిన బిల్లుగాని ఈయబడనిచో ఈ ఉప-నియమములో మొదట తెలుపబడిన సంవత్సరమునకు పన్నును ఈ నియమములో నిబంధింపబడిన రీతిగా రాబట్టబడరాదు.

అయితే 2వ నియమము క్రింద పన్ను నిర్ధారణ పుస్తకములు సవరింపబడినపుడు, సవరణ చేయబడిన సంవత్సరములోగాని, లేక తరువాత సంవత్సరములోగాని బిల్లు అందజేయబడవచ్చును.

(4) ఈ నియమములో లేక 34వ నియమములో ఉన్నదేదియు పంచాయతీ తనకు రావలసిన పన్ను విషయమై న్యాయపంచాయతీలో గాని, సివిలు కోర్టులో గాని దావా వేయుటకు ఆ పంచాయతీని ఆటంక పరచరాదు.

34. (1) బిల్లు అందజేయబడిన లేక 11వ నియమములో పేర్కొన్నట్లు ఆదేశ మీయబడిన లేక 19వ లేక 22వ నియమము క్రింద నోటీసు అందజేయబడిన తేదీ నుండి పదునైదు దినములలోగా డిమాండు చేసిన పన్ను చెల్లింపబడనిచో మరియు పన్ను చెల్లింప వలసిన వ్యక్తి తాను ఆ పన్నును ఎందుకు చెల్లించకూడదో కార్య నిర్వాహకాధికారి సంతృప్తి పడువిధముగా కారణమును తెలుపనిచో, కార్యనిర్వాహకాధికారి తన వారంటుద్వారా పన్ను చెల్లించని వ్యక్తి చరాస్తిని జప్తుచేసి దానిని అమ్మవచ్చును. అట్లు అమ్మి, ఆ వ్యక్తి చెల్లింపవలసిన పన్ను, వారంటు రుసుము, జప్తు రుసుము, అట్లు జప్తు చేయబడిన ఆస్తిని తనవద్ద ఉంచుకొని అమ్మినందులకు బహుశః అగు ఛార్జీలు ఈ మొత్తములను రాబట్టు కొనవచ్చును;

అయితే ఎప్పుడుకాని 1908 సివిలు ప్రొసీజరు కోడు 60వ విభాగమునకుగల మినహాయింపు నిబంధనలో వివరింపబడిన చరాస్తి జప్తు చేయబడరాదు.

(2) ఏ కారణము చేతనైనను, పన్ను చెల్లింపని వ్యక్తిఆస్తిని జప్తుచేయుటకు లేక తగిన మేరకు జప్తుచేయుటకు వీలుకానిచో కార్య నిర్వాహకాధికారి ఆ వ్యక్తిపై అభియోగము తేవచ్చును.

(3) ఉప-నియమము (1) క్రింద వారంటు ఈ నియమముల యొక్క (బి) అనుబంధములోగల నమూనాలోగాని, అదేవిధమైన మరొక నమూనాలోగాని ఉండవలెను; అట్టి ప్రతి వారంటుకు పన్నెండు నయాపైసల రుసుము వసూలు చేయబడవలెను.

(4) కార్యనిర్వాహకాధికారి యొక్క లిఖితపూర్వకమైన ప్రత్యేక ఉత్తరువు క్రింద జప్తు వారంటును అమలు జరుపుటకు అధికారమీయబడిన ఎవరైన ఉద్యోగి ఏదైన భవనములో జప్తుచేయబడవలసిన ఆస్తి వున్నదని ఆయన నమ్ముటకు తగు కారణములున్నచో మరియు తన అధికారమును, తాను వచ్చినపనిని తెలియపరచినప్పటికీ తనను ప్రవేశింపనీయనిచో జప్తు జరుపు నిమిత్తము ఆయన సూర్యోదయ సూర్యాస్తమయ సమయముల మధ్య కాలములోపల ఆ భవనము యొక్క వెలుపలి లేక లోపలి తలుపును గాని, కిటికీని గాని పగులగొట్ట వచ్చును.

అయితే స్త్రీలకు కేటాయింపబడిన ఏదైన నివాస భాగము విషయములో, అట్టి ఉద్యోగి మూడుగంటల నోటీసు ఇచ్చి, ఆ స్త్రీలు అచ్చటినుండి తొలగిపోవు అవకాశ మిచ్చునంతవరకు ఆయన ఆ భాగములో ప్రవేశింపకూడదు లేక దాని తలుపులను పగులగొట్ట రాదు.

35. (1) వారంటును అమలు జరుపుటకు అధికారము పొందిన ఉద్యోగి జప్తుచేయుటకు ముందు, బాకీయున్న పన్నును, వారంటు రుసుమును చెల్లింపవలసినదిగా కోరవలెను. పన్ను రుసుము చెల్లింప బడినచో జప్తుచేయబడరాదు. పన్ను లేక రుసుము చెల్లింపబడనిచో, ఆ ఉద్యోగి—

(ఎ) పన్ను చెల్లింపని వ్యక్తి యొక్క చరాస్తిలో తాను అవసరమని భావించునట్టి ఆస్తిని జప్తు చేయవలెను;

(బి) జప్తుచేసిన ఆస్తి వివరములతో ఒక జాబితాను తయారు చేయవలెను మరియు,

(సి) జప్తుచేయు సమయములో ఆ జాబితా ప్రతి నొకదానిని ఈ నియమముల యొక్క (సి) అనుబంధములో ఉన్న నమూనాలో గాని, అదే విధమైన మరొక నమూనాలోగాని అమ్మకపు నోటీసును ఆ వ్యక్తికి ఈయవలెను.

అయితే బాకీ మొత్తములు చెల్లించుటకును, జప్తుచేయబడిన ఆస్తిని విడిపించుకొనుటకును ఏడు రోజుల గడువు ఈయబడవలెను.

(2) జప్తు అధికముగా వుండరాదు. అనగా పన్ను చెల్లింపని వ్యక్తి బాకీ యున్న పన్ను మొత్తమునకు, వారంటు, జప్తు నిలిపి యుంచుట, అమ్మకము వీటికి సంబంధించి అగు మొత్తము ఖర్చులకు దాదాపు సమానమైన విలువగల ఆస్తి మాత్రమే జప్తుచేయబడ వలెను.

36. (1) పన్ను, వారంటు రుసుము, జప్తురుసుము, ఆస్తిని నిలిపియుంచి నందుకు అగు ఖర్చుల క్రింద పన్ను చెల్లించని వ్యక్తి వద్దనుండి రావలసిన మొత్తము, 35వ నియమము క్రింద ఈయబడిన నోటీసులో పేర్కొనబడిన ఏడు దినముల కాలములోపల చెల్లింపబడ కుండిన కార్యనిర్వాహకాధికారిచే జప్తు వారంటు నిలుపు చేయబడ కున్నచో పట్టుకొనిన ఆస్తిలేక అందులో తగిన భాగము కార్యనిర్వా హకాధికారి యొక్క ఉత్తరువుల ననుసరించి బహిరంగవేలముద్వారా విక్రయింపబడవలెను. విక్రయమువలన వచ్చు రాబడిని కార్యనిర్వాహ కాధికారి పన్ను, వారంటురుసుము, జప్తురుసుము ఆస్తిని నిలిపియుంచి నందుకు అగు ఖర్చులు ఆస్తి విక్రియపు ఖర్చుల క్రింద రావలసిన మొత్తము యొక్క చెల్లింపుకు వినియోగించవలెను, ఆస్తిని విక్రయించి దానివల్ల వచ్చిన రాబడిని పైన తెలిపిన విధముగా ఉపయోగించిన

తరువాత ఏదైన ఆస్తి లేక మొత్తము మిగిలిన సందర్భములో దానిని ఆస్తిని పట్టుకొనిన సమయములో అది ఎవరి స్వాధీనములో గలదో ఆ వ్యక్తికి తిరిగి ఈయవలెను. విక్రయమువలన వచ్చు రాబడిపన్ను, వారంటు రుసుము, జప్తు రుసుము ఆస్తిని నిలిపి యుంచి నందులకు విక్రయించినందులకు అగు ఖర్చుల క్రింది మొత్తమును చెల్లించుటకు చాలని ఎడల కార్యనిర్వాహకాధికారి చెల్లింపబడకుండ మిగిలి యుండు మొత్తము విషయములో తిరిగి 35వ నియమము ననుసరించి చర్య తీసికొనవలెను.

(2) పట్టుకొనిన ఆస్తి త్వరితగతిని సహజముగా పాడయి పోవునది అగుచో, కార్యనిర్వాహకాధికారి సదరు ఏడు దినముల కాలము గతించుటకు ముందు ఎప్పుడైనను ఆ ఆస్తిని విక్రయింప వచ్చును. అయితే సొమ్ము అంతకంటె ముందుగనే చెల్లింపబడిన యెడల అట్లు విక్రయింప పనిలేదు.

(3) ఏదైన ఆస్తి జప్తు విషయములో సదరు ఏడు దినముల కాలపరిమితి లోపల వచ్చు ఏదైన ఆక్షేపణను కార్యనిర్వాహకాధికారి పరిశీలించవలెను. మరియు దానిని గురించి దర్యాప్తు జరుగువరకు ఆస్తి విక్రయమును వాయిదా వేయవచ్చును. జప్తు చేయబడిన ఆస్తి జప్తుకులోను కాదని కార్యనిర్వాహకాధికారి నిర్ణయించినచో ఆయన ఆ ఆస్తిని లేక అది ఇదివరకే విక్రయింపబడిన యెడల విక్రయపు రాబడిని అందుకు హక్కు కలిగియున్నట్లు తోచు వ్యక్తికి వాపసు చేయవలెను. మరియు ఆయన 34వ నియమము క్రింద తిరిగి చర్య తీసుకొనవచ్చును. పన్ను చెల్లింపని వ్యక్తికి ఆస్తి జప్తుకు లోను కాదని తెలిసియున్నను ఆయన బుద్ధిపూర్వకముగా జప్తు జరుగనిచ్చెనని కార్యనిర్వాహకాధికారికి తోచిన యెడల,

మొదటి జప్తు విక్రయముల సందర్భములలో అగు అన్ని రుసుము లను ఖర్చులను పన్ను చెల్లింపని వ్యక్తి వద్దనుండి రాబట్ట దగియుండ వలెను.

37. (1) జప్తు రుసుము ఈ నియమావళిలోని (డి) అనుబంధ ములో తెలుపబడిన రేట్లకు మించకుండ పంచాయతీచే నిర్ణయింపబడు రేట్లచొప్పున వసూలు చేయబడవలెను.

(2) ఈ రుసుములో జప్తుచేసిన ఏదైనా ఆస్తిని నిలిపియుం చుటకు అగు ఖర్చులు చేరియున్నట్లు భావింపకూడదు.

38. 34వ నియమముయొక్క (1)వ ఉప-నియమము క్రింద పన్ను చెల్లింపని వ్యక్తియొక్క ఆస్తిని, అది పంచాయతీ ప్రదేశ ములో ఎచ్చట కనుగొనబడినప్పటికీ, జప్తుచేయవచ్చును.

39. ఏదైనా ఇంటి విషయములో బాకీ యున్న పన్ను 34వ నియమముయొక్క (1)వ ఉప-నియమములో నిర్దిష్ట పరుపబడిన కాలము అంతమునాటికి పూర్తిగాగాని, కొంతభాగముగాని, చెల్లింప బడకున్నచో, కార్యనిర్వాహకాధికారి ఆ పన్ను పన్నెండు మాసము లకు మించి చెల్లింపబడకుండ ఉన్నచో తత్కాలమందు ఆ భవనము నాక్రమించుకొనియున్న వ్యక్తిని పదునైదు దినములకు తక్కువ కాకుండా నిర్దిష్టపరుపబడు కాల వ్యవధిలోపల ఆ మొత్తమును చెల్లింప వలసినదిగా కోరవచ్చును. భవనపు ఆక్రమణదారు ఆ కోరికను పాటించని యెడల కార్యనిర్వాహకాధికారి భవనమందు కనిపించు ఏదైనా చరాస్తిని జప్తుచేసి విక్రయించ వచ్చును. ఈ నియమము క్రింద జరుగు జప్తులు, విక్రయములన్నింటికి పై నియమములలోని

నిబంధనలు అవసరమైన మార్పులతో వర్తించవలెను. అయితే ఏ ఆక్రమణదారుగాని జప్తును లేక తగిన మేరకు జప్తును జరుపుటకు బుద్ధిపూర్వకముగా నిరోధించిననే తప్ప ఆయనవద్దనుంచి రావలసిన ఏదైన మొత్తము విషయములో అభియోగమునకుగాని, సివిలు దావాకు గాని పాత్రుడు కాకూడదు.

40. ఏ వ్యక్తినుండి అయినను, రావలిసియున్న ఎట్టిపన్ను అయినను పూర్తిగాగాని, కొంత భాగముగాని 34వ నియమము యొక్క (1)వ ఉప-నియమములో నిర్దిష్టపరుపబడిన కాలపరిమితి అంతము నాటికి చెల్లింపబడకుండ, ఆ వ్యక్తి భారత దేశమును విడిచి పోయినచో లేక కనుపించనిచో, ఆ పన్ను లేక చెల్లింపబడకుండా మిగిలియున్న అందలి భాగము, దానికి సంబంధించి చెల్లించదగి యున్న అన్ని మొత్తములతో సహా భూమి శిస్తు బాకీవలెనే రాబట్టు కొనదగి యుండవలెను.

41. (1) 34వ నియమము యొక్క (2) ఉపనియమముక్రింద అభియోగము తేబడిన ప్రతి వ్యక్తియు, ఆయన బాకి యున్న మొత్తమును బుద్ధిపూర్వకముగా చెల్లింపకుండెనని, లేక జప్తునుగాని తగిన మేరకు జప్తునుగాని జరుగుటకు బుద్ధిపూర్వకముగా నిరోధించె నని కోర్టు విశ్వసించునట్లు ఋజువుచేయబడిన మీదట, ఆ వ్యక్తి ఈ క్రిందివాటి నిమిత్తము తన వద్ద నుంచి రావలసిన మొత్తమునకు రెట్టింపుకు మించకుండ జరిమానాను చెల్లించుటకు బాధ్యుడు కావలెను.

ఎ) పన్ను వారంటు రుసుము ఏదైన ఉన్నచో, అది;

(బి) జప్తు జరిగినచో జప్తుచేయబడిన ఆస్తిని నిలిపియుంచుట కును, విక్రయమేదైనా ఉన్నచో దానికి అగు ఖర్చులు.

(2) ఏ వ్యక్తియైనను (1)వ ఉపనియమము క్రింద నేరమునకు నేరస్థాపన చేయబడిన సందర్భములో, విధింపబడు ఏదయిన జరిమానాకు అదనముగా కోర్టువారు (1)వ ఉపనియమముయొక్క (ఎ), (బి) క్లాజులలో నిర్దిష్టపరుపబడిన పద్దులక్రింద ఏవైన మొత్తములు రావలసియున్నచో వాటిని సత్వరముగా వసూలుచేసి వాటిని పంచాయతీకి చెల్లింపవలయును; మరియు ఆయన తన వివేచనానుసారము, అభియోగము యొక్క ఖర్చులుగా నిర్ణయించు మొత్తమేదయిన ఉన్నచో దానిని కూడ సత్వరము వసూలుచేసి పంచాయతీకి చెల్లింపవలెను.

42. పై నియమముల క్రింద జప్తుచేసిన ఏదేని ఆస్తికి సంబంధించిన విక్రయములో కార్యనిర్వాహకాధికారిగాని లేక పంచాయతీ యొక్క ఏ అధికారి గాని లేక నౌకరుగాని నేరుగా లేక పరోక్షముగా ఏ ఆస్తిని కొనగూడదు.

43. అధికారక్షేత్రమునకు సంబంధించిన జిల్లా పంచాయతీ అధికారి, డివిజనులు పంచాయతీ అధికారి మరియు పంచాయతుల విస్తరణాధికారికూడ పన్నులు వసూలు చేయుటకు సంబంధించినంతవరకు ఈ నియమములలోనుదహరింపబడిన కార్య నిర్వాహకాధికారియొక్క అధికారములనే వినియోగించవలెను.



## II వ భాగము

### పంచాయతీచే స్వీకరింపబడిన పైకములను భద్రపరచుట, పంచాయతీ నిధినుండి పైకములను చెల్లించుట.

44. పంచాయతీచే స్వీకరింపబడిన పైకములన్నియు అత్యంత సమీపములో గల ప్రభుత్వ ట్రెజరీలోగాని లేక అత్యంత సమీపములో గల పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకులోగాని లేక ఈ రెండింటిలోగాని భద్రపరువబడవలెను.

45. (1) పంచాయతీ తక్షణోపయోగమునకు అవసరములేని ఏవైన మొత్తములను ఇందు నిమిత్తమై సహకార సంఘముల రిజిస్ట్రారు ఆమోదించు రాష్ట్రసహకార బ్యాంకులోను, జిల్లా కేంద్ర సహకార బ్యాంకులలోను మూడు సంత్సరముల వరకు ఫిక్సెడు డిపాజిటు యందు లేక నిర్ణయింపబడు మరే విధముగానైనను పెట్టుబడి పెట్టవచ్చును.

(2) ప్రత్యేకింపబడిన నిధులలోని మిగులు మొత్తములను, ప్రభుత్వ సెక్యూరిటీల యందు లేక సహకార కేంద్ర భూమి తనఖా బ్యాంకు డిబెంచర్లయందు లేక నిర్ణయంపబడు మరే విధముగానైనను పంచాయతీ పెట్టుబడి పెట్టవచ్చును.

46. ప్రత్యేక సందర్భములలో, జిల్లాకలెక్టరు యొక్క అనుమతితో పంచాయతీ తన నిధులను కమీషనరు నిర్దిష్టపరచు ఏదైన ఇతర బ్యాంకులో భద్రపరచవచ్చును లేక పెట్టుబడి పెట్టవచ్చును.

47. కమీషనరు యొక్క అనుమతితోను, భద్రతకు లేక ఇతరమైన దానికి సంబంధించి, ఆయన నిర్ణయించు షరతులకు లోబడి, పంచాయతీ తన పైకములను కార్యనిర్వాహకాధికారి యొక్క అధీనములో ఉంచవచ్చును.

అయితే, కమీషనరు సాధారణ లేక ప్రత్యేకఉత్తరువు ద్వారా నిర్ణయించు మొత్తమునకుమించని పర్మనెంటు అడ్వాన్సును కార్య నిర్వాహక అధికారి యొక్క అదీనములో ఉంచుటకు అట్టి అనుమతి ఏదీ అవసరమై యుండకూడదు.

48. అట్లు భద్రపరుపబడిన పంచాయతీ పైకములు, ఆర్డర్లను లేక చెక్కులను ఇచ్చుట ద్వారా తీసికొనబడవలెను. వీటిపై కార్య నిర్వాహక అధికారి సంతకము చేయవలెను.

49. 48వ నియమము క్రింద కార్యనిర్వాహక అధికారి పైకములను తీయుట, సంబంధించిన జిల్లా పంచాయతీ ఆఫీసరు యొక్క ఆజ్ఞాయిుషీకిని, ఆయన నిర్ణయించు షరతులకును లోబడి జరుగవలెను.

50. (1). సంబంధించిన జిల్లా పంచాయతీ ఆఫీసరు, లిఖిత పూర్వకముగా వ్రాసి యుంచవలసిన తగు కారణములనుపురస్క రించుకొని ఉత్తరువు ద్వారా ఆ ఉత్తరువులో నిర్దిష్టపరుపబడు కాల పరిమితి వరకు ఏ కార్యనిర్వాహక అధికారినైనను పంచాయతీ నిధులనుండి పైకములను తీయకూడదని నిషేధింపవచ్చును.

అయితే, విన్నవించుకొనుటకు సంబధించిన కార్యనిర్వాహ కాధికారికి సమంజసమైన అవకాశ మీయబడిననే తప్ప, అట్టి ఉత్తరువు చేయబడకూడదు.

ఇంతే కాకుండా. జిల్లా పంచాయతీ ఆఫీసరు కార్యనిర్వాహకాధికారిని ఈ ఉపనియమము క్రింద తాను నిర్వహించవలసిన అధికారమును వినియోగించునంత వరకు, గ్రామపంచాయతీ యొక్క ధనమును తీయనద్దని, మధ్యకాల ఉత్తరువు ద్వారా ఆదేశించవచ్చును.

(2). ఉపనియమము (1) క్రింద సంబంధించిన జిల్లా పంచాయతీ ఆఫీసరుచే చేయబడిన ఉత్తరువు మూలముగా నష్టమునకు గురి అయిన ఏ కార్యనిర్వాహక అధికారియైనను, ఆ ఉత్తరువు అందినప్పటి నుండి ఏడు దినముల లోపల జిల్లా కలెక్టరుకు లిఖితపూర్వకముగా అప్పీలు పెట్టుకొనవచ్చును. దానిపై జిల్లాకలెక్టరు చేసిన నిర్ణయము అంతిమమైనదిగా ఉండవలెను.

(3). (1)వ ఉపనియమము క్రింద చేయబడు ప్రతి ఉత్తరువు లోను, పంచాయతీ పైకములను తీయుటకు కార్యనిర్వాహక అధికారిని షేధింపబడిన కాలమందు, ఆ పైకములను తీయవలసిన వ్యక్తి లేక అధికారి పేరు నిర్దిష్టపరుపబడవలెను.

(4) (1)వ ఉపనియమము క్రింద లేక (2)వ ఉపనియమము క్రింద చేయబడు ప్రతి ఉత్తరువు యొక్క నకలు, పంచాయతీ నిధులు భద్రపరుపబడు అన్ని బ్యాంకులకును, ట్రెజరీలకును పంపబడవలెను.

(5) ఏదైన బ్యాంకుకు లేక ట్రెజరికి అట్టి ఉత్తరువు అందిన తేదీనను ఆ తేదీ నుండి ఆ ఉత్తరువులో నిర్దిష్టపరుపబడు కాలపరిమితి యందు పంచాయతీ నిధులను తీయకూడదని అట్టి ఉత్తరువుద్వారా నిషేధింపబడిన కార్యనిర్వాహక అధికారికి ఎట్టి చెల్లింపుగాని చేయ్య బడకూడదు,

51. పంచాయతీ నిధులు భద్రపరుపబడిన ట్రెజరీ లేక బ్యాంకు, పంచాయతీ పేర జమలో నున్న నిధుల మేరకు, 48వ నియమము మరియు 50వ నియమము యొక్క (3)వ ఉప నియమములో తెలుపబడిన విధముగా సంతకము చేయబడియున్న అన్ని ఆర్డర్లను లేక చెక్కులను చెల్లింపవలెను.

52. పంచాయతీ ముందుగా లిఖితపూర్వకమైన అధికార మిచ్చి యుండినచో, అట్టి ట్రెజరీ, బ్యాంకు లేక కార్యనిర్వాహక అధికారి, అట్టి ఆర్డరు లేక చెక్కు లేకుండగనే, పంచాయతీ తరపున ప్రభుత్వమువారు పెట్టిన ఏదైన ఖర్చును పంచాయతీ నిధుల నుండి వెంటనే చెల్లింపవచ్చును.

## అనుబంధము—ఎ.

### (18వ నియమము)

................తో అంతమగు సంవత్సరమందు వృత్తి పన్ను అసెస్మెంటుకు రాబడిని తెలుపు రిటర్ను

(1) కంపెనీ లేక వ్యక్తి పేరు.

(2) వ్యాపారము, వృత్తి, కళ లేక పని లేక ఉద్యోగము యొక్క వివరణ.

(3) అసెసీకి సంవత్సరమందు లేక గత సంవత్సరమందు-

(ఎ) ఆ సంవత్సరములో మొత్తము అరువది దినములకు తక్కువ కాకుండ గ్రామము లోపల;

(బి) ఆ సంవత్సరమందు సదరు అసెసీ మొత్తము అరువది దినములకు తక్కువ కాకుండ గ్రామము లోపల నివసించియున్నచో, గ్రామము వెలుపల, ఏదైన వృత్తి, కళ లేక పనివలనగానీ ప్రభుత్వోద్యోగము లేక ప్రయివేటు ఉద్యోగమువలనగానీ లేక వడ్డీ వ్యాపారము వలనగానీ వచ్చిన రాబడి.

(4) వడ్డీ వ్యాపారము కాక ఇతర వ్యాపారము కేవలము గ్రామము లోపలనే జరిగినచో—

(ఎ) ఈ సంవత్సరమునకు కంపెనీ మీద లేక వ్యక్తి మీద రాబడి పన్ను అసెసు చేయబడినచో, అట్టిరాబడి పన్నును అసెసు చేయు నిమిత్తము 1961 భారతదేశ రాబడి పన్ను చట్టము యొక్క 28వ విభాగముక్రింద లెక్క కట్టబడిన సదరు కంపెనీ లేక వ్యక్తి యొక్క లాభముల, ప్రయోజనముల మొత్తము;

## అనుబంధము - బి.

### జప్తు వారంటు.

వారంటు సంఖ్య.  (34 (క్రి)వ నియమము).

(వారంటును అమలు జరుపవలసిన అధికారి పేరు)

...................................................గారికి.

(బాకీ వడిన పన్ను లేక పన్నులను, ఏదైన ఆవరణ విషయములో పన్ను లేక పన్నులు బాకీ ఉన్నచో, ఆ ఆవరణను తెలుపుడు).

...............చెందిన..............అను వారు......19......తో అంతమగు.......నకు పై తెల్పిన పన్ను లేక పన్నుల క్రింద బాకీయున్న...... రూ....... నయాపైసల మొత్తమును చెల్లింపవలసినదిగా సదరు.......ను కోరినను అట్లు కోరి పదునైదు దినములు గతించినను, చెల్లింపనందున లేక చెల్లింపకుండుటకు తగిన కారణము చూపనందున సదరు.......రూపాయల .........నయాపైసల మొత్తమును దానితోపాటు వారంటు రుసుము క్రింద 12 నయాపైసలను డిమాండు చేయవలసినదిగా మిమ్ము ఇందు మూలముగా ఆదేశించడమైనది. అవి చెల్లింపబడనిచో, సదరు............ ............యొక్క సరకులను, సామానులను (లేక సందర్భమును బట్టి పై తెల్పిన ఆవరణ యందున్న ఏదైన సరకులను. సామానులను), సదరు ............రూపాయల.........నయాపైసల మొత్తమునకు, దానితో పాటు వారంటు రుసుము క్రింద జప్తురుసుము క్రింద.......నయాపైసలకు పెరశి....... ..రూపాయల..........నయాపైసలకు, ఇంకను అట్టిజప్తును ఉంచుటకు, విక్రయించుటకు అగు ఖర్చులకు సరిపోవు మొత్తమునకు మీరు జప్తుచేయవలసి ఉన్నది. అట్టి జప్తు తరువాత ఏదు దినముల లోపల, సదరు పన్ను లేక పన్నుల క్రిందను, రుసుముల క్రిందను బాకీయున్న మొత్తము, అట్టి జప్తును ఉంచుటకు అగు ఖర్చులకు సరిపోవు అదనపు మొత్తముతో పాటు చెల్లింపబడకున్నచో, నేను ఇటుపై ఇచ్చు ఉత్తరువుల ననుసరించి

మీరు ఆ సరకులను, సామానులను విక్రయించి, జప్తు ఆస్తి విక్రయమువలన వచ్చు రాబడి మొత్తమును............ పంచాయతీ కార్యాలయమందు జమ కట్టవలసియున్నది. ఇందులో నుంచి సదరు పన్ను లేక పన్నుల క్రిందను, రుసుముల క్రిందను బాకీయున్న మొత్తము అనగా......... రూపాయల..........నయాపైసల మొత్తము అట్టి జప్తును ఉంచినందుకు విక్రయించినందుకు అగు ఖర్చుల మొత్తము మినహాయించబడి......... నిధికి జమకట్టబడును. ఇంకను ఏదైన మొత్తము మిగిలినచో అది జప్తు చేయబడిన సరకుల, లేక సామానుల యజమానికి వాపసుచేయబడును. సదరు.....................వద్ద జప్తుకు లేక చాలిన మేరకు జప్తుకు సరుకులు, సామానులులేనిచో, ఈ వారంటుతో పాటు మీరు ఆ విషయమును సర్టిఫైచేసి నాకు తెలుపవలసియున్నది.

స్థలము:

తేదీ..............19......

(కార్యనిర్వాహకాధికారి యొక్క సంతకము).

# అనుబంధము—సి.

## జాబితా మరియు విక్రయపు నోటీసు నమూనా

## (35 (1)వ నియమము)

(పట్టుకొనిన సరకుల యొక్కయు, సామానుల యొక్కయు వివరములను తెలుపుడు).

పైజాబితాలో నిర్దిష్టపరుపబడిన సరుకులను, సామానులను..........19.......తో అంతమగు.........నకు మార్జినులో పేర్కొనబడిన పన్ను లేక పన్నుల క్రింద బాకీ యున్న..........రూపాయల.........నయాపైసల మొత్తమునకుగాను నేను ఈ దినమున పట్టుకొంటిననియు.........పంచాయతీ కార్యాలయములో ఆ బాకీ మొత్తమును దానితో పాటు వారంటు రుసుమును జప్తు రుసుమును సరకులను సామానులను ఉంచినందుకగు ఖర్చు మొత్తమును, మీరు ఈ నోటీసు తేది నుండి ఏడు దినములలోపల చెల్లించిన నే తప్ప,ఆసరకులు లేక సామానులు 19...సం... నెల.........తేది.........గంటలకు.........పంచాయతీ కార్యాలయమందు......లేక కార్యనిర్వాహక అధికారి ఆదేశించు ఇతర స్థలమందు విక్రయింపబడుననియు, అసరకులు లేక సామానులు త్వరగా నుసహజముగాను చెడిపోవునవి అయిన ఎడల అవి ఇంకను ముందు తేదననే విక్రయింపబడు ననియు ఇందు మూలముగా మీకు నోటీసు ఈయడమైనది.

స్థలము: (జప్తు వారంటును అమలుపరుచు అధికారి యొక్క సంతకము)

తేది......19.



# అనుబంధము—డి.

## జప్తులపై చెల్లింపనగు గరిష్ఠ రుసుములను తెలుపు పట్టి.

(37 (1)వ నియమము)

| జప్తు ఎంత మొత్తమునకు చేయబడినది. | | రుసుము. |
|---|---|---|
| రూపాయలకు మించి | రూపాయలకు లోపు | రూ. న.పై. |
| 1 రూపాయకు లోపు | ... ... | 0—25 |
| 1 రూపాయకుమించి 5 రూపాయలకులోపు ... | | 0—50 |
| 5 రూపాయలకు మించి 10 డిటో | ... | 1—00 |
| 10 డిటో | 15 డిటో ... | 1—50 |
| 15 రూపాయలకుమించి 20 రూపాయలకు లోపు | | 2—00 |
| 20 డిటో | 25 డిటో .... | 2—50 |
| 25 డిటో | 30 డిటో ... | 3—00 |
| 30 డిటో | 35 డిటో ... | 3—50 |
| 35 డిటో | 40 డిటో ... | 4—00 |
| 40 డిటో | 45 డిటో ... | 4—50 |
| 45 డిటో | 50 డిటో ... | 5—00 |
| 50 డిటో | 60 డిటో ... | 6—00 |
| 60 డిటో | 80 డిటో ... | 7—50 |
| 80 డిటో | 100 డిటో ... | 9—00 |
| 100 రూపాలయకు మించి ... | ... | 10—00 |

పై చార్జిలో అన్ని ఖర్చులు చేరును. ఐతే జప్తుచేయబడిన ఆస్తి జవానుల అజమాయిషీలో ఉంచినప్పుడు మాత్రము ఒక్కొక్క జవానుకు దినమునకు 25 నయాపైసలు చెల్లింపబడవలెను.

## షెడ్యూలు 3.

### (124 వ విభాగము)

### లైసెన్సు లేనిదే ఆవరణ ఉపయోగింపబడుటకు వీలు లేని కార్యములు.

(ఎ) ఉప్పుడు బియ్యమును తయారుచేయుటకు వడ్లను ఉడుక బెట్టుట లేక కర్ప్వారము వండుట ;

(బి) మురికి బట్టలను ఉతుకుట లేక ఉతుకుటకొరకై మురికి బట్టలను ఉంచుట లేక ఉతికిన బట్టలను ఉంచుట ;

(సి) టాలోసల్ఫరును కరగబెట్టుట ;

(డి) పనికిరాని మాంసమును, రక్తమును, ఎముకలను, తోళ్లను, చేపలను లేక చర్మములను, నిలువ ఉంచుట లేక ఇతర విధముగా వాటితో పనిచేయుట ;

(ఇ) తోళ్లను, చర్మములను పదునుచేయుట ;

(ఎఫ్) ఉన్నిని లేక వెంట్రుకలను శుభ్రపరచుట లేక ఎండబెట్టుట

(జీ) చేప నూనెను తీయుట ;

(హెచ్) సబ్బులను తయారుచేయుట ;

(ఐ) సగ్గు బియ్యమును తయారుచేయుట లేక వండుట, కృత్రిమమైన ఎరువులను తయారుచేయుట; పంచదారను తయారుచేయుట లేక పరిశుభ్రపరచుట; గీతపనివారు లేక చెట్లను అనుభవించుచున్న వ్యక్తులు తమ సొంత ఆవరణలో కుటీర పరిశ్రమగా జరుపునప్పుడు తప్ప బెల్లమును,

పటిక బెల్లము లేక షర్బతును తయారుచేయుట; బీడీలను లేక చుట్టలను తయారుచేయుట ;

(జె) తుపాకి మందును లేక బాణాసంచాను తయారుచేయుట ;

(కె) ఇటుకలను, పెంకులను, మట్టి పాత్రలను లేక సున్నమును కాల్చుట ;

(ఎల్) హోటలులను, రెస్టారెంటును, భోజన గృహమును, కాఫీ హౌసును, టీ హౌసును బోర్డింగు హౌసును లేక (పబ్లికు లేక పరిగణన పొందిన అజ్మాయిషీ క్రింద నడుపబడు విద్యార్థుల హాస్టలు కాకుండ) లాడ్జింగు హౌసును నిర్వహించుట ;

(ఎమ్) ఐస్‌ను లేక ఏరియేటెడ్ పానీయములను తయారు చేయుట ;

(ఎన్) బీరును కాచుట, సారాను లేక (డినేచరు అయినను కాకున్నను) మద్యము కలిసిన ఇతర స్పిరిటును బట్టీద్వారా తయారు చేయుట ;

(ఓ) ఖారశాలను నడుపుట ;

(పి) పిండిని లేక మానవ వినియోగము నిమిత్తము పిండితో తయారైన పదార్థములను లేక మిఠాయిలను తయారుచేయుట ;

(క్యూ) కలపను, ఇంటి కప్పుకు వాడు గడ్డి మొదలగు వాటిని, ఎండు గడ్డిని, పచ్చి గడ్డిని, స్ట్రాను, నేల బొగ్గును, కర్ర బొగ్గును, వంట చెరుకును లేక నారను, అన్ని రకముల నూనెలను విక్రయించుట, లేక విక్రయము నిమిత్తము నిల్వయుంచుట ;

(ఆర్) ధాన్యము, వేరుశనగ, చింతపండు, మిరపకాయలు, బెల్లము, పప్పులు; పిండి, తవుడు, గానుగపిండి, లేక ఎలుకలు కొట్టుటకు వీలున్న పంటలతో సహా వ్యవసాయకోత్పత్తులు—వీటిని టోకుగా లేక చిల్లరగా విక్రయించుట లేక టోకు లేక చిల్లర వర్తకము నిమిత్తము లేక

సొంత లేక ఇంటి కార్యములకు కాక ఇతరమైన కార్యములే నిమిత్తము నిల్వయుంచుట ;

(ఎస్) ఏదైన ప్రేలుడు పదార్థములను లేక నిప్పంటుకొను పదార్థములను నిల్వయుంచుట ;

అయితే, పెట్రోలియము యొక్కయు దానితో తయారైన పదార్థముల యొక్కయు ఏ పరిమాణములకు 1934 పెట్రోలియము చట్టము యొక్క లేక దాని క్రింద చేయబడిన నియమముల యొక్క లేక ప్రకటల నిబంధనలచే ఈ చట్టము యొక్క అమలు పరిమిత మొనరింపబడినదో, ఆ పరిమాణములకు మించినవాటిని నిల్వయుంచుటకు ఎట్టి లైసెన్సుగాని అవసరము లేదు ;

(టి) ప్రత్తిని టోకుగాగాని, చిల్లరగాగాని విక్రయించుట, లేక టోకు లేక చిల్లర వర్తకము నిమిత్తము లేక నూలుగా మార్చు నిమిత్తము నిల్వయుంచుట ;

(యు) హానికరమైన లేక చెడువాసన వచ్చు దేనినైనను తయారుచేయుట ;

(వి) ఏదైన ఇంధనము లేక ప్రభుత్వమువారు ఆయా సమయము లందు ఆంధ్రప్రదేశ గెజిటులో ప్రకటన ద్వారా, మినహాయించు యంత్రములుగాక ఇతర యంత్రములను పారిశ్రామిక కార్యముల నిమిత్తము ఉపయోగించుట ;

(డబ్ల్యు) సాధారణముగా, ఏదైన పారిశ్రామికమైన ప్రాసెసులో బహుశః హానికరమైనదిగా లేక మానవ జీవితమునకు లేక ఆరోగ్యమునకు లేక ఆస్తికి అపాయకరమైనదిగా ఉండగల ఏ పనినైనను చేయుట ;

(ఎక్స్) ప్రాణమునకు, ఆరోగ్యమునకు లేక ఆస్తికి అపాయకరమైనదని లేక స్వభావరీత్యా లేక అది నిర్వహింపబడుటకు ఉద్దేశింపబడిన పద్ధతిని లేక పరిస్థితులనుబట్టి బహుశః కంటకము కలిగించునదని పంచాయతీ అభిప్రాయపడు ఏదైన వృత్తి లేక పని.

అయితే, కలప, ఇంటి కప్పులకు వాడు గడ్డి మొదలగునవి, ఎండు గడ్డి, పచ్చిగడ్డి, స్ట్రా, పేలబొగ్గు, కర్రబొగ్గు, వంటచెరకు లేక నార— వీటిని నిల్వచేయుట, వడ్లను ఉడుకబెట్టుట లేక ఉతికిన బట్టలను ఉంచుట లేక మురికి బట్టలను ఉతుకుట—ఇట్టివి నిల్వ చేయుట, ఉడుకబెట్టుట, ఉంచుట లేక ఉతుకుట సొంతమునకైన సందర్భములో అందుకు ఎట్టిదైనా లైసెన్సుగాని అవసరములేదు.



4వ షెడ్యూలు

## సాధారణ జరిమానాలు

(220 (i)వ విభాగము)

| విభాగము | ఉపవిభాగము లేక ఖండము | నేరము | విధింపబడదగు జరిమానా. |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| 86 | (2) | ప్రజలకు అందుబాటులో ఉన్న నీటిని వాడకుండా నిషేధించు నోటీసును పాటింపకుండుట | ...ఏబది రూపాయలు. |
| 87 | (ఎ) | త్రాగుటకు ప్రత్యేకింపబడిన స్థలములలో స్నానము చేయుట మున్నగునవి ... | డిటో |
| 87 | (బి) | త్రాగుటకు ప్రత్యేకింపబడిన స్థలములో కంటకప్రాయ మైనట్టి వస్తువులను ఉంచుట... | డిటో |
| 87 | (సి) | త్రాగుటకు ప్రత్యేకింపబడిన స్థలములలో బట్టలను ఉతుకుట ... | ఏబదిరూపాయలు. |
| 87 | (డి) | త్రాగుటకు, స్నానము చేయుటకు లేక బట్టలను ఉతుకుటకు ప్రత్యేకింపబడిన స్థలములలో జంతువులు మున్నగువాటిని కడుగుట ... ... | డిటో |

| (1) | (2) | (3) | (4) |
| --- | --- | --- | --- |
| 87 | (ఇ) | త్రాగుట. స్నానము లేక బట్టలను ఉతుకుటకొరకు ప్రత్యేకింపబడిన స్థలములకు మురికి నీటి కాలువ నుండి లేక గుంట నుండి నీరు వదలుట ... | ఏబది రూ. |
| 90 | (1) | శవ సంస్కారముకొరకు ఏర్పైన స్థలమును రిజిస్టరు చేయకపోవుట ... | ఒక వంద రూ. |
| 90 | (1) | శవ సంస్కారము కొరకు లైసెన్సు లేకుండ ఏర్పైన స్థలమును ఏర్పాటు చేయుట లేక ఉపయోగించుట .... | డిటో |
| 94 | | నివాస స్థలమునకు లేక మంచి నీటి వనరునకు వంద గజముల లోపల శవమును పూడ్చుట, దహనము చేయుట మున్నగునవి ... ... | డిటో |
| 95 | | శవ సంస్కార ప్రదేశములో శవములను పూడ్చినపుడు, లేక దహనము చేసినపుడు అట్టి సమాచారమును తెలుపకపోవుట ... ... | ఇరువది రూ. |
| 96 | (3) | నిషిద్ధ ప్రదేశములో శవమును పూడ్చుట లేక దహనము చేయుట, లేక ఇతర విధమైన సంస్కారమునకు ... | ఒక వంద రూ. |
| 98 | | పబ్లికు రోడ్డు మున్నగువాటిపైకి మురికి రానిచ్చుట ... ... | ఇరువది రూ. |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 99 | (1) | నోటీసులో కోరబడిన రీతిగా పనిని నిర్వహింపక పోవుట ... ... | ఏబది రూ. |
| 100 | (1) | పబ్లికు రోడ్డు సమీపములో లైసెన్సు లేకుండ ప్రత్యేకము మున్నగు పసులు జరుపుట ... ... | డిటో |
| 101 | | పబ్లికు రోడ్డులో లేక రోడ్డుపై చట్ట విరుద్ధముగా గోడ కట్టుట లేక కంచె వేయుట మున్నగునవి ... ... | ఒక వంద రూ. |
| 102 | | లైసెన్సు లేకుండ లేక నోటీసుకు వ్యతిరేకముగా తలుపులు, క్రింది అంతస్థు కిటికీలు మున్నగువాటిని బయటి వైపుకు తెరచుట ... ... | ఇరువది రూ. |
| 103 | (1) | అతిక్రమణను మానకుండుట లేక మార్చకుండుట ... ... | రెండువందల రూ |
| 105 | (1) | తూముపై లేక చెత్త వేయబడిన ప్రదేశముపై చట్ట విరుద్ధముగా భవనమును నిర్మించుట ... ... | డిటో |
| 105 | (2) | అనుమతి లేకుండగానీ, అనుమతిలో తెలుపబడిన షరతులకు విరుద్ధముగా కానీ నిర్మింపబడిన భవనమును పడగొట్టవలసినదిగా కోరబడినపుడు అట్లు చేయకపోవుట ... | డిటో |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 106 | (1) | చట్టవిరుద్ధముగా పబ్లికు రోడ్డుకు కన్నము చేయుట లేక రోడ్డుపై అడ్డము పెట్టుట ... | ఏబదిరూపాయలు |
| 106 | (2) | కన్నము పూడ్చకపోవుట లేక అడ్డము తొలగింపకపోవుట ... | డిటో |
| 107 | (1) | ఏదైన పబ్లికు రోడ్డుపై గాని, పంచాయతీ స్వాధీనములో గల ఇతర ఆస్తిపైగానీ అనుమతి లేకుండ చెట్లను నాటుట ... | రెండువందలరూ. |
| 107 | (2) | పబ్లికు రోడ్డుపై గానీ, పంచాయతీ స్వాధీనములో గల ఇతర ఆస్తిలో గానీ, పోరంబోకుపై గానీ, 67వ విభాగముక్రింద ఏ భూమి పంచాయతీచే క్రమబద్ధమొనరింపబడునో ఆ భూమిపై గానీ పెరుగుచున్న చెట్లను అనుమతి లేకుండ పడగొట్టుట మున్నగునవి ... | డిటో |
| 108 | (2) | పంచాయతీ క్రింద ఉన్న భూమిపై గల ఏదైన భవనము మున్నగుదానిని తొలగింపకపోవుట ... | డిటో |
| 110 | (1) | 110వ విభాగమును ఉల్లంఘించి, ప్రైవేటు మార్కెట్టును తెరచుట లేక నిర్వహించుట... | ఐదువందలరూ. |
| 113 | ... | ప్రైవేటు మార్కెటుకు లేక కప్పు మున్నగువాటికి అప్రోచీలు మొదలగు వాటిని నిర్మింపవలసినదిగా కోరుచు ఈయబడిన ఆదేశమును పాటింపకుండుట ... | వంద రూ. |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 115 | ... | పబ్లికు మార్కెటులో గానీ, ప్రైవేటు మార్కెటులోగానీ అనుమతిలేకుండ ఏదైన జంతువును లేక వస్తువును అమ్ముట, లేక అమ్మకమునకు పెట్టుట ... | ఇరువది రూ. |
| 116 | ... | పబ్లికు రోడ్లలో లేక స్థలములలో నిషేధమున్నప్పుడు లేక లైసెన్సు లేకుండ, లేక నిబంధనలకు విరుద్ధముగా వస్తువుల అమ్మకము మున్నగునవి ... | పది రూ. |
| 120 | (బి) | ఏదైన పబ్లికు స్థలములో లేక రోడ్డులో నిషేధింపబడినమార్గము లోపల నిలుచుట, ఆగుట, లేక బండ్ల స్టాండుగా ఆ ప్రదేశమును ఉపయోగించుట ... | ఏబది రూ. |
| 121 | (1) | లైసెన్సు లేకుండాగానీ, లైసెన్సుకు విరుద్ధముగాగానీ క్రొత్తగా ప్రైవేటు బండ్ల స్టాండును ఏర్పాటు చేయుట, లేక తెరచియుంచుట ... | రెండువందల రూ. |
| 123 | (ఎ) | వధ్యశాలకు వెలుపల పశువులు మున్నగువాటిని వధించుట, కోయుట, చర్మము తీయుట మున్నగువాటికి ... | రెండువందల రూ. |
| 123 | (బి) | లైసెన్సు లేకుండ లేక లైసెన్సుకు విరుద్ధముగా ఏవైన పశువులు మున్నగువాటిని వధించుట, మున్నగువాటికి ... | ఇరువది రూ. |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 124. | | లైసెన్సు లేకుండ లేక లైసెన్సుకువిరుద్ధముగా శివ పెడ్యూలులో నిర్దిష్టపరుపబడిన ఏవైన కార్యములకొరకు ఏదైన స్థలమును ఉపయోగించుట ... | వంద రూ. |
| 125 | ... | చట్టవిరుద్ధముగా ఫ్యాక్టరీ, వర్కుషాపు మొదలగువాటిని నిర్మించుట ... | ఒక వెయ్యిరూ. |
| 126 | ... | కంటకమును తొలగించుటకు సంబంధించిన ఉత్తరువును పాటించకపోవుట ... | వంద రూ. |
| 130 | (2) | భవనమునకు కేటాయించిన నంబర్లను చట్ట విరుద్ధముగా చెఱుపుట మున్నగువాటికి ... | అయిదు రూ. |
| 130 | (3) | కోరబడినపుడు నంబరును మార్చకుండుట ... | ఇరువది రూ. |
| 131 | (7) | కోరబడినపుడు లైసెన్సును తెచ్చి చూపక పోవుట ... | అయిదు రూ. |
| 227 | ... | పల్లికు రోడ్డు, మార్కెట్టు, బావి, చెరువు మున్నగువాటిని ఉపయోగించు లేక అనుభవించు వ్యక్తిని ఆటంకపరచుట ... | వంద రూ. |

# 5వ షెడ్యూలు

## నేరములను కొనసాగించుచున్నందుకు జరిమానాలు

(220 (2)వ విభాగమును చూడుడు)

| విభాగము | ఉపవిభాగము లేక ఖండము | నేరము | విధింపబడదగు రోజు వారి జరిమానా. |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| 86 | (2) | ప్రజలకు అందుబాటులో ఉన్న నీటి ఉపయోగమును నిషేధించు నోటీసును పాటింపకుండుట | ... పది రూ. |
| 87 | (a) | త్రాగుట, స్నానము లేక బట్టలుతుకుట కొరకు ప్రత్యేకించబడిన స్థలములోనికి మురికినీటి కాలువనుండి లేక గుంటనుండి నీరు వదలుట | ... డిటో |
| 91 | (1) | శవ సంస్కారముకొరకు లైసెన్సు లేకుండ ఏదైన స్థలమును ఉపయోగించుట | ... దఫాకు ఇరువదిరూ. |
| 98 | ... | పల్లికు రోడ్లు మున్నగువాటిపైకి మురికి రానిచ్చుట | ... పది రూ. |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 99 | (1) | నోటీసులో కోరబడిన రీతిగా పనిని నిర్వ హింపకపోవుట ... | పది రూ. |
| 100 | (1) | పబ్లికురోడ్డుసమీపములో లైసెన్సులేకుండ త్రివ్వకము మున్నగు పని జరుపుట ... | డిటో |
| 101 | ... | పబ్లికు రోడ్డులో లేక రోడ్డుపై చట్టవిరుద్ధ ముగా గోడ కట్టుట లేక కంచెవేయుట మున్నగునవి ... | ఇరువది రూ. |
| 102 | ... | లైసెన్సులేకుండ లేక నోటీసుకు వ్యతిరేక ముగా తలుపులు, క్రింది అంతస్థు కిటికీలు మున్నగువాటిని బయటివైపుకు తెరుచుట ... | పది రూ. |
| 103 | (1) | అతిక్రమణను మానకుండుట లేక మార్చ కుండుట ... | డిటో |
| 105 | (1) | తూముపై లేక చెత్తవేయబడినప్రదేశముపై చట్టవిరుద్ధముగా భవనము నిర్మించుట ... | ఏబది రూ. |
| 105 | (2) | అనుమతిలేకుండగానీ,అనుమతిలోని షరతు లకు విరుద్ధముగాగానీ నిర్మింపబడిన భవన మును పడగొట్టవలసినదిగా కోరబడిన పుడు అట్లు చేయకపోవుట ... | డిటో |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 106 | (1) | చట్టవిరుద్ధముగా పబ్లికు రోడ్డుకు కన్నము చేయుట, లేక రోడ్డుపై అడ్డము పెట్టుట ... | పది రూ. |
| 108 | (2) | పంచాయతీక్రింద ఉన్న భూమిపై గల ఏదైన భవనము మున్నగుదానిని తొలగింపకపోవుట ... | ఏబది రూ. |
| 110 | (1) | 110వ విభాగమును ఉల్లంఘించి, ప్రైవేటు మార్కెట్టును తెరచుట లేక నిర్వహించుట ... | వంద రూ. |
| 113 | ... | ప్రైవేటు మార్కెట్టుకు లేక కప్పు మున్నగువాటికి అప్రోచీలు మొదలగు వాటిని నిర్మింపవలసినదిగా కోరుచు ఈయబడిన ఆదేశములను పాటించకపోవుట ... | పది రూ. |
| 115 | ... | పబ్లికు మార్కెట్టులో గానీ, ప్రైవేటు మార్కెట్టులో గానీ అనుమతిలేకుండ ఏదైన జంతువును లేక వస్తువును అమ్ముట లేక అమ్మకమునకు పెట్టుట ... | డిటో |
| 121 | (1) | లైసెన్సులేకుండ లేక లైసెన్సుకు విరుద్ధముగా ప్రైవేటు బండ్ల స్టాండును తెరచి ఉంచుట ... | ఇరువది రూ. |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 124 | ... | లైసెన్సులేకుండ లేక లైసెన్సుకు విరుద్ధముగా లేక షెడ్యూలులో నిర్దిష్టపరుపబడిన ఏదైన కార్యములకొరకు ఏదైన స్థలమును ఉపయోగించుట ... | ఇరువది రూ. |
| 125 | ... | చట్టవిరుద్ధముగా ఫ్యాక్టరీ, వర్కుషాపు మున్నగు వాటిని నిర్మించుట ... | వంద రూ. |
| 126 | ... | కంటకమును తొలగించుటకు సంబంధించిన ఉత్తరువును పాటింపకపోవుట ... | ఏబది రూ. |



## 6వ షెడ్యూలు.

## మధ్యకాల నిబంధనలు

## (236వ విభాగము)

1. నిర్వచనములు:— ఈ నియమావళిలో సందర్భము అన్యథా కోరిననే తప్ప—

(ఎ) "పూర్వపు ఆంధ్రప్రాంతపు చట్టము" అనగా 1950 ఆంధ్రప్రదేశ (ఆంధ్రప్రాంతపు) గ్రామపంచాయతీల చట్టము (1950లోని 10వ చట్టము) అని అర్థము. "పూర్వపు తెలంగాణా ప్రాంతపు చట్టము" అనగా 1956 ఆంధ్రప్రదేశ (తెలంగాణా ప్రాంతపు) గ్రామ పంచాయతీల చట్టము (1956లోని 17వ చట్టము) అని అర్థము.

(బి) "మునిసిపలు చట్టము" అనగా 1956 ఆంధ్రప్రదేశ (తెలంగాణా ప్రాంతపు) జిల్లా మునిసిపాలిటీల చట్టము (1956 లోని 18వ చట్టము) అని అర్థము.

(సి) "పంచాయతీ" అనగా.

(i) పూర్వపు ఆంధ్రప్రాంతపు చట్టము క్రింద ఏర్పాటు చేయబడిన పంచాయతీ లేక

(ii) పూర్వపు తెలంగాణా ప్రాంతపు చట్టము క్రింద ఏర్పాటు చేయబడిన లేక ఏర్పాటు చేయబడినట్లు భావింపబడిన గ్రామ పంచాయతీ, లేక

(*iii*) ఈ చట్టము ప్రారంభమయిన తేదీనాటి కున్నటువంటి, మునిసిపలు చట్టముక్రింద పట్టణ మునిసిపాలిటీకొరకు ఏర్పాటుచేయబడిన లేక ఏర్పాటు చేయబడినట్లు భావింపబడు పట్టణ కమిటీ అని అర్థము ;

(డి) సభ్యుడు అనగా –

(*i*) పూర్వపు ఆంధ్రప్రాంతపు చట్టముక్రింద ఏర్పాటుచేయబడిన పంచాయతీయొక్క సభ్యుడు, లేక

(*ii*) పూర్వపు తెలంగాణా ప్రాంతపు చట్టముక్రింద ఏర్పాటు చేయబడిన లేక ఏర్పాటు చేయబడినట్లు భావింపబడు గ్రామ పంచాయతీయొక్క పంచ్ ; లేక

(*iii*) మునిసిపలు చట్టముక్రింద ఏర్పాటుచేయబడిన లేక ఏర్పాటు చేయబడినట్లు భావింపబడు పట్టణ కమిటీ సభ్యుడు ;

అయితే, అట్టి పంచాయతీకి, గ్రామ పంచాయతీకి లేక పట్టణ కమిటీకి నామనిర్దేశము చేయబడిన ప్రభుత్వోద్యోగి "సభ్యుడు" అను మాటలో చేరడు ;

(ఇ) "అధ్యక్షుడు" అను మాటలో గ్రామ పంచాయతీ యొక్క సర్పంచియు "ఉపాధ్యక్షుడు" అను మాటలో గ్రామ పంచాయతీయొక్క ఉపసర్పంచియు చేరును.

2. ఇప్పుడున్న గ్రామములు, పట్టణ మునిసిపాలిటీలు ఈ చట్టముయొక్క కార్యములకొరకు గ్రామములుగా భావింపబడుట:–

(1) ఈ చట్టము ప్రారంభమునాటికి పూర్వపు ఆంధ్రప్రాంతపు చట్టముక్రింద గాని, పూర్వపు తెలంగాణా ప్రాంతపు చట్టముక్రింద గాని గ్రామముగా ఉన్నట్టి లేక మునిసిపలు చట్టముక్రింద పట్టణ మునిసిపాలిటీగా ఉన్నట్టి ప్రతి స్థానిక ప్రాంతముకూడ సందర్భమును బట్టి ఈ చట్టముక్రింద గ్రామముగా ప్రకటింపబడినట్లు భావింపబడవలెను.

(2) ఈ చట్టము ప్రారంభమునాటికి ఉన్న ప్రతి పంచాయతీ కూడ ఈ చట్టముక్రింద ఏర్పాటుచేయబడిన పంచాయతీగా భావింపబడవలెను.

3. పంచాయతీల మొత్తము సభ్యుల సంఖ్య :- (1) ఈ చట్టములో ఏమియున్నప్పటికిని పూర్వపు ఆంధ్రప్రాంతపు చట్టముక్రింద గాని, పూర్వపు తెలంగాణాప్రాంతపు చట్టముక్రిందగాని, మునిసిపలు చట్టముక్రిందగాని నిర్ణయింపబడిన లేక నిర్ణయింపబడినట్లు భావింపబడు పంచాయతీయొక్క మొత్తము సభ్యుల సంఖ్య, ఈ చట్టముక్రింద పంచాయతీ మొదటిసారిగా తిరిగి ఏర్పాటుచేయబడునంతవరకు, 2వ నియమము (2) ఉప నియమము మూలముగా ఏర్పాటు చేయబడినట్లుగా భావింపబడు పంచాయతీయొక్క మొత్తము సభ్యుల సంఖ్యగా భావింపబడవలెను.

వివరణ :— ఆంధ్రప్రాంతము విషయములో "మొత్తము సభ్యుల సంఖ్య" అను పదసముదాయములో పూర్వపు ఆంధ్రప్రాంతపు చట్టముయొక్క 10—ఎ విభాగము క్రింద కో ఆప్టు చేసుకొనబడిన స్త్రీ సభ్యురాలు చేరదు.

(2) ఈ చట్టముయొక్క 2వ నియమము (2,వ ఉప నియమము ద్వారా ఏర్పాటుచేయబడినట్లు భావింపబడు ఏదైన పంచాయతీ విషయములో దానియొక్క మొత్తము సభ్యుల సంఖ్య 7వ విభాగముక్రింద దానికి నిర్ణయించబడు సభ్యులసంఖ్యకు మించియున్నపుడు ఈ విషయమై ప్రభుత్వమువారు జారీచేయునట్టి ఆదేశములకు లోబడి, కమీషనరు పత్రికటనద్వారా ఈ చట్టపు ప్రారంభమున సభ్యులుగా ఉన్నవారిలో ఏ సభ్యులు అదనముగా ఉన్నట్లు భావింపబడవలెనో ప్రకటింపవలెను.

(3) (2)వ ఉప నియమముక్రింద అదనముగా ఉన్నట్లు ప్రకటింపబడిన ఎవరైన సభ్యుని పదవి ఖాళీ అయినమీదట తిరిగి భర్తీ చేయబడరాదు.

4. ఇప్పుడున్న అధ్యక్షుల, ఉపాధ్యక్షుల, పదవీ కాలపరిమితి:

(1) ఈచట్టము ప్రారంభమునాటికి పదవిలోవున్న పంచాయతీ అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు మరియు సభ్యులు, 18, 20 విభాగముల యొక్క నిబంధనలకు లోబడి, 1964 జూలై 1వ తేదీవరకు అట్టి పదవిలో ఉండవలెను.

అయితే మునిసిపలు చట్టము క్రింద ఒక పట్టణ మునిసిపాలిటీ కొరకు ఏర్పాటు చేయబడిన పట్టణ కమిటీయొక్క అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, మరియు సభ్యులు ఎవరైతే ఈ చట్టపు ప్రారంభమునాటికి పదవిలో యుందురో, వారు 18, 20 విభాగముల యొక్క నిబంధనలకు లోబడి 1969 జూలై 1వ తేదీ వరకు అట్టి పదవిలో ఉండవలెను.

(2) ఈ చట్టము ప్రారంభము నాటికి పూర్వము పంచాయతీ సభ్యుడుగా నామనిర్దేశము చేయబడిన ఎవరైన ప్రభుత్వోద్యోగి ఆ తేది నుండి అట్టి సభ్యుడుగా ఉండరాదు.

(3) పంచాయతీ అధ్యక్షు, ఉపాధ్యక్షు లేక సభ్యుని పదవిలో ఈ చట్టము ప్రారంభము నాటికి ఉన్న లేక తరువాత ఏర్పడగల ఏదైన ఖాళీ 3వ నియమము (1)వ ఉపనియమము యొక్క నిబంధనలకు లోబడి, పాత ఆంధ్రప్రాంతపు చట్టము యొక్క లేక పాత తెలంగాణా ప్రాంతపు చట్టము లేదా మునిసిపలు చట్టము యొక్క నిబంధనల ప్రకారము భర్తీచేయబడవలెను.

(4) (3)వ ఉపనియమము క్రింద పంచాయతీ అధ్యక్షుడుగా, ఉపాధ్యక్షుడుగా లేక సభ్యుడుగా ఎన్నుకొనబడిన ఏ వ్యక్తియైనను 1964 జూలై 1వ తేదీ వరకే పదవిలో ఉండవలెను.

(5) (3)వ (4)వ ఉపనియమముల కార్యముకొరకు, ఈ చట్టము ప్రారంభమగు తేదీ నాటికి పంచాయతీ అధ్యక్షుడుగా ఉపాధ్యక్షుడుగా లేక సభ్యుడుగా ఏ వ్యక్తియు ఎన్నుకొనబడనిచో ఆ పదవి ఆ తేదీన ఖాళీగా వున్నట్లు భావింపబడవలెను.

5. కొన్ని సందర్భములలో తప్ప ఇప్పుడున్న వార్డులు కొనసాగుట:— (1) ఈ చట్టపు ప్రారంభము నాటికి సందర్భానుసారముగా పూర్వపు ఆంధ్రప్రాంతపు చట్టము క్రింద లేక మునిసిపలు చట్టము క్రింద ఏదైన గ్రామము వార్డులుగా విభజింపబడియున్నచో లేక విభజింపబడియున్నట్లు భావింపబడినచో అట్టి విభజన ఈ చట్టము క్రింద చేయబడినట్లే భావింపబడవలెను. ఈ చట్టము ప్రారంభమయిన తరువాత పంచాయతీకి జరుగు మొదటి సాధారణ ఎన్నికల తేదీ వరకు అమలులో ఉండవలెను.

(2) ఈ చట్టపు ప్రారంభమునకు పూర్వము ఏదైన గ్రామము వార్డులుగా విభజింపబడనిచో, పంచాయతీతో సంప్రదించిన మీదట కమీషనరు సందర్భానుసారముగ పాత ఆంధ్రప్రాంతపు చట్టము క్రింద లేదా పాత తెలంగాణా ప్రాంతపు చట్టము క్రింద లేదా మునిసిపల్ చట్టము క్రింద ప్రకటన ద్వారా ఆ గ్రామమును వార్డులుగా విభజింపవలెను. మరియు కో ఆప్టు చేసికొనబడిన సభ్యురాలు ఎవరైన ఉన్నచో ఆమె కాక అధ్యక్ష ఉపాధ్యక్షులతో సహా అప్పటి పంచాయతీలో వున్న ఏ యే సభ్యుడు ఏ యే వార్డుకు ప్రతినిధిగా భావింపబడవలెనో నిర్ణయింపవలెను. ఈ చట్టపు ప్రారంభమునకు సద్యః పూర్వము ఏదైన యాధృచ్ఛిక ఖాళీ వున్నచో ఆ ఖాళీ ఏ వార్డునకు చెందునో కూడ సదరు ప్రకటన నిర్ణయింపవలెను.

వివరణః— గ్రామ పంచాయతీ లేక పట్టణ కమిటీ విషయములో "వార్డు" అనగా "నియోజక వర్గము" అని అర్థము.

6. స్థానముల ప్రత్యేకింపు.

షెడ్యూల్డు కులములకుగానీ, షెడ్యూల్డు తెగలకు గానీ, లేక రెండింటికిగానీ పూర్వపు ఆంధ్రప్రాంతపు చట్టము క్రింద లేకపూర్వపు తెలంగాణా ప్రాంతపు చట్టము క్రింద లేక మునిసిపలు చట్టము క్రింద చేయబడి, ఈ చట్టము ప్రారంభము నాటికి అమలునందున్న స్థానముల ప్రత్యేకింపు ఈ చట్టము క్రింద చేయబడినట్లే భావింపబడవలెను.

7. మొదటి సాధారణ ఎన్నికలు.

ఈ చట్టముక్రింద పంచాయతీకి మొదటి సాధారణ ఎన్నికలు, కమీషనరు నిర్ణయించిన తేదీన జరుపబడవలెను. అట్టి ఎన్నిక తర్వాత

12వ విభాగము (3)వ ఉప విభాగము క్రింద ఏర్పరచబడిన పంచాయతీ మొదటి సమావేశము 1964 జూలై 1వ తేదీకి ముందు ఏ రోజునైనను జరుగునట్లుగా నిర్ణయింపబడవలెను.

8. ఈ చట్టముయొక్క ప్రారంభమునకు పూర్వము విఘటన చేయబడిన లేక రద్దు చేయబడిన పంచాయతీలను తిరిగి ఏర్పాటు చేయుట:—

పూర్వపు పాత ఆంధ్రప్రాంతపు చట్టము క్రిందగాని, పూర్వపు తెలంగాణ ప్రాంతపు చట్టము క్రిందగాని, మునిసిపలు చట్టము క్రిందగాని ఈ చట్టము ప్రారంభము నాటికి విఘటన చేయబడి లేక రద్దుచేయబడి తిరిగి ఏర్పాటు చేయబడవలసియున్న ఏ పంచాయతీ అయినను ఈ చట్టము యొక్క నిబంధనల ప్రకారము తిరిగి ఏర్పాటు చేయబడవలెను.

9. ఈ చట్టపు ప్రారంభమునకు పూర్వము ప్రకటింపబడిన గ్రామములకు పంచాయతీల ఏర్పాటు:—

ఈ చట్టపు ప్రారంభము నాటికి పూర్వము, పూర్వపు ఆంధ్ర ప్రాంతపు చట్టము క్రిందగానీ, పూర్వపు తెలంగాణా ప్రాంతపు చట్టము క్రిందగానీ, మునిసిపలు చట్టము క్రిందగానీ ఏదైన గ్రామమునకు పంచాయతీని ఏర్పాటు చేయుటకై ప్రకటింపబడి పంచాయతీ ఏర్పాటు చేయబడకున్నచో, నియమింపబడియున్న ఎవరైన ప్రత్యేకోద్యోగి ఈ చట్టము క్రింద నియమింపబడినట్లే భావింపబడవలెను. అట్టి సందర్భములో 226 విభాగపు నిబంధనలు వర్తించవలెను. అట్టి ప్రత్యేకోద్యోగి నియమింపబడకున్నచో, ఈ చట్టము క్రింద ఈ

చట్టము ప్రారంభమయిన తేదీన ఆ గ్రామము ప్రకటింపబడిన ఎట్లో అట్లే ఆ గ్రామమునకు ఒక ప్రత్యేకోద్యోగి నియమింపబడవలెను.

10. పట్టణ కమిటీల కార్యనిర్వాహకోద్యోగులు 30వ విభాగము క్రింద నియమింపబడిన కార్యనిర్వాహకోద్యోగులుగా భావింపబడుట:— ఈ చట్టము ప్రారంభమగు తేదీన, ఆ తేదీ నుండి పంచాయతీలుగా భావింపబడునట్టి పట్టణ కమిటీల కార్యనిర్వాహకోద్యోగులు సదరు తేదీన సదరు ఉద్యోగ్యులుగా పనిచేయుచున్నప్పుడు వారు 30వ విభాగము క్రింద నియమింపబడినట్లు భావింపబడవలెను.

11. ఆస్తి, హక్కులు బాధ్యతల సంక్రమణ:— (1) ఏదైన పంచాయతీచే లేక దానికొరకు ఉపయోగింపబడు, అనుభవింపబడు లేక కలిగియుండబడు యావత్తు ఆస్తి, ఏ విధముగానైన ఉండు అధికారము అన్నియును, ఇంకను దానికి స్వంతముగా నుండు లేక దాని వశమందుండు లేదా ట్రస్టుగా కలిగియుండు మరియు ఏ విధముగానైన నుండు హక్కులన్నియును, చట్ట సమ్మతముగా అమలులో ఉండు దాని మీద గల యావత్తు బాధ్యతలును ఈ చట్టము ప్రారంభమగు తేదీనను, ఆ తేదీ నుండియు ఈ విషయములో ప్రభుత్వము వారు సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువు ద్వారా చేయు ఆదేశములకు లోబడి ఈ చట్టము ననుసరించి ఏర్పాటు చేయబడినట్లు భావింపబడిన పంచాయతీకి చెందవలెను.

(2) ఈ చట్టపు ప్రారంభము నాటికి పంచాయతీకి రావలసియున్న అన్ని పన్ను బకాయలు లేక పన్నులకు సంబంధించిన ఇతర చెల్లింపులు లేక ఖర్చుల క్రింద, నష్ట పరిహారము క్రింద లేక ఇతర విధముగా రావలసియున్న అన్ని మొత్తములు ఈ చట్టము క్రింద రావలసియున్నట్లే భావింపబడి, వసూలు చేయబడవచ్చును.

(3) పూర్వపు ఆంధ్రప్రాంతపు చట్టము క్రిందగానీ, పూర్వపు తెలంగాణా ప్రాంతపు చట్టము క్రిందగానీ, మునిసిపలు చట్టముక్రింద గానీ ఏదైన పంచాయతీ; లేక ఎవరైన అధికారి లేక వ్యక్తి జరిపిన లేక వారిపై జరుపబడిన అన్ని ప్రొసీడింగులు, అవి ఈ చట్టమునకు విరుద్ధముగా నుండనంత వరకు, ఈ చట్టము క్రింద అట్టి పంచాయతీ లేక అధికారి లేక వ్యక్తిచే లేక వారిపై కొనసాగింపబడ వచ్చును.

12. ఇప్పుడున్న పన్నుల కొనసాగింపు :— ఈ చట్టపు ప్రారంభమునాటికి ఏదైన పంచాయతీచే లేక దాని తరపున శాసన రీత్యా విధింపబడుచున్న ఏదైన పన్ను, సెస్సు లేక రుసుము ఈ చట్టము అమలులోనికి తేబడిన సంవత్సరములోను, ప్రభుత్వము వారు సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువు ద్వారా అన్యథా ఆదేశించిననే తప్ప మరియు ఆదేశించనంత వరకు తరువాత సంవత్సరములలోను ఆ పంచాయతీచే లేక దాని తరపున విధింపబడుచుండవలెను.

13 పూర్వపు ఆంధ్రప్రాంతపు చట్టము క్రింద లేక పూర్వపు తెలంగాణా ప్రాంతపు చట్టము క్రింద లేక మునిసిపలు చట్టముక్రింద తీసి కొనబడిన చర్య కొనసాగుట:—ఈ చట్టము ప్రారంభమునకు పూర్వము, పాత ఆంధ్రప్రాంతపు చట్టము క్రింద లేక పూర్వపు తెలంగాణా ప్రాంతపు చట్టము క్రింద లేక మునిసిపలు చట్టము క్రింద ఎవరేని అధి కారిచే తీసికొనబడిన ఏదేని చర్య, ఈ చట్టమునకు విరుద్ధముగా ఉన్ననే తప్ప, ఈ చట్టము క్రింద అట్టి చర్య తీసుకొనుటకు అర్హతగల అధి కారిచే. ఆయన తీసికొన్న చర్య ద్వారా అది రద్దు చేయబడిననే తప్ప, మరియు రద్దు చేయబడనంతవరకు ఆయన పూర్వపు ఆంధ్ర ప్రాంతపు చట్టము క్రింద లేక పూర్వపు తెలంగాణా ప్రాంతపు

చట్టము క్రింద లేక మునిసిపలు చట్టము క్రింద అట్టి చర్య తీసుకొనుటకు అర్హతగల అధికారివంటి వారైననూ, కాకపోయినను, తీసుకొనబడినట్లు భావింపబడవలెను.

14. చిక్కును తొలగించుట;— ఈ నియమముల యొక్క నిబంధనలను అమలు జరుపుటలో ఏదైన చిక్కు ఏర్పడిన యెడల ప్రభుత్వమువారు ఆంధ్రప్రదేశ గెజిటులో ప్రకటన ద్వారా, పరిస్థితిని బట్టి అట్టి చిక్కును తొలగించుటకు అవసరమని తమకు తోచునట్టి ఏ పనినైననూ చేయవచ్చును.



# ప్రత్యేక అనుబంధము

(1) 35వ పేజీలో 23వ విభాగములో (1)వ ఉపవిభాగము క్రింద రావలసిన భాగము.

(i) ఒకవేళ ఆగ్రామ పంచాయతీ, ఒక పంచాయతీ సమితియొక్క అధికార క్షేత్రములో నున్నయెడల, ఆ పంచాయతీ సమితి యొక్క బ్లాకు డవలపుమెంటు ఆఫీసరుకును, మరియు

(ii) ఇతర పరిస్థితులలో ఆగ్రామ పంచాయతీపై అధికారముగల డివిజినలు పంచాయతీ అధికారికిని, నోటీసు నిచ్చుట ద్వారా రాజీనామా చేయవచ్చును.

అయితే ఆ రాజీనామా చేసినవ్యక్తి రాజీనామా పత్రమును బ్లాకు డవలప్‌మెంటు ఆఫీసరుకుగాని, లేక సందర్భాను సారముగా డివిజినలు పంచాయతీ అధికారికిగాని స్వయముగా అందజేసిననే తప్ప, సదరు అధికారి అట్టి నోటీసు వేరువిధముగా అందినమీదట, సంబంధించిన వ్యక్తినుండి దానిగురించి ధృవీకరణను పొందవలెను. స్వయముగా అందజేయబడిన లేక పైన పేర్కొనబడిన విధముగా ధృవ పరుపబడిన రాజీనామా సదరు అధికారికి అందిన తేదీన మరియు అదే రోజునుండి అమలులోనికి రావలయును.

(2) 42వ పేజీలో 28వ విభాగములో (3)వ ఉప విభాగము క్రింద రావలసిన భాగము.

అయితే, అట్టి నిషేధము పెట్టబడిన సభ్యుడు, పంచాయ తీల విస్తరణాధికారికి అప్పీలు పెట్టుకొనవచ్చును, దానిపై అతని నిర్ణయము తుదినిర్ణయ మగును.

(3) 42వ పేజీలో 32వ విభాగములో (ఏ) ఖండము క్రింద ఆఖరున రావలసిన భాగము.

(i) ఆయనే సర్పంచు కూడ అయిన యడల ప్రత్యక్షముగాను;

(ii) ఆయన సర్పంచు కానియడల సర్పంచు ద్వారాను, కమీషనరుకు నివేదించవలెను.

